శ్రీరస్తు.

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః

సగుణ నిర్గుణోపాస్తి బోధకానేకగ్రంథసారమగు

# శ్రీశివశక్త్యైక్యదర్పణము



:o:

ఇది

మంథాలక్ష్మీనరసింహము

విరచింపబడి

పేరిసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

పరిశోధింపబడి

అమలాపురం

వామరాజు చంద్రమౌళిగారి స్వకీయ

శ్రీమారుతీముద్రానిలయమందు

ముద్రింపబడియె.

వెల 2-8-0

కాపీరైటు] [రిజిష్టరు.

1920

# —:విషయసూచిక:—

—————:0:—————

ప్రకరణోక్తసంగతి సంగ్రహము, తత్సంబంధము.

1 ప్ర॥ శ్రీవిద్య నిర్గుణబ్రహ్మమని నిరూపణము.

2 అదియె సచ్చిదానందస్వరూపము సగుణమందు శివశక్త్యుభయసమష్టిరూపమును.

3 ఉపాసనయు, అద్వైతవిమర్శయు కలవానికాజన్మమందే ముక్తి కలుగును. కాని కేవలాద్వైతవిమర్శగలవానికి కొన్నిజన్మములవరకు ముక్తి కలుగదు. మఱియు నిర్గుణసిద్ధికి సగుణోపాసన ముఖ్యకారణము.

4 నిర్గుణసిద్ధికి శ్రీవిద్య అత్యుత్తమము. కనుకనే శివాది సమస్తదేవతలు యక్ష,రాక్షస,గంధర్వాదులు. వ్యాస,వసిష్ఠ, సనక, అగస్త్యాదిమహర్షులు, శంకరాచార్యులు, విద్యారణ్యులు రామాదులు మొదలగువారు చిచ్ఛక్తిని ఉపాసించిరి.

5 ముఖ్యాంగమయిన దీక్షలేకుండ చేసినయుపాసనవ్యర్థము

6 జీవేశ్వరరూపముగను, జగద్రూపముగను, మాయా విద్యాదిరూపములుగనున్న చిచ్ఛక్తియే సమస్తమునకధిష్ఠానముగనున్నది.

7 సగుణోపాసనాంగమైన పూజనుచేసుటకు రెండుమార్గములు. వేదబాహ్యులకు తంత్రమార్గమొకటియే. వేదార్హులకు

తంత్రవైదికమార్గములు రెండునుకలవు. కాని తంత్రమార్గము పూర్ణాధికారులకే కలదు.

8 కలియుగమునందు స్త్రీదేవతోపాసన ముఖ్యము.

9 సమస్తార్థములు తెలిసి యుపాసనచేయుట యుత్తమము. కనుక పంచదశీమంత్రమునకు అంతరవరివస్యారహస్యగ్రంథ మందుచెప్పిన భావార్థాది బహువిధార్థవివరణము.

10 ఉపాసనచేయుమంత్రములు గురుముఖమును డియెపొం దవలయునుగాని స్వయముగ నభ్యసింపరాదు. అట్టి గురుశిష్యు లు దేవతాభక్తిశ్రద్ధలు కలవారుగను, యోగ్యులుగను యుం డవలయును. [మవసరము లేదు.

11 శ్రీవిద్యమొదలగు కొన్నిమంత్రములకు సిద్ధాదివిమర్శ

12 ఉపాసనాంగమయిన జపము మూడువిధములు. అందు తనచెవులకు వినబడకుండ అక్షరములను భావనచేయు మాన సికజపము ఉత్తమము. తనచెవులకుమాత్రము వినబడునట్లు చే యునది మధ్యమము. ఇతరులకు వినబడునట్లు బిగ్గరగ చేయునది అధమము.

13 వేదసారమగు నాలుగుపాదములతోకూడిన పూర్ణగా యత్రి మూడుమారులు జపముచేసినఫలము ఒకమారు పంచ దశీమంత్రజపముచేతనే కలుగును.

14 ఉపాసనచేయబడు దేవతయొక్క అనుగ్రహముకొఱకు భక్తిమొదలగునవి ముఖ్యసాధనములు.

15 శ్రీవిద్యారూపపరదేవతయే జగద్రూపముతో పరిణామోపాదానముగను, చైతన్యరూపముతో వివర్తోపాదానముగనున్నది. బ్రహ్మమునకును, చిచ్ఛక్తికిని నామభేదమే కాని యితరభేదములేదు. కార్యకారణములకు భేదములేదు. కనుక చిచ్ఛక్తి అధిష్ఠానముగాగల జగత్తును చిద్రూపముగనే చూడవలయును. నామరూపములు లేనపుడు చైతన్యమాత్రమె మిగిలియుండును. ఇట్లు తెలిసికొనుటయే ముక్తియని ఈశ్వరుడు, శ్రీశంకరాచార్యులు, విద్యారణ్యులు, గౌడపాదాచార్యులు మొదలగువారు చెప్పిరి. జరామరణములు కార్యమైనజగత్తుకు కలవుకాని అధిష్ఠానమైన చిత్తునకు లేవు. ఇట్లు పదునైదుప్రకరణములందు చెప్పబడిన సంగతులు పరస్పరము సంబంధించియున్నవి.

శ్లో॥ గుణదోషవివేచనక్షమాః పరకీయేషు గుణేష్వమత్సరాః। శుకవాగుపమం వచోమమోఽథయభాషాఽనభివేత్తురంజసా। పరదైవతసత్కటాక్షతః పరమశ్రీలలితార్థవేదినః। సుజనాః ప్రవిలోక్య సాదరం ఫలయంతు శ్రమమత్రిమామకం॥

తా॥ శ్రీవిద్యాసారగ్రహణధురీణులును, గుణదోషవిమర్శనపటిష్ఠులును, పరకీయగుణ విమత్సరులునగు సజ్జనులు భాషాద్వయపాండిత్యరహితుడును, సద్గురుకటాక్షసాదిత విద్యారహస్యుడునగు నాదువచనములను శుకభాషితములవలె నాదరమున వీక్షించి నన్నుకృతార్థుంజేయ బ్రార్థితులు. ఇట్లు,

సద్విధేయుడు,

మంథా లక్ష్మీనరసింహము

## ప్రకరణములు

ఈక్రింద చెప్పబడినరీతిని పంచదశీమంత్ర బీజక్రమముతో ప్రారంభింపబడినవి.

1 ప్ర॥ కకారరూపా
2 వక్షోరుద్రిస్స్ర్వ
3 ఈశ్వరానుగ్రహా
4 లక్ష్మీవాణీనిషేవితా
5 హ్రీంకారభాస్కర
6 హంసవాహనా
7 సకలాగమసంస్తుతా
8 కలిదోషహరా
9 హాదికాద్యోః కాదివిద్యా
10 లఘ్వ్యర్థా
11 హ్రీంకారాదేః సిద్ధారి
12 సంయతేంద్రియసంచారం
13 కామయతె సకకారః
14 లబ్ధభక్తిసులభా
15 హ్రీం

| సంకేతములు. | సంకేతములవివరణము | సంకేతములు. | సంకేతములవివరణము |
|---|---|---|---|
| అ. | అవతారిక. | జీ॥ వి॥ | జీవన్ముక్తివివేకము |
| అ॥ ప॥ | అపరోక్షానుభూతి | త్రి॥ తా॥ ఉ॥ | త్రిపురాతాపినీఉపనిషత్తు |
| అ॥ ఉ॥ | అరుణోపనిషత్తు | | |
| అ॥ రా॥ | అధ్యాత్మరామాయణము | తా॥ | తాత్పర్యము |
| ఆగ॥ | ఆగమము | త్రి॥ ఉ॥ | త్రిపురోపనిషత్తు |
| ఉ॥ | ఉత్తరము | త్రి॥ సి॥ | త్రిపురాసిద్ధాంతము |
| క॥ సూ॥ | కల్పసూత్రము | తం॥ రా॥ | తంత్రరాజము |
| | (పరశురామసూత్రం) | త్రి॥ భా॥ | త్రిశతిభాష్యము |
| కులా॥ | కులార్ణవము | ద॥ సం॥ | దత్తాత్రేయసంహిత |
| కూ॥ పు॥ | కూర్మపురాణము | దే॥ భా॥ | దేవీభాగవతము |
| క్రి॥ సా॥ | క్రియాసారము | దే॥ ఉ॥ | దేవ్యుపనిషత్తు |
| గ॥ పు॥ | గరుడపురాణము | పం॥ స్త॥ | పంచదశీస్తవము |
| గౌ॥ సూ॥ | గౌడపాదసూత్రము | ప్ర॥ | ప్రశ్న |
| జ్ఞా॥ | జ్ఞానార్ణవము | బ్ర॥ పు॥ | బ్రహ్మాండపురాణము |

| సంకేతములు | సంకేతములవివరణము | సంకేతములు | సంకేతములవివరణము |
|---|---|---|---|
| బృ॥ | బృహదారణ్యకము | వ్యా॥ | వ్యాఖ్యానము |
| బ్ర। ఖం। | బ్రహ్మోత్తరఖండము | శ। సూ। | శక్తిసూత్రి[illegible]గ |
| భా। శ్రు। | భావనోపనిషచ్ఛ్రుతి | | ప్రత్యభిజ్ఞసూత్రము) |
| భో। వృ। | భోజరాజవృత్తి | శం। వ్యా। | శంకరాచార్యవ్యాఖ్య |
| భా। భా। | భానురానందభాష్యము | శం। భా॥ | శంకరాచార్యభాష్యము |
| భా। వ్యా। | భానురానందవ్యాఖ్య | శం। స్తు। | శంకరాచార్యస్తుతి |
| భ। గీ। | భగవద్గీత | శి। పు। | శివపురాణము |
| మ। వా। | మహావాసిష్ఠము | శి। ర। | శివరహస్యము |
| మా। పు। | మార్కండేయపురాణము | శై॥ ర। | శైవమతరహస్యము |
| యో। సూ॥ | యోగసూత్రము | శ్రు। | శ్రుతి |
| య। ఖం | యజ్ఞవైభవఖండము | శి। సూ- | శివసూత్రము |
| రు। యా॥ | రుద్రయామళము | శ్రీ। భా। | శ్రీమద్భాగవతము |
| ల॥ | లలితోపాఖ్యానము | శ్రీమ।భా। | శ్రీమహాభారతము |
| ల। స। | లలితాసహస్రనామము | సూ। సం। | సూతసంహిత |
| లిం। పు॥ | లింగపురాణము | సే। బం।ప। | సేతుబంధము, పటలము |
| వ। పు। | వరాహపురాణము | శ్లో॥ | శ్లోకము |
| వ। ర॥ | వరివస్యారహస్యము | సౌ। సం। | సౌరసంహిత |
| వి। చూ॥ | వివేకచూడామణి | స్కాం। | స్కాందము |
| వా। సం। | వాసిష్ఠసంహిత | సౌం। | సౌందర్యలహరి |
| వా సి॥ | వాసిష్ఠము | హ। వ॥ | హరివంశము |
| వి। వ్యా। | విద్యారణ్యవ్యాఖ్య | | |
| వా।తం।ప॥ | వామకేశ్వరతంత్రము పటలము | | |

# ప్రకరణానుక్రమణిక

—♦ విషయము ♦—

గౌడపాదసూత్రములు.



శక్తిసూత్రములు.

అని యీప్రకరణములందు వివరింపబడెను.

ఈగ్రంథమును మూడుసారులు పారాయణచేయుటచే ఐహికసుఖములును, భూత ప్రేత పిశాచాది సంఘాతసమస్తరోగశాంతియును, అర్థానుభవముగలవారికి ఆముష్మిక సాక్షాత్ఫలమగు మోక్షమును, పరదేవతానుగ్రహమువలన కలుగును. సంశయములేదు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు

శ్రీగురుభ్యో నమః

శ్రీమత్త్రిపురసుందరీసహిత దక్షిణామూర్తయే నమః

శ్రీబాలాత్రిపురసుందర్యై నమః

—:o:—

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥
వందే విఘ్నేశ్వరం దేవం సర్వసిద్ధిప్రదాయినం।
వామాంకారూఢవామాక్షీకరపల్లవపూజితం॥
పాశాంకుశేక్షుసుమరాజితపంచశాఖాం।
పాటల్యశాలిసుషమాం చితగాత్రవల్లీం।
ప్రాచీనవాక్స్తుతిపదాం పరదేవతాం త్వాం।
పంచాయుధార్చితపదాం ప్రణమామి దేవీం॥
యావిద్యా శివకేశవాదిజననీ యావై జగన్మోహినీ।
యాపంచ ప్రణవద్విరేఫనళినీ యాచిత్కళామాలినీ।
యాబ్రహ్మాది పిపీలికాంతజగదానందైకసంధాయినీ।
సాపాయాత్పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ॥
అస్తు వశ్శ్రేయసే నిత్యం వస్తు వామాంగసుందరం।
యతస్తృతీయం విదుషాం తురీయం త్రైపురం మహః॥
ఇతి లలితోపాఖ్యానే ప్రథమశ్లోకః॥

తా॥ యేవస్తువువలన విద్యాంతనులకు కామము, మోక్షములు ... మూడుపురములుగలదియు, నాశములేనిదియు, యెడమభాగమున సుందరి యగు తేజస్సు సర్వదా మీకు శ్రేయస్సు నిచ్చుగాక.

శ్లో॥ భూమౌ స్ఖలితపాదానాం భూమిరేవావలంబనం ।
త్వయి జాతాపరాధానాం త్వమేవ శరణం శివే ॥

తా॥ భూమియందు తొట్రుపడిన పాదములను భూమియే సహించి నట్లుల ఓపరమేశ్వరి నీ యెడల చేయబడిన యపరాధములను నీవే రక్షించు దానవు.

కలియుగము ప్రథమపాదమునందు 3069 వత్సరములు గతించువరకు వేదోక్తములగు కర్మో. పాసనా, జ్ఞానకాండ ములు మూడును క్షీణింపగా శ్రీశంకరాచార్యులవారు పునరుద్ధారము చేసిరి.

శంకరులు, పద్మపాదులు, తోటకాచార్యులు, వార్తికులు మొదలగు నలుగురుయతీశ్వరులకద్వైతభాష్యము బోధించి అనంతరము శ్రీవిద్యనుపదేశించి వారిచేత నాలుగుపీఠముల యందు శ్రీచక్రారాధన చేయించినట్లును తాము శ్రీచక్రా రాధనచేసినట్లును శంకరవిజయమునందు గనబడును. అట్టివరంపర శృంగగిరి మొదలగు స్థలములయందిప్పటికిని జరుగుచున్నది. అనంతరము శ్రీవిద్యారణ్యస్వామి ముందుగా పంచదశీమంత్ర (శ్రీవిద్య) దేవతాసాక్షాత్కారమునుబొంది పంచదశీప్రకరణ ములు మొదలయిన అద్వైతగ్రంథములును, అనేకగ్రంథము లలోని అద్వైతసారమును బోధించు జీవన్ముక్తివివేకమును సంస్కృతమున రచియించిరి. క్రమముగా సంస్కృతవిద్యక్షీణ మగుచున్నది.

2 అద్వైతము ముఖ్యమని శ్రీశంకరులు, విద్యారణ్యస్వామి మొదలగువారి యాభిప్రాయము. కానివారును అద్వైతసిద్ధి దుర్లభమనియెంచి తత్సాధనభూతమయిన చిద్విద్యోపాసన ముఖ్యమనియెంచి దానియందు ప్రవర్తకులయిరి. మఱియు బ్రహ్మ, విష్ణు, శివాదిదేవతలును, సనకసనందనాగస్త్యవసిష్ఠాది మహర్షులను, యక్ష, రాక్షస, గంధర్వాదులును శ్రీవిద్య యనెడి చిద్విద్యోపాసన చేసినట్లు అనేకగ్రంథములయందు గనబడును.

3 దేవతోపాస్తిచేతనే సగుణసిద్ధియు, అనంతరము అద్వైతసిద్ధియుకలుగునని అనేకగ్రంథములయందు చెప్పఁబడెను విద్యారణ్యకృత జీవన్ముక్తివివేకమునందు సాక్షాత్కారపర్యంతము దేవతోపాసనఁజేసి అద్వైతవిచారము చేయుటచేత విశేషముగలదని చెప్పఁబడినది. సూతసంహితయొక్క యజ్ఞవైభవ ఖండములో జ్ఞానయజ్ఞమనెడి 13 అధ్యాయమునందు దీక్షాయుక్తముగను ఉపాసనకలిగి అద్వైతవిమర్శచేయువారికాజన్మమందె ముక్తియనియు, ఉపాసనలేక అద్వైతవిమర్శచేయువారికి కొన్నిజన్మములకుగాని ముక్తికలుగదనియు చెప్పబడినది. ఇట్టియభిప్రాయము శంకరులవారికనున్నట్లు వారి యానలుగురు శిష్యులను శ్రీవిద్యోపాసనయందు ప్రవర్తింపజేయుటవలన స్పష్టముగాఁదోచును

4 దేవతోపాస్తి శ్రేష్ఠమనిచెప్పు గ్రంథములు బహుళముగానుండి యందరికిని సాధ్యముగాకుండుటనుబట్టి యనేక

గ్రంథములలోని సారభూతమైన సంస్కృతమూలమును. వ్యాఖ్యానమును, వానికి తెలుగుతాత్పర్యములతో పంచదశీ మంత్ర బీజ క్రమపూర్వకముగ పదునయిదు ప్రకరణములిందు వ్రాయబడుచున్నవి. ఈగ్రంథము దేవతలయందును, వేదశాస్త్రములయందును, భక్తివిశ్వాసములుగల యభ్యాసకులకు సుబోధకముగానుండును.

5 భక్తివిశ్వాసములతో నారాధనచేయు వారికి దేవతలవలన పురుషార్థములు గలుగునని శ్రుతి స్మృతి పురాణాదుల వలనను, పెద్దలయొక్క ఆచరణమువలనను కనబడును. పంచదశీమంత్రోపాసనచే విద్యారణ్యస్వామికిని విష్ణుభక్తిచే ప్రహ్లాదునకును, శివభక్తిచే మార్కండేయులకును క్లీంకార మంత్రోచ్చారణచేత సువర్ణమహారాజునకును ఐకారోచ్చారణచేత సత్యవ్రతునకును, వాగ్బీజ (ఐం) మంత్రోపాసన చేత శ్రీవ్యాసులవారికి నిట్లనేక దేవతోపాసనలచే ననేకులకును తాదృశసిద్ధికలిగినటుల ప్రసిద్ధము.

కలియుగప్రథమపాదము 5020 సంవత్సరములుగతించినవి. సంస్కృతవిద్యయు, కర్మోపాసనాది కాండత్రయమును. క్రమక్రమముగా క్షీణమగుచున్నది. కాని మరల ఈశ్వరానుగ్రహమువలన వృద్ధినిబొందవలసియుండును.

7 శ్రీవిద్యోపాసన, జడశక్త్యుపాసనయనియు, చిచ్ఛక్త్యుపాసనకాదనియు, తాంత్రికవిద్యయనియు, వైదికవిద్యకాదనియు కొందరియభిప్రాయము. అట్టియభిప్రాయము సరికాద

నియు, శ్రీవిద్యోపాసన వైదికమనియు, చిచ్ఛక్త్యుపాసనయనియు, వామకేశ్వరతంత్రము ద్రిశతీభాష్యమునందు చెప్పబడినది.

మఱియు వేదశిరోభాగములగు త్రిపురోపనిషత్తు, త్రిపురాతాపిని, బహ్వృచోపనిషత్తు, చక్రభావనోపనిషత్తు, దేవ్యుపనిషత్తు, కౌలోపనిషత్తు, గుహ్యోపనిషత్తు, మహోపనిషత్తు మొదలగువానివలనను, పరశురామకృత కల్పసూత్రములు, త్రిశతీభాష్యము, సూతసంహిత, దత్తాత్రేయసంహిత, గౌడపాదసూత్రములు, ఈశ్వరప్రత్యభిజ్ఞాసూత్రములు మొదలగువానివలనను నది చిచ్ఛక్తియొక్క ఉపాసనయేయని కనబడును. కనుక నీవిద్య వైదికమేయనియు, తంత్రములలో కూడ చెప్పినందున మాత్రము చేత తంత్రప్రధానవిద్య కాదనియు తెలియబడుచున్నది.

8 శ్రీవిద్య రహస్యవిద్యయగుటవలనను, సద్గురువుల వలన యోగ్యులయిన శిష్యులకు మాత్రముపదేశింపదగియుండుటవలనను, అట్టిగురువులు కనిపెట్టుట దుర్లభమగుటవలనను, తక్కిన రామ, కృష్ణ, శివాదిమంత్రములవలె నిదియంత ప్రచురముగా లేదు. కొందఱు ప్రవేశించి తమకోరిక వెంటనే సఫలము కాలేదని యుపేక్ష చేయుదురు. గాని జన్మాంతరకర్మముయొక్క ప్రతిబంధకసామగ్రి విశేషముగానుండెనని తలచరు. కొందఱు ముందుగ తంత్రమార్గమునందు ప్రవేశించి యుండవలెనియందురు

లనతిక్రమించి స్వేచ్ఛాచారులై దీనివలన తమకుగలిగిన నష్టములను విస్మరించుదారోపించుచున్నారు. తంత్ర వైదికమార్గములలో వైదికము నవలంబించువారికి దోషములేవియును లేవు. తంత్ర వైదికమార్గములు శాస్త్రసమ్మతములైనను తంత్రమార్గము పూర్ణాధికారులకే చెప్పబడినది.

9 త్రిపురసుందరియొక్కయు, గురువులయొక్కయు, కటాక్షమువలనను, పండితుల సాహాయ్యమువలనను, శ్రీభాస్కరానందనాథశిష్యులగు ప్రకాశానందనాథునిచేత నీగ్రంథము భక్తిశ్రద్ధలతో యథాశక్తిగ ప్రకటింపబడెను.

శ్లో॥ అనంతశాస్త్రం బహువేదితవ్యం స్వల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః। యత్సారభూతం తదుపాసితవ్యం హంసైర్యథా క్షీరమివాంబుమిశ్రం= హంసలు నీరమిశ్రమగు క్షీరములో సారమగు క్షీరమునే గ్రహించునట్లు బాలాభావమని పండితులు దీనియందలి సుగుణములను గ్రహింపప్రార్థితులు.

10 కేవలము సంస్కృతమయినను, తెల్గయినను కొందఱు తెలిసికొనుట దుర్లభమనియెంచి సులభముగా నందరికిని దెలియగల తెలుగుపదములతో నీగ్రంథము వ్రాయబడెను

# ప్రకరణములు

—:0:—

శ్రీగురుభ్యోనమః
శుభమస్తు అవిఘ్నమస్తు.
శ్రీబాలాత్రిపురసుందర్యై నమః
శ్రీమేధాదక్షిణామూర్తయే నమః

# శివశక్త్యైక్యదర్పణము

## ప్రథమ ప్రకరణము.

### చిద్విద్యావివరణము.

చితి, చైతన్యము, చిద్రూపము, ఆత్మ, పూర్ణాహంత, బ్రహ్మము, జ్ఞానము, చిచ్ఛక్తి, శ్రీవిద్య, చిద్విద్య, బ్రహ్మవిద్య, కైవల్యము, సంవిత్, అనునవి బ్రహ్మముయొక్క పర్యాయపదములని శ్రుతి, స్మృతి, పురాణాదులు దెలుపుచున్నవి.

శ్రీవిద్యయను సంజ్ఞ బాల, పంచదశి, షోడశి మంత్రములకు ప్రధానముగ వర్తించును.

పంచదశీమంత్రమునందు కాది, హాది విద్యలు రెండు ముఖ్యముగనున్నవి. వీనితోకలిసిన షోడశాక్షరికి షోడశి యని పేరు.

ఈమూడు మంత్రాధిష్ఠానదేవతలలో పంచదశికి లలితాత్రిపురసుందరియనియు, బాలకు బాలాత్రిపురసుందరియనియు, షోడశికి రాజరాజేశ్వరియనియు సమాఖ్యలు. పంచప్రేతాసనమీదేవతలకుమాత్రమే కలదు. కావున నిమూడునుత్కృష్టములు.

శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః ।
పంచప్రేతా వరారోహే నిశ్చలాశ్శవతే సదా ॥

అని జ్ఞానార్ణవమునందున్నది॥

తా॥ బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వర, సదాశివులు మున్నగు ప్రేతలనియూ చలింపని చిత్తముగలవారై ధ్యాననిష్ఠులయి యుండిరనియు పార్వతితో ఈశ్వరుడు చెప్పెను. ప్రేతలనగా నిశ్చలచిత్తముగలవారు.

కకారము కాది పంచదశీమంత్రములోని ప్రథమబీజము.

కకారరూపాయని త్రిశతి మొదటినామము.

శ్రీశంకరాచార్యభాష్యము:—కకారః కవర్ణః రూపం। జ్ఞాపకవిశేషణం యస్యాః సా కాదివిద్యా విగ్రహేత్యర్థః॥ "కం బ్రహ్మ" ఇతి శ్రుతేః॥

తా॥ కకారము కాదివిద్యకు మొదటిబీజము। బ్రహ్మస్వరూపము। శ్రుతి కకారము బ్రహ్మమని చెప్పెను.

ఈ గ్రంథములో చెప్పబడిన త్రిశతి, అనునది కాదిపంచదశీమంత్రవర్ణములమీద పుట్టిన 300 నామములుగలది। దీనికి శ్రీశంకరాచార్యులవారు భాష్యము చేసిరి॥

లలితాసహస్రనామములు అనునది శ్రీవిద్యను చెప్పును॥

ఈశ్వరప్రత్యభిజ్ఞాసూత్రములు (శక్తిసూత్రములు) వీనికి శ్రీపూర్ణానందముని భాష్యము చేసిరి॥

వామకేశ్వరతంత్రముయొక్క వ్యాఖ్యానమునకు సేతుబంధనమని పేరు॥

సేతుబంధము, వరివస్య, లలితాసహస్రనామభాష్యము త్రిపురోపనిషద్భాష్యము అను నివి శ్రీభాసురానందనాథునిచే చేయబడెను.

శ్రీగౌడపాదసూత్రములకును, సూతసంహితకును, శ్రీవిద్యారణ్యస్వామి భాష్యముచేసిరి. గౌడపాదులు శ్రీశంకరులవారి పరమగురువులు॥

చితిః ॥ (లలితాసహస్రనామము 362)

శ్రీభాసురానందనాథ వ్యా॥ అవిద్యాప్రతిబంధిజ్ఞానస్వరూపా చితిః॥

I శక్తిసూత్రము—చితిస్స్వతంత్రా విశ్వసిద్ధిహేతుః ॥

దీనికీసూత్రభాష్యమునందు। చితిరేవ భగవతీ స్వతంత్రా। అనుత్తరవిమర్శమయీ। శివభట్టారికా ఐభిన్నా హేతుః కారణం॥

II మహావాసిష్ఠము— సైషా చితిరితి ప్రోక్తా జీవనాత్జీవిశేషిణాం ॥

తా॥ అజ్ఞానమునకు శత్రువయిన జ్ఞానమే చిత్తు.

I చిచ్ఛక్తి స్వతంత్రముయినది. విశ్వసిద్ధికి కారణము. ఈశ్వరుని కంటె వేరుకానిది.

II జీవులను బ్రతికించుటవలన నీశక్తి చిత్తుఅని చెప్పబడుచున్నది.

(ల॥ స॥ 417) చేతనారూపా ॥

గౌడపాదసూత్రము—చైతన్యస్వరూపా చిచ్ఛక్తిః ॥

శ్రీవిద్యారణ్య వ్యా॥ చైతన్యస్య బ్రహ్మణః స్వరూపా చిత్। శక్తిస్సామర్థ్యం

తా। బ్రహ్మముయొక్క సామర్థ్యమే శక్తి.

ల॥ స॥ 625) కైవల్యపదదాయినీ ॥

భా॥ వ్యా॥ కేవలస్య భావో ధర్మిమాత్రావశేషః కైవల్యం పంచమీముక్తిః। తదేవ పదం దదాతీతి ॥

I యోగశాస్త్రముయొక్క తుదిసూత్రము— కైవల్యం స్వరూపప్రతిష్ఠా చితిశక్తేరితి। అనేన ప్రతిపాదిత స్వరూపో మోక్ష ఉచ్యతే ॥

II చితిశక్తేర్వృత్తి సారూప్యనివృత్తౌ స్వరూపమాత్రే ణావస్థానం కైవల్యముచ్యత ఇతి భోజరాజవృత్తి ॥

తా॥ చిచ్ఛక్తి పునరావృత్తిలేని కైవల్యముక్తినిచ్చునది.

I చిచ్ఛక్తియే మోక్షస్వరూపము.

II వృత్తులు లేకుండనుండుటయే కైవల్యము.

ల॥ స॥ 854) గంభీరా ॥

భా॥ వ్యా॥ అపస్త్యాత్ గంభీరా మహాహ్రదస్వరూపేత్యర్థః ॥ శివసూత్రము—"మహాహ్రదానుసంధానాన్మంత్రవీర్యానుభవః" ఇతి మహాహ్రదఇతి ప్రోక్తా శక్తిర్భగవతీ పరా। అనుసంధానమిత్యుక్తం తత్తాదాత్మ్యవిమర్శనం। మంత్రవీర్యమితి ప్రోక్తం పూర్ణాహంతా విమర్శనం। తదీయోనుభవస్తస్య స్ఫురణం స్వాత్మనః స్ఫుటమితి ॥

తా॥ పరాశక్తి మహాహ్రదస్వరూపము పరాశక్తికిని తనకును భేదములేనటుల తెలిసికొనుటయే అనుసంధానమని చెప్పబడుచున్నది. అహంత అనగా అకారహకారములచే చెప్పబడు శివశక్తులయొక్క విమర్శము ఇదియే మంత్రవీర్యము. (అహంతనుగూర్చి ఇందు 9వ పరిష్కరణము భావార్థముచూడవలయును) అట్టివిమర్శనలన కలిగిన అనుభవమే స్పష్టమగు స్వరూపానుభవము.

(ల॥ స॥ 872) త్రయీ ॥

భా॥ వ్యా॥ త్రీయోర్చ్యాస్సామయజూంషి ఇతి వేదాస్త్రయస్త్రయీతి కోశాద్వేదత్రయరూపా ॥

I కూర్మపురాణము—హిమవంతంప్రతి దేవీవచనం మమైవాన్యా పరాశక్తిర్వేదసంజ్ఞా పురాతనీ। ఋగ్యజుస్సామరూపేణ సర్గాదౌ సంప్రవర్తతే॥ [కథ్యసే॥

II పద్మపురాణము— అస్వేతకీ త్రయీదేవి దండనీతిశ్చ

తా॥ I సర్గాదిని ఋగ్వేద, యజుర్వేద, సామవేద రూపము గానున్న పరాశక్తి నాస్వరూపమే.

II ఓపార్వతీ, నీవు జ్ఞానస్వరూపురాలవు. కర్మస్వరూపురాలవు. నీతిస్వరూపురాలవు.

(ల॥ న॥ 918) చైతన్యార్ఘ్యసమారాధ్యా॥

భా॥ వ్యా॥ చైతన్యం చిద్రూప ఆత్మా ॥

I చైతన్యమాత్మా। శివసూత్రము। తదేవార్ఘ్యం పూజా యోగ్యం జలాది। తేన సమ్యగారాధ్యా । నిరాధారాఖ్యా యాః పూజాయాశ్చిదభేదభావనారూపత్వాత్ ॥

II జ్ఞానమర్ఘ్యం । ఇతి భావనోపనిషచ్ఛ్రుతి ॥

III స్కాందను— స్వానుభూత్యా స్వయంసాక్షాత్స్వాత్మభూతాం మహేశ్వరీం। పూజయేదాదరేణైవ పూజా సా పురుషార్థదా ॥

IV సూతసంహిత— జపిత్వా దశసాహస్రం మంత్రిం చైతన్యవాచకం। మహాపాతకసంఘైశ్చ ముచ్యతే పాతకాంత రైరితి॥ శ్లోకే చైతన్యవాచకమంత్రపదస్య భువనేశ్వరీమంత్ర పరత్వేన వ్యాఖ్యాతత్వాచ్చ ॥

తా॥ I శివసూత్రము ॥ చైతన్యమనగా చిద్రూపమగు ఆత్మయని ఆచైతన్యమును పూజాద్రవ్యము చేత పూజింపదగినది నిరాధారమగు పూజ చైతన్యముతో నభేదభావనయే కాని వేరుకాదు.

II దేవీస్వరూపజ్ఞానమే ఉత్తమార్ఘ్యము.

III ఆత్మభూతయగు మహేశ్వరిని తానుగ అనుభవముతో ఆదరముగ పూజించుటవలన సకలపురుషార్థములు గలుగును.

IV భువనేశ్వరీమంత్రము చైతన్యవాచకము. ఈమంత్రమును పది వేలమాఱులు జపించినయెడల సకలపాపములు నశించును

అధర్వణవేదమందైన త్రిపురాతాపిన్యుపనిషత్తు ౪0॥వది॥

"అథైతస్మిన్నంతరే భగవాన్ ప్రాజాపత్యం వైష్ణవం విలయకారణం రూపమాశ్రిత్య త్రిపురాభిధా భగవతీత్యేవ

మాదిశక్త్యా భూర్భువస్స్వస్త్రీతి స్వర్గభూపాతాళాని హరమా యాత్మకేన హ్రీంకారేణ హృల్లేఖాఖ్యా భగవతీ త్రికూటావసానే నిలయే విలయే ధామ్ని మహసా ఘోరేణ వ్యాప్నోతి సైవేయం భగవతీ త్రిపురేతి వ్యాపదిశ్యతే॥ *** దేవీం మహాలక్ష్మీం సర్వలక్ష్మీమయీం సర్వలక్షణసంపన్నాం హృదయే చైతన్యరూపిణీం నిరంజనాం త్రికూటాఖ్యాం స్మితముఖీం మహామాయాం సర్వసుభగాం మహాకుండలినీం త్రిపీఠమధ్యవర్తినీ మకథాది శ్రీపీఠ పరాం భైరవీం చిత్కళాం మహాత్రిపురాం దేవీం ధ్యాయేన్మహాధ్యానయోగేన। య ఏవం వేదేతి॥

తా॥ సదాశివుడు, త్రిపుర, భగవతి యనెడి యాదిశక్తితో హ్రీంకారవాచ్యమై సృష్టి, స్థితి, లయములకొరకు బ్రహ్మ విష్ణ్వీశరూపములను బొంది త్రికూటాగ్రవిరాజమానమగు దివ్యతేజస్సుచేత స్వర్గ, మర్త్య, పాతాళలోకములను వ్యాపించియుండును. ఆవరణరహిత చిద్రూపయు, మహాకుండలినీరూపయు, అ. క. థాద్యక్షరాత్మికయు, సర్వోత్కృష్టమహామాయాస్వరూపయునై త్రికూటసంజ్ఞతో శ్రీపీఠనివాసినియగు సర్వలక్షణసంయుక్త శ్రీమహాత్రిపురసుందరిని భక్తులు మందస్మితసుందరవదనారవిందగను, పుత్రపౌత్రగవాశ్వధనధాన్యాది సకలసంపత్ప్రదాత్రి మహాలక్ష్మిగను, హృదయకమలమునందు తదేకనిష్ఠతో ధ్యానింపవలెను.

అధర్వణవేదమందున్న దేవ్యుపనిషత్తు॥

సర్వే వై దేవా దేవీముపతస్థుః। కాసి త్వం మహాదేవి। సాబ్రవీదహం బ్రహ్మస్వరూపిణీ। మత్తః ప్రకృతిపురుషాత్మకం జగత్। శూన్యంచాశూన్యంచ। ఇత్యాది॥

తా॥ దేవతలాదటు దేవివద్దకువెళ్ళి ఓమహాదేవి నీవెవ్వరవనియడిగిరి. ఆమె నేను బ్రహ్మస్వరూపురాలననియు, నావల్లనుండి యే ప్రకృతి పురుషాత్మకమగు జగత్తు కలిగినదనియు, ప్రపంచము నేనేయనియు, ప్రళయమందున్న మిగులుదానను నేనేయనియు చెప్పెను.

దత్తాత్రేయసంహిత మొదటిఅధ్యాయము॥

వసిష్ఠః కశ్యపో వ్యాసః పులస్త్యః పులహః క్రతుః । భరద్వాజోంగిరాదక్షో దుర్వాసో మునిపుంగవః । కణ్వః పరాశరశ్శంఖ శ్శౌనక శ్శ్రీశుక శ్శివః । అగస్త్యో వాలఖిల్యాద్యా ఋషయోథ మహర్షయః । బ్రహ్మర్షయో జ్ఞానసిద్ధా స్తపస్సిద్ధామహౌజసః । మేరుశృంగే సమాసీనం భగవంతం సనాతనం । దత్తాత్రేయం మహాభాగం యోగినాంప్రవరం విభుం । మునింప్రాంజలయస్సర్వే ప్రణిపత్యోపతస్థిరే ॥ ప్రాంజలీనుపపన్నాంస్తాన్బ్రహ్మర్షీన్ సూర్యవర్చసః । ప్రాహ గంభీరయావాచాభగవాన్ యోగవిత్తమాన్ ॥ శ్రీదత్తాత్రేయః॥ మహర్షయో మహాభాగా యూయం సర్వవిదుత్తమాః । కిమర్థముపపన్నా మాంబ్రూత శశ్వద్వదామివః ॥ 9 *** మయి కారుణ్యభావోయంభవద్భిర్దర్శితోయది । తదాపాత్రం భవిష్యామి కృపయా భవతామహం ॥ 16.॥ ఇత్యేవమనుశిష్టాస్తే దత్తాత్రేయేణ యోగినామహాభాగా మహాభాగం శరణం జగ్మురంజసా ॥ 17. ***** మహర్షయఊచుః॥ *** భవంతమఖిలాధారం శరణ్యం శరణాగతాః । అనాథనాథ సర్వజ్ఞ విష్ణో దత్త హరే విభో । అత్రినందన విశ్వాత్మన్ శరణం యామ సంగతాః ॥

I కేన ప్రయత్నవర్యేణ భవేద్బంధపరిక్షయః । జగతాం
జగదాధార నమస్తుభ్యం చిదాత్మనే ॥

II కిమస్య జగతో రూపం ।

III కిమేకం తత్వముచ్యతే ।

IV కిమేకం జగతోమూలం—తన్నోవక్తు మిహార్హసి । ఇతి పృష్టో మహాయోగీ దత్తాత్రేయో హరిస్స్వయం ॥ 24— మహర్షిభ్యఃపరంతత్వమాఖ్యాతుముపచక్రమే ॥

తా॥ జ్ఞానసిద్ధులు, తపస్సిద్ధులు నగు వసిష్ఠ, కశ్యప, వ్యాస, పులస్త్య, పులహ, క్రతు, భరద్వాజాంగిరస, దక్ష, దుర్వాస, కణ్వ, పరాశర, శంఖ, శౌనక, శుక, శివాగస్త్య, వాలఖిల్యాది మహాత్ములు, బ్రహ్మర్షులు, మేరుశృంగమునందున్న యోగరాట్టు, సనాతనుడు, భగవంతుడు నగు దత్తాత్రేయ గురువులను నమస్కరించి సేవింపగా నాయన తమయాగమనకారణమేమని వారినడిగెను. తరువాత వాసిష్ఠాదిమహాత్ములిట్లు ప్రశ్నించిరి.

I బంధమునుబోగొట్టెడి మహోపాయమేమి ।

II ఈజగత్తునకు రూపమేమి ।

III ఈజగత్తుయొక్క ముఖ్యతత్త్వమేమి ।

IV జగత్తునకు ముఖ్యమగు మూలకారణమేమి ।

వీనిని చెప్పుటకు తమరే యర్హులని మహాత్ములు కోరగా పార్వతీకీశ్వరు డుపదేశించిన విషయములను దత్తాత్రేయులవారు 91 అధ్యాయములుగల దత్తాత్రేయసంహితారూపముగా వారికి వినిపించిరి. మహాత్ములడిగిన నాలుగు ప్రశ్నలకునుత్తరముగా చెప్పినట్టియునెడు శ్రీదత్తానుగ్రహించిన యీగ్రంథమంతయు చెప్పబడెను. అందుల ముఖ్యసంగతులీగ్రంథముయొక్క ఆయాప్రకరణములయందు వ్రాయబడును.

ద॥ సం॥ అయిదవఅధ్యాయము ॥

శ్లో॥ చిద్విద్యా బ్రహ్మవిద్యాద్యా హాదికాది సమన్వితాః । షోడశార్ణముఖాస్తద్వదానందమనవస్మృతాః ॥ *** సచ్చిదానందమనుషు నిష్ఠా యేషాం స్థిరీభవేత్ । తేప్రాక్తేనదేహేన ముక్తా బ్రహ్మమయాః స్మృతాః ॥ ఇతి ॥

తా॥ చిద్విద్య, బ్రహ్మవిద్య యనెడు హాదిపంచదశియు, కాదిపంచదశియు, వీనితో కలిసిన షోడశాక్షరియు ఆనందమంత్రములని చెప్పబడుచున్నవి. వీనియందు దృఢనిష్ఠగలవారు కల్పితదేహమును విడిచి బ్రహ్మస్వరూపులగుదురు.

ద॥ సం॥ ఇరువదిమూడవయధ్యాయము.

దేవ్యాపృష్ట ఈశ్వర ఉవాచ॥ శృణుదేవి ప్రవక్ష్యామి రహస్యం పరమం మహత్। పరాకాష్ఠేయమీశాని మహాభట్టారికాపరా। సమస్తవిశ్వసామ్రాజ్ఞీ మహాత్రిపురసుందరీ। మంత్రవాచ్యార్థభేదేన రూపివాగాదిరూపతః। ఉపాస్యతే పరతరా మహాత్రిపురసుందరీ। లలితా లలితాకారా జ్ఞానానందసదాత్మికా। స్ఫూర్త్యైకలహరీ మాత్రా స్వస్వానందరసాత్మికా। అపరిచ్ఛిన్నరూపాశక్తిః ద్వైతభ్రమవివర్జితా। విశ్వమేతా మామనంతి ప్రత్యక్సంశదమాగమాః। కలరూపవినిర్ముక్తాం బ్రహ్మనంద్యైకభాసురాం॥ 10॥ బ్రహ్మ విష్ణు రహం భద్రే భావయామః పరాం చితిం। తస్యాం పరాంబికాయాం శ్రీలలితాయాం కులాంబికే। కల్పితాభావనిష్ఠాహి మాయాఖ్యా ప్రకృతిశ్శివే। కల్పితాభాసవిజ్ఞాననివృత్త్యాం తాం జగుః శ్రుతిః॥ 12॥ తయా యదా కల్పితంస్యాద్భోక్తృభోగ్యమయం జగత్। తదాత్మజ్ఞానలాభాయ కల్ప్యతే రూపముత్తమం॥ 13॥ ఉపాసనార్థం విశ్వేశి స్త్రీపుంరూపేణ సుందరి। తయోర్వాచకవిద్యే ద్వే కాదిహాదీ సమీరితే॥ 14॥ యా సా కామేశ్వరీదేవీ కాదివాచ్యా సమీరితా। యో సౌ కామేశ్వరశ్శంభుః హాదివాచ్యస్సమీరితః॥ 15॥ హాదికాదిమనుద్వంద్వయుక్తయోః షోడశార్ణయోః మహాతోర్వర్మంత్రిసామ్రాజ్యస్వామినోః శ్రీత్రయోశ్శివే। మహాకామేశ్వరీ దేవీ మహాకామేశ్వరశ్శివః। ఉపాస్యమివభేదేన దేవతేతి సమీరితా॥ ఇత్యాది॥

తా॥ ఈశ్వరుడు పార్వతితో చెప్పుచున్నాడు. ఓదేవీ యీపరమ రహస్యమును వినుము. మహాత్రిపురసుందరి సర్వప్రపంచమునకుమహారాణియు

పరాస్వరూపయు, మహాశక్తియు, మంత్రరూపయు, మంత్రార్థరూపయునై సరస్వతి మొదలగు నామములనొప్పుచు, సచ్చిదానందస్వరూపిణియు, సర్వోత్తమయు నగు నీలలితాదేవి శ్రద్ధతో సేవింపదగినది. సకలలోకజననియగు నీమె యన్నివస్తువులయందును నన్నివేళలను, కాలత్రయమందును, నిండియుండి నిజభక్తులయొక్క ద్వైతభ్రమను నివారించునని వేదములు చెప్పుచున్నవి. అనృతజడదుఃఖాత్మకమగు జగత్తుకంటె విలక్షణమగు సచ్చిదానందస్వరూపము గలిగి కల్పిత జాతిరూపసంబంధములేని యీలలితామహాదేవిని నేనును, బ్రహ్మాదిదేవతలును, శుద్ధచైతన్యముగ భావనచేయుచున్నాము. అట్టి లలితారూపమగు పరాంబికయందాభాసచేత మాయయనెడి ప్రకృతి కల్పింపబడినది. ఈపరాంబికను సేవించుటవలననే కల్పితమగు నాయజ్ఞానములొలగునని శ్రుతి చెప్పుచున్నది. భోక్తృ భోగ్యరూపమగు జగత్తును కల్పించిన యీపరాంబికయే యాభోక్తల (జీవుల) కాత్మజ్ఞానలాభముకై యుపాసన కొరకు కామేశ్వరీరూపమగు కాదివిద్యగను, కామేశ్వరరూపమగు హాదివిద్యగను త్రిపురసుందరీరూపమును దాల్చెను. కాది పంచదశితో కూడిన షోడశాక్షరియనెడి కామేశ్వరీవిద్యయు, హాది పంచదశితో కూడిన షోడశాక్షరియనెడి కామేశ్వరవిద్యయు, మంత్రములలో శ్రేష్ఠమయిన మహత్తుగలవి. ఇవి శ్రీకారమును ప్రథమబీజముగ నాశ్రయించినవి.

ద॥ సం॥ ఆరవఅధ్యాయము॥ ఈశ్వరఉవాచ ॥ లలితాం
జగతాం ధాత్రీం సంవిత్స్ఫూర్తిమనుత్తమాం। శరణం యేతు
గచ్ఛంతి మంత్రేణానేన మత్ప్రియే। మయా తేహరిణా వంద్యా
విధినా నిఖిలైస్సురైః॥ ఇతి॥

తా॥ ఓపార్వతీ జగత్తును ధరించినదియు, ఉత్తమమయినదగు లలితా త్రిపురసుందరిని పంచదశాక్షరీమంత్రముచేత నెవరు శరణుపొందెదరో వారు నాచేతను, విష్ణువుచేతను, బ్రహ్మమొదలగు దేవతలందరిచేతను నమస్కరింపఁదగినవారు.

త్రిశతి 17 కమ్రవిగ్రహా — శ్రీశంకరభాష్యే: కమ్రః అతిమనోజ్ఞః, గాంభీర్య, ధైర్య, మాధుర్యాదిబహుగుణోదితత్వాత్ విగ్రహః మూర్తిః యస్యాః సా తథా ॥ "ఆనందరూపమమృతం యద్విభాతి" ఇతిశ్రుతేః ॥ ఆనందస్వరూపత్వాద్వా । కమ్రవిగ్రహా । లలితాయా ఇత్యర్థః ॥

తా॥ గాంభీర్య ధైర్యాది బహుగుణములు కలదగుటవలన మిక్కిలి సుందరమూర్తి గలదియు, ఆనందరూపము, మోక్షరూపము ఏదిగలదో అట్టి త్రిపురసుందరి యనియు అర్థము.

త్రిశతియొక్క 156 నామభాష్యమునందు— వేదశాస్త్రమయీ వాణీ యస్యాః సా పరదేవతా ॥ ఇతివచనాత్ ॥

తా॥ ఎవరియొక్క వాక్కులు వేదశాస్త్రములో ఆమెయే పరదేవత॥

త్రిశతి 227 సచ్చిదానందా— అను నామమునకు శంకరభాష్యము॥ కాలత్రయాబాధ్యత్వం సత్త్వం। స్వేతరప్రకాశాప్రకాశ్యత్వం చిత్త్వం । పరమప్రేమాస్పదత్వమానందత్వం ॥ "సత్యం జ్ఞానమనంతం । విజ్ఞానమానందం । సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ । ప్రజ్ఞాప్రతిష్ఠా । ప్రజ్ఞానం బ్రహ్మ । ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" ఇత్యాది శ్రుతిభ్యః తే స్వరూపం యస్యాః సా తథోక్తా । వేదాంతశాస్త్రోక్తబ్రహ్మస్వరూపలక్షణలక్షితేత్యర్థః ॥

తా॥ భూతభవిష్యద్వర్తమానములను మూడుకాలములయందును, బాధింపబడనిది సత్తు. ఇతరప్రకాశాపేక్ష లేకుండగ తనంతనే ప్రకాశించునది చిత్తు. మిగుల ప్రేమస్థానము ఆనందము. పై శ్రుతులచేత చెప్పబడు బ్రహ్మస్వరూపమునకు లక్ష్యార్థమీ చిచ్ఛక్తియే.

దేవీభాగవతము। సప్తమస్కంధము। ముప్పదిరెండవఅధ్యాయము— శ్రీదేవ్యువాచ॥ శృణ్వంతు నిర్జరాః సర్వే వ్యాహరంత్యావచోమమ। యస్యశ్రవణమాత్రేణ మద్రూపత్వం ప్రపద్యతే। అహమేవాసపూర్వంతు నాన్యత్కించిన్నగాధిప। తదాత్మరూపం చిత్సంవిత్పరబ్రహ్మైకనామకం। అప్రతర్క్యమనిర్దేశ్యమనౌపమ్యమనామయం। తస్యకాచిత్స్వతఃసిద్ధ శక్తిర్మాయేతి విశ్రుతా ॥ 3 ॥

తా॥ ఓదేవతలారా, నావాక్యమునువినుడు. వినినమాత్రముచేతనే నాస్వరూపమును పొందుదురు. సృష్టికి పూర్వమందు చిన్మాత్రరూపమగనేనేయుంటిని. ఇతరమయినదేమియును లేదు. అట్టిచిద్రూపమే పరబ్రహ్మము. ఇది ఊహించుటకు, చెప్పుటకు, శక్యముకానిదియు, సాటిలేనిదియయియుండెను నాశక్తియే మాయ, యని పరమేశ్వరిచెప్పెను

బాలాత్రిపురసుందరీవిద్య ఆదివిద్యయనుట వామకేశ్వరతంత్రము మొదటిపటలమునందు—

I సర్వాద్యవిద్యయా దేవి కరశుద్ధింతు కారయేత్ ॥

వ్యా॥ ఆద్యవిద్యయా ॥ తా॥ బాలావిద్యచేత అని చెప్పబడెను.

II తతోరక్షాం ప్రకుర్వీత పూర్వోక్తకులవిద్యయా॥

వ్యా॥ కులవిద్యయా- బాలాత్ర్యక్షర్యా ॥

తా॥ బాలాత్రిపురసుందరియొక్క మూడుఅక్షరములచేతను అని చెప్పబడెను.

ల॥ స॥ 630 త్ర్యక్షరీ ॥

భా॥ వ్యా॥ త్రయాణామక్షరాణాం వాక్కామశక్తిబీజాత్మకానాం సమాహారః ॥

I వామకేశ్వరతంత్రము॥ వాగీశ్వరీ జ్ఞానశక్తిర్వాగ్భవే మోక్షరూపిణీ। కామరాజే క్రియాశక్తిః కామేశీ కామరూపి

ణీ। శక్తిబీజే పరాశక్తిరిచ్ఛైవ శివరూపిణీ॥ ఏవం దేవీత్ర్యక్షరీతు మహాత్రిపురసుందరీతి॥ శుద్ధవిద్యా కుమారీ వాఙ్మరూపావా॥

II గౌడపాదసూత్రము— త్ర్యక్షరీ శుద్ధవిద్యా కుమారీ చేతి॥ హృదయరూపా సత్యరూపావా॥

III బృహదారణ్యకము—తదేతత్ త్ర్యక్షరం హృదయమితి తదేతత్ త్ర్యక్షరం సత్యమితి చ॥

తా॥ త్ర్యక్షరి అనగా వాగ్భవ, కామరాజ, శక్తిబీజములు (ఐంక్లీంసౌః) అనునవి.

I వాగ్భవబీజము వాగీశ్వరియును, జ్ఞానశక్తియును, మోక్షరూపిణియును కామరాజబీజము క్రియాశక్తియు, కోరికలనిచ్చునదియును. శక్తిబీజము పరాశక్తిరూపిణియు, ఇచ్ఛాశక్తియు, శివరూపిణియును. ఈ ప్రకారము మహాత్రిపురసుందరీబీజములు మూడు.

II మూడక్షరములుగలది శుద్ధవిద్యయు, కుమారీ అనగా బాలావిద్యయు అని గౌడపాదసూత్రము.

III మూడక్షరములుగల మంత్రము హృదయస్వరూపమనియు, సత్యస్వరూపమనియును బృహదారణ్యము.

దత్తాత్రేయసంహిత 54 అధ్యాయము॥

ఈశ్వరఉవాచ॥ శ్రుణు దేవి ప్రవక్ష్యామి బాలావిద్యా మనుత్తమాం। యస్యాః స్మరణమాత్రేణ సర్వవిద్యానిధిర్భవేత్। అవ్యక్తరూపా విద్యాస్యాద్బాలా త్రిపురసుందరీ। బీజమూలమిదం భద్రే బాలాబీజత్రయం జగుః॥ 2॥ శ్రీవిద్యా మహాశ్రీవిద్యా విలీనాత్రమమప్రియే। ఏకైకబీజమధ్యస్థం చిత్తం దత్రితయం జగుః॥ 3॥ యాశక్తిశ్చిన్మనాదేవి సర్వకార్యసమర్పణే। తాంశక్తిమస్యాం బాలాయాం సంస్థితాంవిద్ధిమత్ప్రియే

శ్రీవిద్యాయాః శరీరం బాలా ప్రోక్తా చాంగస్వరూపతః। అన్న పూర్ణా ప్రత్యంగ మాశ్వారూఢా తథా ప్రియే ॥ 5 ॥ ఉపాంగమితి వైపిస్తి శ్రీవిద్యాయాః కులాంబికే। అంగభూతాం పరాం బాలాం ప్రవక్ష్యామి సమాసతః ॥ 6 ॥ ఇత్యాది—

తా॥ ఏవిద్యయొక్క స్మరణచేత భక్తుడు సర్వవిద్యలకు నిధియగునో అట్టివిద్య బాలాత్రిపురసుందరీవిద్యగ నున్నది. ఈవిద్య యుత్తమమయినది. అవ్యక్తమయినది. మూడుబీజములుగలది. దీనియందు శ్రీవిద్య లీనమయినది. ఈ మూడు బీజములయందు చిత్సంబంధమయిన మూడుఖండములున్నవి. సర్వకార్యములను సమర్థించెడి చిన్మాత్రశక్తి బాలావిద్యయందును గలదు. శ్రీవిద్యకు బాల అంగవిద్యగను, అన్నపూర్ణ ప్రత్యంగవిద్యగను, అశ్వారూఢ ఉపాంగవిద్యగను చెప్పబడెను. అంగభూతమయి పరాస్వరూపమయిన బాలావిద్యను సంపూర్ణముగా చెప్పుచున్నాను వినుమని పార్వతితో నీశ్వరుడు చెప్పెను.

ద॥ సం॥ 56 అధ్యాయము— ఈశ్వరఉవాచ॥ ధ్యాత్వైవం హృదయే దేవీం కుమారీం త్రిపురేశ్వరీం ॥ 1 ॥ రత్నస్వర్ణాకృతి స్ఫారదీప్తిమచ్చంద్రిమధ్యగం। పంచప్రేతాసనం సాక్షాత్క మూర్త్యాః పరమేశ్వరి ॥ 4 ॥ బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః। పంచప్రేతా వరారోహే నిశ్చలాఏవ సర్వదా ॥ 5 ॥ ఇత్యాది ॥

తా॥ హృదయవాసినియు, త్రిపురేశ్వరియునగు బాలాత్రిపురసుందరినిట్లు ధ్యానించవలెను. సువర్ణరత్నాకృతియు, పూర్ణచంద్రకాంతియు, బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వర సదాశివాఖ్య పంచప్రేతలాసనము గలదియునగు బాలాపరమేశ్వరిని పంచప్రేతలును, సర్వదాచలింపని చిత్తముగలవారై ధ్యానించుచున్నారు.

వీనివలన శ్రీవిద్య బ్రహ్మముయొక్క స్వరూపమని, మోక్షస్వరూపమని స్పష్టము. మొదటిప్రకరణము సమాప్తము.

# రెండవప్రకరణము

## సచ్చిదానందస్వరూపకథనము.

సగుణబ్రహ్మము శివసమాఖ్యతో పురుషరూపముగను, శక్తిసమాఖ్యతో స్త్రీరూపముగ నున్నదనియు, అట్టి శివశక్తి రూపములకభేదమనియు, నిర్గుణమందు నామరూపములు లేవనియు తెలిసికొనుటవలన పురుషార్థములుసిద్ధించునని శ్రుతి, స్మృతి పురాణాదులు తెలుపుచున్నవి. ఎట్లనగా—

లు॥ స॥ 417 శివమూర్తిః ॥

భా॥ వ్యా॥ శివఏవ మూర్తిః స్వరూపం యస్యాః శివ శక్త్యోరభేదాత్ । తదుక్తం ॥ శ్రుతి॥ "ఏకోరుద్రస్సర్వభూతేషు గూఢో మాయారుద్రస్సకలో నిష్కళశ్చ । సఏవ దేవీ నచ తద్విభిన్నా హ్యేతత్ జ్ఞాత్వావాఽమృతత్వం వ్రజంతి ॥

తా. సర్వభూతములయందు నంతర్యామియగు ఈశ్వరుడు ఒకడే. అతడే సగుణుడును, నిర్గుణుడును, అతడే శక్తిస్వరూపుడును, శక్తి అతని కంటె భిన్నమైనదికాదు. ఇట్లు శివశక్తులకు భేదములేదని తెలిసికొనిన వారు ముక్తిని పొందుదురు.

లు॥ స॥ 53 శివా ॥

భా॥ భాష్యమునందు— లింగపురాణము ॥ యథాశివస్తథా దేవీ యథాదేవీ తథాశివః । తస్మాదభేదబుద్ధ్యైవ శివేతి కథయంత్యుమాం । ఉమాశంకరయోర్భేదో నాస్త్యేవపరమార్థతః ద్విధాసౌ రూపమాస్థాయ స్థితఏకో నసంశయః । పరమాత్మా శివఃప్రోక్తః శివాసైవ ప్రకీర్తితా ॥

తా॥ శివశక్తులకు భేదములేకపోవుటచేతనుభయులును శివనామముచే చెప్పబడుచున్నారు. రెండురూపములుగ కనబడినను విమర్శింపగా నిజమ

డును చంద్రచంద్రికలవలె నొకస్వరూపమే. సంశయములేదు. పరమాత్మ యే శివుడనియు, శివయనియు చెప్పబడును.

ల॥ స॥ 249 పంచప్రేతాసనాసీనా ॥

భా॥ భాష్యమునందు — జ్ఞానార్ణవము॥ సదాశివోమహాప్రేతః కేవలో నిశ్చలః ప్రియె। శక్త్యావినాకృతో దేవి కథంచి దపి నక్షమః ॥

తా॥ మహాప్రేతయగు సదాశివుడు శక్తిలేని కాలమునందునిశ్చలుడై యేకార్యమునుచేయుటకు సమర్థుడు కాడు.

ల॥ స॥ 250 పంచబ్రహ్మస్వరూపిణీ ॥

భా॥ వ్యా॥ I సూ॥ సం॥ యజ్ఞవైభవఖండము॥ ఏకఏవ శివస్సాక్షా త్సత్యజ్ఞానాది లక్షణః। వికారరహిత స్స్వస్య స్వశక్త్యా పంచధా స్థిత॥ఇతి॥ సృష్టిస్థిత్యాది పంచకృత్యశక్తిభిః సద్యోజాతాది పంచబ్రహ్మరూపో జాతఇత్యర్థః॥

II పుంభావలీలా పురుషాస్తు పంచయాన్వృచ్ఛికం సంలపితం త్రయీ తే। అంబ త్వదక్ష్ణోరణురంశుమాలీ। తవైవ మందస్మితబిందురిందురితి॥

తా॥ I సత్యజ్ఞానానందస్వరూపుడు వికారరహితుడు నగు పరశివుడొకడైనను సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములను పంచకృత్యశక్తులవలన సద్యోజాత వామదేవాఘోర తత్పురుషేశానులను ఐదుభేదములచే నొప్పుచున్నాడు.

I తల్లీ ఈసద్యోజాతాది పంచపురుషులు నీపుంభావలీలలు. ఋగ్యజుస్సామవేదములు నీస్వతంత్రవాక్కులు. మఱియు సూర్యుడు నీనేత్రాంశము. చంద్రుడు నీమందస్మితముయొక్క బిందువు యని పరమేశ్వరిని శంకరులు నుతిచేసిరి.

ల॥ స॥ 280 పద్మనాభసహోదరీ ॥

భా॥ భాష్యమునందు— శైవమతరహస్యము। బ్రహ్మధర్మో౽ధర్మీతి రూపద్వయమభూత్ । తత్ర ధర్మః పుమాన్ స్త్రీతి ద్విధాభవత్ । తత్ర పుమాన్ విష్ణుః సకలజగదుపాదానభావం। స్త్రీపరమశివమహిషీభావం ప్రాపత్। ఏతత్త్రియమపి మిళిత్వైకమఖండం బ్రహ్మేతి శైవమతరహస్యం ॥

తా॥ ధర్మమని, ధర్మముకలవాడని బ్రహ్మము రెండురూపములను బొందెను. రెంటిలోను ధర్మము పురుషుడనియు, స్త్రీయనియు రెండురూపములుగలదయ్యెను. అందు పురుషుడు విష్ణువు జగత్తునకు ఉపాదానకారణమును, స్త్రీ పరమశివునియొక్క రాణియు నాయెను. ఈమూడును కలిసియే యఖండబ్రహ్మరూపము

ల॥ స॥ 298 నారాయణీ॥

భా॥ భా॥ కూర్మపురాణము—అహం నారాయణో గౌరీజగన్మాతా సనాతని । విభజ్య సంస్థితో దేవ స్స్వాత్మానం పరమేశ్వరః । న మే విదుః పరంతత్త్వం దేవాద్యా నమహర్షయః। ఏకో౽హం వేదవిశ్వాత్మా భవానీ విష్ణురేవచ ॥ ఇతిశివేన ॥

తా॥ పరమేశ్వరుడు తనస్వరూపము శివుడనియు, విష్ణువనియు, జగన్మాతయను శక్తియనియు, విభజింపబడెననియు, ఇట్లున్న పరతత్త్వమును దేవతలుగాని, మహర్షులుగాని యెఱుగరు. విశ్వాత్ముడనయిన నేనును విష్ణుమూర్తియు, పరమేశ్వరియు నొక్కరమే యగుదుమనియు చెప్పెను.

ల॥ స॥ 416 చిచ్ఛక్తిః ॥

భా॥ భా॥ దేవీభా॥ 5స్కంధము—వర్తతే సర్వభూతేషు శక్తిస్సర్వాత్మనా నృప। శవవచ్ఛక్తిహీనస్తు ప్రాణీభవతి సర్వదా చిచ్ఛక్తిస్సర్వభూతేషు రూపం తస్యాస్తదేవహి ॥

తా॥ సర్వభూతములయందును సర్వరూపములచేత శక్తియేయున్నది. శక్తిలేనికాలమువందు అన్నిప్రాణులును శవములగుచుండును. సర్వభూతములయందున్న ఆశక్తియే చైతన్యము. ఆచైతన్యమే పరదేవతారూపము.

ల॥ స॥ 571 మహాప్రళయసాక్షిణీ॥

పంచదశీస్తవము— శ్రీశంకరాచార్యకృతము— కల్పోపసంహరణకల్పితతాండవస్య దేవస్య ఖండపరశోః పరభైరవస్య। పాశాంకుశైక్షవ శరాసనపుష్పబాణైః సాసాక్షిణీ విజయతే తవమూర్తిరేకేతి॥

తా॥ మహాప్రళయకాలమునందు ఈశ్వరునియొక్క మహాతాండవమును పరాశక్తిమాత్రమే సాక్షిగానుండును. అన్యముగనదేదియునులేదు.

ల॥ స॥ 628 త్రిమూర్తిః॥

భా॥ భా॥ వరాహపురాణము—త్రివర్ణాచ కుమారీసా కృష్ణా శుక్లాచ పీతికా। ఉవాచ భగవద్దృష్ట్యే సజాతాస్మి సత్తమాః। కింమాం నవేత్థ సుశ్రోణీం స్వశక్తిం పరమేశ్వరీం॥ *** తతో బ్రహ్మాదయస్తస్యై త్రయస్తుష్టా వరందదుః। నామ్నాసి త్రికలాదేవీ పాహి విశ్వంచ సర్వదా। అపరాణ్యపి నామాని భవిష్యంతి తవానఘే। గుణోత్థానిమహాభాగే సర్వసిద్ధికరాణి చేత్యాద్యుక్త్వైకం। అన్యచ్చ కారణం దేవి యద్వృత్తం త్వయుమః శ్రుణుష్వతత్। సితరక్తకృష్ణవర్ణైస్త్రివర్ణాసి వరాననే। మూర్తిత్రయం త్రిభిర్వర్ణైః కురు దేవి స్వవిగ్రహే॥ ఏవముక్తాతదా దేవై రకరోత్త్రివిధాంతనుం। సితాం రక్తాం తథాకృష్ణాం త్రిమూర్తిత్వం జగామహేత్యుక్త్వా। అన్యత్రాపి। ఏషాత్రిమూర్తిరుద్దిష్టానయ సిద్ధాంతగామినీ। ఏషా శ్వేతా పరాశక్తిస్సాత్త్వికీ బ్రహ్మసంస్థితిః। ఏషైవ రక్తా రజసి వైష్ణవీపరికీర్తితా।

యో ధర్మాః కల్పితాః। వియదాద్యవచ్ఛిన్నేపి చైతన్యే పునశ్శబ్దవిషయత్వ ద్రవ్యత్వ ధర్మత్వాదయస్తదవచ్ఛిన్న చైతన్యేపి పునర్ధర్మత్వాదయః కల్పితాస్తథా ధర్మత్వస్యాపి ధర్మిత్వస్యేవ దృశ్యస్య నిర్ధర్మకేపి బ్రహ్మణి సుకల్పత్వాదేకస్యైవ ధర్మధర్మిభావేన్యాయేనైవ సిద్ధే తత్ర శివఏవ ధర్మీ శక్తిరేవ ధర్మ ఇతి తు సంప్రదాయాదవగంతవ్యమితి భావః। బ్రహ్మైవ శక్తిప్రపంచ ప్రతియోగిత్వేన శక్తిరిత్యుచ్యత ఇతి సాంప్రదాయికాః। సంప్రదాయసంజ్ఞకో మంత్రార్థోపి యోగినీహృదయే। దత్తాత్రేయ సంహితాయాంచ ప్రసిద్ధః। సచ కాదివిద్యాయామేవ స్వరస ఇతితు వరివస్యారహస్యఏవోపపాదితమస్మాభిః తదీశ్వరీత్యర్థః॥

తా॥ సంప్రదాయమనగా శిష్యపరంపరకిచ్చుట. అందుకు దేవతగినది నిర్గుణమగు బ్రహ్మమందు ఆకాశాది పంచభూతములు వానిగుణములు కల్పించబడెను. ఆకాశమారుతాది భూతనిష్ఠమగు చైతన్యమునకు ద్రవ్యత్వము ధర్మత్వము కల్పింపబడెను. ఇట్లు దృశ్యమగు జగత్తునందు ధర్మములుకల్పించినట్లు నిర్ధర్మమగు బ్రహ్మమందును ద్రవ్యత్వాది ధర్మములను కల్పించుట సులభము గనుక బ్రహ్మమునకొక వస్తువునకే ధర్మియని ధర్మమని కల్పించుట న్యాయమే. ఆ బ్రహ్మమందు ధర్మి శివుడు ధర్మము శక్తి అని పెద్దలమతము. కార్యమగు ప్రపంచము ఏకారణమువలన గలిగెనో ఆకారణమగు బ్రహ్మమే శక్తియని ఆర్యులుచెప్పుదురు. మంత్రార్థము సంప్రదాయమని యోగినీహృదయమందును, దత్తాత్రేయసంహితయందును ప్రసిద్ధము. ఈయర్థము కాదివిద్యయందే స్వారసమని వరివస్యారహస్యమందు చెప్పబడెను. లలిత సంప్రదాయేశ్వరి అనియు నర్థము.

ల॥ స॥ 728 చిత్కళా ॥

పద్మపురాణము— చిత్తేషు చిత్కళానామ శక్తిస్సర్వశరీరిణాం ॥ ఇతి ॥

తా॥ సర్వజంతువులయొక్క చిత్తమునందు చిత్కళయనుశక్తికలదు.

ల॥ స॥ 878 స్వాత్మారామా ॥

మార్కండేయపురాణము— త్వమక్షరం పరందేవి యత్ర సర్వం ప్రతిష్ఠితం । అక్షరం బ్రహ్మపరమం జగచ్చైతత్క్షరాత్మకం । దారుణ్యవస్థితో వహ్ని ర్భౌమాశ్చ పరమాణవః । తథా త్వయిస్థితం బ్రహ్మ జగచ్చేదమశేషతః ॥

తా॥ ఓ దేవీ నాశములేనిస్వరూపముగల నీయందు సమస్తజగత్తున్నది అక్షరమనగా పరబ్రహ్మ. జగత్తు క్షరాత్మకము. అనగా నశించునది. కఱ్ఱయందు అగ్నిహోత్రమువలెనే భూమియందు పరమాణువులవలెనే నీయందు సమస్తజగత్తున్నది.

ల॥ స॥ 905 బైందవాసనా ॥

భ॥ శా॥ బిందువ్యూహం ప్రవక్ష్యామి బీజరూపం వరాననే హకారం బిందురూపేణ బ్రహ్మాణం విద్ధి పార్వతి। సకారంబిందుసర్గాభ్యాం హరిశ్చాహం సురేశ్వరి। అవినాభావసంబంధో లోకే హరిహరౌ ఇత్యాదినా ॥ వామాదీనాం ఇచ్ఛాదీనాం జాగ్రదాదీనాం త్రయం త్రయం బిందురూపమేవప్రోక్త్వ్యపసంహృతం। ఏవం బిందుత్రయయోగాత్త్రిపురానామరూపిణీతి ॥

తా॥ ఓపార్వతీ బిందుబీజరూపములను చెప్పుచున్నాను. హకారమునుబిందురూపముచేత బ్రహ్మగాను, సకారమును బిందువిసర్గలచేత హరిహరులనుగను తెలిసికొనుము. హరిహరులొకరినొకరు విడిచియుండరు. 1వామాదులు 2ఇచ్ఛాదులు 3జాగ్రదాదులు మూడు మూడును బిందురూపముగానే చెప్పబడినవి. ఈత్రికారము మూడుబిందువులయోగముచేత త్రిపురయను నామరూపములు గలదయ్యెను.

---

1 వామ, జ్యేష్ఠ, రౌద్రి. 2 ఇచ్ఛా, జ్ఞాన, క్రియ. 3 జాగ్రత్, స్వప్న, సుషుప్తి.

ల॥ స॥ 997 శ్రీమత్త్రిపురసుందరీ॥

భా॥ వ్యా॥ త్రీణి పురాణి బ్రహ్మ, విష్ణు, శివశరీరాణి యస్మిన్ పతి పురః। కాళికాపురాణము—ప్రధానేద్యానశాద్భాగశ్శరీరముభవత్త్రిధా। తతోర్ధ్వభాగస్సంజాతః పంచవక్త్రశ్చతుర్భుజః। పద్మకేసరగౌరాంగః కాయో బ్రాహ్మో మహేశ్వరి। తన్మధ్యభాగో నీలాంగ ఏకవక్త్రశ్చతుర్భుజః। శంఖచక్రగదాపద్మపాణిః కాయస్సవైష్ణవః। అథవ త్తదధోభాగే పంచవక్త్రశ్చతుర్భుజః। స్ఫటికాభ్రమయశ్శుభ్రస్సకాయశ్చాంద్రశేఖరః। ఏవం త్రిభిః పురైర్యోగాత్త్రిపురః పరమశ్శివ॥ ఇతి॥

తా॥ శంభుని యిచ్ఛవలన నాని శరీరము త్రివిధమయ్యెను. అందూర్ధ్వభాగము 5 ముఖములు, 4 భుజములు, పద్మకేసరములవలె బసిమిగల వన్నెకలది. ఈభాగమే బ్రహ్మ. మధ్యభాగము ఒకమొగము, 4 భుజములు, శంఖ చక్ర, గదా పద్మములుగల చేతులు నీలవర్ణముగలది. ఈభాగమే విష్ణువు. అధోభాగము 5 ముఖములు, 4 భుజములు, స్ఫటికాభ్రములవలె ధవళమగు వర్ణముగలదయ్యెను. ఈభాగమే చంద్రశేఖరుడయిన శివుడు. ఇట్లు త్రివిధములగు పురములయొక్క వలన త్రిపురుడు పరమశివుడు.

ల॥ స॥ 999 శివశక్త్యైక్యరూపిణీ॥

భా॥ భా॥ I వాయుసంహిత— శివేచ్ఛయా పరాశక్తిశ్శివతత్త్వైకతాంగతా। తతః పరిస్ఫురత్యాదౌ సర్గే తైలం తిలాదివ॥

II సౌరసంహిత॥ బ్రహ్మణోఽభిన్నశక్తి బ్రహ్మైవశివాఖ్యా సాపరా। తథాపతి పృథావాక్యం శక్తిరిత్యవివేకిభిః॥

తా॥ I శివునియొక్క ఇచ్ఛచేతను పరాశక్తి శివతత్త్వము అయెను. పిమ్మట తిలలయందలి తైలమువలెనే సృష్ట్యాది అనేకముగా ప్రకాశించును.

II బ్రహ్మమునకంటె భేదములేని శక్తి బ్రహ్మస్వరూపమేకాని భేద
మంగలదికాదు ఇట్లుండగా అవివేకులు వ్యర్థముగా శక్తి వేఱని చెప్పుదురు.

త్రిశతి 22 వ కాతురి

శ్రీశంకరభాష్యమునందు— I స్మృతి సచ్చిన్మయః శివస్సా
తాత్తస్యానందమయీ శివా ॥

II స్మృతి॥ స్త్రీరూపాం చింతయేద్దేవీం పుంరూపాం మధవే
శ్వరీం । అథవా నిష్కళంధ్యాయేత్సచ్చిదానందవిగ్రహాం ॥

III శ్రుతి॥ త్వం స్త్రీ, త్వం పుమాన్ ॥

తా॥ I ఈశ్వరుడు సత్యజ్ఞానస్వరూపుడు. శక్తి ఆనందరూపము.

II సచ్చిదానందరూపమును స్త్రీరూపముగగాని, పురుషరూప
ముగగాని, లేక నిర్గుణరూపముగగాని ధ్యానము చేయవలయును.

III బ్రహ్మమును నీవే స్త్రీవి. నీవే పురుషుడవు. అని శ్వేతాశ్వ
తరోపనిషత్తు బోధించుచున్నది.

వామకేశ్వరతంత్రము॥ నాల్గవపటలము— త్రిపురా పరమా
శక్తిరాద్యా జ్ఞానాదితఃప్రియే । స్థూలసూక్ష్మవిభేదేన త్రైలో
క్యోత్పత్తిమాతృకా ॥ 4 ॥ కబళీకృతనిశ్శేష తత్త్వగ్రామస్వరూ
పిణీ । తస్యాం పరిణతాయాంతు నకశ్చిత్పరఇష్యతే ॥ 5 ॥ పరో
హి శక్తిరహితశ్శక్తః కర్తుం నకించన । శక్తస్తు పరమేశాని
శక్త్యాయుక్తో యదా భవేత్ ॥ 6 ॥ శక్త్యావినా శివే సూక్ష్మే
నామధామ నవిద్యతే । జ్ఞాతేనాపి మహాదేవి శర్మకర్మ నకించన॥

తా॥ త్రిపురసుందరియను పరాశక్తియే జ్ఞానేచ్ఛాక్రియాశక్తులను
గల్పించినది. స్థూలసూక్ష్మభేదములుగల మూడులోకములకు కారణమైనది.
తనయందు సమస్తతత్త్వములను లయముచేసికొన్నది. ఆమెయొక్క పరిణామ
మందు మఱియొకటియేదియు తెలియబడదు. శక్తిలేనియెడల పరమేశ్వరు
ను ఏమియు చేయలేడు. శక్తితోకూడినయెడల సమస్తమును చేయుటకు సమ

తా॥ ఈపరమేశ్వరి ఈశ్వరునకును సాక్షిణిగానున్నది. ఈశక్తిలేని కాలమునందు శివుడసమర్థుడు. శివుడులేకుండ శక్తిలేదు. శక్తిలేకుండ శివుడులేడు. శివునికిని శక్తికిని ఐక్యము ఎవరికిసాక్షాత్కారమగునో వారుముక్తులు వారిద్దరికి భేదమని యేనరాధములు తలంతురో వారు క్రిందికి ముఖము పైకి పాపములుగలవారై నరకసముద్రమునం బడుదురు. భూమియందు తల్లిదండ్రులచేక నరులెట్లువృద్ధినిబొందుదురో అట్లు వీరిద్దరివలన జగత్తు వృద్ధిపొందును. సంశయములేదు. సర్వలోకములకు తల్లియగు నీపరమేశ్వరిని నెవ్వరుపాసింతురో వారు సకలాభీష్టములనేకాక ముక్తినిగూడబడయుదురు. ఓమహర్షులారా, సర్వేశ్వరప్రేష్టయగు పార్వతి తనను శ్రద్ధతో సేవించువారికి భుక్తిముక్తులను తప్పకయిచ్చును. శైవవైష్ణవాద్యుపభేదమునవలంబించువారికి మెత తద్రూపిణియయి తన్నారాధించుటచేత వారుకోరినఫలమునిచ్చును. కరుణానిధియగు శాంకరిని పూజచేసినవారికిష్టమగుఫలములన్నియు తప్పక కలుగునని సూతుడుచెప్పెను.

త్రిపురోపనిషత్తు 14 ఋక్కు— భగశ్శక్తిర్భగవాన్ కామ ఈశఉభా దాతారావిహ సౌభగానాం। సమప్రధానౌ సమసత్త్వా సమేతౌ సమశక్తిరజరావిశ్వయోనిః॥

భా॥ భా॥ సగుణస్య కల్పితత్వాదేవ స్త్రీపుంసరూపయోః సమప్రాధాన్యముపదేష్టుం చతుర్దశీమృచమాహ— భగశ్శక్తిరితి। భగో విమర్శపర్యాయః। ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసః శ్రియః। జ్ఞానవిజ్ఞానయోశ్చైవ షణ్ణాం భగఇతీర్యతే ఇత్యాది స్మృతిభిరీశ్వరస్య శరీరఘటకోపాయువాన్ ధర్మరాశిః సర్వోఽపి భగపదేన ఇహనిర్దిష్టః। తాదృశధర్మసమూహఏవశక్తిరిత్యుచ్యతే। ఉపాస్యత్వేన వర్ణితాయాః స్త్రీరూపాయా దేవతాయాఇదంశరీరం। తదుక్తం నాగానందసూత్రే॥ ప్రకాశాత్మనో బ్రహ్మణః స్వభావాత్మకం విమర్శం ప్రక్రమ్య ఏషఏవవిమర్శ

చ్ఛిచ్చైతన్యమాత్మా స్వరసోదితః। పరా వాక్ స్వాతంత్ర్యం పర
మాత్మైక్యమైశ్వర్యం। సత్వం సత్తాస్ఫురత్తాసారాః మాతృ
కామాలినీ హృదయం మూర్తిః స్వసంవిత్స్పంద ఇత్యాది
శబ్దైరాగమై రుద్ఘోష్యత ఇతి। తేషాం ధర్మవిశేషార్థవివరణం
తద్భాష్యఏవ ద్రష్టవ్యం। భగవాన్ తాదృశధర్మవిశిష్టఏవ।
కామః ఈశః కామేశ్వరః। ఇదమేవ ఉపాస్యదేవతాయాః స్ఫు
రత్తామాత్రికం రూపం। ఇహ ఉపాసనాయాం సాధకానాం
ధర్మార్థకామమోక్షాణాం వివిధఫలానాం దాతారావుభావపి ఏక
స్యైవ దేవతాయాద్వేధాపి సగుణధ్యానే త్రివర్గసిద్ధిరిత్యర్థః॥
సమప్రధానౌ సమసత్వౌ సత్వశబ్దో గుణపరః। తేన పరస్పరం
గుణగుణిభావాపన్నావిత్యర్థః। కామేశ్వర్యాః కామేశ్వరాంక
నిలయత్వేన ధ్యానే, శివస్యాధారత్వాద్గుణః, శక్తిః ప్రధానం।
శివస్యాంగీకారమురస అర్థాంశయుక్తత్వేన ధ్యానే, కటిష్ఠా
ద్వయమపి శేషరూపత్వాచ్ఛక్తిర్గుణః, శివఏవ ప్రధానమితి
భావః। ఏవమభిమతఫలదానసామర్థ్యస్యాన్యోన్యగుణప్రధాన
భావస్యచ, సమత్వేపి జగత్కర్తృత్వాంశః శక్తినిష్ఠఏవ। తేన
స్త్రీరూపధ్యానేనైవ శీఘ్రం ఫలసిద్ధిరితి బోధయన్నాహ—సమే
తయోరితి సమ్యక్స్వరస్యాభేదేన (నీ) ఇతయోః మిళితయోరర్థ
నారీశ్వరరూపయోశ్శివశక్త్యోర్మధ్యే సమశక్తిస్సర్వశక్తిః నిఖిల
ధర్మసమూహాత్మికా దేవ్యేవ॥ విశ్వయోనిః జగత్కర్త్రీ తథా
చ శక్తిసూత్రం॥ "చితిస్స్వతంత్రా విశ్వసిద్ధిహేతురితి" సమ
శబ్ద ఉరుష్యాణో అఘాయతస్సమస్మాదిత్యాదౌ ప్రసిద్ధస్సర్వప
ర్యాయః। అజకేతి విశ్వయోనిత్వాంశే విశేషణం। జగత్క

లలి॥ స॥ 167 పాపనాశనీ ॥

భా॥ వ్యా॥ పాపం నాశయతి స్వీయవిద్యా జపాదినా భక్తా నామితి ॥

తా॥ పరమేశ్వరి తనవిద్యయొక్క జపము మొదలగువానిచేత భక్తులకు పాపమును నశింపచేయును.

I పద్మపురాణము— మేరుపర్వతమాత్రోపి రాశిః పాపస్య కర్మణః । కాత్యాయనీం సమాసాద్య నశ్యతి క్షణమాత్రతః ॥ దుర్గార్చనరతో నిత్యం మహాపాతకసంభవైః । దోషైర్నలిప్యతే వీర పద్మపత్రమివాంభసేత్యాది ॥

తా॥ పరమేశ్వరిని నారాధించుటచే పాపరాశి మేరుపర్వతమంత గొప్పదయినను క్షణములో నశించును నీరు తామరాకునంటనట్లు పాతకములు దుర్గార్చనపరుని నంటవు.

II బ్ర॥ పురాణము— వర్ణాశ్రమవిహీనానాం పాపిష్ఠానాం నృణామపి । యద్రూపధ్యానమాత్రేణ దుష్కృతం సుకృతాయతే ।

తా॥ తమవర్ణాశ్రమములకు తగినకర్మములను జేయక పాపులగువారు నయితె మొకమారు దేవిని ధ్యానించిరేని వారిపాపములు పుణ్యములుగమారి సుఖమునిచ్చును.

లలి॥ స॥ 214 మహాపాతకనాశనీ ॥

భా॥ వ్యా॥ మహాంతి బ్రహ్మహత్యాదీని పాతకానినాశయతి

తా॥ పరమేశ్వరి తనను సేవించుటచేత భక్తులకు బ్రహ్మహత్యాది మహాపాపములనయినను నశింపజేయును.

I బ్ర॥ పు॥ కృతస్యాఖిలపాపస్య జ్ఞానతో౽జ్ఞానతో౽పివా । ప్రాయశ్చిత్తం పరం ప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః ॥

తా॥ జ్ఞానముచేతగాని, యజ్ఞానముచేతగాని చేయబడిన సమస్తపాపములకు పరమేశ్వరియొక్క పాదస్మరణమే ప్రాయశ్చిత్తమని చెప్పబడినది.

II బ్రహ్మోత్తరఖండము— బహునాత్ర కిముక్తేన శ్లోకార్ధేన వదామ్యహం। బ్రహ్మహత్యాశతంవాపి శివపూజా వినాశయేత్ ॥

తా॥ విశేషముగా చెప్పనక్కరలేదు. అర్ధశ్లోకముచేత చెప్పుచున్నాను. నూరుబ్రహ్మహత్యలుగూడ శివపూజవలన నశించును.

ల॥ స॥ 736 ముక్తిదా॥

భా॥ భా॥ శివపురాణము— నామాని యేమహేశస్య కృణంత్యజ్ఞానతోపివా। తేషామపి శివోముక్తిం దదాతి కిమతః పరం ॥

తా॥ శివనామములను తెలియకుండ నుచ్చరించినను మోక్షమునిచ్చు నవగా దవను సేవించినభక్తులకు ముక్తికలుగునని చెప్పవలెనా. ఎరిగిముట్టినను ఎరుగకముట్టినను అగ్ని కాల్పకమానదు.

ల॥ స॥ 286 వర్ణాశ్రమసిద్ధాయిపీ॥

కూర్మపు॥ దేవ్యువాచ॥ ధ్యానేన కర్మయోగేన భక్త్యా జ్ఞానేనచైవహి। ప్రాప్యాహం తేగిరిశ్రేష్ఠ నాన్యథా కర్మకోటిభి ర్నిత్యేవ న్యాప్యాహ్యత్ర। కర్మయోగనిరూపణార్థం పునరప్యుక్తం। శ్రుతిస్మృత్యుదితం సమ్యక్కర్మవర్ణాశ్రమాత్మకం। అధ్యాత్మజ్ఞానసహితం ముక్తయే సతతంకురు। ధర్మాత్సంజాయతే భక్తి ర్భక్త్యా సంజాయతే పరం। శ్రుతిస్మృతిభ్యాముదితో ధర్మోయజ్ఞాదికోమతః। నాన్యతోజ్ఞాయతే ధర్మో వేదాద్ధర్మోహినిర్బభౌ తస్మాన్ముముక్షుర్ధర్మార్థం మద్రూపం వేదమాశ్రయేత్। మదాజ్ఞయైవ గుప్త్యర్థం వేదానాం భగవానజః। బ్రాహ్మణాదీనసజ్ఞాథ స్వేస్వేకర్మణ్యయోజయదిత్యాది ॥

తా॥ ఓహిమవంతుడా ధ్యానముచేతను, వక్ష్యమాణకర్మయోగముచేతను, భక్తిజ్ఞానములచేతను నేను నీకులభింపగలదానను గాని ఇతరమగుకోటి

కర్మముల చేతనైన లభింపను. వర్ణాశ్రమములకు తగినట్లుగా శ్రుతిస్మృతులచే తెలుపబడిన కర్మములనెల్లప్పుడు నాత్మజ్ఞానముతో ముక్తికొఱకు బ్రహ్మార్పణముగా జేయుము. ధర్మమువలన భక్తియు, భక్తివలన జ్ఞానమును గలుగును. శ్రుతిస్మృతులచేత విహితములగు యజ్ఞాదికములు ధర్మమనబడును. ఇదివేదములవలననే కాని యితరమువానివలన తెలియబడదు. కనుక మోక్షేచ్ఛగలవారు నాస్వరూపమగు వేదము నాశ్రయింపవలయును. నాయాజ్ఞచేత నేనెవరి రక్షణముకొఱకు బ్రహ్మ బ్రాహ్మణాదివర్ణములను సృజించి వారివారికి తగిన కర్మముల నియమించెను.

లి॥ స॥ 288 పుణ్యాపుణ్యఫలప్రదా ॥

భా॥ భా॥ I శ్రుతి॥ ఏషఏవ సాధుకర్మ కారయతి। యమమూన్నినీషత్యేషఏవ హ్యసాధుకర్మకారయతి। యమధోనినీషతీతి॥

తా॥ ఈశ్వరుడు ఉత్తమలోకములను పొందింపదలచినప్పుడు సత్కర్మములను, అధోలోకములను పొందింపదలచినప్పుడు దుష్కర్మములను చేయించును.

II శివరహస్యము — కర్తా సుప్తి జాగ్రత్త్వమసి స్వయోగే కర్మఫలదాతామిత్యాద ॥

తా॥ ఓ పాపకర్మములు వారికి నీవు జాగరూకతతో ఫలము నిచ్చుచుందువు.

III కూర్మపురాణము — యే న కుర్వంతి తద్ధర్మం తదర్థం బ్రహ్మనిర్మితాః। నిరయాస్తేషు పతనః పాతయంత్యన్మదాజ్ఞయా। ధర్మం కుర్వంతి వేదోక్తం యే మద్భక్తిపరాయణాః। స్వర్గాదిషు శచీశాద్యాస్తారయంతి మదాజ్ఞయా॥

తా॥ ధర్మములనాచరింపని వారికొరకు బ్రహ్మ నరకములను సృజించెను అట్టివారిని యముడు నాయాజ్ఞచేత నరకములందు గూల్చును నాయెడల భక్తిగలిగి వేదోక్తధర్మములాచరించువారిని ఇంద్రాదులు నాయాజ్ఞచేత స్వర్గాద్యుత్తమలోకములను బొందింతురు.

IV కూర్మపురాణము— ఈశ్వరప్రేరితో గచ్ఛేత్స్వర్గంవా శ్వభ్రమేవవా ॥

తా॥ ఈశ్వర ప్రేరణవలననే స్వర్గమును గాని, నరకమునుగాని పొందుదురు

V పౌరసంహిత— శ్రుత్యనుగ్రాహకేణాపి గ్రాహ్యాస్తర్కేణశంకరః । అతస్సర్వాత్మనాసాక్షాద్ధర్మాధర్మఫలప్రద ఇతి॥

తా॥ ఈశ్వరుడు శ్రుతిచేతను, యుక్తులచేతను తెలిసికొనదగినవాడు. కనుక అన్నివిధముల చేతను ధర్మఫలమును, అధర్మఫలమును ఇచ్చువాడతడే.

ల॥ స॥ 354 పశుపాశవిమోచనీ॥

భా॥ భా॥ లింగపురాణము— బ్రహ్మాద్యాస్థావరాంతాశ్చదేవదేవస్య శూలినః। పశవః పరికీర్త్యంతే సమస్తాః పశువృత్తయ ఇతి॥ విషయాఅపి కీర్త్యంతే పాశాజీవస్య బంధనాత్ । తైర్బద్ధాః శివభక్త్యైవ ముచ్యంతే సర్వదేహినః ఇతి ॥

తా॥ బ్రహ్మమొదలు స్థావరములు తుదిగాగల జీవులు ఈశ్వరునియొక్క పశువులని చెప్పబడుచున్నవి. విషయములు జీవులను బంధించునవి కనుక పాశములని చెప్పబడుచున్నవి. అట్టిపాశములచేత కట్టబడిన సమస్తజీవులు ఈశ్వరభక్తిచేత ముక్తినిబొందుదురు.

ల॥ స॥ 391 నిర్వాణసుఖదాయినీ॥

భా॥ భా॥ కూర్మపు॥— హిమవంతునిగూర్చి దేవీవాక్యము— మామనాదృత్య పరమం నిర్వాణమమలంపదం। ప్రాప్యతేనహి శైలేంద్ర తతోమాం శరణం వ్రజ। ఏకత్వేన పృథక్త్వేన తథాచోభయతోపివా। మాముపాస్య మహారాజ తతో యాస్యసి తత్పదం ॥

తా॥ ఓహిమవంతుడా, నన్ను సేవింపకమోక్షమనేనిముక్తిపదవిపొందుడదు. కనుక నీవు పరమేశ్వరితో నేనభిన్నుడననేబుద్ధిచేతగాని, కాలాను

సారముగా నుభయవిధముగగాని, నాకటాక్షమును బొంది యుపాసనచేసిన యెడల ముక్తినిపొందగలవని పరమేశ్వరి చెప్పెను.

లః॥ స॥ 623 కేవలా॥

భా॥ భ॥ శ్రుతి॥ యదీగ్ శ్రుణోత్యలకగ్ శ్రుణోతి। నహి ప్రవేద సుకృతస్య పంథామ్॥

వ్యా॥ ఈకారమాత్రశ్రవణంతు లకారకకారరాహిత్యేనశ్రవణం। అత స్తద్వాన్ సుకృతస్య సత్కర్మణః సత్పంథానముత్తమలోకాన్ నయాతి। కింతు నిర్గుణజ్ఞానస్యైవలోకం ప్రాప్నోతి కామబీజమాత్రేణ తు మోక్షఇతి పర్యవసితోర్థః॥

తా॥ క్లీంకారమునందు కకార లకారములు తీసివేయగా మిగిలిన ఈంకారమాత్రశ్రవణముచేత నుత్తమములయినను క్షీణించెడిలోకములను పొందడు. నిర్గుణజ్ఞానమోక్షమును పొందును. క్లీంకారమాత్రముచేత ధర్మార్థకామములును, కామకలాబీజమగు ఈంకారమాత్రముచేత మోక్షమును కలుగునని అభిప్రాయము.

లః॥ స॥ 880 సంసారపంకనిర్మ్ముక్త సముద్ధరణపండితా॥

కూ॥ పు॥ యేమనాగపి శర్వాణి స్మరంతి శరణార్థినః। దుస్తారాపారసంసారసాగరే నపతంతి తే॥

తా॥ ఓపార్వతీ యెవరునిన్ను శరణుపొంది స్వల్పముగానైనను స్మరించెదరో వారు దుస్తరమగు సంసారసముద్రమునందు పడరు.

లః॥ స॥ సర్వాపద్వినివారిణీ॥

I కూ॥ పు॥ దేవీవాక్యము— యేతు సంగాన్పరిత్యజ్య మామేవ శరణంగతాః। ఉపాసతే సదాభక్త్యా యోగమైశ్వర్యమాశ్రితాః। సర్వభూతదయావంత శ్శాంతాదాంతా విమత్సరాః। అమానినో బుద్ధిమంతః తాపసాస్సంయతవ్రతాః। మచ్చిత్తామద్గతప్రాణా మజ్జ్ఞానకథనేరతాః। సన్యాసినో గృహస్థాశ్చ వన

స్థాబ్రహ్మచారిణః । యేదోషైర్నకులక్షైర్హీనా అపిమన్మామజాప
కాః । తేషాం నిత్యాభియుక్తానామాపదాం పర్వతానపి । నాశ
యామితరాంజ్ఞానదీపేన నచిరాదిహేతి॥

II హరివంశము— దేవినిగూర్చి విష్ణువాక్యము— నృణాం
బంధం వధం రోధం పుత్రనాశం ధనక్షయమిత్యాదినా ఆపత్సు
నిఖిలాసు త్వాం రక్షస్యేవ నసంశయ ఇతి ॥

III వరాహపురాణము— శరణం త్వాం ప్రపద్యంతే యే
దేవి పరమేశ్వరి। నతేషామాపదః కాశ్చిజ్జాయంతే క్వాపిసంకటే॥

IV ఆపదికిం కరణీయం స్మరణీయం చరణయుగళ మంబా
యాః । తత్స్మరణం కింకురుతే బ్రహ్మాదీనపిచ కింకరీకురుతే ॥

తా॥ I ఎవరు విషయసుఖములను విడిచి నన్ను శరణుపొంది సర్వ
భూతములయందు దయగలిగి కోపమునువిడిచి ఇంద్రియనిగ్రహముకలిగి అస
హనము మొదలగుదోషములు లేకుండగ జ్ఞానముకలిగి తపస్సుచేయుచు నియ
మవ్రతముగలిగి చిత్తము, ప్రాణములు నాయందే యుంచి నాకథలయందాస
క్తులయి నన్ను తెలియగోరుదురో వారికిని, సన్యాసికిగాని, గృహస్థునకుగాని
వానప్రస్థునకుగాని, బ్రహ్మచారికిగాని చెప్పబడిన లక్షణములులేకున్నను నా
మంత్రమును, నానామములు జపించుచుఉపాసకులకును, పర్వతములతోసమా
నమగు ఆపదలను జ్ఞానముచేత శీఘ్రముగా నాశముజేసెదనని పరమేశ్వరి
చెప్పెను

II భక్తులను సంసారదుఃఖము, మరణము, రాజబాధ, సంతాననాశ
ము, ధననాశము మొదలగు సమస్తాపదలనుండి నీవు రక్షించెదవు. సందేహ
ములేదని పరమేశ్వరితో విష్ణుమూర్తి చెప్పెను.

III ఓపరమేశ్వరీ యెవరునిన్ను శరణుపొంది సేవించుచున్నారో
వారికి నేకాలమునందును ఏయాపదలునుకలుగవని బ్రహ్మాదులు పరమేశ్వరిని
స్తోత్రముచేసిరి.

IV ఆపత్తులయందు పరమేశ్వరియొక్క పాదద్వంద్వమును స్మరిం

కవలయుననియు, స్మరణవలన బ్రహ్మాదిదేవతలనుకూడ కింకరులనుగాచేయు ననియు పెద్దలు చెప్పిరి.

ల॥ స॥ అభ్యాసాతిశయజ్ఞాతా॥

భా॥ భా॥ I శ్రుతి॥ ఆసుప్తేరామృతేః కాలం నయేద్వేదాంతచింతయేతి విహితేన బ్రహ్మాత్మైక్యానుసంధానావృత్త్యతిశయేన జ్ఞాతా॥

తా॥ ప్రతిదినము సుషుప్తివరకును, ఇట్లుమృతినొందునరకును వేదాంతవిమర్శముచేత కాలమును గడుపవలెనను శ్రుతిచేత బ్రహ్మమునకును తనకును అభేదానుసంధానవృత్తి అతిశయించుటవలన తెలిసికొనబడును.

II వ్యాససూత్రము—ఆవృత్తిరసకృదుపదేశాదితి॥

తా॥ వినవలెను, విమర్శింపవలెను అని అనేకసారులు బోధించుట వలన దేవీసాక్షాత్కారపర్యంతము విమర్శింపవలెను.

III బ్ర॥ పు॥ ధ్యానైకదృశ్యా జ్ఞానాంగీ విద్యాత్మా హృదయాస్పదా। ఆత్మైక్యా న్ముక్తిమాయాతి చిరానుష్ఠానగౌరవాత్॥

తా॥ జ్ఞానస్వరూపురాలును, ధ్యానముచేతనే తెలియదగినదియు, విద్యామయమగుదేవిని ఆత్మతోనభేదముగ చిరకాలము ధ్యానించుటవలన ముక్తినిబొందుదురు.

ల॥ స॥ 3అ॥ 4శ్లోకభా॥ పద్మపురాణము—పుష్కరఖండము—అన్హికప్రకరణము॥ గణేశం పూజయేద్యస్తు విఘ్నస్తస్య నబాధతే। ఆరోగ్యార్థేర్చయేత్సూర్యం ధర్మమోక్షాయ మాధవం। శివం ధర్మార్థమోక్షాయ చతుర్వర్గాయచండికాం॥

తా॥ వినాయకుని పూజచేయువారిని విఘ్నములు బాధింపవు. ఆరోగ్యముకొరకు సూర్యుని, ధర్మమోక్షములకొరకు విష్ణుమూర్తిని, ధర్మార్థమోక్షములకొరకు ఈశ్వరుని, ధర్మార్థకామమోక్షములకొరకు పరాశక్తిని ఆరాధింపవలయును.

త్రిశతి 8 కల్మషఘ్నీ ॥

శం॥ వ్యా॥ కల్మషాని పాపాని హంతి నాశయతీతి కల్మషఘ్నీ I భగవద్వచనము— అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి ॥ అథవా వేదాంతమహావాక్యజన్యసాక్షాత్కారరూపబ్రహ్మవిద్యా ॥

II స్మృతి॥ జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతేऽర్జున॥

III శ్రుతి॥ నస పాపం శోకం శ్రుణోతి ॥

తా॥ పరదేవత పాపములను నశింపచేయును.

I నిన్ను సర్వపాపములనుండి నేను విడిపింతునని భగవంతుడు చెప్పెను. లేక పరమేశ్వరి వేదాంతమహావాక్యములచే సాక్షాత్కారరూపమగు బ్రహ్మవిద్యగానున్నది.

II జ్ఞానమనెడు అగ్ని సర్వకర్మములను భస్మముచేయును

III జ్ఞాని పాపమును చేయడు. దుఃఖమును పొందడు.

త్రిశతి 9 కరుణామృతసాగరా ॥

శం॥ వ్యా॥ కరుణయా కృపయా జాతం యదమృతం మోక్షరూపం తస్య సాగరఇవ సాగరా। యథా అమృతసముద్రః స్వయమమృతస్వరూపః సన్ అన్యానపి లోకాన్ అమృతపాయి మేఘాద్విముక్తేనామృతేన సంజీవయతి తథా ॥ “బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి। బ్రహ్మవిదాప్నోతి పరం” ఇత్యాది శ్రుత్యా స్వయమమృతస్వరూపాసతీ ॥ “లభతేచ తతః కామాన్మయైవ విహితాన్ హితాన్” ॥ ఇతి భగవద్వచనేన తత్తదధికారికృత కర్మోపాసనాది ఫలస్య దేవతా ప్రాపణీయస్య సంప్రాప్తౌ తత్తదధికారిణాం తత్తత్ఫలం స్థితమితి సంభావ్యత ఇతి సాగరోపమా ॥

తా॥ పరమేశ్వరీకృపచేత మోక్షరూపామృతమునకు సముద్రము. అమృతసముద్రము తన యమృతమును త్రాగమేఘములవలన అమృతమును విడిపించి లోకములను జీవింపజేయునట్లే అమృతరూపురాలగు పరమేశ్వరి ఆయాత్మోపాసనలయొక్క ఫలమయిన అమృతమునిచ్చుచుండును.

త్రిశతి 153 కామ్యావిగ్రహా ॥

శం॥ వ్యా॥ సూత్రభాష్యే దేవతాధికరణే— "మంత్రప్రకాశికా దేవాః" "వజ్రహస్తః పురందరః" ఇత్యాది స్వతః ప్రమాణ వేదవాక్యవశాత్ బాధకాభావే విగ్రహవంతః అంగీకర్తవ్యా ఇతి ప్రతిష్ఠాపితం । తథా బహుశోభమానాముమాం హైమవతీం । ఇతి కేనోపనిషద్భాష్యే ॥ హైమాని హేమవికారాణి భూషణాని యస్యాః సా । హిమవతః అపత్యం స్త్రీ చ తథేతి పరదేవతాయాః దివ్యవిగ్రహవత్త్వం ప్రతిష్ఠాపితం । తథాచ మహానుభావానాం స్వప్రకాశ చైతన్యరూపాణామేవం భూతానాం సర్వాత్మనా సర్వోత్తమానాం మూర్తిత్రయదేవానాం ధ్యానాద్యుపకారాయ తాదృశమూర్తిమత్త్వం అస్తీతి । సకించిదనీశ్వరవాదప్రసంగావకాశ ఇతి ॥

తా॥ సూత్రభాష్యములో దేవతాధికరణమునందు— " దేవతలుమంత్రములచే ప్రకటనచేయబడువారు ఇంద్రుడు వజ్రాయుధము హస్తమునందు గలవాడు " ఈ మొదలగు స్వతస్సిద్ధప్రమాణమగు వేదవాక్యములవలన బాధకములేనందున విగ్రహవత్త్వము అనగా స్వరూపముకలుగుట అంగీకరింపబడినది. ఈప్రకారముగానే కేనోపనిషద్భాష్యమునందు సువర్ణవికారమగు భూషణములుగల పార్వతిఅనియు, హిమవంతునికుమార్తె అనియు. పరదేవతకు దివ్యశరీరమంగీకరింపబడినది. మహానుభావులును, స్వప్రకాశచైతన్యరూపులును, సర్వవిధములచేతను సర్వోత్తములునగు బ్రహ్మ, విష్ణు, రుద్రులకును ధ్యానాదులకొరకు శరీరముకలదు. దీనిచే భగవంతుడు లేడనువాదమునకు లేశమయిన నవకాశము లేదు.

త్రిశతి 97 హ్రీంకార వేద్యా ॥

భగవద్గీత— బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్ష్యతే మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ ఇత్యాది

తా॥ అజ్ఞాననాశముకొరకు బ్రహ్మవిషయమగు వృత్తులనవలంబింపవలెను నన్ను శరణుపొందినవారు మహామాయను దాటగలరని భగవంతుడు చెప్పెను.

త్రిశతి 229 సద్గతిదాయినీ॥

శ॥ వ్యా॥ "సమీచీనా పునరావృత్తిరహితా సుఖమాత్ర రూపాగతిః " గమ్యతే జ్ఞాయతే ప్రాప్యతే ఇతివాగతిః । యత్ జ్ఞాయతే తదేవ గతిః । తదన్యస్యాజ్ఞాతత్వాత్ । గతిత్వానుపపత్తేః । జ్ఞాతే ఫలే ఇచ్ఛయా తత్సాధనేషు పురుషః ప్రవర్తతే। నత్వజ్ఞానఫలసాధనే। ఇత్యన్వయవ్యతిరేకాభ్యాం । (1) బ్రహ్మవిదాప్నోతి పరం । (2) బ్రహ్మవేద బ్రహ్మైవభవతి । (3) యే పూర్వం దేవాఋషయశ్చ తద్విదుః । తేతన్మయా అమృతావై బభూవుః । ఇత్యాది శ్రుత్యా పరదేవతాస్వరూపమేవ ముక్తిస్వరూపతయా సద్గతిః ॥ ఇతి ॥

తా॥ సద్గతియనగా తిరుగాజన్మములేని సుఖరూపమగు మోక్షము. గతియనగ తెలిసికొనబడునది లేక పొందబడునది. తెలిసికొనబడునదియేగతి ఫలము తెలిసినకాలమునందే ఇచ్ఛచేతను దానిని సాధించుటయందు పురుషుడు ప్రవర్తించును. ఫలము తెలియనికాలమునందు ప్రవర్తింపడు. శ్రుతి॥ (1) బ్రహ్మమును తెలిసికొనినవాడు శ్రేష్ఠపదమును బొందును (2) బ్రహ్మమును తెలిసికొనినవాడు బ్రహ్మమేయగును. (3) పూర్వమే దేవతలు, ఋషులు బ్రహ్మమును తెలిసికొనిరో వారు బ్రహ్మస్వరూపులై మోక్షమును బొందిరి. ఈ మొదలగు శ్రుతులవలన పరదేవతాస్వరూపమే ముక్తిరూపమగుట చేత సద్గతియనబడును.

దత్తాత్రేయసంహిత 4అ॥ జ్ఞానం వేదాంతవాక్యానాంవిచారాదేవ యద్యపి। అనైకాగ్ర్యాత్సంశయాద్వా సామగ్ర్యావాప్యసంభవే। విచారాసంభవాద్బ్రహ్మవిద్యోక్తా జ్ఞానసిద్ధయే। ఇత్థం విదితవిద్యస్య చిద్విద్యోపాసనక్రతుం। కర్వతో ద్వారి తిష్ఠంతి భూతయోష్టాణిమాదయః। ఆర్థికం ఫలమేతద్ధి మోక్షస్సాక్షాత్ఫలం లభేత్ ॥ **** ॥ మనుం భజేత సర్వార్థ ప్రదం పంచదశాక్షరం ॥ ఇత్యాది॥

తా॥ వేదాంతవాక్యములయొక్క విమర్శనములవల్లనే జ్ఞానము కలుగుచున్నను, ఏకాగ్రతలేకపోవుటవలనగాని, సంశయమువలనగాని, సామగ్రిలేకపోవుటవలనగాని, జ్ఞానముసంభవింపనికాలమునందు బ్రహ్మయొక్కవిమర్శసంభవమగుటవలన జ్ఞానసిద్ధికొరకు ఈవిద్య చెప్పబడినది ఇట్టిచిద్విద్యయొక్క ఉపాసనక్రతువును తెలిసికొని యాచరించినవానియొక్క ద్వారమునందు అణిమాదిసిద్ధులుండును. ఇట్టి ఐహికఫలమేగాక సాక్షాత్ఫలమగు ముక్తియును లభించును. ఇట్టిఉపాసనాభిప్రాయమే జీవన్ముక్తివివేకమునందును, సూతసంహితయందును, త్రిశతినామభాష్యమునందును, శ్రీమద్భాగవతమునందును చెప్పబడెను.

జీవన్ముక్తివివేకము—వాసనాక్షయప్రకరణము॥

శ్లో॥ యం వినిద్రాజితశ్వాసాః సంతుష్టాః సంయతేంద్రియాః। జ్యోతిఃపశ్యంతి యుంజానాస్తస్మై విద్యాత్మనే నమః॥

వి। భా॥ విద్యాధికారీ ద్వివిధః। కృతోపాస్తిరకృతోపాస్తిశ్చేతి। తత్రోపాస్య సాక్షాత్కారపర్యంతాముపాస్తింకృత్వా యదిజ్ఞానే ప్రవర్తేత తదా వాసనాక్షయ మనోనాశయోర్దృఢతరత్వేన జ్ఞానాదూర్ధ్వం విద్వత్సంన్యాసజీవన్ముక్తీ స్వతఏవసిధ్యతః। తాదృశఏవ శాస్త్రాభిమతో ముఖ్యో విద్యాధికారీ। తతస్తం ప్రతిశాస్త్రేషు మహోపన్యాసాత్। స్వరూపేణ వివిక్తా

వపి విద్వత్సంన్యాసవివిదిషాసంన్యాసౌ సంకీర్ణావివ ప్రతిభాసేతే ఇదానీంతనాస్తు ప్రాయేణాకృతోపాస్తయఏవౌత్సుక్యమాత్రాత్సహసా విద్యాయాం ప్రవర్తంతే। వాసనాక్షయ మనోనాశౌ చ తాత్కాలికౌ సంపాదయంతి। తావతా శ్రవణ మనన నిధిధ్యాసనాని నిష్పద్యంతే। తైశ్చ దృఢాభ్యస్తైరజ్ఞానసంశయ విపర్యయనిరాసాత్తత్త్వజ్ఞానం సమ్యగుదేతి। ఉదితస్య జ్ఞానస్య బాధకప్రమాణాభావాన్నివృత్తాయా అవిద్యాయాః పునరుత్పత్తి కారణాభావాచ్చ నాస్తి తస్య శైథిల్యం। వాసనాక్షయమనోనాశౌతు దృఢాభ్యాసాభావాద్భోగప్రదేన ప్రారబ్ధేన తదాతదా బాధ్యమానత్వాచ్చ సవాతప్రదేశదీపవత్సహసా నివర్తేతే॥ తథాచ వసిష్ఠః॥ "పూర్వేభ్యస్తు ప్రయత్నేభ్యో విషమోఽయం హి సంమతః। దుస్సాధ్యో వాసనాత్యాగః సుమేరూన్మూలనాదపి" ఇతి॥ అర్జునోఽపి—"చంచలంహి మనః కృష్ణ ప్రమాథిబలవద్దృఢం। తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం"

తా॥ అద్వైతజ్ఞానమునకు అధికారి ఉపాసనచేసినవాడు, చేయ్యనివాడు రెండువిధములుగనుండును. ఉపాసనచేయబడు దేవతయొక్క సాక్షాత్కారపర్యంతముపాసనచేసి జ్ఞానమునందు ప్రవేశించునెడల వాసనాక్షయమనోనాశములు దృఢములగును కనుక జ్ఞానానంతరమందు విద్వత్సంన్యాసజీవన్ముక్తులు వానంతటనవియే కలుగును. అట్టివాడే శాస్త్రమునందు చెప్పబడిన ముఖ్యమగు విద్యాధికారి. అట్టివానినిగురించియే శాస్త్రములు విశేషముగా చెప్పినవి. స్వరూపముచేత వేరుగానుండినను విద్వత్సంన్యాస వివిదిషాసంన్యాసములు రెండును భేదములేనివివలె తోచుచుండును. ఇప్పటికాలమువారైతే ఉపాసనచేయక పూర్వమే ఉత్సాహమాత్రముచేత జ్ఞానవిద్యయందు (అద్వైతవిద్యయందు) సాహసముచేత ప్రవేశించుచున్నారు. దానిచే శ్రవ

ణామననవనిధిధ్యాసలు కలుగును. శ్రద్ధాభక్తులచేత దృఢమైన శ్రవణమువలన నజ్ఞానము నశించును. యుక్తులచేత దృఢమయిన మననమువలన చిదాత్మ కలదా లేదాయను సంశయము నశించును. విజాతీయజ్ఞానము కలుగకుండ సజాతీయములగు ధీవృత్తులచేత దృఢమగు నిదిధ్యాసమువలన దేహమె ఆత్మ యనెడి విపర్యాసము నశించును అప్పుడు అజ్ఞానసంశయవిపర్యయములనెడి ప్రతిబంధకములేని తత్వజ్ఞానము స్ఫురించును. నిస్సంశయముగఫుట్టిన జ్ఞానమును బాధించెడి ప్రమాణాంతరములేనందునను, తిరుగ నజ్ఞానమునుపుట్టించెడి కారణమేదియులేనందునను, అజ్ఞానము క్షీణింపదు. వాసనాక్షయమనోనాశములనుగూర్చి దృఢముగు ప్రయత్నముచేయానంగున నవి గాలిచేత దీపమువలెనే భోగప్రదమగు ప్రారబ్ధముచే బాధింపబడును. మేరుపర్వతమైనను పెకలింపవచ్చును. కాని తనపూర్వకర్మములవలన గలిగినవాసనలను విడుచుట అతికష్టమని వసిష్ఠుడుచెప్పెను వాయువునైనను అరికట్టవచ్చును గాని బలవంతమయి దృఢముగ బాధించెడి మనస్సును అరికట్టశక్యముకాదని అర్జునుడు శ్రీకృష్ణునితో చెప్పెను.

సూ॥ సం॥ యు॥ ఖం॥ 34అ॥

శ్లో॥ మహాదేవో మహానందో మహాకారుణికోత్తమః । స్వాత్మభూతాం పరాశక్తిం ప్రేరయత్యేవసువ్రతాః । ప్రసన్నా సా మహాదేవీ మహాకారుణికోత్తమా । శిష్యస్యాత్మని చిద్రూపే స్వయం పతతి నిర్మలా । శక్తిపాతేతు సంజాతే శిష్యస్యాత్మని సంస్థితా । మాయాందగ్ధాభవేత్క్రించి న్నాత్రిసందేహకారణం॥ *** ॥ యస్యప్రసాదస్సంజాతో దేహపాతావసానకః । కృతార్థ ఏవ విప్రేంద్రా నసభూయోపి జాయతే । తస్య ప్రసాదయుక్తస్య విద్యా వేదాంతవాక్యజా । దహత్యవిద్యామఖిలం తమసూర్యోదయో యథా । శక్తిపాతవిహీనోపి సత్యవాగ్గురుభక్తిమాన్ । ఆచార్యాచ్ఛ్రుతవేదాంతః క్రమాన్ముచ్యేతబంధనాత్

శక్తిపాతనసంయుక్తో విద్యా వేదాంతవాక్యజా । యదా యస్య తదా తస్య విముక్తిర్నాత్రసంశయః । శక్తిపాతపరీకారశ్చరహస్యాంశశ్చ కశ్చన । మయానోక్తో రహస్యత్వాదాజ్ఞాభంగభయాదపి ॥ ఇత్యాది॥

తా॥ పరమానందరూపుడు దయాళుడునగు నీశ్వరుడు తనయొక్క పరాశక్తిని ప్రేరణచేయును. మిగులదయగల అట్టిపరాశక్తి శిష్యునియొక్క చిద్రూపమగు ఆత్మయందు స్వయముగా ప్రవేశించును. అట్టిశక్తి ప్రవేశించినపిమ్మట శిష్యునియందుగల అవిద్య నశించును. ఇందుకుసందేహములేదు. ఈశ్వరానుగ్రహమువలన కృతార్థుడై తిరిగి జన్మమునుపొందడు. ఈశ్వరానుగ్రహముగా శక్తిపాతముకలిగినవానికి వేదాంతవాక్యములవలనకలిగిన జ్ఞానము. సూర్యుడు చీకటినివలెనే బోగొట్టును. అట్టిశక్తిపాతములేనివాడైనను సత్యవాక్యు, గురుభక్తి గలవాడైనయెడల గురువులవలన వేదాంతవాక్యశ్రవణము చేసి క్రమముగా కొన్నిజన్మములకు ముక్తుడగును. శక్తిపాతముగలవాడైనయెడల వేదాంతశ్రవణముచేత నాజన్మమందే ముక్తినిబొందును. సంశయములేదు. అట్టి శక్తిపాతము గలుగువిధము రహస్యము గనుక గుర్వాజ్ఞకు భంగముకలుగునని భయమువలన నేనీగ్రంథమందు చెప్పలేదని సూతుడు ఋషులతో చెప్పెను.

శ్రీమద్భాగవతము—దశమస్కంధము—బ్రహ్మస్తవము॥

శ్లో॥ శ్రేయస్సృతిం భక్తిముదస్యతే విభో క్లిశ్యంతి యే కేవలబోధలబ్ధయే । తేషామసౌ క్లేశలఏవశిష్యతే నాన్యద్యథాస్థూలతుషావఘాతినాం ॥ 4 ॥ పురేహ భూమన్ బహవోపి యోగిన స్త్వదర్పితేహా నిజకర్మలబ్ధయా । విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంజో చ్యుత తే గతిం పరాం ॥ 5 ॥ తథాపి భూమన్ మహిమాగుణస్య తే విబోద్ధుమర్హత్యమలాంతరాత్మభిః ।

శ్రియా త్స్వానుభవా దరూపతో హ్యానన్యబోధ్యాత్మతయా నచాన్యథా ॥ 6 ॥

వ్యాఖ్యానమునను సరించి తాత్పర్యము భక్తి లేకుండ జ్ఞానము సిద్ధించ దని చెప్పుచున్నారు. మోక్షశ్రీయనునట్టి కోరినవారికి నీయెడను భక్తివిడిచి యత్నించుటవలన క్లేశమేమిగిలియుండును. అన్యమేమియునులేదు. మంచి ధాన్యమునువిడిచి బియ్యములేనిపొల్లుకాయలను దంచినవారికి ఫలములేనట్లే భక్తినివిడిచి కేవలజ్ఞానముకొరకు ప్రయత్నించువారికిని ఫలములేదు. 4 జ్ఞాన ముభక్తిచేతనేగాని మఱియొకవిధమునగలుగదని చెప్పుచున్నారు. పూర్వము కొందరు యోగముచేత జ్ఞానమునుపొందలేక అనంతరము నీయందర్పితమైన బుద్ధిగలవారై తాముచేసినక్రియలను నీకర్పించి నిజకర్మములచేతను, భక్తిచే తను ఆత్మస్వరూపమును తెలిసికొని సుఖముచే మోక్షమునుబొందిరి. ఈప్ర కారముగానే సగుణనిర్గుణజ్ఞానములు నీకథలను వినినదే పొందశక్యముకాదు. భక్తియే భగవత్ప్రాప్తిసాధనమని వృద్ధాచారము ప్రమాణమైయున్నది. 5 దేవా పరిపూర్ణుడవును, నిర్గుణుడవునగు నీయొక్క మహిమ నిర్మలులును, జితేంద్రియులును, నంతర్ముఖులు నగువారే తెలిసికొనగలరు. 6.

శంకరులవారు వివర్తవాదమును అంగీకరించినను మంత్ర శాస్త్రమును అంగీకరించి భాష్యము చేసినారు.

శ్రీ మేధాదక్షిణామూర్తిమంత్రము॥

ఓంనమోభగవతే దక్షిణామూర్తయే మహ్యం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా ॥

శ్రీశంకరాచార్యకృతవ్యాఖ్యానము॥ ఎట్లనగా— ఓంకారేణ స్థూలసూక్ష్మకారణప్రపంచావధిభూతం ప్రత్యగభిన్నం తత్త్వమస్యాది మహావాక్యార్థభూతం బ్రహ్మాభిధీయతే। భగవచ్ఛబ్దేన ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతింగతిం। వేత్తి

విద్యామవిద్యాంచ సవాద్యో భగవానితి శ్లోకోక్తేః. సర్వజ్ఞస్స
ర్వశక్తిమాంశ్చాభిధీయతే । దక్షిణామూర్తిశబ్దేన సమర్థా
సృష్టిస్థితిసంహారేషు మూర్తిర్యస్య సః సత్వప్రధానమాయో
పాధికో బింబభూతః పరమాత్మాభిధీయతే । చతుర్థ్యంతేనైక్యా
ద్దృఢీక్రియతే । మోజీవః కర్తృత్వాది విశిష్టోంతఃకరణప్రతిబింబ
భూతః ప్రతిపాద్యతే । నేతి నిషేధార్థః । తథాచాహం జీవోన ।
కింతు భగవాన్ దక్షిణామూర్తిరేవ । ఏతాదృశాయ మహ్య
ముపాధినా తిరస్కృతాయ మహిమ్నే । మేధాం స్థిరామసం
భావనాది దోషరహితాం సవాసనా విద్యాద్వయనివర్తికాం
ప్రజ్ఞా మఖండసాక్షాత్కారరూపాం । ప్రయచ్ఛ దేహి । తయా
భ్రాంత్యాది నివృత్తిః । తామపి స్వాహా ఆత్మని సచ్చిదానంద
స్వరూపే ప్రవిలాపయామీతి స్వాహాకారార్థః । మో జీవోన
భవామి । కింతు కేవలో నిష్ప్రపంచశ్శివ ఇత్యుక్తశ్శివ ఏవాహం
చతుర్థీచైక్యదృఢీకారార్థా । జడావృతాహంకారేభ్యః ప్రాతిలో
మ్యేవ సత్యజ్ఞానానందాత్మకతయా అంచతి ప్రకాశయతీతి
ప్రత్యక్ ॥ ఇతి

తా॥ ఓంకారమునకు స్థూల సూక్ష్మ కారణ ప్రపంచమునకవధియు, ఐక్యగాత్మకంబై భేదములేనిదియు, తత్త్వమస్యాది మహావాక్యములకు లక్ష్యార్థమునగు పరబ్రహ్మము అర్థము. భగవచ్ఛబ్దమునకు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నని అర్థము. దక్షిణామూర్తిపదములో దక్షిణశబ్దమునకు సకలజగత్సృష్టి స్థితి సంహారములను జేయదగిన సగుణబ్రహ్మమును, అమూర్తిశబ్దమునకు నిర్గుణబ్రహ్మము నర్థములు. చతుర్థీవిభక్తి కైక్యమర్థము. నమఃశబ్దములోని మకారమునకు కర్తృత్వాదిధర్మములు గలిగి యంతఃకరణవిశిష్టుడగు

జీవుఁడర్థము. నిషేధార్థకమగు నకారముతోఁ గలిసి జీవుఁడు కాఁడని యర్థము. ప్రత్యయమను క్రియను జీవసంజ్ఞను వదలి భగవద్రూపుఁడనగు నాకు వాసనలతోఁ గూడిన విద్యాఽవిద్యలను నివర్తింపుము అఖండబ్రహ్మసాక్షాత్కారరూపమగు నిర్దుష్టమగు ప్రజ్ఞను దయచేయుము అని అర్థము. స్వాహాకారమునకు అటువంటి ప్రజ్ఞను సచ్చిదానందపరబ్రహ్మమునందు లయము చేయుచున్నానని యర్థము. ప్రత్యగాత్మయనగా అనృతజడాహంకారములకు విలక్షణమగు సత్యజ్ఞానానందస్వరూపమగు ఆత్మ యర్థమని చెప్పబడెను.

భగవద్గీత–12వ అధ్యాయము— భగవతావణితః॥

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవచ। నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖఃక్షమీ॥ సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః। మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః సమే ప్రియః॥

తా॥ సర్వభూతములకు హితుఁడయి మిత్రత్వము, దయయుఁగలిగి మమత్వాహంకారములు లేనివాఁడై సుఖదుఃఖములను సమముగాఁ జూచుచు సర్వదా సంతుష్టుఁడై ఆత్మయందు దృఢనిశ్చయుఁడై నాయందర్పింపబడిన మనస్సు, బుద్ధి గలవాఁడే నాకు భక్తుఁడును, ఇష్టుఁడును అని భగవంతుఁడు చెప్పెను.

భగవద్గీత 14అ॥— మాంచ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే। సగుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయకల్పతే॥

తా॥ నన్నెడతెగని భక్తియోగముచేత సేవించువాఁడు మంచిగుణములుగలిగి సమబుద్ధిగలవాఁడై సద్గతిని పొందును.

జీవన్ముక్తివివేకము— బృహస్పతిస్మృతి॥ ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా। తథా చేద్విశ్వకర్తారం కోనముచ్యేత బంధనాత్॥

తా॥ ధనమందు కోరిక చేత ధనవంతునిని యాదరముతో స్తుతించు నట్లు లోకకర్తయగు పరమేశ్వరునిస్తుతించు నెడల సంసారబంధమునువిడి చి ముక్తుడగును.

వివేకచూడామణి॥ శంకరాచార్యకృతము— 3 శ్లో॥ దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకం। మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥

తా॥ దుర్లభములగు మనుష్యజన్మము, మోక్షేచ్ఛయు, పరమార్థజ్ఞానులసేవయు, నను నీమూడును దైవానుగ్రహమువలననే కలుగవలయును

జీవన్ముక్తివివేకము— గవాంసర్పిః శరీరస్థం నకరోత్యంగపోషణం। తదేవకర్మరచితం పునస్తస్యైవ భేషజం। ఏవం సర్వశరీరస్థః సర్పిర్వత్పరమేశ్వరః। వినాచోపాసనాం దేవో నకరోతి హితం నృషు ॥

తా॥ గోవులయందు గలనెయ్యి వానిగర్భములోనున్న కాలములో అంగపోషణచేయదు. కర్మములవలన పాలుపిదికి నేయితీసినయెడల నదియౌషధముగా అంగపోషకమగును. ఈరీతిగానే ఈశ్వరుడు సర్వశరీరములయందున్నను తన్నుపాసనచేయనివారికి హితముచేయడు. ఉపాసనచేసినవారికే హితముచేయును.

వివేకచూడామణి— 4 శ్లో॥ లబ్ధ్వా కథంచిన్నరజన్మదుర్లభం తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనం। యస్త్వాత్మముక్తౌ నయతేతమూఢధీః సహ్యాత్మహాస్వంవినిహన్త్యసద్గ్రహాత్ ॥

తా॥ నిత్యనిరంతరోపాసనలవలన సంప్రీతుడగు భగవంతునిదయవలననే ప్రాప్తమయి వేదశాస్త్రజ్ఞానమునకర్హమయిన పురుషజన్మమెత్తినను ముక్తికొఱకు యత్నించక అనిత్యములగు దేహాదులనే శాశ్వతముగ నమ్మువాడు ఆత్మజ్ఞానములేమిచే ఆత్మఘాతియనబడును.

మూడవప్రకరణము సమాప్తము.

# నామ్నాపప్రకరణము

## శ్రీవిద్యావిశేషము॥

బ్రహ్మ, విష్ణు, శివాది దేవతోపాసనకంటె శ్రీవిద్యోపాసన శ్రేష్ఠమనియు, అందువలన మాయయనెడి అవిద్య శీఘ్రముగా తొలగింపబడుననియు, బ్రహ్మ విష్ణు శివాదిదేవతలును, మహర్షులు మొదలగువారును శ్రీవిద్యోపాసనచేసి సకలసిద్ధులను పొందినారనియు శ్రుతి స్మృతి పురాణాదులు తెలుపుచున్నవి.

త్రిశతి 63 లక్ష్మీవాణీ నిషేవితా ॥

శం॥ వ్యా॥ లక్ష్మీ రమా సర్వైశ్వర్యశక్తిః। వాణీ సరస్వతీ సర్వజ్ఞానశక్తిః। తాభ్యాం నితరాం అకృత్రిమప్రీత్యా అనన్యభావతయా సేవితా। సేవానామ ఉన్మీలితాజ్ఞాప్రతీక్షా। తద్వత్త్వాదిత్యర్థః

తా॥ పరమేశ్వరి సర్వైశ్వర్యశక్తియగు లక్ష్మీదేవిచేతను, సర్వజ్ఞానశక్తియగు సరస్వతీదేవిచేతను సహజప్రేమతో ఏకాగ్రతతో సేవింపబడుచున్నది. సేవయనగా ఆజ్ఞను నిరీక్షించియుండుట.

త్రిశతి 149 కలానాథముఖీ ॥

శం॥ వ్యా॥ కలాః చతుఃషష్టికలాః నాథయతి ప్రేరయతీతి కలానాథః ॥

I శ్రుతి॥ నిశ్వసితమేతదృగ్వేదో యజుర్వేదః సామవేదః ఇత్యాది ॥

II వ్యాససూత్రము— "శాస్త్రయోనిత్వాత్" తాదృశ ముఖం వదనం యస్యాః సేతి తథా ॥

తా॥ I ఋగ్వేద, యజుర్వేద, సామవేదములు బ్రహ్మయొక్క నిట్టూర్పులు.

II బ్రహ్మము శాస్త్రములకు కారణము. పరమేశ్వరి యీవిధముగా వేదాది సర్వకళలను 64 విద్యలను ప్రకాశింపజేయునట్టి ముఖముగలది.

త్రిశతి 182 లాతాపూజ్యా ॥

శం॥ వ్యా॥ సమారాధ్య మహేశానీం భుక్తిం ముక్తించ విందే॥

తా॥ భక్తులు పరమేశ్వరిని ఆరాధనచేసి భుక్తిముక్తులనుపొందెదరు

త్రిశతి 186 లంఘ్యేతరాజ్ఞా ॥

శం॥ వ్యా॥ ఇతరేషాం జీవభ్రాంతికల్పితానాం గుణమూర్త్యాదీనాం ఉపాసనా విధిరూపా వా। కర్మవిధిరూపా వా। ఆజ్ఞాప్రేరణాలంఘ్యా అవిషయీకృతా యయా సా తథా। శుద్ధచైతన్యస్య విశిష్టక్రియాద్యాత్మకత్వాభావేన విధ్యవిషయత్వాదితి యావత్। అథవా కింకరీత్వాభావేన ఇతరేషాంఆజ్ఞాప్రేరణాలంఘ్యా ఉపేక్షణీయా యయా సా తథా। శ్రుతిః॥ “సర్వస్యాధిపతిః సర్వస్యేశానః” ఇతి। ఈశ్వరస్య సర్వనియంతృత్వేన స్వేతరానియమ్యత్వాదితి జ్ఞాతవ్యం॥

తా॥ బ్రహ్మ విష్ణ్వాది దేవతలు కల్పించబడినవారు. జీవభ్రాంతికలవీరు ఈపరమేశ్వరియొక్క ఆజ్ఞను మీరక పాలించుచుందురు. శుద్ధచైతన్యరూపయగు నీలలిత ఇతరులఆజ్ఞకు లోబడునది కాదు.

త్రిశతి 212 హ్రీంకారోద్యాన కేకినీ ॥

శం॥ వ్యా॥ హ్రీంకారరూపదేవతాధ్వనేః సచ్చిదానందరూపత్వాచ్చార్థస్యచ పరమపురుషార్థసాధకత్వేన అవశిష్టత్వేఽపి బ్రహ్మ, విష్ణు, రుద్రాదిమూర్తిషు ఉద్యానతరువల్లీకతుగుల్మాదివదుత్తమనీచ దేవతిర్యఙ్మనుష్యాదిషు చ, మయూరీవ స్వేచ్ఛయా సర్వవ్యాపకత్వేన తదాత్మరూపతయా శరీరేంద్రియప్రాణాద్యాధార పరమప్రేమాస్పద పరమానందరూప ప్రత్యగ్గోచరాహంస్ఫూర్తివ్యాపకతయైతద్బీజప్రకాశ్యా భవతీత్యర్థః॥

తా॥ హ్రీంకారరూపదేవతాశబ్దమునకును, సచ్చిదానందస్వరూపమగు హ్రీంకారార్థమునకును భేదములేదు. పరమపురుషార్థమునకు సాధనమగుటచేతను బ్రహ్మ, విష్ణు, రుద్రాదిమూర్తులయందే కాక, ఉద్యానవనముల దైన వృక్షములు, తీగెలు, పొదలు మొదలగువానియందు నెమలివలెనే ఉత్తమ నీచ దేవ తిర్యఙ్మనుష్యాదులయందును స్వేచ్ఛగా వ్యాపించియుండు టచేతను శరీరేంద్రియప్రాణాదులకు ఆధారమై మిక్కిలి ప్రియస్వరూపమై పరమానందరూపమయిన అహమను వృత్తిని వ్యాపించుటచేతను పరదేవత హ్రీంకారబీజముగ ప్రకాశించుచున్నది.

ఌ॥ స॥ చతుష్షష్ట్యుపచారాఢ్యా ॥

భా॥ వ్యా॥ చతుష్షష్ట్యుపచారాః భగవతా పరశురామేణ కల్పసూత్రే గణితాః ॥

తా॥ పరశురామునిచేత కల్పసూత్రములయందు గణింపబడిన అరువదినాలుగు ఉపచారములచే పరమేశ్వరి పూజింపబడునది. వివరణము ఇట్టి అరువదినాలుగు ఉపచారములు పరమేశ్వరికే కలవు.

ఌ॥ స॥ 237 మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితా॥

భా॥ వ్యా॥ బ్రాహ్మ్యాదీనా మష్టానాం మధ్యే ఏకైకస్యాంశభూతాక్షోభ్యాది శక్త్యోష్టావష్టావితి చతుష్షష్టియోగిన్యః । తాసామపి ప్రతిస్వికమంశభూతాః కోటిసంఖ్యాకాః గణాః తైర్మహద్భిస్సేవితా—వస్తుత స్తంత్రరాజోక్తాపవేహా గ్రాహ్యాః । యథా॥ శ్లో॥ లలితాచక్రనవకే ప్రత్యేకం శక్తయః ప్రియే। చతుష్షష్ట్యమితాకోట్య ఇతి ॥

తా॥ బ్రాహ్మీ మాహేశ్వరి మొదలగు ఎనిమిది శక్తులలో నొక్కొకదాని కెనిమిదెనిమిదిగా నంశభూతములైన యక్షోభ్యాదియోగినులరువదినలుగురు వారి ప్రత్యేకాంశభూతములైన గణములు కోటిసంఖ్యాకములు ఆమహత్ముల చేత సేవింపబడునది అయినను లలితాదుల్కి . నవచక్రములందు ప్ర

శ్లోకము అరువదినాలుకోట్లసంఖ్యగల శక్త్యుండెనని చెప్పిన తంత్రరాజ వాక్యమే యిచట గ్రహింపబడినది.

ల॥ స। 736 ముక్తిదా ॥

భా॥ వ్యా॥ I కూర్మపురాణము॥ తస్మాద్విముక్తిమన్విచ్ఛన్ పార్వతీం పరమేశ్వరీం। ఆశ్రయేత్సర్వభూతానా మాత్మభూతాం శివాత్మికాం ॥

II బ్రహ్మాండపురాణము—యేర్చయంతి పరాం శక్తిం విధినా ఽవిధినాపివా। నతే సంసారిణో నూనం ముక్తాఏవ నసంశయః। తస్మాదశేషవర్గానాం త్రిపురారాధనంవినా। నస్తో భోగాః పర్గాతు యోగపద్యేన కుత్రచిత్ ॥

తా॥ I మోక్షమును కోరువారు సర్వభూతములయొక్క ఆత్మస్వరూపనగు పరమేశ్వరి నాశ్రయింపవలయును

II శాస్త్రవిధిచేతగాని. శాస్త్రవిధివిరోధిగాని పరాశక్తినిఁ బూజించువారు ముక్తులేకాని తప్పక సంసారమును బొందరు. సంశయములేదు. కనుక సర్వజంతువులు త్రిపురసుందరి యారాధనలేకుండగ భోగమోక్షము లొక్కసారి మరియే దేవతను సేవించినను గలుగవు.

ల॥ స॥ భవదావ సుధావృష్టిః ॥

రుద్రయామళము—యత్రాస్తి భోగో నతు తత్ర మోక్షః యత్రాస్తి మోక్షో నతు తత్ర భోగః। శ్రీసుందరీ నాయకపుంగవానాం భోగశ్చ మోక్షశ్చ కరస్థఏవ॥

తా॥ దేవతలలో భోగమునిచ్చువారు మోక్షమునియ్యలేరు మోక్షమునిచ్చువారు భోగమునియ్యలేరు. త్రిపురసుందరియొక్క భక్తులకు భోగమోక్షములు చేతిలోనివి.

ల॥ స॥ 743 పాపారణ్యదవానలా ॥

బ్ర। పు॥—ఇదంచ శ్రుణు దేవేంద్ర రహస్యం పరమం మ

హాత్ । సర్వేషామేవపాపానాం యౌగపద్యేన నాశనం । భక్తి శ్రద్ధాసమాయుక్తః స్నాత్వాంతర్జలసంస్థితః । అష్టోత్తరసహస్రంతు జపేత్పంచదశాక్షరీం । ఆరాధ్యపరమాంశక్తిం ముచ్యతే సర్వకిల్బిషైరిత్యాది ॥

తా॥ ఓదేవేంద్రా గొప్పరహస్యమును వినుము. భక్తిశ్రద్ధలుకలిగి స్నానముచేసి జలమునందేయుండి 1008మారులు పంచదశీమంత్రమును జపముచేసినయెడల సమస్తపాపములు తొలగిపోవును.

౭॥ స॥ 785 మార్తాండభైరవారాధ్యా ॥

మార్కండేయపురాణము— దుర్గేస్మృతాహరసి భీతిమశేషజంతోః ॥

తా॥ ఓదేవీనిన్ను స్మరించుటచేత సమస్తజంతువులను భయమును బోగొట్టుచున్నావు.

౭॥ స॥ 995 సర్వానుల్లంఘ్యశాసనా ॥

భా॥ వ్యా॥ I సర్వైః బ్రహ్మవిష్ణ్వాదిభిరప్యుల్లంఘయితుమతివర్తితుమయోగ్యమశక్యంచ శాసనం యస్యాః ॥

II ఆచార్యభగవత్పాదైః॥ ।సౌందర్యలహరి॥ 24శ్లో॥ జగత్సూతేధాతా హరిరవతి రుద్రః క్షపయతే । తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి । సదాపూర్వస్సర్వం తదిద మనుగృహ్ణాతిచ శివస్తవాజ్ఞామాలంబ్యక్షణచలితయో ర్భ్రూలతికయోరితి ॥

తా॥ I పరమేశ్వరియొక్క యాజ్ఞను బ్రహ్మవిష్ణ్వాది దేవతలుకూడ అతిక్రమింపలేరు.

II తల్లీ నీకటాక్షమునవలంబించియే బ్రహ్మ లోకములను సృజించును విష్ణువు రక్షించును. రుద్రుడు లయముచేయును. ఈముగ్గురను ఈశ్వరుడు తన శరీరముతోడ లయముపొందించును. సదాశివుడు ఈనలుగురను మఱలనుద్ధ

రించుచున్నాడు. (అనగా ననేకకోటిబ్రహ్మాండములను సృష్టియించుట యందును, లయింపజేయుటయందును, నీకటాక్షమే సదాశివునకు సహాయమైనదని తాత్పర్యము.)

ల॥ స॥ 3అ॥ 22శ్లో॥

I పద్మపురాణము — అశ్వమేధసహస్రాణి వాజపేయశతాని చ। లలితాపూజనస్యైతే లక్షాంశేనాపి నో సమాః। స దాతా స మునిర్యజ్వా స తపస్వీ స తీర్థగః। యస్సదా పూజయేద్దేవీం గంధపుష్పానులేపనైరితి॥

II చందనాగరుకర్పూరైః సూక్ష్మపిష్టైః సకుంకుమైః।

ఆలిప్య లలితాం లోకే కల్పకోటీర్వసేన్నర ఇత్యాది॥

తా॥ I వెయ్యి అశ్వమేధములును, నూరు వాజపేయములును, లలితాపూజయొక్క ఫలములో లక్షాంశమునకయినను సమముకావు. గంధపుష్పాదులచేత సదా లలితాపూజజేసినవాడే దాతయు, మునియు, యజ్వయు తపస్వియు, తీర్థసేవియును కనుక నీపూజచేసినవాడు ఆయాకర్మమును బొందును. చందనము, అగరు, పచ్చకర్పూరము, కుంకుమ మొదలగు వానిచేత లలితాత్రిపురసుందరిని అర్చించినవారు కోటికల్పములు లలితాలోకమునందు వసించెదరు.

ల॥ స. 3అ॥ 46శ్లో॥

భా॥ వ్యా॥ I బ్ర॥ పు॥ నశిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దః ప్రయుజ్యతే। మోక్షైకహేతువిద్యావాన్ యస్సవిద్వానితీర్యతే। మోక్షైకహేతువిద్యాచ శ్రీవిద్యా నాత్రి సంశయః॥

II దేవీపురాణము — అప్యేకం నామ యో వేత్తి ధాతొర్థనిగమాదిభిః। సోపి శ్రీలలితాలోకే కల్పకోటీర్వసేన్నర ఇత్యాది॥

తా॥ I మోక్షమునకు కారణమయిన విద్యగలవాడే విద్వాంసుడు. కాని శిల్పాది జ్ఞానముగలవాడు విద్వచ్ఛబ్దమునకర్హుడుకాడు. మోక్షమునకు శ్రీవిద్యయే హేతువగుచున్నది. సంశయములేదు.

11 ఒక నామమైనను దాని వ్యుత్పత్త్యర్థముతో నెఱుగువారు లలిత యొక్క శ్రీనగరమునందు కోటికల్పములు వసించెదరు.

ల॥ స॥ 3 అ॥ 6 శ్లోక భాష్యము॥

తస్మాదశేషలోకానాం త్రిపురారాధనం వినా । న స్తో భోగాపవర్గౌ తు యౌగపద్యేన కుత్రచిత్ । తన్మనా స్తద్గతప్రాణ స్తద్యాజీ తద్రహస్యకః । తదాత్మైక్యేన కర్మాణి కుర్వన్ముక్తి మవాప్స్యసి ఏతద్రహస్యమాఖ్యాతం సర్వేషాం హితకామ్యయా ॥

తా॥ త్రిపురసుందర్యారాధనలేనందున భోగమోక్షములెవ్వరికిని నొక్కసారి యొక్కడను గలుగవు త్రిపురసుందరియందే మనస్సు ప్రాణము లుంచి యామెను సేవించుము ఆత్మైకహస్యముగనుగొని ఆమెను తనకును అభేదజ్ఞానముతో కర్మములు చేయువాడు ముక్తినిబొందుచును. ఇట్టిపరమ రహస్యము లోకులకందరికిని హితముకొరకు చెప్పబడెను

వామకేశ్వరతంత్రము ప్రథమపటలము 125 శ్లో॥

ఏవమేషా మహావిద్యా మహాత్రిపురసుందరీ । సంస్మృతైవ మహేశాని త్రైలోక్యవశకారిణీ ॥

తా॥ ఈప్రకారము మహాత్రిపురసుందరి తనయొక్క స్మరణచేత సేవకులకు మూడులోకములను వశముజేయును.

ఋగ్వేదము త్రిపురోపనిషత్తు మొదటిశ్రుతి॥

ఓం తిస్రః పురస్త్రిపథా విశ్వచర్షణీ ర్యత్రాఽకథా అక్షరా స్సంనివిష్టాః । అధిష్ఠాయైనా మజరా పురాణీ మహత్తరా మహిమా దేవతానాం ॥ ౧ ॥

భా॥ వ్యా॥ తత్ర ముక్తి స్తావత్పంచవిధా । సామీప్యమేకం, సాలోక్య, సారూప్య, సాయుజ్యత్రితయం, కైవల్యంచేతి । తా స్వాద్యాంత్యౌ ప్రత్యేకం ద్వౌ మార్గౌ । మధ్యత్రయమేకో మార్గః । తథాచ తైత్తిరీయా ఆమనంతి ॥ " యఏవంవిద్వానుదగ

యనే ప్రమీయతే, దేవానామేవ మహిమానం గత్వాదిత్యస్య సాయుజ్యం గచ్ఛత్యథయో దక్షిణే ప్రమీయతే, పితౄణామేవ మహిమానం గత్వా చంద్రమసస్సాయుజ్యగ్ం సలోకతామాప్నోత్యేతౌ వై సూర్యాచంద్రమసోర్మహిమానౌ బ్రాహ్మణో విద్వానభిజయతి । తస్మాద్బ్రహ్మణో మహిమానమితి" అయం భావః । ఊర్ధ్వరేతసాం స్వాశ్రమోచితకర్మానుష్ఠానవశాచ్చంద్రలోకప్రాప్తిస్సామీప్యరూపా ప్రతీకోపాసనయా, స్వస్వామిభావేన ఉపాసనయా అహంగ్రహోపాసనయాచ సాలోక్యాది త్రితయరూపా ఆదిత్యలోకప్రాప్తిః। నిర్గుణోపాస్తిరూపబ్రహ్మజ్ఞానవశాత్తు కైవల్యరూపా బ్రహ్మపదప్రాప్తిరితి ॥ ఏతన్మార్గత్రియమేవ స్పష్టముపబృంహితం ॥ విష్ణుపురాణే తృతీయేంశే । ఉత్తరం యదగస్త్యస్య అజవీథ్యాశ్చ దక్షిణం । పితృయాణస్స వై పంథా వైశ్వానరపథాద్బహిః ఇత్యాదినా వివేకజ్ఞానస్పష్టంచ తద్విష్ణోః పరమంపదమిత్యంతేన మార్గత్రితయాదేవ ఉపగంతవ్యాః ॥ పురోపి తిస్రః ఈదృశపురత్రయవ్యాపకత్వాత్తద్రూపత్వాద్దేవ్యా, పరదేవతా త్రిపురేత్యుచ్యతే ॥ " ఆత్మబుద్ధ్యా ప్రతీకేన మాతృబుద్ధ్యాథ్యహం ధియా। కర్మణాపి భజన్మర్త్యః కైవల్యం పదమశ్నుతే " ఇత్యనేన పంచవిధ్యాత్మకత్రివిధభజనేనాపి దేవీప్రాప్తేరుక్తత్వాత్ ॥ తస్మాత్సైవ తిస్రః పురః। సైవ త్రిపథా త్రయః పంథానో యస్యాస్సా । *** చర్షణీశబ్దో వైదికనిఘంటురీత్యా ప్రజావాచకః విశ్వాస్సమస్తాశ్చర్షణ్యః ప్రజా యస్యాః సా విశ్వచర్షణీ। దేవాపి సర్వప్రాణ్యుత్పాదికేతియావత్ విశ్వద్రష్ట్రీవా, ఇదమత్రబోధ్యం। తత్రైవ బహుస్యాంప్రజాయేయేతి శ్రుతిసిద్ధం। యస్య బ్రహ్మణః స్వామినోమీక్షణంతదేవ

సర్వప్రజాజనకం । తదేవచ ఇచ్ఛారూపం, కృతిరూపంచ ।
"సోఽకామయత తత్తపోఽకురుతేతి" శ్రుత్యంతరాత్ । "స్వాభా
వికీ జ్ఞానబలక్రియాచేతి" శ్రుత్యాచ । ఏకైవ బ్రహ్మాభిన్నా ప్రా
థమికాన్వృత్తిః జ్ఞానేచ్ఛాకృతిరూపేతి ప్రతిపాద్యతే । సాన్వృత్తిరేవ
ఇచ్ఛాజ్ఞానక్రియాసమష్టిరూపత్వాచ్ఛాంతేత్యుచ్యతే । పశ్యంతీ
మధ్యమా, వైఖరీత్రయసూక్ష్మరూపత్వాత్త్రిపురేత్యుచ్యతే ।
వామా, జ్యేష్ఠా, రౌద్రీ, సమష్టిరూపత్వాదంబికేత్యుచ్యతే ।
సా శాంతాద్యాత్మికా, దేవతైవ, శ్రీచక్రస్థం బిందుచక్రం । తదు
క్తం నిత్యాహృదయే । పరబ్రహ్మ ప్రక్రమస్య, ప్రస్మృతం విశ్వల
హరీస్థానం మాతృత్రయాత్మకం బైందవం చక్రమితి । తదేవచ
తిస్రః పుర ఇత్యాదివిశేషణత్రయేణ నిర్దిష్టం ॥ విశేషణేషు బహు
వచనైకవచనాభ్యాం విశేష్యస్య త్రిత్రిరూపకత్వం, ఏకాత్మక
త్వంచ సూచితం । తాదృశమీక్షణా భిన్నం బ్రహ్మప్రక్రమస్య,
కాళికాపురాణేప్యుక్తం । త్రికోణం మండలం చాస్యా భూపురం
చతిరేఖకం । మంత్రోఽపి త్ర్యక్షరః ప్రోక్తస్తథారూపా త్రియం
పుః । త్రివిధా కుండలీశక్తిస్త్రిదేవానాంచ సృష్టయే । సర్వం
త్రయంత్రియం యస్మాత్తస్మాత్తు త్రిపురామతేత్యాది । అర్థసృష్టి
జనకత్వేన తాంసర్గిత్వ, శబ్దసృష్టిజనకత్వేనాపి తాం నిర్దిశతి । య
త్రేతి । యత్ర యస్యాం శాంతాంబికాదిరూపాయాం త్రిపురా
యాం అకథాః అకారాద్యాః షోడశ, కకారాద్యాః షోడశ,
థకారాద్యాః షోడశాక్షరాస్సంనివిష్టాః । వటబీజేవృక్షవత్సమస్త
జ్ఞాతరాంచ వటవృక్షాకారోఽపి విమర్శస్వరూపవేతి, నవ్యష్టి
వేషేణ త్రిపురాయాం గమ్యతే । హకారోంత్యః కళారూపో
విమర్శాఖ్యః ప్రకీర్తిత ఇతి వచనాత్ ॥ ***

ఏవం పూర్వోక్తం బిందుచక్రస్వరూపముపదిశ్య తదధి ష్ఠాత్రీముపాస్యాం పరదేవతామాహ—

అధిష్ఠాయేతి । ఏనాం సాంప్రతముపదిష్టాం బిందురూపాం త్రిపురాధిష్ఠాయ కాచిదస్తి దేవతా । అస్తిర్భవంతి పరో ప్రయుజ్యమానోఽప్యస్తీతి కాత్యాయనవచనాదస్తీత్యధ్యాహారః ॥ ఉత్తరమంత్రస్థక్రియాపూర్వాన్వయః । సా దేవతా అజరా మరణరహితా । జ్యాయమోహానావిత్యత్ర హానిపదేనాయుషో నాశస్యైవ కథనాత్ । పురాణీ అనాదిః జన్మరహితా । దేవతానాం బ్రహ్మవిష్ణుశివాదినామ్నా ప్రసిద్ధానాం మధ్యే మహత్తరా సర్వోత్కృష్టా । తాసాం దేవతానాం యో మహిమా తదూ్రపాచ । దేవతాంతరాణాం మహత్త్వస్యాప్యస్యైవ నిదానం । ఏతదుపాసనయైవ తేషాం మహిమలాభ ఇతి భావః । త్రిపురోపనిషది । తదనుయాయి పురాణతంత్రాదిషు శివవిష్ణ్వాద్యుపాసితానాం విద్యానాం బహుశః ప్రతిపాదనాత్ ॥ "శంభుః పూజయతే దేవీం మంత్రశక్తిమయీం శుభామి"త్యాదినా, దేవైః పూజనీయా చ, ప్రతిమాభేదానాం పద్మపురాణే విస్తరేణ కథనాచ్చ తథా చ । సహి భిక్షుకో భిక్షుకాన్యాచితుమర్హతి సత్యన్యస్మిన్నభిక్షుక ఇతి న్యాయేన దేవతాంతరోపాస్త్యపేక్షయా త్రిపురాదేవతోపాస్తిరేవ జ్యాయసీతి ధ్వన్యర్థః । తదిదముక్తమస్మాభిః పరశివస్తవే ॥ త్వదత్తైశ్వర్యభాజః పరమశివకథం కారమన్యాన్నమర్త్యాన్యాచేదహీతి శక్రద్రుహిణహరిముఖాన్ భిక్షుకాన్ భిక్షుకోఽహం । ఇత్యాది ॥ అజరేత్యాదిభిః బ్రహ్మలింగైః బిందుచక్రాధిష్ఠితా దేవతా పరబ్రహ్మైవేత్యుక్తం భవతి । తథా చ శ్రుతిమూర్ధానం ఆమనంతి । అష్టాచక్రా నవద్వారా దేవా

నాంపూరయోధ్యా। తస్యాం హిరణ్మయః కోశః స్వర్గో లోకో జ్యోతిరావృతః। తస్మిన్ హిరణ్మయె కోశే త్ర్యరే త్రిప్రతిష్ఠితే। తస్మిన్యద్యక్షర మాత్మన్వత్తద్వై బ్రహ్మవిదో విదురితి॥ భూపురాది త్రికోణాంత చక్రాష్టకోపరి, యఃకోశో గర్భకృత రూపత్రయో బిందురితియావత్। తస్మిన్యదక్షరం మహద్భూతమస్తి। బలిపూజాయోగ్యత్వాదక్షరపదేన నిర్దేశః। తత్సాక్షాత్కృత్యైవ బ్రహ్మవిదపవ। నాన్యేతి। తదుక్తం సేతుబంధ విస్తరాత్ ॥ ౧॥

తా॥ ముక్తులలో సామీప్యమొకటిగను, సాలోక్య, సారూప్య, సాయుజ్యములు మూడు నొకటిగను, కైవల్యమొకటిగను తైత్తిరీయశ్రుతియందు మూడుమార్గములుగ చెప్పబడినవి. ఉత్తరాయణమునందు మృతుడైన విద్వాంసుడు దేవతల మహిమనుబొంది సూర్యసాయుజ్యమును, దక్షిణాయణమున మృతిబొందినవాడు పితృదేవతలమహిమనుబొంది చంద్రసాయుజ్యమును, ఇట్లుసాలోక్యమునందు సూర్యచంద్రులయొక్కయు, బ్రహ్మముయొక్కయు మహిమను విద్వాంసుడగుబ్రాహ్మణుడు పొందగలడు. ఇందులభావము— ఊర్ధ్వరేతస్కులకు తమయాశ్రమమునకుచితమయిన కర్మానుష్ఠానము వలన ప్రతిమోపాసన చేత సామీప్యరూపమగు చంద్రలోకప్రాప్తికలుగును. దేవత నుతాను సేవించుచున్నాననిగాని, దేవతతో తానభేదమనిగాని చేయు ఉపాసనచేత సాలోక్య సారూప్య సాయుజ్యములుగల సూర్యలోకమును బొందును. నిర్గుణోపాస్తిరూపమగు బ్రహ్మజ్ఞానమువలన కైవల్య(బ్రహ్మపద) ముక్తికలుగును. విష్ణుపురాణమునందీమూడుమార్గములే చెప్పబడినవి. అట్టి మూడుమార్గ

ములయొక్క రూపముగుటవలనగాని, వానిని వ్యాపకత్వముచే యుటవలనగాని పరదేవత త్రిపురయని చెప్పబడుచున్నది. ఇట్లే "ఆత్మబుద్ధ్యైకైవల్యపదమశ్నుతే" అను స్మృతి చెప్పుచున్నది కనుక త్రిపథాశబ్దముచేత పరదేవత మూడుపురములు గలదనియు, విశ్వచర్షణీశబ్దముచేత దేవాదిసర్వప్రాణులుగల జగత్తును పుట్టించునదనియు నర్థము. లేక "బహుస్యాం" అనుశ్రుతి బ్రహ్మము యొక్క మొదటిరూపు సర్వవిశ్వమును పుట్టించునదనియు నదియే ఇచ్ఛాజ్ఞానక్రియారూపములయినదనియును చెప్పుచున్నది. "సోకామయత" "స్వాభావికీ=క్రియాచ" అనుశ్రుతులు బ్రహ్మము యొక్క ప్రథమవృత్తియే బ్రహ్మముకంటె వేఱుకాని జ్ఞానేచ్ఛాకార్యరూపయని చెప్పుచున్నవి. ఆవృత్తియే యిచ్ఛాజ్ఞానక్రియలయొక్క సమష్టిరూపమయిన శాంతయనియు పశ్యంతి, మధ్యమ, వైఖరి యనుమూడింటికి సమష్టి సూక్ష్మరూపమయిన "పర" యనియు, వామ, జ్యేష్ఠ, రౌద్రి యను మూడింటికి సమష్టిరూపమయిన అంబికయనియును చెప్పబడుచున్నది. అట్టి శాంత, పర, అంబికలయొక్క సమష్టిదేవతయే శ్రీచక్రమందలి బిందుచక్రము. ఈబిందుచక్రమే బ్రహ్మాది పిపీలికాంతమగు జగత్తునకు మూలమని నిత్యాహృదయమునందు చెప్పబడినది. బిందుచక్రమే త్రిస్రః, పురః, త్రిపథా యను మూడువిశేషణములచేత నిర్దిష్టమయినది. విశేషణములయందు ఏకవచనములచేతను, బహువచనములచేతను విశేష్యములచేతను మూడుమూడురూపములనియు, వస్తువొకటేయనియు సూచింపబడినది. అట్టిదృష్టి బ్రహ్మమునకు కలదనియు, పరదేవత యొక్క మనస్సులును, కోణములు, భూపురములు (శాంతి)

మునకక్షరములు) (బాలా త్రి.) మూడు మూడనియు, శాంత లినీశక్తి మూడువిధములనియు, సృష్టికి దేవతలు (బ్రిహ్మ, విష్ణువు, మహేశ్వరుడు) ముగ్గురనియు, సర్వము మూడుమూడ నేకారణమున త్రిపురయని కాళికాపురాణమందు చెప్పబడినది ఇట్లు అర్థసృష్టి చెప్పి శబ్దసృష్టి చెప్పబడుచున్నది. శాంతాంబి కాది నమష్టియగు త్రిపురాపర దేవతయందు "అ. క. థాః" అకారాది 16 కకారాది 16 థకారాది 16 మొత్తము 48 అక్షరములు బీజరూపముగ "వటబీజమందు వృక్షాకారమున్నట్లు" నున్నవి. కాని వేఱుగానుండలేదు. శకారము లకారముకంటె వేఱుకాదు. క్షకారము కకార షకారముల సంయోగము. శ్రుతిపూర్వార్థముచేత బిందుచక్రిస్వరూపము నుపదేశించెను. "అధిష్ఠాయ" అనుశబ్దమునకు బిందురూపయగు త్రిపురనాశ్రి యించిన అధిష్ఠానదేవతకలదని అర్థము. ఆమె జరామరణములు లేనిది. అనాదియయినది. జన్మములేనిది. బ్రహ్మవిష్ణ్వాదిప్రసిద్ధ దేవతలలో సర్వోత్కృష్టతగలది. బ్రిహ్మాది సమస్తదేవతలకు గల మహిమలకు నీమెయొక్క యుపాసనయే కారణము. ఈవి ద్యను శివవిష్ణ్వాది దేవతలనేకవిధములుగనుపాసన చేసినట్లు త్రిపు రోపనిషత్తునందును, దానిననుసరించిన పురాణతంత్రములయం దును చెప్పబడెను. "శంభుః పూజయతే దేవీం. మంత్రశక్తిమ యీంశుభా" మనియు, "దేవైః పూజనీయాంబా" అను వాక్య ములచేత నీపరదేవతను దేవతలు పూజచేసినట్లు పద్మపురాణ మునందు విశేషముగా చెప్పబడెను. భిక్షుకుడు ధనవంతుని ... ంచుట యుక్తముకాని, భిక్షుకునియాచించుటయుక్తము ... న్యాయముచేత నితరదేవతోపాస్తికంటె త్రిపురాదేవతో

హాస్తియే మంచిదని తన్వార్థము. ఓపరశివ నీవలన నియ్యాబడిన ఐశ్వర్యముగల భిక్షుకులగు ఇంద్రాదిదేవతలను ఏకారణముచేత దేహీయని భిక్షుకుడనైన నేను యాచింతునని పరశివ స్తవనమందు చెప్పబడినది. అజర మొదలగుపదములచేత బిందుచక్రస్థిత్వాన దేవతయే పరబ్రహ్మమనియు, భూపురాది త్రికోణాంతమువరకు గల యెనిమిదిచక్రములకు పైని (ఊర్ధ్వమందు) కోశరూపమయి త్రికోణగర్భమందున్నదియే బిందువనియు నిశ్చయార్థము. ఆబిందువును బలిపూజాదులకు యోగ్యమైన నిత్యచైతన్యమనియు, ఆత్మస్వరూపమనియు బ్రహ్మవేత్తలు తెలిసికొనుచున్నారు.

౮॥ త్రిపురసుందరియొక్క లోకము తక్కినలోకములకంటె పైనున్నదనియు, సర్వోత్తమమైనదనియును చెప్పబడుచున్నది.

త్రిపురాసిద్ధాంతము— అనుత్తమో బ్రహ్మలోకః సర్వేషాముపరిస్థితః। తస్యోపరిమహావిష్ణోర్లోకస్సర్వోత్తమోత్తమః। తస్యోపరిమహాలోకః స్కందస్య పరమేశ్వరి। తస్యోపరిమహాదేవిమమలోకో జగత్ప్రియః। మల్లోకోపరి విఘ్నేశలోకోభక్తేష్టదశ్శుభః। మహాగణపతేర్లోకాదుపరిస్థితఉత్తమః। మహాత్రిపురసుందర్యాలోకః కామసమన్వితః॥ ఇతి దక్షిణామూర్తినా॥

తా॥ ముందుగా ఉత్తమమగు బ్రహ్మలోకమును, దానికిపైని క్రమముగా సర్వోత్తమోత్తమగు విష్ణులోకమును, కుమారస్వామిలోకమును, జగత్తునకు ప్రియమగు నాలోకమును భక్తులకు ఇష్టమును, శుభమునిచ్చు గణపతిలోకమును, ఉత్తమమయి కామేశ్వరునితోకూడిన మహాత్రిపురసుందరీలోకమును ఈప్రకారము ఒకదానికంటె మఱియొకటి క్రమముగా పైని యున్నవని పార్వతితో దక్షిణామూర్తి చెప్పెను.

ఒకజన్మమునందే ముక్తిని బొందగోరువారికి శ్రీవిద్యో ముఖ్యమనుటనుగురించి దత్తాత్రేయసంహిత చతుర్థాధ్యాయము.

దేవీంప్రతి ఈశ్వరఉవాచ॥** సమస్తవిద్యాసామ్రాజ్ఞీ మహాసింహాసనేశ్వరీ। చిద్విద్యైవ పరాస్వరూపా నాన్యా విద్ధి షడాంశితే॥ ఏకేనజన్మనా ముక్తిం పుమానిచ్ఛేద్యదిప్రియే। చిద్బ్రహ్మవిద్యాదాతారం పరమాచార్యమాశ్రయేత్॥** అశ్వ త్రిమాత్రిషదపి విద్యేయం నామ సుందరి। ఏకోచ్చారణమాత్రేణ వాజిమేధస్య కోటయః॥** భూప్రాదక్షిణ్యకోటిశ్చ సిద్ధమేతద్భవేచ్ఛివే। మహతీయం పరావిద్యా మహతీయం పరాగతిః। చిద్విద్యయా సమావిద్యా నాస్తి బ్రహ్మాండగోళకే। శతప్రాణైకమాత్రేణ త్వయాచైవ మమప్రియే॥** మనుం భజేత సర్వార్థప్రదం పంచదశాక్షరం॥ ఇత్యాది—

తా॥ చిద్విద్యయు సమస్తవిద్యలకు సమ్రాటుగాను, మహాసింహాసనేశ్వరిగాను తెలిసికొనుము. చిద్విద్య పరాస్వరూపమే యితరము కాదు. ఒకజన్మమునందే ముక్తినికోరిన పురుషుడు చిద్బ్రహ్మవిద్యోపదేశకుడయిన పరమగురువు నాశ్రయించి విద్యనుగ్రహింపవలయును. ఈవిద్య మోక్షమునిచ్చునది. ఒకమారుచ్చరించుటచేత కోటియశ్వమేధములయొక్కయు, కోటి భూప్రాదక్షిణ్యములయొక్కయు ఫలములభించును. కనుక సర్వోత్కృష్టమైన యీచిద్విద్యయే భక్తులకు ప్రాప్యస్థానము. ఈ విద్యతోసమమగు విద్య బ్రహ్మాండగోళమునందు లేదు. దీనిని సత్యమని దృఢముగనమ్ముము సత్యముకాదేని నాకు ఘోరనరకము గలుగును. కావున నీపంచదశీమంత్రమును శ్రద్ధతోజపింపుమని ఈశ్వరుడు పార్వతితో చెప్పెను.

వసిష్ఠాదులకు దత్తాత్రేయులు ఉపదేశించిన రశ్మిమాల
యను నీ మంత్రములయొక్కయు, చిద్విద్యయొక్కయు జపఫల
వివరణము॥ ౭॥ సం॥ 14 అధ్యాయము.

** ఋషయ ఊచుః॥ భగవన్ కరుణాసింధో దత్తాత్రే
య జగద్గురో॥ ౧ ౨॥ పార్వత్యై త్రిపురా భవతా శంకరేణాఖిలాత్మనా
యదీరితం మహాత్మ్యం దేవ్యాస్సృష్టం చ యద్రహః। తస్మి
న్సంశ్రద్ధధానానాం వ్యాచక్ష్వాస్మాకమీశ్వర। యద్యనుగ్ర
హ్యతాస్మాసు యది కారుణ్యమస్తి తే। అవాచ్యమపి తద్గుహ్యం
భగవన్నస్సమర్పయ॥ ఇత్థం తైః ప్రార్థితో విష్ణుః దత్తాత్రేయో
జగద్గురుః। మహతీం సంహితామేతాం మహర్షిభ్యస్సమాది
వాన్॥ దత్తాత్రేయ ఉవాచ। శృణుధ్వం బాలకాయామం వసి
ష్ఠాద్యాస్తపోధనాః। పురాయదుదితం దివ్యం హరేణ పరమా
త్మనా। తత్తే వ్యాఖ్యాతుమిచ్ఛామి శ్రూయతాం శ్రుణుతాద
రాత్। శేషీభూతాం పరానందతనూం విషయిణాం త్రిశక్తిమయం।
సాంగకర్మనంశం వక్ష్యామి శృణుధ్వం తు మునిసత్తమాః॥ ౧౪॥
పార్వతీవచనైః శంభుః పరితుష్టః పురాంతకః। వచనైస్సాంత్వ
యిత్వా తాం దేవీం వక్తుం ప్రచక్రమే॥ శ్రీమహాదేవ ఉవాచ॥
అయి ధన్యతరే దేవి భవత్యా పృష్టమంజసా। గుహ్యం లోకో
పకారాయ పవిత్రతమమద్భుతం। అవాచ్యమపి వక్ష్యామి స్వ
యోనిమివ గోపయ। మహతీయం పరాకాష్ఠా చిద్విద్యా భువ
నేశ్వరీ। అస్యామధ్యస్తమఖిలం వచవాచ్యస్వలక్షణం। విశ్వం
సమస్తమీశాని ఆత్మరూపా స్మృతా హి సా। అస్యాస్సత్త్వాస్సర్వ
విశ్వస్య మహతీ త్రిపురేశ్వరీ। అధిష్ఠానతయా భద్రే సంప్రోక్తా
ఖిలకామధుక్। అతఏవాఖిలానాత్మ సద్మనో మంత్రసత్తమాత్

దేహిస్వరూపాత్మద్విశ్వం స్పృశేన్నాస్తీతి నిర్ణయః ॥౨౮॥ అస్యై
మేవాఖిలార్థాత్మరూపాయాం భువనేశ్వరి । విద్యారూపమఖిలం
స్యాన్న్యస్తం విద్యాజాలం కులాంబికే । అహం సమస్తవిద్యానాం
దేవానాం వచసామపి । పురాణసంహితాదీనాం సారం సంగృ
హ్యాత్తే శివే । జామదగ్న్యస్య రామస్య కుమారస్యాపి చాంతికే ।
సప్తకోటిమహామంత్రా సద్ధృత్య నిజరూపకః । తత్రాపి చా
మ్నాయనగస్య క్రమముద్ధృత్య శాంభవం । సూత్రముద్ధృత్య
తత్సూత్రే గుహ్యం సర్వానువాదినం । తత్రి యత్సంహితాసా
రం వేదతంత్రార్థగర్భితం । అధికృత్యోక్తసిద్ధాంతం సర్వసిద్ధాం
తసంగ్రహం । ఉద్ధృత్యాహం ప్రవక్ష్యామి మానసోల్లాసస
ద్భృతం । అస్మిన్ హి మానసోల్లాసే అజ్ఞాతార్థా అనేకశః ॥౩౦॥
జ్ఞాతవ్యా గురువక్త్రేణ నాన్యథా పాతకీ చ చేత్ । తత్రి పఞ్చాశ
షంశోత్రిసారం సూక్ష్మం మహత్తరం । రశ్మిమాలాభిధం సూ
క్తం శ్రీశ్రీయః పరమేశ్వరి । ఆనతః నాదస్య భవేదఖిలాఘౌఘనం
క్షయః । సమస్తవేదాదుద్ధృత్య ఫలమస్య స్మృతేర్భవేత్ । స
ప్తకోటిమహామంత్రజపకోట్యుద్భవంఫలం॥ సకృత్పాఠస్య భవే
దితి శాస్త్రనిర్ణయః । కాశ్యామఖిలయాత్రోత్థం వాజపేయాది
యాగజం । తులాపురుషదానాది ఫలమస్య భవేజ్జపాత్ । దే
వ్యాః శ్రీలలితాంబాయాః కృత్స్నమంత్రాత్మనోఽశివే ॥౩౧॥ యతో
రశ్మయ ఆఖ్యాతా మహామంత్రా ఇమే తతః, తతో రశ్మ్యభిధానేన
మహామంత్రా ఇమే స్మృతాః । చిద్విద్యాజపకర్త్రీదా జప్తవ్యా
రశ్మిమాలికా । అజప్తా రశ్మిమాలా చేత్సద్యో భక్ష్యతి చిన్మనుః
ఏకవారం ద్వివారం వా త్రివారం ప్రతిరంబికే, ఆచార్యచర
ణద్వంద్వం నత్వా పఠేద్రశ్మిమాలికాం । వ్రజపాదేవపంథానే

...కానాంచ మయోదితః । సకృజ్జపేత్ రశ్మిసూక్తం పాపాదిభయసంకటాత్ । విముక్తస్సకలాన్కామాన్ ప్రాప్య సాయుజ్యభాగ్భవేత్ । రశ్మిసూక్తే మహాపుణ్యే వసేత్షణ్మతసంక్రమః ॥ మతాని షడ్విజానీహి పురాసిద్ధాని వల్లభే । ప్రమాణలక్షణాభ్యాంచ భిన్నాన్యేతాని వైక్రమాత్ । మంత్రదేవతయోర్భేదాదితి శాస్త్రార్థనిర్ణయః । ఆద్యం సౌరమతం తత్ర దేవతాలక్షణాన్వితం రవిః । గాణాపత్యం ద్వితీయంతు దేవతాలక్షణాన్వితం । శైవం తృతీయం తద్వత్తు చతుర్థం వైష్ణవం జగుః । యద్వా ద్వితీయం శ్రీనాథమతం, గణపతేర్మతం తృతీయం, శైవమిత్యుక్తం చతుర్థం, శాక్తమీశ్వరి పంచమం, భైరవాద్ధాత్మమతం షష్ఠముదీరితం । మతషట్కమిదం దేవి రశ్మిసూక్తే వ్యవస్థితం రమే॥ అతశ్చిద్రశ్మిసూక్తస్య మధ్యే షణ్మతసంభవాః । మంత్రాః సంతి యతస్తస్మాన్ త్రిసామ్రాజ్యనాయికా ॥ చిద్విద్యైవమహామంత్ర రత్నరత్నేశ్వరీ స్మృతా । అతో మంత్రేశ్వరీ మేనాం జపన్ సర్వమనుస్మృతేః ॥ లభేత్ఫలం తతో విద్యా జప్తవ్యా సాంగమన్వహం । మనుక్రమం ప్రయుజతా దేవతాశరణార్థినా । తతశ్చిద్రశ్మిసూక్తేస్మిన్ సర్వమంత్రసమన్వయః । యతః షణ్మతసంస్థానం తజ్జపేత్సూక్తమన్వహం ॥ ఇత్యాది ॥

తా॥ ఈశ్వరుడు పార్వతికి యుపదేశించిన విద్య గోప్యమైనను మేము తెలిసికొనఁదగినవారమై తమకు మాయందు కరుణయుండెనేని చెప్పవలయునని మహర్షులుకోరఁగా విష్ణ్వంశభూతుఁడు, జగద్గురుఁడునగు దత్తాత్రేయుఁడు ఈమహాసంహితను చెప్పెను. తపోధనులును, బాలకులనగు వసిష్ఠాది మహర్షులారా, పూర్వము పరమాత్మయగు శంకరుఁడు పార్వతికిఁ జెప్పిన

విద్యయు తదంగదీక్షను చెప్పెదను సాదరముగ వినుము; ఓపా
ర్వతీ నీవడిగినది బొత్తిగా వెల్లడింపరాని రహస్యము. అయినను
మిక్కిలిపవిత్రమును, అద్భుతమును కనుక లోకోపకారముకై
చెప్పుచున్నాను. దీనిని రహస్యాపయమువలె గోప్యము చే
యుము. భువనేశ్వరియగు చిద్విద్య ఉత్కృష్టమయినది. ఆత్మ
రూపమగు నీచిద్విద్యయందే విశ్వమంతయును ఇమిడియున్నది.
సర్వాధారమగు త్రిపురసుందరియే భక్తులకు సమస్తకోరికలని
చ్చునది. కల్పితమగు జగత్తుగూడ ఆత్మయు, మంత్రరాజము
నగు దేవియొక్క స్వరూపమేకాని వేఱుకాదని నమ్ముము. జడ
ములగు సకలోపాధులయందు ఆత్మరూపముగనున్న యీచిద్వి
ద్యయందె సకలమంత్రములున్నవి. సమస్తవిద్యలలోను, దేవ
తావాక్యములలోను, పురాణసంహితాదులలోనున్న సారము
నుగ్రహించి పరశురామ, కుమారస్వాములయెదుట సప్తకోటి
మహామంత్రములును నిజరూపముతో నుద్ధరించి ఆమ్నాయవర్గ
ముయొక్క క్రమమును, శాంభవసూత్రమునుగూడ నుద్ధరించి
అట్టిసూత్రములయొక్క యావద్రహస్యమును పరశురామునికి
చెప్పితిని. వానిలో వేదతంత్రగర్భితమగు సారమై, సర్వసిద్ధాంత
సంగ్రహస్వరూపమగు మానసోల్లాసమనెడి నీయద్భుతసంహిత
నునీకు చెప్పుచున్నాను. దీనియందు తెలియబడనివానిని గురు
ముఖమువలన తెలిసికొనవలెను. అట్లుకానియెడల పాతకముక
లుగును. అందులో షణ్మతములయొక్క మంత్రములసారమై,
సూక్ష్మమై, మహత్తరమైన రశ్మిమాల అనుపేరుగల సూక్తము
సమస్తకోరికలనిచ్చునది. దీనినుచ్చరించుటచేత సమస్తపాతక
ములునశించి సమస్తవేదపఠనఫలమును, ఒకవారముజపించుటచే

సప్తకోటిమహామంత్రములను కోటికోటిమారులజపించినఫలము
ను, కాశిమొదలగు సమస్తయాత్రలయు, అశ్వమేధము మొద
లగు యాగములయు, తులాపురుషాది సమస్తదానములయు,
ఫలము కలుగును. సమస్తమంత్రస్వరూపురాలగు శ్రీలలి
తాంబకు ఈమహామంత్రములు రశ్ములు (కిరణములు) కనుక
నీమహామంత్రములు రశ్మిమాలయని పేర్కొనబడినవి. చిద్వి
ద్యాజపకర్త ముందుగా రశ్మిమాలామంత్రములను జపముచే
యనియెడల చిద్విద్యామంత్రజపఫలము వెంటనే నశించును.
ప్రాతఃకాలమునందు గురుపాదములకు నమస్కరించి ఒకమారు
గాని, రెండు మూడుమారులుగాని రశ్మిమాల జపముచేయు
తగినది. నీవును లోకులును ఆచరించుటకు నేను నియమించిన
క్రమమిదియె. రశ్మిమాలనొకమారు జపముచేయుటచే పాప
ములు భయములు తొలగును. అన్నికోరికలనుపొందిసాక్షాత్తు
శివుడేయగును. మహాపుణ్యస్వరూపమగు రశ్మిమాలయందు
షణ్మతములయొక్క క్రమము ఉండును. పూర్వమునుండి సిద్ధ
మైన మతములు ఆఱు. ఇవి మంత్రదేవతల భేదమువలనను,
ప్రమాణములవలనను, లక్షణములవలనను భిన్నములై యున్నవి
వీనిలో మొదటిది సౌర (సూర్యుని) మతము. రెండవది గణపతి
మతము. మూడవది శివమతము. నాలగవది విష్ణుమతము.
(లేక రెండవది విష్ణుమతము, మూడవది గణపతిమతము. నాల
గవది శైవము అని మఱియొకసంప్రదాయము) అయిదవదిశా
క్తమతము, ఆరవది భైరవమతము. ఈమతములుచిద్రశ్మిమా
లయందుండుటవలన నీవిద్య మంత్రసామ్రాజ్యనాయికఅనియు
మహామంత్రరత్నరత్నేశ్వరియనియు చెప్పబడుచున్నది. కనుక

సీమంతోన్నీశ్వరిని జపించినవారు సమస్తమంత్రజపఫలమును పొందుదురు. సర్వమంత్రసమన్వయముగల యీచిద్రశ్మిమాలాక్రమందు షణ్మతములును స్థాపింపబడియున్నందున మంత్రక్రమానుష్ఠానముచే దేవతను శరణుపొందువారు ప్రతిదినమును ఈరశ్మిమాలను సాంగోపాంగముగా జపము చేయవలెను.

రశ్మిమాలాస్వరూపము.

ద॥ సం॥ 26 అధ్యాయము॥ మహాదేవఉవాచ॥ శ్రుణు దేవి ప్రవక్ష్యామి నామతో రశ్మిమాలికాం ॥౨॥ మూలాసమస్తదేవానామాద్యం గాయత్ర్యుదీరితా । అభయంకరవిద్యాథ సావిత్ర్యష్టాక్షరీపరా। ప్రణవాఖ్యాథ గాయత్రీ తురీయాఖ్యా కులాంబికే। మూలవ్యాహృత్యాలకబిలద్వాదశాంతేషు సువర్తితా। బీజభూతమిదం విద్యాపంచకం సర్వసిద్ధిదం । తతశ్చక్షుష్మతీ విద్యా తతో గంధర్వనాయికా । పథిప్రద్రవిద్యాథ తారా రాజభయాపహా । నామత్రయమహావిద్యా స్థానేషూక్తేషు పంచసు॥ ౬॥ ధ్యాయేత్పరికరత్వేన విద్యాపంచకమిష్టదం । మహాగణపతేర్విద్యా మహేశద్వాదశాక్షరీ । మృత్యుంజయ మహావిద్యా విద్యాధాతురధఃపరం । పంచాశదక్షరావిద్యా మాతృకాప్యథ పంచమీ ॥౮। స్థానేషు పంచస్వేతేషు రక్షాకర్త్య ఇమాః స్మృతాః । విద్యా పరశివస్యాథ విద్యా సంపత్కరీపరా । కాలసంకర్షణీవిద్యా మహాశాంభవ్యతఃపరం । తతఃపరం కళావిద్యా రశ్మివిద్యా ఇమాశ్శుభాః । అధిష్ఠానతయాధ్యేయాః స్థానేష్వేతేషు పంచసు । తతఃకుమారీ విద్యాఖ్యాచాన్నపూర్ణా తతఃపరం ॥౧౧ అశ్వారూఢామహావిద్యా తతఃశ్రీగురుపాదుకా । విద్యాభిరాభిస్సంయుక్తా చతుర్భిర్బ్రహ్మరూపిణీ ॥ ౧౨ ॥ నిత్యా సింహాసనా

మ్నాయ విద్యాక్షరపిసంయుతా। మాలాధారేచింగసియా శ్రీ
దేవీ పరదేవతా ।౧౩। లఘుశ్యామాభిధావిద్యా విద్యా వాగ్వా
దినీ శుభా। విద్యా నకులీశ్యామా తతో దేశికపాదుకా॥
చతుర్విద్యాభిరేతాభిర్యుక్తా శ్రీమంత్రిణీ శుభా। స్వయంవరా
ఖ్యసునునా సంయుక్తా శ్రీపరాంబికే॥ శ్రీశ్యామా బాహ్యాది
స్త్రియా మహాసిద్ధిప్రదాయినీ। లఘుకోలముఖీవిద్యా స్వప్న
కోలముఖీ తథా॥౧౬॥ తిరస్కరిణవార్తాళీ వారాహ్యాః గురుపా
దుకా। చతుర్విద్యాభిరేతాభిర్దండనాథాఖ్యవిద్యయా॥౧౭॥ యు
క్తా బగళయా తద్వజ్జాతవేదసవిద్యయా। మహాకోలముఖీ స్వ
యం పాలచక్రే సనాతనీ॥౧౮॥ స్వర్ణాకర్షణవిద్యా చ ఆపద్వటు
కభైరవి। చింతామణిమహావిద్యా కామధేన్వభిధాతతః। చతు
ర్విద్యాభిరేతాభిర్యుక్తా శ్రీపరదేవతా। శ్రీపూర్ణాఖ్యా బహిస్త్రి
బిలే పుష్టవ్యాసే తతఃపరం ॥౨౦॥ గురోర్గురోః పరస్యాపి గురో
శ్చ పరమేష్ఠినః। పరాపరాఖ్యస్య గురోశ్చతుర్విద్యాభిరన్వితా।
మహాశ్రీపాదుకాఖ్యయా ద్వాదశాంతే తతఃపరం। శ్రీరశ్మి
మాలికాపూర్ణగాత్రేణఇష్టం శివోభవేత్। ఇతి త్రిపురభైరవ్యా
తథా సంహారభైరవః। రక్తాభిధానా యోగిన్య సానసశ్చ తతః
పరం। చాముండేతి చిదంబాయా విఘ్నదేవ్యాః షడీరితాః।
హాసంతీశ్యామలా విఘ్నదేవ్యైకా సంప్రకీర్తితా ॥౨౪। స్తంభి
నీనామ వార్తాళీ విఘ్నదేవీప్రకీర్తితా। సమస్తవిఘ్నశమనీ
భూతవిద్యా ప్రకీర్తితా॥ సప్తకోటిమహామాత్రా అపి శ్రీరశ్మి
యుఃస్మృతాః। తత్రావయవభూతాఃస్యుః శ్రీయోమీరశ్మయ
శ్శివే॥౨౬॥ బ్రాహ్మేకాలే సముత్థాయ స్మృత్వాదౌ దేశికం
విభుం। బ్రాహ్మసమయఉత్థాయ చింతయేదాదితఃశుచిః॥౨౭॥

*** వేదాస్సర్వే సేతిహాసాః సాగమాః శాస్త్రసంచయాః ।
భూతాద్యఖిలవిద్యాశ్చ యూక్తతన్నవశ్చయే ॥ ౩౬ ॥ సప్తకోటి
మహామన్త్రా అపి సర్వే పరశ్మయః । సమస్తవిద్యా సామ్రాజ్ఞీ
శ్రీవిద్యాశ్చ ప్రకీర్తితా ॥౩౭॥ ఇత్యాది॥ బ్రాహ్మే సమయ ఉత్థాయ
స్మృత్వా పరిత్యహామాదరాత్ । ఏకధా వా ద్విధా త్రేధా చతు
ర్ధా పంచధాపి వా ॥౩౮॥ సా తు బ్రహ్మమయో భూత్వా భవే
త్పరశివాత్మకః । పంచధా ప్రత్యహం రశ్మిసూక్తం స్మర్తవ్య
మాదరాత్ ॥౩౯॥ చతుర్ధా వా త్రిధా ద్వేధా సకృద్వా నియతః
స్మరేత్ । దక్షిణామూర్తిమీశానం స్మృత్వా గురుతరం గురుం
ఆచార్యపాదుకామన్త్రం స్మరేత్పశ్చాదనుక్రమాత్ । ఓంకా
రాద్యస్మదాచార్యపదాంతే గురునామ చ ॥ ౪౦ ॥ ఉచ్చార్య శ్రీ
పదం పశ్చాచ్చరణారపదాన్వితం । బిందాభ్యాం పాదయోపే
తం విద్యైషా చార్యపాదుకా ॥ ౪౧ ॥ శయనస్థితఏవాసౌ బ్ర
హ్మరంధ్రే కృతాంజలిః । ఆరావృత్త్యాథ దశధా పంచధా వా
స్మరేన్మనుం । మహాత్రిపురసుందర్యై నమ ఇత్యుచ్చరేత్తతః ॥
పంచవింశతిధా పంచదశధా వా స్మరేచ్ఛివే ॥ ౪౨ ॥ విద్యామే
నాం చ మహతీం పాతకౌఘవిభేదినీం । ఏకవింశతిధా పశ్చాత్
శివాభ్యాం నమ ఉచ్చరేత్ ॥౪౩॥ శివాంశసంభవాన్పశ్చాద్గు
ర్వాదీన్ స్మరేన్మునీన్ । వసుంధరాం నమస్కృత్య పాదంనిక్షి
ప్య దక్షిణం ॥౪౪॥ ఆచార్యపాదుకాయుగ్మం సౌవర్ణం రాజతం
తు వా । దృష్ట్వాథ తం నమస్కృత్య ధృత్వా మూర్ధ్ని తతః పరం
తులసీం బిల్వవృక్షం వా నదీం వా మహతీమపి । అరుంధతీం
ధ్రువం పశ్యేత్సప్తబ్రహ్మమునీనపి ॥౪౫॥ తత ఆచమ్య మేధావీ
సమ్యగాసీనఆసనే । ప్రాణానాయమ్య సంకల్ప్య రశ్మిమాలామ

నుంస్మరేత్ । భార్గవో భగవాన్ రామో ఋషిరస్యాం ఉదీరి
తః । గాయత్ర్యాదీని ఛందాంసి సర్వవిద్యామయీపరా ॥౮ ౯॥
శ్రీదేవీ దేవతా ప్రోక్తా మహాత్రిపురసుందరీ । సర్వశ్రేయఃప్రసి
ద్ధ్యర్థం వినియోగ ఉదాహృతః । అసంఖ్యాతమహాపుంజపింజరీ
కృతవిగ్రహాం । రశ్మిమాలా మహం వందే మహాత్రిపురసుం
దరీం ॥౧౦॥ ధ్యాత్వైవం విజపీఠేశీం జపేచ్ఛ్రీరశ్మిమాలికాం ।
ఏకవారమనుస్మృత్య శ్రీదేవీరశ్మిమాలికాం । అహోరాత్రి
కృతైః పాపైః తత్క్షణాదేవ ముచ్యతే । వారద్వయమను
స్మృత్య రశ్మిమాలాం దినేదినే ॥౧౧॥ ఆజన్మసంచితైః పాపైః
ముక్తో బ్రహ్మమయో భవేత్ । వారత్రయమనుస్మృత్య ప్రత్య
హం రశ్మిమాలికాం । సప్తజన్మకృతైర్ముక్తో మహాపాపోపపాత
కైః । బ్రహ్మానందమయం ధామ దేహాంతే ప్రవిశత్యసౌ ॥౧౨॥
చతుర్వారమనుస్మృత్య శ్రీదేవీరశ్మిమాలికాం । శ్రియమష్టగు
ణాం ప్రాప్య దేహాంతేముక్తిమాప్నుయాత్ ॥౧౩॥ పంచవార
మనుస్మృత్య ప్రత్యహం రశ్మిమాలికాం । సర్వవిద్యానిధీభూ
త్వా సకలైశ్వర్యసంయుతః । సపుత్రపౌత్రసంపత్తి సహితస్స
ర్వభాగ్యవాన్ । చిరాయురిహ భుక్త్వాథ దివ్యాన్భోగాంశ్చ
మానుషాన్ ॥౧౪॥ సాక్షాన్నారాయణో భూత్వా భవేత్పరశివః
స్వయం । శ్రీదేవీరశ్మివిద్యాభిః పూర్ణగాత్రో దినేదినే ॥ పరబ్రహ్మ
మయో భూత్వా చిన్మయో నిత్యశుద్ధిభాక్ । పరమచిన్మయో వి
ద్యాతపస్తేజోమయః ప్రభుః ॥౧౫॥ జీవన్ముక్తో భవత్యేవ నాత్ర
కార్యా విచారణా ॥ ఇత్యాది॥

తా॥ 1 సమస్తదేవతామాతయగు గాయత్రివిమలా
కారముసంస్మను, 2 సంకటభయనాశినియగు అభయంకరవిస్మ

ను హృదయమునందును, 3 సర్వార్థసాధకీని ఫాలమందును, 4 పరిణతమైన ఓంకారమును బ్రహ్మరంధ్రమునందును, 5 తురీయగాయత్రిని (పరోరజసేసావదోం) ద్వాదశాంతమునందును ధ్యానింపుము. దీపభూతములైన యీమంత్రములు సర్వసిద్ధులనిచ్చును. 1 చక్షుష్మతీవిద్య, 2 గంధర్వరాజవిద్య, 3 మోహనకలహారిణియగు పథిమప్రముద్రవిద్య, 4 జలమందలిభయమును బోగొట్టెడి తారావిద్య, 5 మహావ్యాధులను శమింపజేయునట్టి నావాత్రియమహావిద్య, వీనిని పైనిచెప్పినక్రమముగానే హృదయము మొదలుకొని ద్వాదశాంతమువరకును ధ్యానింపవలయును. 1 మహాగణపతివిద్య 2 శివశక్త్యైక్యరూపయగు ద్వాదశాక్షరీవిద్య, 3 మృత్యుంజయమహావిద్య, 4 శ్రీకీధారిణీవిద్య, 5 అకారము మొదలుకొని క్షకారమువరకునుగల మాతృకావిద్య వీనిని పైనిచెప్పినవిధముననే ధ్యానింపవలయును. హాది పంచదశాక్షరి (హాదివిద్య) 2 సంపత్కరీవిద్య, 3 కాలసంకర్షణీవిద్య, 4 మహాశాంభవీవిద్య, 5 పరావిద్య వీనిని పైవిధముగానే ధ్యానింపుము. ఇవిశుభములనిచ్చును. 1 బాలాత్రిపురసుందరీనవార్ణవిద్య, 2 అన్నపూర్ణావిద్య, 3 అశ్వారూఢామహావిద్య, 4 శ్రీగురుపాదుకావిద్య, వీనితో కూడిన మూలవిద్య (కాదిపంచదశాక్షరిని మూలాధారమునందును,) 1 లఘుశ్యామలావిద్య, 2 వాగ్వాదినీవిద్య. 3 శ్యామాంగనకులీవిద్య, 4 శ్యామాంగగురుపాదుకావిద్య వీనితోకూడుకొని మహాసిద్ధులనిచ్చు రాజశ్యామలావిద్యను హృదయమునందును, 1 లఘువారాహివిద్య, 2 స్వప్నవారాహివిద్య, 3 వారాహ్యాంగతిరస్కరిణీవిద్య, 4 వారాహ్యాంగగురుపాదుకావిద్య, ఈనాలు

సంపద్విద్యయు, వనదుర్గావిద్యయు, బగళా (బ్రహ్మాస్త్ర) విద్యయు, జాతవేదసమను దుర్గావిద్యయు, వీనితోఁ గూడిన వారాహీవిద్యను ఫాలమునందును, 1 స్వర్ణాకర్షణభైరవవిద్య, 2 ఆపద్వటుకభైరవవిద్య, 3 చింతామణివిద్య, 4 కామధేన్వన్నపూర్ణవిద్య, 5 శ్రీత్రిపురావిద్యయనగ కాదిపంచదశీవిద్య వీనిని బ్రహ్మరంధ్రమునందును, 1 గురువు, 2 పరమగురువు, 3 పరమేష్ఠిగురువు, 4 పరమగురుని పరమగురువు, 5 శ్రీమహాపాదుకవిద్య, వీనిని ద్వాదశాంతమునందును ధ్యానింపవలయును. ఇట్లు రశ్మిమాలా ధ్యానమువలన శివుడగును. 1 మహాత్రిపురభైరవి, 2 సంహారభైరవి, 3-4 రక్తాభిధానా యోగినులు, 5 సారస్వతి, 6 చాముండ అనునవి లలితావిద్యయును, వాసంతీవిద్య శ్యామలయును, జృంభిణీవిద్య వారాహికని విఘ్నదేవతలనియు, భూతవిద్య సమస్త విఘ్ననాశమునకనియు చెప్పబడుచున్నది. సప్తకోటిమహామంత్రములు పరదేవతకు కిరణములనియు అవయవములనియు చెప్పబడుచున్నది. బ్రాహ్మముహూర్తమునందు లేచి ముందుగా గురుస్మరణ చేయవలయును. సర్వవేదములు, ఇతిహాసములు, ఆగమములు, శాస్త్రములు, భూతాదిసమస్తవిద్యలు, రశ్మిసూక్తమంత్రములు, సప్తకోటిమహామంత్రములు మొదలగు సర్వమును రశ్మిమంత్రములలో చేరినది కనుక శ్రీవిద్య సమస్తవిద్యల సమ్రాట్టు అని చెప్పబడుచున్నది. 36. 37. ప్రతిదినమును బ్రాహ్మముహూర్తమందు నిద్రనుండి లేచి శ్రద్ధతో నొకమారుగాని, రెండు, మూడు, నాలుగు, అయిదు మారులుగాని రశ్మిమాలాస్తోత్రమును ఆదరణతో స్మరించినయెడల సాక్షాత్తు శుద్ధబ్రహ్మస్వరూపుడై పరశివుడు కాగలడు. మహాగురువగు దక్షిణా

మూర్తియొక్క మంత్రమును, గురుపాదుకామంత్రమును స్మరించి అనంతరము ఓంకారము మొదలుగా తనగురుపాదాంతము వరకు గురునామముచ్చరించి శ్రీచరణారవిందాభ్యాంనమః అని హృదయమునందున్న ఈ ఆచార్యపాదుకయనువిద్యను పఠించిన స్థలమునందే కూర్చుండి బ్రహ్మరంధ్రమునందు అంజలియుంచి (నమస్కరించి) 12 లేక 10 లేక 5 మారులు స్మరించి మహాత్రిపురసుందర్యై నమః అనిఉచ్చరించి 25 లేక 15మారులు మూల మంత్రమును స్మరింపవలెను. ఇట్లుజపించిన మహావిద్య పాపము లన్నిటినిపోగొట్టును. అనంతరము 21 మారు శివాభ్యాం నమః అని ఉచ్చరించి శివాంశసంభవుడగు అగస్త్యముని స్మరించి భూమికినమస్కరించిదక్షిణపాదముంచవలెను. గురుపాదముల నుగాని బంగారము లేక వెండినిగాని చూచి గురుపాదుకాబుద్ధితో నమస్కరించి తులసినిగాని, మారేడువృక్షమునుగాని, మహాపదినిగాని, అరుంధతినిగాని, ధ్రువునిగాని, సప్తఋషులను గానిజూడవలసినది. పిమ్మట ఆచమనము చేసి ఆసనమునందుకూర్చుండి ప్రాణాయామసంకల్పము చేసి రశ్మిమాలామంత్రములను స్మరింపవలసినది. ఈరశ్మిమాలాసూక్తమునకు ఋషి పరశురాముడు. ఛందస్సులు గాయత్ర్యాదులు. దేవత సర్వవిద్యాస్వరూపిణి, పరాస్వరూపిణియునగు మహాత్రిపురసుందరి. సమస్త శ్రేయస్సులయొక్క సిద్ధియేఫలము. అపరిమితతేజస్సమూహము చేప్రకాశించు రశ్మిమాలాస్వరూపయగు మహాత్రిపురసుందరిని నమస్కరించి ధ్యానించి మూలదేవతను, రశ్మిమాలామంత్రములను జపింపవలసినది. శ్రీదేవీరశ్మిమాలను అనుదినము నొకమారు స్మరింపగా అనేకజన్మార్జితపాపములు తత్క్షణమే నశించ

మును. రెండుమారులు స్మరింపగా జన్మించినది మొదలుకొని చేయబడిన పాపములునశించి బ్రహ్మస్వరూపుడగును. మూడు మారులు స్మరింపగా యేడువందలజన్మములం జేసిన మహాపాతకముల పపాతకములను నశించి బ్రహ్మానందస్వరూపుడై దేహాంతమునందు మోక్షమును పొందును. నాలుగుమారులుస్మరింపగా అష్టైశ్వర్యములనుపొంది దేహాంతమందు ముక్తిని పొందును. ఐదుమారులు స్మరింపగా సర్వవిద్యలకు నిధియు, సకలైశ్వర్యపుత్రపౌత్రసంపన్నుడును, చిరంజీవియునై యిక్కడనే దివ్యమానుషభోగములనుభవించి సాక్షాత్తు నారాయణుడై పరశివుడగును. ప్రతిదినము నిట్లు శ్రీదేవిరశ్మిమాలామంత్రములను జపము చేయుటవలన నిత్యశుద్ధచిన్మయబ్రహ్మస్వరూపుడగును. సంశయములేదు.

అగస్త్యమహామునికిని, చర్యానందనాథునికిని హాదివిద్యోపాసనవలన కలిగిన ఫలము.

త్రి॥ సం॥ 47 అ॥ ఈశ్వర ఉవాచ॥ అతఃపరమహం వక్ష్యే హాదివిద్యామనుత్తమాం। యస్యాః స్మరణమాత్రేణ భవితా శివతా శివే॥ *** ॥ అనంతకోటిజన్మోత్థం పాతకంచోపపాతకం। మహాపాతకసంఘంచ భస్మీకుర్యాదియం స్మృతా ॥౫॥ కామేశ్వరప్రధానేయం విద్యా హాదిపురస్సరా। అఖండశివతాదాత్మ్యం ప్రయచ్ఛతి మనుస్మృతేః। కామేశ్వరమహావిద్యా స్మృతా భువనసిద్ధిదా। పురేయం జగదీశాని జప్త్వా కుంభభువా పరా జప్త్వైనాం మహాశీం విద్యాం హాదిపంచదశాక్షరీం। వర్ణలక్షమిమాం భద్రే మునిః కలశసంభవః। వారిధింస్సప్త పీత్వాపి ఋషితామన్యధాగమత్ ॥౮॥ ఏవాహంచావయోర్భద్రేసమస్త

జగదన్వయాత్ । ఉత్తరాదిగధోభాగమన్వగాత్సుందరి ॥
దిగ్దక్షిణాచోర్ధ్వభాగం అగాద్విశ్వాసమన్వయాత్ । మనువింత
యతఃపశ్చాత్ బ్రహ్మాకలశసంభవం । నివేదయామాసమహ్యాం
యథారూపాదివర్ణనాత్ । తతస్సమస్తవిశ్వస్య హరిబ్రహ్మాది
సంయుతః ॥ ౧౧ ॥ కుంభోద్భవః ప్రతికృతిర్దక్షిణాయాందిశీశ్వరి ।
మయా సంస్థాపితస్సోపి మదాజ్ఞా మనుపాలయన్ । స్వకార్యం
కలశేనైవ కృత్వాగాన్మాం శుచివ్రతః । మహోత్సవం వివా
హోత్థం పశ్యన్నేనావయోఃస్థితః । ఉపకృశో మహీపా భద్రే
విద్యాయాః శ్రీశ్రియఃపరైః । చర్యానందమహాభాగః సంసేవ్య
బహువత్సరం । విద్యామేనామవాప్యాథ లోపాముద్రాసుందరీ
శ్రీదేవీరూపతామాప తతస్సోప్యుత్తమోమనుః । హాదిపంచద
శార్ణోసౌ కాదిపంచదశాక్షరః । వహ్న్యేకతత్త్వంపిశ్వేశి భూమ
రూపం పరాత్పరం । హాదిపంచదశార్ణోయం కల్పితాం పుం
తనుం శ్రయన్ । ప్రవృత్తో మనురాడ్భద్రే కాదిపంచదశాక్షరః
స్వీకృత్య కల్పితం రూపం స్త్రీమయం జగదంబికే ॥ ఇత్యాది ।

తా॥ ఓపార్వతీ స్మరణమాత్రముచేత శివస్వరూపము గాగల హాదివిద్యను వినుము. బహుజన్మములందలి పాతకములును, ఉపపాతకములును, మహాపాతకసంఘములును కామేశ్వరప్రధానమైన ఈహాదిపంచదశాక్షరీవిద్యను స్మరించుటవలన భస్మమగును. ఈమంత్రమును స్మరించినవారు సమస్తసిద్ధులను పొంది శివతాదాత్మ్యమును పొందగలరు. అగస్త్యముని యీ విద్యను అక్షరలక్షలు జపముచేసి సప్తసముద్రములను బీల్చివేసి అనంతరము మహర్షి ఆయెను. మనయొక్క వివాహకాలమునందు సమస్తలోకములవారిరాకవలన ఉత్తరదిక్కు క్రిందకువాలి

దక్షిణదిక్కు పైకి తేచెను. అంతట నేను విచారింపగా అగస్త్య మునియొక్క మహిమను యథార్థముగా బ్రహ్మ నాకు చెప్పెను హరిబ్రహ్మాదులతో కూడిన సమస్త జగత్తుకు ప్రతినిధిగా దక్షిణదిక్కునందు అగస్త్యముని నాచేత నియమింపబడి నాయాజ్ఞ నుపరిపాలించుచు తనకార్యభారమును తనకమండలువుచేత దీర్పించి మరలవచ్చి శుచియగు వ్రతముగలవాడై మనయొక్క వివాహమహోత్సవమును చూచుచుండెను. ఇట్టి మహాత్మ్యముగల యీవిద్యను చర్యానాదనాథుడనేకవత్సరములు జపించి లోపాముద్రయను స్త్రీరూపముగ దేవిరూపమును బొందెను. కనుక సింహాసికాదివిద్యలు సర్వోత్తమములనియు, ముఖ్యతత్వమనియు, మిక్కిలి ఉత్కృష్టమనియు చెప్పుచున్నారు. ఈహాది పంచదశాక్షరి పుంరూపమును, కాదిపంచదశాక్షరి స్త్రీరూపమునాశ్రయించెను. అని పార్వతితో నీశ్వరుడు చెప్పెను.

అ॥ నరులకు చిద్విద్యోపాసనవలన సకలపురుషార్థములు సిద్ధించుననియు సర్వయుగములయందును దేవతలుకూడ అట్టి యుపాసనకొరకు నరజన్మము కోరుచుండిరనియు చెప్పబడుచున్నది. దత్తాత్రేయసంహిత 62 అధ్యాయము॥

ఈశ్వరఉవాచ॥ అతఃపరం ప్రవక్ష్యామి శ్రీవిద్యాశంత్రివైభవం। శ్రవణాద్యస్య సుభగే సాక్షాత్పశుపతిర్భవేత్॥౧ సౌభాగ్యమతుల్యం విశ్వేశి మమయత్తద్భవేద్ధ్రువం। అణిమాద్యష్టకంచాపి ఘుటికాద్యాశ్చ సిద్ధయః। చిద్విద్యాయోగశీలస్య భవంతి భవినస్సదా। చిద్విద్యాయోగశీలస్య యత్ర యత్ర వసేత్పుమాన్ ॥3॥ కాశీక్షేత్రం తదుద్దిష్టం సమంతాద్దశయోజనం। చిద్విద్యాయోగకర్తారం సాక్షాత్పశుపతిం యథా॥౪॥

యు, చిద్విద్యాయాగము చేయువానికి సిద్ధించును. ఉత్తరవాహి న్యస్థలము మొదలుకొని పదియామడవరకు కాశీక్షేత్రము. చి ద్విద్యాయాగకర్తను చూచినంతమాత్రముచేత ఈకాశీనిచూ చినట్లు పంచమహాపాతకములు నశించును. నామరూపములుగల ప్రపంచమును చిత్స్వరూపముగనే తెలిసికొనును. సదాశివుడు విష్ణువు, బ్రహ్మ మొదలగువారుగాని నేనుగాని యీవిద్యా మాహాత్మ్యమును చెప్పజాలము. ఈపంచదశాక్షరిపరబ్రహ్మ విద్య అని చెప్పబడినది. ఈవిద్యను నేను మన్మథుడు వైరివును జపము చేయుచుంటిమి. ఇది ధర్మార్థకామమోక్షములనిచ్చు నదియనియు, సమస్తతీర్థములు, యాగములు, దానములు, తపస్సులు మొదలగువానిఫలమును, సకలకళ్యాణములును, మితములేని సౌభాగ్యమును ఇచ్చునదియనియు చెప్పబడుచున్నది. మోక్షేచ్ఛగలవారు శ్రీవిద్యను సేవింపవలెను. మనోవాక్కా యకర్మములచేత పొందబడు సుకృతము శ్రీవిద్యాస్మరణవలన కలుగును. కృత, త్రేతా, ద్వాపరయుగములయందును, కలి యుగమందును దేవతలుకూడ మోక్షము (ఆత్మస్వరూపము) ను బొందుకొరకు భూలోకమునందు జన్మమునుకోరుచున్నారు దేవతలకుకూడ ఈవిద్య దుర్లభము. మోక్షాధికారులను గురు ముఖమువలన పొందబడదగు ఈశ్రీవిద్య సాక్షాత్తు శంకరుడను వారును, పునర్జన్మము లేనివారునుగాని యితరులు పొందలేరని పార్వతితో నీశ్వరుడు చెప్పెను.

౯॥ మహిషాసురునియొక్క సంహారానంతరమందు దే వతలందరు పరమేశ్వరిని స్తుతిచేసినట్లును, కలియుగమునందు నరులు మాయచే మోహితులయి పరమేశ్వరియొక్క సేవచే

...కే ॥౧౩॥ విద్యా త్వమేవ సుఖదాఽసుఖదాప్యవిద్యా మాత
స్త్వమేవ జననార్తిహరా నరాణాం । మోక్షార్థిభిస్తు కలితా
కిల మందధీభిర్నారాధితా జనని భోగపరైస్తథాజ్ఞైః ॥౧౪॥ బ్ర
హ్మా హరశ్చ హరిరప్యనిశం శరణ్యాం పాదాంబుజం తవ భజంతి
సురాస్తథాన్యే । తద్వైన యేఽప్రమతయో మనసా భజంతి భ్రాం
తాః పతంతి సతతం భవసాగరే తే ॥౧౫॥ చండి త్వదంఘ్రిజల
జోత్థరజఃప్రసాదైర్బ్రహ్మా కరోతి సకలం భువనం భవాదౌ ।
శౌరిశ్చ పాతి ఖలు సంహరతే హరస్త్వాం సేవతే న మనుజ
స్త్విహ దుర్భగోఽసౌ ॥౧౬॥ వాగ్దేవతా త్వమసి దేవి సురాసు
రాణాం వక్తుం న తేఽమరవరాః ప్రభవంతి శక్తాః । త్వం చేన్ము
ఖే వససి నైవ యదైవ తేషాం యస్మాద్భవంతి మనుజా నహి
తద్విహీనాః ॥౧౭॥ శప్తో హరిస్తు భృగుణా కుపితేన కామం
మీనో బభూవ కమఠః ఖలు సూకరస్తు । పశ్చాన్నృసింహ ఇతి
యశ్ఛలకృద్ధరాయాం తాన్ సేవతాం జనని మృత్యుభయం న కిం
స్యాత్ ॥౧౮॥ శంభోః పపాత భువి లింగమిదం ప్రసిద్ధం శాపేన
తేన చ భృగోర్విపినే గతస్య । తే యే నరా భువి భజంతి కపాలిన
స్తు తేషాం సుఖం కథమిహాపి పరత్ర మాతః ॥౧౯॥ యోభూద్గ
జాననగణాధిపతిర్మహేశాత్తం యే భజంతి మనుజా వితథప్రప
న్నాః । జానంతి తేన సకలార్థఫలప్రదాత్రీం త్వాం దేవి విశ్వజ
ననీం సుఖసేవనీయాం ॥౨౦॥ చిత్రం త్వయారిజనతాపి దయా
ర్ద్రిశావార్థత్వారణే శితశస్త్రైర్గమితా ద్యులోకం । నో చేత్స్వకర్మ
నిచితే నిరయే నితాంతం దుఃఖాతిదుఃఖగతిమాపదమాపతేత్సా
॥౨౧॥ బ్రహ్మా హరశ్చ హరిరప్యుత గర్వభావాజ్జానంతి తేఽపి
విబుధా న తవ ప్రభావం । కేఽన్యే భవంతి మనుజా విదితుం సము

ధాస్సంమోహితాస్తవగుణైరమితప్రభావైః ॥ ౨౨ ॥ క్లిశ్యంతి
తేపి మునయస్తవ దుర్విభావ్యం పాదాంబుజం నహి భజంతి
విమూఢచిత్తాః । సూర్యాగ్నిసేవనపరాః పరమార్థతత్త్వం జ్ఞాతం
నతైశ్శ్రుతిశతైరపి వేదసారం ॥ ౨౩ ॥ మన్యేగుణాస్తవభువి ప్రథిత
ప్రభావాః కుర్వంతి యేహి విముఖాన్ననుభక్తిభావాత్ ।
లోకాన్స్వబుద్ధిరచితైర్వివిధాగమైశ్చ విష్ణ్వీశభాస్కరగణేశప
రాన్విధాయ ॥ ౨౪ ॥ కుర్వంతి యే తవపదాద్విముఖాన్నరాగ్ర్యా
న్స్వోక్తాగమైర్హరిహరార్చనభక్తియోగైః । తేషాంనకుప్యసి
దయాం కురుషేంబికేత్వం తాన్మోహమంత్రనిపుణాన్ప్రథయ
స్యలంచ ॥ ౨౫ ॥ తుర్యేయుగే భవతి చాతిబలం గుణస్య తుర్య
స్యతేన మథితాన్యసదాగమాని । త్వాం గోపయంతి నిపుణాః
కవయః కలౌవై త్వత్కల్పితాన్సురగణానపి సంస్తువంతి ॥ ౨౬ ॥
ధ్యాయంతి ముక్తిఫలదాం భువియోగసిద్ధాం విద్యాం పరాంచ
మునయోఽతివిశుద్ధసత్త్వాః । తే నాప్నువంతి జననీజఠరేతు
దుఃఖం ధన్యాస్తఏవ మనుజాస్త్వయి యేవిలీనాః ॥ ౨౭ ॥ చిచ్ఛ
క్తిరస్తి పరమాత్మని తేనసోఽపి వ్యక్తో జగత్సువిదితో భవకార్య
కర్తా । కోన్యస్త్వయావిరహితః ప్రభవత్యముష్మిన్కర్తుం విహ
ర్తుమపి సంచలితుం స్వశక్త్యా ॥ ౨౮ ॥ తత్త్వాని చిద్విరహితాని
జగద్విధాతుం కింవా క్షమాని జగదంబ యతో జడాని । కించేం
ద్రియాణి గుణకర్మయుతాని సంతి దేవిత్వయా విరహితానిఫలం
ప్రదాతుం ॥ ౨౯ ॥ దేవా మఖేష్వపి హుతం మునిభిస్స్వభాగం
గృహ్ణీయురంబ విధివత్ప్రతిపాదితం కిం । స్వాహా నచేత్త్వమసి
తత్ర నిమిత్తభూతా తస్మాత్త్వమేవ ననుపాలయసీవ విశ్వం ॥ ౩౦ ॥
సర్వంత్వయేదమఖిలం విహితం భవాదౌ త్వంపాసి నైవ హరిహర

ప్రముఖాన్ దిగీశాన్ । కాలేఽత్సి విశ్వమపి తేచరితంభవాన్యా
జానంతి నైవమనుజాః క్వనుమందభాగ్యాః ॥౩౧॥ హత్వాసురం
మహిషరూపధరం మహోగ్రం మాతస్త్వయా సురగణః కిల
రక్షితోఽయం । కాంతేస్తుతిం జనని మందధియో విదామో
వేదాగతిం తవయథార్థతయా నజగ్ముః ॥౩౨॥ కార్యం కృతం
జగతి నోయదసౌ దురాత్మా వైరీహతో భువనకంటకదుర్విభా
వ్యః । కీర్తిః కృతా నను జగత్సుకృపావిధేయా హ్యస్మాంశ్చ
పాహి జనని ప్రథితప్రభావే ॥౩౩॥ వ్యాసః॥ ఏవంస్తుతా సురైర్దేవీ
తానువాచ మృదుస్వరా । అన్యత్కార్యంచ దుఃసాధ్యం బ్రూ
యంతు సురసత్తమాః ॥౩౪॥ యదాయదాహి దేవానాం కార్యం
స్యాదతిదుర్ఘటం । స్మర్తవ్యాహం తదాశీఘ్రం నాశయిష్యామి
చాపదం ॥౩౫॥ దేవాః॥ సర్వంకృతం త్వయాదేవి కార్యంనఃఖలు
సాంప్రతం । యదయం నిహతశ్శత్రురస్మాకం మహిషాసురః ॥
౩౬॥ స్మరిష్యామో యదాతేఽంబ సదైవపదపంకజం । తదాకురు
జగన్మాతర్భ క్తిం త్వయ్యవ్యచంచలాం ॥౩౭॥ అపరాధసహస్రాణి
మాతైవ సహతేసదా । ఇతిజ్ఞాత్వా జగద్యోనిం నభజంతేకుతో
జనాః॥౩౮॥ ద్వౌసుపర్ణౌహి దేహేస్మింస్తయోస్సఖ్యంనిరంతరం।
మాన్యస్సఖాప్రియోయోఽస్తి యోఽపరాధం సహంతిహి॥౩౯॥ తస్మా
జ్జీవస్సఖాయం త్వాం హిత్వా కిన్నుకరిష్యతి । పాపాత్మా మం
దభాగ్యోఽసౌ సురమానుషయోనిషు ॥౪౦॥ ప్రాప్య దేహం సుదు
ష్ప్రాపం నస్మరేత్త్వాం నరాధమః । మనసా కర్మణా వాచా
బ్రూమస్సత్యం పునః పునః ॥౪౧॥ సుఖేవాప్యథవా దుఃఖే త్వన్న
శ్శరణమద్భుతం । పాహినస్సతతం దేవి సర్వైస్తవవరాయుధైః
॥౪౨॥ అన్యథా శరణం నాస్తి త్వత్పాదాంబుజరేణుతః । వ్యాసః॥

ఏవం స్తుతా సురైర్దేవీ తత్రై వాంతరధీ యత ॥ ౪౨॥ విస్మయా

పరమంజగ్ముర్దేవాస్తాం వీక్ష్య నిర్గతాం ॥ ఇతి ॥

తా॥ జనమేజయునితో వ్యాసులు చెప్పుచున్నారు. మ

హిషాసురసంహారానంతరము ఇంద్రాదిదేవతలు పరదేవతను స్తోత్రము చేయుచున్నారు. ఓతల్లీ నీశక్తి చేతనే బ్రహ్మ, విష్ణు, రుద్రులు సృష్టి స్థితి లయములు చేయుచున్నారు కాని నిన్ను విడిచినకాలమందు వారు సమర్థులుకారు. ఇట్లు సృష్టి స్థితి లయములు చేయుదానవు నీవే. కీర్తి, మతి, స్మృతి, గతి, కరుణ, దయ, శ్రద్ధ, ధృతి, వసుధ, కమల, జయ, పుష్టి, కల, విజయ గిరిజ, తుష్టి, ప్రమ, (సత్యము) సరస్వతి, ఉమ, రమ, లక్ష్మి విద్య, క్షమ, కాంతి, మేధ మొదలగురూపములు సర్వమునీవే. శక్తులు లేక యెవడు నేమియు జేయజాలడు. నీసహాయము లేక యీమహాభూమిని ఆదికూర్మము, ఆదిశేషుడు నెట్లుధరింపగల రు. ధరాస్వరూపము నీవుకానియెడల బహుభారయుక్తమయి నగగనమెట్లు నిలిచియుండగలదు. 5.

దుష్టతరమయిన కలియుగమున మనుష్యులు ధూర్తుల గుపౌరాణికులచే వంచితులై నిన్ను సేవింపలేక నివలన నిర్మింప బడిన హరిహరాదులను సేవించుచుందురు. రాక్షసులచేత దేవ తలు పీడపెట్టబడి నిన్ను శరణుపొంది సుఖించిరని తెలిసియు, ఆదేవతలనే సేవింతురు. ఇది నిర్మలమయిన దీపమును చేతిలో నుంచుకొనియును పాడునూతిలోపడుటయేగద. సేవించుభక్తుల కుసుఖమునిచ్చు విద్యాస్వరూపురాలవునీవె. నిన్ను సేవింపకుండ మోహపఱచి దుఃఖమునిచ్చు అవిద్యాస్వరూపురాలవు నీవె. నరులకు జననమరణాది దుఃఖములను హరించుదానవును నీవె.

మోక్షమునుగోరువారు నిన్ను ఆరాధింతురు గాని కేవలభోగాస
క్తులగు అజ్ఞులు నిన్ను ఆరాధింపలేరు. హరిహరబ్రహ్మాది దేవ
తలే నీపాదపద్మమును సర్వదా సేవించుచుండగా అల్పబుద్ధిగల
నరులు సుఖమునిచ్చు నీసేవను మానదగునా. ఈనరులు భ్రాంతి
చేత నిన్ను సేవింపక సంసారసాగరమందె పడుచున్నారు. ఓపర
మేశ్వరీ నీపాదపద్మరజోరేణుప్రసాదముచేత బ్రహ్మ సకలభువ
నమును సృష్టిని, విష్ణువు పరిపాలనమును, ఈశ్వరుడు సంహార
మును చేయుచున్నారు. ఈలోకమునందు నిన్ను సేవింపనిమ
నుజుడు అదృష్టహీనుడు. దేవతలకును, రాక్షసులకును నీవు
ప్రాపవు(గా)యున్నావు. వాగ్దేవతాకటాక్షములేని మనుజులవ
లె నీకటాక్షములేని దేవతలును పలుకలేరు. భృగుమహర్షి శపింప
గా విష్ణుమూర్తి మత్స్యకూర్మాద్యవతారములను బొందెను.
అట్టిఅవతారపురుషులను సేవించువారికి మృత్యుభయముతొల
గునా. ఆభృగుమహర్షి శపింపగా ఈశ్వరునియొక్క లింగము
భూలోకమున దారుకావనమందు తెగిపడెను. అట్టిఈశ్వరుని
సేవించువారికి ఇహపరసుఖములు కలుగునా. భూలోకమునందు
కొందఱు సకలార్థములనిచ్చు నిన్ను సేవింపలేక గణేశుని సేవించి
తమకార్యమును వ్యర్థపఱ్చుకొనుచున్నారు. ఓతల్లీ నీవు శత్రువు
లయినను సంహరించి వారి స్వకర్మములకు తగిన నరకమును
పొందింపక దయతో స్వర్గమును పొందించెదవు. మఱియు హరి
హరబ్రహ్మాది దేవతలయినను మోహితులై గర్వముచేత నీప్ర
భావమును దెలియజాలకయుండిరి. మహామహిమగల నీగుణ
ములచేత మోహితులగు జనులు నీప్రభావమును తెలిసికొనలే
రని వేరుచెప్పనక్కరలేదు. అచింతనీయమగు నీపాదారవింద

భజనము చేయగని మనుజులు కొందరు పరమార్థమును తెలిసికొన లేక సూర్యాగ్న్యాదులను సేవించుచు క్లేశపడుదురు. జననీ ప్రసిద్ధములగు నీగుణములచేత మోహితులై నీయందు భక్తిలేక నానావిధములగు ఆగమముల ననుసరించి విష్ణు శంకర భాస్కరాది దేవార్చనపరులగుచున్నను వారియందు నీవు కోపముచేయక దయనేజూపుచు వారినివశ్యాకర్షణాదిమంత్రములయందు నేర్పరులనుగ జేయుచున్నావు. సత్య (కృత) యుగమందుజన్మించినవారికి అతిశుద్ధసత్వగుణముతో బలముగానుండెను. అతిశుద్ధసత్వగుణము తుర్యగుణమనియు, కృతయుగము తుర్యయుగమనియు చెప్పబడినది. వారు ఆగుణములచేతనే అసదాగమములను మథించుచు సత్యమునననుసరించి యుండిరి. 1 కలియుగము, 2 ద్వాపరయుగము, 3 త్రేతాయుగము, 4 కృతయుగము అని కలియుగము మొదలుకొని వెనుకకు క్రమముచేత కృతయుగము తుర్యయుగమని వ్యాఖ్యానమందు చెప్పబడినది. కలియుగమునందు నిపుణులైన కవులు నిన్నువిడిచి నీవల్లకల్పింపబడిన విష్ణ్వీశాది దేవతలనే స్తుతిచేయుచున్నారు. యోగసిద్ధులగు మునులు ముక్తిఫలమునిచ్చు పరావిద్యాస్వరూపమైన నిన్నే ధ్యానించుచు నీయందే మనస్సును లీనముచేసి ధన్యులై తిరిగి తల్లిగర్భమునందు పుట్టరు. పరమాత్ముడు తనచిచ్ఛక్తి వలననే వ్యక్తుడై సంసారకృత్యములను చేయుచున్నాడు. నీసహాయము లేకుండగ సృష్టి స్థితి సంహారముల నెవడుచేయగలడు. జడములగు తత్వములు చిత్సహాయములేక జగత్తును కల్పింపగలవా. ఓజననీ యజ్ఞములలో నీవు స్వాహాకారముగ సన్నిధినుండవేని దేవతలాహారములను స్వీకరింపలేరు.

కావున నీవే మునులద్వారా దేవతలకును, దేవతలద్వారా పితృలకును తృప్తి కలిగించుచున్నావు. హరిహరాదులను, దిక్పాలురను, సకలవిశ్వమును పుట్టించి రక్షించుచు సంహరించు నీమహిమను హరిహరాదులే తెలియలేనపుడు మందభాగ్యులగు మనుజులు తెలిసికొనగలరా; ఓతల్లీ మహిషాసురుని సంహరించి దేవగణమును రక్షించినావుగద. వేదములే నీయథార్థగుణములనుస్తుతిచేయలేకపోయినవి. అల్పబుద్ధిగలమేమెట్లు స్తుతింపగలము. మహాప్రభావముగల నీవు మమ్ము దయతో రక్షింపుము. అనిస్తుతిచేయబడిన పరమేశ్వరి మృదుమధురస్వరముతో ఓదేవతలారా! మీకసాధ్యమయిన కార్యముతటస్థించినపుడు నన్ను స్మరింపుడు. నేనువెంటనే మీయాపదలను నశింపచేయుచున్నానని పలుకగా దేవతలు మాకుశత్రువైన మహిషాసురునిసంహారించుటవలన మాసకలకార్యములు నీచేతచేయబడినవే. మరియు నీపాదపద్మమునందు సర్వదామాకు చలింపనిభక్తియుండునట్లు చేయుము. సహస్రాపరాధములుచేసినను జగన్మాత సర్వదాసహించునను జ్ఞానముకలిగిన యేజనులు జగత్కారణమయిననిన్ను భజింపకయుందురు. ఈదేహరూపమైన వృక్షమునందు జీవుడు, పరమాత్మ అను రెండుపక్షులు కలవు. వీనికి సర్వదా సఖ్యముకలదు. అపరాధములను సహించుపరమమిత్రము, ఆత్మరూపమునగు నిన్ను సేవింపక జీవుడు సుఖించునా; ఉత్తమదేహములనుబొందినను పాపాత్ములు నిన్ను స్మరింపలేరని సత్యముగ చెప్పుచు పరాయుధధారిణివగు నిన్ను శరణుపొందితిమి. కావున మాకు సుఖముకలిగినపుడు గర్వింపని, దుఃఖముగలిగినపుడు విచారింపని సుబుద్ధినిచ్చి రక్షింపుమని దేవతలు ప్రార్థిం

పగా పరమేశ్వరి యక్కడనే అంతర్ధానమాయెను. దేవతలు పరమేశ్వరిని చూడక మిక్కిలి ఆశ్చర్యము పొందిరి.

దేవీవేదపాదస్తవము॥ శంకరాచార్యకృతము॥

88 శ్లో॥ త్రికలాఢ్యాం త్రిహృల్లేఖాం ద్విహాసస్వరభూషితాం। యోజయత్యాంబ తేవిద్యాం సోకరః పరమఃస్వరాట్॥

తా॥ మూడుకకారములు మూడులకారములు మూడు హ్రీంకారములు రెండుసకారములు రెండుఅచ్చులు గల్గిన మంత్రిమెవరు జపింతురో వారు ముక్తినిపొందుదురని పరమేశ్వరిని శంకరులు స్తుతిచేసిరి.

11. ఉపాసన చేసినవారు.

అ॥ బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాది దేవతలును, రాక్షసాదులును పరమేశ్వరిని గొప్పగా పూజించిరని చెప్పబడుచున్నది.

ల॥ స॥ 213 మహాపూజ్యా॥

భా॥ వ్యా॥ పూజ్యానాం శివాదీనామపి పూజ్యత్వాత్॥

పద్మ॥ దేవిభాగవతములు॥ శివ, బ్రహ్మ, విష్ణు, కుబేర విశ్వేదేవ, వాయు, వసు, వరుణాగ్ని, శక్రి, సూర్య, సోమ, గ్రహ రాక్షస పిశాచ మాతృగణాది భేదేన తత్తత్పూజనీయ దేవీమూర్తి భేదో మంత్ర శైలేంద్రి శిల, స్వర్ణ, రౌప్య, పిత్తళ కాంస్య, స్ఫాటిక, మాణిక్య, ముక్తాఫల, ప్రవాళ, వైడూర్య, తామ్ర, సీస, వజ్రి, లోహ వికారరూపో విస్తరేణ దర్శితః। అత్రాగ్ని, శక్ర, సూర్యాః మాణిక్యమయీమేవ ప్రతిమాం పూజయంతి. ఇతరద్వ్యథాసంఖ్యం యోజనీయం॥

తా॥ శివుడు మొదలు పిశాచులవరకు చెప్పినవారు మాతృగణాదిభేదముచేత మారి భేదమునుపొంది పరమేశ్వరిని శైల

(రోయు) ఇంద్రనీలము, బంగారు, వెండి, యిత్తడి, కంచు, స్ఫాటికము, మాణిక్యము, ముత్యము, పగడము, వైడూర్యము, పుష్య. సీసము. వజ్రము, లోహము అనువానిపైని రచింపబడిన ప్రతిమలనగ శ్రీచక్రములయందు పూజించిరి.

౧॥ స॥ 231 మహాభైరవపూజితా॥

భా॥ వ్యా॥ పరశిఖ్రా భైరవః॥

పద్మపు॥ శంభుః పూజయతే దేవీం మంత్రశక్తిమయీం శుభాం। అక్షమాలాం కరేకృత్వా న్యాసేనైవ భపూర్ధ్యః॥ ఇతి॥

తా॥ ఈశ్వరుడు అక్షమాలను చేతధరించి శుభమగు మంత్రశక్తిరూపమయిన దేవిని న్యాసముచేత పూజించెను.

౧॥ స। 238 మనువిద్యా॥

వ్యాఖ్యానము – మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః। అగస్తి రగ్ని స్సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివ స్తథా। క్రోధభట్టారకో దేవ్యా ద్వాదశామీ ఉపాసకా ఇతి వచనే సంప్రదాయతో ద్వాదశప్రకారాః శ్రీవిద్యాప్రస్తారాః॥

తా॥ మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్తిమహర్షి, అగ్నిహోత్రుడు, సూర్యుడు, ఇంద్రుడు కుమారస్వామి, ఈశ్వరుడు, క్రోధభట్టారకుడు ఈపండ్రెండుగురును దేవీ ఉపాసకులు. పండ్రెండువిధములగు శ్రీవిద్యాప్రస్తారము గలవారు.

౧॥ స॥ 280 పద్మనాభసహోదరీ॥

బ్ర॥ పు॥ కాంచీక్షేత్రే పురా ధాతా సర్వలోకపితామహః శ్రీదేవీదర్శనార్థాయ తపస్తేపే సుదారుణం॥ అత్రైకస్త్రధ్యాన

పగా పరమేశ్వరి యొక్క-డనే అంతర్ధానమాయెను. దేవతలు పరమేశ్వరిని చూడక మిక్కిలి ఆశ్చర్యము పొందిరి.

దేవీవేదపాద స్తవము॥ శంకరాచార్యకృతము॥

88 శ్లో॥ త్రికలాఢ్యాం త్రిహృల్లేఖాం ద్విహాసస్వరభూషితాం। యోజపత్యాంబ తేవిద్యాం సోకురః పరమః స్వరాట్॥

తా॥ మూడు కకారములు మూడు లకారములు మూడు హ్రీంకారములు రెండు సకారములు రెండు అచ్చులు గలిసినం త్రిమెవరు జపింతురో వారు ముక్తిని పొందుదురని పరమేశ్వరిని శంకరులు స్తుతిచేసిరి.

II ఉపాసన చేసినవారు.

అ॥ బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాది దేవతలును, రాక్షసాదులును పరమేశ్వరిని గొప్పగా పూజించిరని చెప్పబడుచున్నది.

ల॥ స॥ 213 మహాపూజ్యా॥

భా॥ వ్యా॥ పూజ్యానాం శివాదీనామపి పూజ్యేత్యర్థః॥

పద్మ॥ దేవీభాగవతములు॥ శివ, బ్రహ్మ, విష్ణు, కుబేర విశ్వేదేవ, వాయు, వసు, వరుణాగ్ని, శక్ర, సూర్య, సోమ, గ్రహ రాక్షస పిశాచ మాతృగణాది భేదేన తత్తత్పూజనీయ దేవీమూర్తి భేదో మంత్ర శైలేంద్రశిల, స్వర్ణ, రౌప్య, పిత్తళ కాంస్య, స్ఫాటిక, మాణిక్య, ముక్తాఫల, ప్రవాళ, వైడూర్య, త్రిపు, సీస, వజ్ర, లోహ వికారరూపో విస్తరేణ దర్శితః। అత్రాగ్ని, శక్ర, సూర్యాః మాణిక్యమయీమేవ ప్రతిమాం పూజయంతి. ఇతరద్వ్యధాసంఖ్యం యోజస్తీయం॥

తా॥ శివుడు మొదలు పిశాచులవరకు చెప్పినవారు మాతృగణాదిభేదము చేత మూర్తిభేదము పొంది పరమేశ్వరిని శైల

(రోయు) ఇంద్రనీలమణి, బంగారు, వెండి, యిత్తడి, కంచు, స్ఫాటికము, మాణిక్యము, ముత్యము, పగడము, వైడూర్యము, పుష్య. సీసము. వజ్రము, లోహము అనువానిపైని రచింపబడిన చక్రములనగ శ్రీచక్రములయందు పూజించిరి.

నా॥ స॥ 231 మహాభైరవపూజితా॥

భా॥ వ్యా॥ పరశివ ప్రా భైరవః॥

పద్మపు॥ శంభుః పూజయతే దేవీం మంత్రశక్తిమయీం శుభాం। అక్షమాలాం కరేకృత్వా న్యాసేనైవ ధ ప్రాద్ధ్యః॥ ఇతి॥

తా॥ ఈశ్వరుడు అక్షమాలను చేతధరించి శుభమగు మంత్రశక్తిరూపమయిన దేవిని న్యాసముచేత పూజించెను.

నా॥ స॥ 238 మనువిద్యా॥

జ్ఞానార్ణవము - మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః। అగస్తి రగ్ని స్సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివ స్తథా। క్రోధభట్టారకో దేవ్యా ద్వాదశామీ ఉపాసకా ఇతి వచనే సంగృహీతో ద్వాదశప్రకారః శ్రీవిద్యాప్రస్తారః॥

తా॥ మనువు, చంద్రుడు, కుబేరుడు, లోపాముద్ర, మన్మథుడు, అగస్తిమహర్షి, అగ్నిహోత్రుడు, సూర్యుడు, ఇంద్రుడు కుమారస్వామి, ఈశ్వరుడు, క్రోధభట్టారకుడు ఈపండ్రెండు గురును దేవీ ఉపాసకులు. పండ్రెండువిధములగు శ్రీవిద్యాప్రస్తారము గలవాడు.

నా॥ స॥ 280 పద్మనాభసహోదరీ॥

బ్ర॥ పు॥ కాంచీక్షేత్రే పురా ధాతా సర్వలోకపితామహః శ్రీదేవీదర్శనార్థాయ తపస్తేపే సుదారుణం॥ అత్త్యైక్షధ్యాన

యుక్తస్య తస్య ప్రతపతో మునేః। ప్రాదుర్బభూవ త్రిపురా పద్మహస్తా సహోదరా॥ పద్మాసనేచ తిష్ఠంతీ విష్ణునా జిష్ణునా సహోత్యాది -

తా॥ సర్వలోకములకు పితామహుడగు బ్రహ్మ పూర్వకాలమున కాంచీక్షేత్రమునందు శ్రీదేవియొక్క దర్శనముకొరకు అఖండతపస్సుచేసెను ఆత్మతోఐక్యమగు ధ్యానముతో తపస్సు చేసిన బ్రహ్మకు త్రిపురసుందరి పద్మాసనాసీనయు, పద్మహస్తయునై సోదరుడగు విష్ణువుతోకూడ ప్రత్యక్షమయ్యెను.

ల॥ స॥ 297 హరిబ్రహ్మేంద్రసేవితా॥

లలితోపాఖ్యానము— శ్రీనగరే అష్టాదశ సప్తదశ ప్రాకారయోర్మధ్యే విష్ణోః। సప్తదశ షోడశయోర్మధ్యే బ్రహ్మణః। పంచదశ చతుర్దశయోర్మధ్యే ఇంద్రాదిలోకపాలానాం దేవీసేవార్థం నివాసస్మరణాత్ ॥

తా॥ శ్రీనగరమునందు 17-18 ప్రాకారములమధ్యను విష్ణువు, 16-17 ప్రాకారములమధ్యను బ్రహ్మయు, 14-15 ప్రాకారములమధ్యను ఇంద్రుడుమొదలగు లోకపాలకులును దేవిని సేవించుటకై వసించిరి.

ల॥ స॥ 406 శివారాధ్యా॥

భా॥ వ్యా॥ శివేనారాధ్యోపాసితా ॥

బ్ర॥ పు॥ శివోపి యాం సమారాధ్య ధ్యానయోగబలేనచ ఈశ్వరస్సర్వసిద్ధీనా మర్ధనారీశ్వరో భవదితి ॥

తా॥ శివుడును, ధ్యానయోగబలముచేతఁ బరమేశ్వరినారాధించి సర్వసిద్ధులకు ఈశ్వరుడేకాక అర్ధనారీశ్వరుడునునయ్యెను.

ల॥ స॥ 726 సనకాదిసమారాధ్యా ॥

భా॥ వ్యా॥ బ్ర॥ పు॥ త్వమేవానాదిరఖిలా కార్యకారణరూపిణీ। త్వామేవహి విచిన్వంతి యోగినస్సనకాదయ ఇతి॥

తా॥ ఓపరమేశ్వరీ సమస్తకార్యకారణరూపమయి అనాది స్వరూపురాలవునగునిన్నే సనకాదిమునులుధ్యానించుచున్నారు.

ల॥ స॥ 817 సత్యవ్రతా ॥

భా॥ భా॥ దేవీభా। తృతీయస్కంధము॥ అనక్షరో మహా మూర్ఖో నామ్నా సత్యవ్రతో ద్విజః। శ్రుత్వాక్షరం కోలముఖాత్ సముచ్చార్య స్వయంతతః। బిందుహీనం ప్రసంగేన జాతోసౌ విబుధోత్తమః। ఐకారోచ్చారణాదేవ తుష్టా భగవతీ తదా। చకార కవిరాజం తం దయార్ద్రా పరమేశ్వరీత్యాది॥

తా॥ అక్షరజ్ఞానములేని మహామూర్ఖుడయిన సత్యవ్రతుడనుబ్రాహ్మణుడు అడివిపందిముఖమువలన అక్షరమునువిని ప్రసంగవశముచేత బిందుహీనమయినను ఐకారము నుచ్చరించుట వలన దయగల పరమేశ్వరి సంతసించి వానిని కవిరాజుగాచేసెను. అనగా కవీశ్వరుడయ్యెను.

త్రిశతి 68 లలాటనయనార్చితా ॥

శంకరభా॥ తృతీయనేత్రవతా శివేన తత్స్వరూపరుద్రైర్వా పూజితేత్యర్థః॥

తా॥ పరమేశ్వరి మూడవనేత్రముగల శివునిచేతను గాని, అట్టిస్వరూపులగు రుద్రులచేతగాని పూజింపబడెను.

త్రిశతి 230 సనకాది మునిధ్యేయా ॥

శం॥ వ్యా॥ మననశీలాః మునయః। మననశబ్దేన లక్షణయా తత్సాక్షాత్కారవంత ఇత్యర్థః। బ్రహ్మణః మానసికపుత్రాః

జ్ఞానవైరాగ్యాది బహులాః మోక్షమార్గప్రవర్తకాః । సకాః
అజాః యేషాం తే మునయః సనందన, సనాతన, సనత్కుమార
ప్రముఖాః । నిర్గతకామాః నిశ్చింతాః । త్రైధ్యయా ఆత్మాదరేణ
స్వాత్మాఽభేదజ్ఞానేన సర్వదా విషయీకృతేత్యర్థః । " I త్వం
వా అహమస్మి భగవో దేవతే అహంవై త్వమసి " " II క్షేత్ర
జ్ఞంచాపి మాం విద్ధి " " III ఆత్మానం చేద్విజానీయాదయమ
స్మీతి పూరుషః " " IV అథయోఽన్యాం దేవతాముపాస్తేఽ
న్యోసావన్యోఽహమస్మీతి న సవేద యథాపశుః " "మృత్యోః
సమృత్యుమాప్నోతి యఇహ నానేవ పశ్యతి " ఇత్యాది శ్రుతి
స్మృతిశతేభ్యః ॥ ఇతి॥

తా॥ బ్రహ్మయొక్క మానసికపుత్రులును, అధికజ్ఞానవై
రాగ్యములుగలవారును, మోక్షమార్గప్రవర్తకులును, కోరిక
లేనివారును, నిశ్చింతులునగు సనకసనందనాదిమునులు త్రి
పురసుందరిని ఆత్మస్వరూపముగ శ్రద్ధతో సర్వదా ధ్యానించు
చుందురు. ఈయభేదమును ఈక్రిందజెప్పినరీతిని నేకశ్రుతిస్మృతు
లుబోధించుచున్నవి. I ఓదేవా నీవే నేను నేనే నీవు. II నన్ను
క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము. III ఆత్మస్వరూపము తానేయని
తెలిసినవాడేమియుకోరక సుఖించును. IV ఎవడు దేవతవేఱని
తానువేఱని భేదభావముచేత దేవతనుపాసించునో వాడు పశు
వువలె నేమియు నెఱుగనివాడు. ఈవిషయములో (అద్వైతభా
వనలేకుండ) నానాత్వము భావించువాడు జన్మమును మరల
మరల బొందును. సౌందర్యలహరి॥

భగవత్పాదకృతము—శ్లో॥ హరిస్త్వామారాధ్య ప్రణతజనసౌ
భాగ్యజననీ మిత్యాది ॥

తా॥ ఓ దేవి! ఆశ్రయించుజనులకు సుఖమునిచ్చునట్టి నిన్ను విష్ణుమూర్తి యారాధనజేసెనని శంకరగురువారిచేత చెప్పబడెను.

జ్ఞానార్ణవము— త్వామారాధ్య దేవేశి కామః సౌభాగ్యసుందరః। హరిశ్చ పరమేశాని త్రిపురారాధనాత్ప్రియే। త్రైలోక్యమోహనో భూత్వా స్థితికర్తాఽభవత్సదా। త్వత్సమారాధనాత్తు బ్రహ్మా సృష్టికరోఽభవత్। చంద్రసూర్యౌ వరారోహే సృష్టిసంహారకారకౌ

తా॥ ఈ పరమేశ్వరి ని ఆరాధనచేసి మన్మథుడు సౌభాగ్యసుందరుడయ్యెను. త్రిపురసుందరి ఆరాధనవలన విష్ణువు మూడు లోకములకు మోహనరూపమును, పరిపాలకరూపమును పొందెను. సర్వదా నీయొక్క ఆరాధనవలన బ్రహ్మ సృష్టికర్తయును, రవి చంద్రులు సృష్టిసంహారకారకులును అయిరి.

వ్యాసులవారు పుత్రునికొరకు వాగ్బీజమును జపించినట్లును శ్రీశుకులు పుట్టినట్లును చెప్పబడుచున్నది.

దేవీభా॥ ప్రథమస్కంధము పదియవ అధ్యాయము॥

శ్లో॥ మేరుశృంగే మహారమ్యే వ్యాసస్సత్యవతీసుతః। తపశ్చచార సోత్యుగ్రం పుత్రార్థం కృతనిశ్చయః। జపన్నేకాక్షరం మంత్రం వాగ్బీజం నారదాచ్ఛ్రుతం। ధ్యాయన్ పరాం మహామాయాం పుత్రకామస్తపోనిధిః॥ ౫॥ అగ్నేర్భూమేస్తథా వాయోరంతరిక్షస్యచాప్యయం। వీర్యేణసమ్మితః పుత్రో మమ భూయాదితిస్మహ। అతిష్ఠత్స్వగతాహారః శతసంవత్సరం విభుః। ఆరాధయన్మహాదేవం తథైవచ సదాశివాం॥ ౭॥ శక్తిస్సర్వత్ర పూజ్యేతి విచార్యచ పునఃపునః। అశక్తో నింద్యతేలోకే శక్తస్తు పరిపూజ్యతే॥ ౮॥ ఇత్యాది॥

తా॥ సత్యవతీపుత్రులయిన వ్యాసులు మేరుపర్వతమునందు వాగ్బీజము (ఐం) ను నారదునివలన నుపదేశమునుపొంది నిశ్చలమనస్సుతో జపము చేయుచు మహామాయాస్వరూపమయిన పరమేశ్వరిని ధ్యానించుచు, పంచమహాభూతసత్త్వమగు పుత్రుడుత్తమముగ కలుగవలెనని ఉగ్రమయిన తపస్సుతో లోకము లోశక్తిగలవానింబూజింతురు. శక్తిహీనునినిందింతురు గావున నంతటను శక్తియే పూజ్యరాలనియెంచి పరమేశ్వరుని, పరమేశ్వరిని నిరాహారుడై నూరుసంవత్సరములు ఆరాధింపగా శ్రీశుకుడుకలిగెను.

అ॥ శ్రీవిద్య ముఖ్యమయినదనియు, హరిహరులును, మన్మథుడును మూడుకాలములయందును జపించినట్లును చెప్పబడుచున్నది.

వామకేశ్వరతంత్రము। చతుర్థపటలము— అతఃప్రధానవిద్యేయం త్రిపురాపరమేశ్వరీ। నైతస్యాస్సదృశీకాచిద్విద్యా దేవేశి విద్యతే ॥ 68 ॥ ఏతామేవ పురారాధ్య విద్యాం త్రైలోక్యమోహినీం। త్రైలోక్యమోహనం రూపమకార్షీద్భగవాన్ హరిః ॥69॥ కామదేవో౾పి దేవేశి మహాత్రిపురసుందరీం। సమారాధ్యా౾భవల్లోకే సర్వసౌభాగ్యసుందరః ॥70॥ మయాప్యేతద్వ్రతస్థేన క్రియతే౾ద్యాపి సువ్రతే। జప్యం త్రిసంధ్యమేతస్యాస్తు దేవత్వపదసిద్ధయే ॥ 71 ॥

తా॥ ఓ పార్వతీ త్రిపురసుందరీవిద్య ప్రధానమయినది. దీనితో సమమగు విద్యయేదియును లేదు. ఈ త్రైలోక్యమోహన విద్యను ఆరాధనచేసి విష్ణువు మోహినీరూపమును, మన్మథుడు అతిసుందరరూపమును పొందిరి. నేనును ఇప్పటికిని మూడుకా

లములయందును నియమము చేత ఈవిద్యనుపాసనచేయు చుంటి నని ఈశ్వరుడు చెప్పెను

అ॥ బాలాత్రిపురసుందరీవిద్య అత్యుత్తమమనియు, బ్రహ్మ విష్ణువు, ఈశ్వరుడును, ఇంద్రాదులును జపించి సర్వోత్తమపద మును బొందిరనియు చెప్పబడుచున్నది.

దత్తాత్రేయసంహిత 54 అధ్యాయము ॥ శ్లో॥ శ్రుణు దేవి ప్రవ క్ష్యామి బాలావిద్యామనుత్తమాం। యస్యాః స్మరణమాత్రేణ సర్వవిద్యానిధిర్భవేత్ ॥౧॥***॥౯॥ అణిమాదిగుణైశ్వర్యప్రదా త్రిస్మృతితస్స్మృత్ । శంఖపద్మాదినిధిదా సామ్రాజ్యశ్రీప్రదా యినీ ॥౧౧॥ బృహస్పతేరపి గుణశతకోటిప్రదాయినీ। కాలమృ త్యుహరీస్మర్తు ర్జగద్వశ్యప్రదాయినీ ॥౧౨॥ మహామహాత్తరా విద్యా మంత్రసింహాసనేశ్వరీ। ఇమామహం హరిర్బ్రహ్మాజప్త్వా సర్వోత్తమంపదం ॥౧౩॥ అవాప్తాస్మ మహాభాగే తథాశక్రా దయస్సురాః ॥ ఇత్యాది ॥

తా॥ ఓపార్వతీ స్మరణమాత్రముచేతనే భక్తులకు సకలవిద్య లనిచ్చి రక్షించునట్టి మిక్కిలియుత్తమమయిన బాలాత్రిపుర సుందరీవిద్యను వినుము. ఈవిద్య ఒకమారు స్మరణచేతనే అణి మాద్యష్టైశ్వర్యములను, శంఖపద్మాది నిధులను, సామ్రాజ్య లక్ష్మిని యిచ్చును. బృహస్పతికికూడ బహుగుణములనిచ్చెడి మహత్తరమయిన యీమంత్రసింహాసనేశ్వరీవిద్యనునేను, విష్ణు వుబ్రహ్మయు ఇంద్రాదులును జపించి సర్వోత్తమపదమునుబొం దినాము.

అ॥ శ్రీరామమూర్తి పరమేశ్వరిని దేవీనవరాత్రములయందు పూజించి సిద్ధులను బొందినట్లు చెప్పబడుచున్నది.

దేవీభాగవతము — తృతీయస్కంధము 30 అధ్యాయము॥

నారదఉవాచ॥ శృణురామ సదానిత్యా శక్తిరాద్యా సనా
తనీ। సర్వకామప్రదాదేవీ పూజితాదుఃఖనాశినీ ॥౨౭॥ కార
ణంసర్వజంతూనాం బ్రహ్మాదీనాం రఘూద్వహ। తస్యాఃశక్తిం
వినాకోఽపి స్పందితుం నక్షమో భవేత్ ॥౨౮॥ విష్ణోఃపాలనశక్తిః
సా కర్తృశక్తిః పితుర్మమ। రుద్రస్య నాశక్తిః సాత్వన్యాశక్తిః
పరాశివా ॥ ౩౦ ॥ యచ్చకించిత్క్వచిద్వస్తు సదసద్వాధరాతలే।
తస్య సర్వస్య యాశక్తిస్తదుత్పత్తిః కుతోభవేత్ ॥౩౧॥ నబ్ర
హ్మానయదావిష్ణుర్నరుద్రో నదివాకరః। నచేంద్రాద్యాః
సురాస్సర్వే నధరా నధరాధరాః ॥౩౨॥ తదాసాప్రకృతిఃపూర్ణా
పురుషేణ పరేణవై। సంయుతావిహరత్యేవ యుగాదౌ నిర్గు
ణాశివా ॥౩౩॥ సాభూత్వా సగుణాపశ్చాత్కరోతి భువనత్రయం
పూర్వం సంసృజ్య బ్రహ్మాదీన్ దత్వా శక్తీశ్చ సర్వశః ॥ ౩౪
తాం జ్ఞాత్వా ముచ్యతేజంతుర్జన్మసంసారబంధనాత్। సావి
ద్యాపరమాజ్ఞేయా వేదాద్యా వేదకారిణీ ॥౩౫॥ అసంఖ్యాతాని
నామాని తస్యాబ్రహ్మాదిభిఃకిల। గుణకర్మవిధానైస్తు కల్పితా
నిచ కింబ్రువే ॥౩౬॥ అకారాది క్షకారాంతైః స్వరైః వర్ణైస్తు
యోజితైః। అసంఖ్యేయానినామాని భవంతి రఘునందన ॥౩౭॥
రామఉవాచ॥ విధింమే బ్రూహి విప్రర్షే వ్రతస్యాస్యసమాసతః।
కరోమ్యద్యైవ శ్రద్ధావాన్ శ్రీదేవ్యాః పూజనంతథా ॥ ౩౮ ॥
నారదఉవాచ॥ పీఠంకృత్వా సమేస్థానే సంస్థాప్య జగదంబికాం।
ఉపవాసాన్నవైవత్వం కురురామవిధానతః ॥౩౯॥ ఆచార్యోఽహం
భవిష్యామి కర్మణ్యస్మిన్ మహీపతే। దేవకార్యవిధానార్థము
త్సాహం ప్రకరోమ్యహం ॥ ౪౦ ॥ వ్యాసఉవాచ॥ తచ్ఛ్రుత్వా

వచనం సత్యం మత్వా రామః ప్రతాపవాన్ । కారయిత్వాథ
పీఠం చ స్థాపయిత్వాంబికాం శివాం ॥౨౮॥ విధివత్పూజనంతస్యా
శ్చకార వ్రతవాన్ హరిః । సంప్రాప్తే చాశ్వినేమాసి తస్మిన్
గిరివరే తదా ॥౨౯॥ ఉపవాసపరో రామః కృతవాన్ వ్రతము
త్తమం । హోమంచ విధివత్తత్ర బలిదానంచ పూజనం ॥౩౦॥
భ్రాతరౌ చక్రతుః ప్రీత్యా వ్రతం నారదసంమతం । అష్టమ్యాం
మధ్యరాత్రే తు దేవీ భగవతీ హి సా ॥౩౧॥ సింహారూఢా దదౌ
తత్ర దర్శనం ప్రతిపూజితా । గిరిశృంగే స్థితోవాచ రాఘవం
సానుజం గిరా ॥౩౨॥ మేఘగంభీరయా చేదం భక్తిభావేనతో
షితా । దేవ్యువాచ॥ రామరామమహాబాహో తుష్టాస్మ్యద్య
వ్రతేన తే ॥౩౩॥ ప్రార్థయస్వ వరం కామం యత్తే మనసి వర్తతే
నారాయణాంశసంభూతస్త్వం వంశే మానవేనఘ ॥౩౪॥ రావణ
స్య వధార్థాయ ప్రార్థితస్త్వమమరైః పురాసి ॥౩౫॥ తతోదాసింతు కాకుత్స్థ
జాతో దశరథాత్మజః ॥౩౬॥ ప్రార్థితస్తు సురైస్సర్వై రావణేనా
తిపీడితైః । కపయస్తే సహాయా వై దేవాంశా బలవత్తరాః ॥౩౭॥
భవిష్యంతి నరవ్యాఘ్ర మచ్ఛక్తిసంయుతా హ్యమీ । శేషాం
శోప్యనుజస్తేయం రావణాత్మజనాశకః ॥౩౮॥ భవిష్యతి నసం
దేహః కర్తవ్యోత్ర త్వయానఘ । వసంతే సేవనం కార్యం
త్వయా తత్రాతిశ్రద్ధయా ॥౩౯॥ హత్వాథ రావణం పాపం కురు
రాజ్యం యథాసుఖం । ఏకాదశసహస్రాణి వర్షాణి పృథివీతలే॥
౪౦॥ కృత్వా రాజ్యం రఘుశ్రేష్ఠ గంతాసి త్రిదివం పునః ।
వ్యాసఉవాచ॥ ఇత్యుక్త్వాంతర్దధే దేవీ రామస్తు ప్రీతిమానసః॥
౪౧॥ సమాప్య తద్వ్రతం చక్రే ప్రయాణం దశమీదినే । విజ
యాపూజనం కృత్వా దత్వా దానాన్యనేకశః ॥౪౨॥ కపిపతిబల

యుక్తః సానుజః శ్రీపతిశ్చ ప్రకటపరమశక్త్యా ప్రేరితః పూర్ణకామః। ఉదధితటగతో సౌ సేతుబంధం విధాయాత్యహానదమరశత్రుం రావణం గీతకీర్తిః॥ ౬౧ ॥ యః శృణోతి సరో భక్త్యా దేవ్యాశ్చరితముత్తమం। సభుంక్త్వా విపులాన్ భోగాన్ ప్రాప్నోతి పరమంపదం॥ ౬౨ ॥ సంత్యన్యాని పురాణాని విస్తరాణి బహూనిచ। శ్రీమద్భాగవతస్యాస్య నతుల్యానీతి మేమతిః॥ ౬౩।

తా॥ ఓరామా! ఆదిశక్తి నిత్యమయినది. ఆదిమధ్యాంతములులేనిది. పూజించినభక్తులకు దుఃఖములనుబోగొట్టి అన్నికోరికలనిచ్చునది. బ్రహ్మాది దేవతలకును కారణమయినది. ఆశక్తిలేకుండగ నెవరునేమియును సమర్థులుకారు. విష్ణువుయొక్క పాలనశక్తియు, నాలుగ్రంథియయిన బ్రహ్మయొక్క సృష్టిశక్తియు, రుద్రునియొక్క సంహారశక్తియు నామెయే. స్వర్గమర్త్యపాతాళలోకములు మూడింటియందునుగల సమస్తజీవులకుత్పత్తికారణమామెయే. కాని యాశక్తికి కారణమేదియునులేదు. బ్రహ్మ, విష్ణు, రుద్రాదులును, సూర్యేంద్రాదిదేవతలును, భూమి, పర్వతములును లేని యాదికాలమందు నామెయే పరశివునితో కలిసి నిర్గుణముగనుండెను. అనంతరము సగుణరూపమునుబొంది మూడులోకములను బుట్టించెను. ముందు బ్రహ్మాదులనుసృజించి వారికి తనశక్తులనిచ్చెను. ఆదిశక్తిని తెలిసి సేవించినవారు జన్మసంసారబంధమునుండి విముక్తులగుదురు. ఆశక్తియే వేదములకు కారణముగానుండును. గుణకర్మతారతమ్యముచేత బ్రహ్మాదులామెకనేకనామములుకల్పించిరి. పెక్కుమాటలేల? ఆపరమేశ్వరి అకారముమొదలుకొని క్షకారమువరకుగల అక్షరములచే ననేకనామములతో నున్నదని నారదుడుచె

ష్పగా రాముఁడా మెయొక్క వ్రతమును, విధిని తనకు పూర్ణముగ
జెప్పుమనియు, శ్రీదేవియొక్క పూజవిష్ణుచే శ్రద్ధతో జేసెదనని
యుపలికెను. సముద్రమునస్థలమందు పీఠమేర్పఱ్చి తొమ్మిదిదిన
ములుపవాసములు చేసి శాస్త్రవిధిప్రకారము జగదంబికను పూ
జచేయుము. ఈకర్మమందు దేవకార్యనిర్వాహమ్ముకై నేనాచా
ర్యునిగా నుండెదనని చెప్పిన నారదునివాక్యమును సత్యమని
రాముడు నిశ్చయించి శుభమయినపీఠము నేర్పఱ్చి జగదంబికను
పీఠమందావాహన చేసి శరదృతువునందాశ్వయుజశుక్లపాడ్యమి
మొదలుకొని నవమివరకు తొమ్మిదిదినములయందును ఋష్య
మూకపర్వతముమీద నుపవాసపరుడై జగదంబికయొక్క పూ
జను, హోమమును, బలిదానమును నారదుడు చెప్పినట్లు
తాను తమ్ముడితోఁకూడ భక్తితో విధిప్రకారము పూజించెను.
అష్టమిరోజు మధ్యరాత్రియందు వారిభక్తికిసంతసించిన పరమే
శ్వరి సింహవాహనారూఢయై దర్శనమిచ్చి ఓరామా నీనవరా
త్రివ్రతమునకు సంతోషించితిని. నీవుకోరిన వరము నిచ్చెదను.
విష్ణువగునీవు దేవతలచేత ప్రార్థితుడవై రావణవధకొఱకు రఘు
వంశమునందు దశరథమహారాజునకు పుత్రుడవయితివి. దేవ
తాంశగలవారలు నాశక్తియుక్తులయి నీకు సహాయులు కాగ
లరు. ఇంద్రజిత్తును శేషాంశగల నీతమ్ముడు లక్ష్మణుడు తప్పక
సంహరింపగలడు. వసంతఋతువున నన్నతిశ్రద్ధతో సేవించియు
ద్ధములో పాపాత్ముడైన రావణునిసంహరించి 11 వేల సంవత్సర
ములు భూలోకమునందు రాజ్యము చేసి తిరుగ స్వర్గమునకు రా
గలవని పరమేశ్వరి పలికి యంతర్ధానమాయెను. రాముడుసం
తోషముతో నావ్రతమును సమాప్తముచేసి విజయదశమినం

దనేకదానములుచేసి పరమేశ్వరియొక్క ప్రేరణచేత సుగ్రీవాది వానరులతోను సేతువునుగట్టి రావణునిసంహరించి కీర్తిని, కోరికలను బొందెను. పరమేశ్వరియొక్క నను భక్తిచేత పిన సకలసుఖభోగములను, మోక్షమును దురు. పురాణములనేకములున్నవి. కాని యీభాగవతముతో సమానమయినది లేదని నానమ్మకము. ఇట్లు జనమేజయునితో వ్యాసులు చెప్పిరి.

క్లీంబీజోపాసనచే సుదర్శనమహారాజునకు కలిగిన ఫలము.

దేవీభాగవతము—తృతీయస్కంధము॥ 17వ అధ్యాయము॥

వ్యాసఉవాచ॥ మునిబాలగతఃక్రీడన్నిర్భయః సర్వతః శుభః॥ 33॥ ఏకస్మిన్ సమయేతత్ర విదల్లం సముపాగతం। క్లీబేతి మునిపుత్రస్తమామంత్రయ తదంతికే॥ 34॥ సుదర్శనస్తు తచ్ఛ్రుత్వా దధారైకాక్షరం స్ఫుటం। అనుస్వారయుతం తచ్చ ప్రోవాచాతిపునఃపునః॥ 35॥ బీజంవై కామరాజాఖ్యం గృహీతం మనసాతదా। జజాప బాలకోత్యర్థం ధృత్వా చేతసి సాదరం॥ 36॥ భావియోగాన్మహారాజ కామరాజాఖ్యమద్భుతం। స్వభావేనైవ తేనేత్థం గృహీతం బాలకేనవై॥ 37॥ తదాసౌ పంచమే వర్షే ప్రాప్య మంత్రమనుత్తమం। ఋషిచ్ఛందో విహీనం చ ధ్యానన్యాసవివర్జితం॥ 38॥ ప్రజపన్మనసా నిత్యం క్రీడత్యపి స్వపిత్యపి। విసస్మార నతంమంత్రం జ్ఞాత్వా సారమితి స్వయం॥ 39॥ వర్షేచైకాదశే ప్రాప్తే కుమారోసౌ నృపాత్మజః। మునినాచోపనీతోథ వేదమధ్యాపితస్తథా॥ 40॥ ధనుర్వేదం తథా సాంగం నీతిశాస్త్రం విధానతః। అభ్యస్తా సకలా విద్యా తేన మంత్రబలాద్విభ॥ 41॥ కదాచిత్సోపి ప్రత్యక్షం దేవీరూపం దదర్శహ।

మహీపాలాః కృత్వా కోలాహలం తదా। ఉత్థితాః సైన్యసంయు
క్తా హర్తుకామాః కన్యకాం ॥౧౨॥ కాశీరాజస్తు తాన్దృష్ట్వా
హంతుకామో బభూవహ। నివారిత స్తదాత్యర్థం రాఘవేణ
జిగీషితా ॥౧౩॥ తత్రాపి నేదుః శంఖాశ్చ భేర్యశ్చానకదుందుభిః
సుబాహోశ్చ నృపాణాంచ పరస్పరజిఘాంసతాం ॥౧౪॥ శత్రుజి
త్తు సుసంవృత్తః స్థిత స్తత్ర జఘాంసయా। యుధాజిత్తత్సహా
యార్థం సన్నద్ధః ప్రబభూవహ ॥౧౫॥ కేచిచ్చ కౌతుకా స్తస్య సహా
స్తైః స్థితా స్తదా। యుధాజిదగ్రతో గత్వా సుదర్శనముపస్థితః ॥
౧౬॥ సశత్రుజిత్సేన సహితో హంతుం భ్రాతరమానుజః। పర
స్పరం బాణౌఘైః స్తతక్షుః క్రోధమూర్ఛితాః ॥౧౭॥ సంయుద్ధః సు
మహాం స్తత్ర సంప్రవృత్తః సుమార్గణైః। కాశీపతి స్తదాతూ
ర్ణం సైన్యేన బహునావృతః ॥౧౮॥ సాహాయ్యార్థం జగామాశు
జామాతరమనిందితా। ఏవం ప్రవృత్తే సంగ్రామే దారుణేలో
మహర్షణే ॥౧౯॥ ప్రాదుర్బభూవ సహసా దేవీసింహోపరిస్థితా।
నానాయుధధరారమ్యా వరభూషణభూషితా ॥౨౦॥ దివ్యాంబ
రపరీధానా మందారస్రక్సుసంయుతా। తాందృష్ట్వా తేఽథభూపా
లావిస్మయం పరమంగతాః ॥౨౧॥ కేయం సింహాసనారూఢా
కుతేవేతి సముత్థితా। సుదర్శనస్తు తాం వీక్ష్య సుబాహుమితి
చాబ్రవీత్ ॥౨౨॥ పశ్య రాజన్ మహాదేవీ మాగతాం దివ్యద
ర్శనాం। అనుగ్రహాయ మేనూనం ప్రాదుర్భూతా దయాన్వితా
॥౨౩॥ నిర్భయోహం మహారాజ జాతోస్మి నిర్భయాదపి। సుద
ర్శనః సుబాహుశ్చ తామాలోక్య వరాననాం ॥౨౪॥ ప్రణామం
చక్రతు స్తస్యాముదితౌ దర్శనేనచ। ననాదచ తథాసింహో హ్యా
గజాస్త్రస్తాశ్చ కంపిరే ॥౨౫॥ వవుర్వాతా మహాఘోరా దిశ

శ్చాపసక్ సదారుణాః। సుదర్శనస్తదా ప్రాహ ప్రహస్య సేనాపతిం
ప్రతి ॥౨౬॥ మార్గే వ్రజత్వం తరసా భూపాలా యత్ర సంస్థితాః।
కింకరిష్యంతి రాజానః కుపితా దుష్టచేతసః ॥౨౭॥ శరణం మేంచ
సంప్రాప్తా దేవీ భగవతీ శివా। నిరాతంకైశ్చ గంతవ్యం మా
ర్గేస్మిన్ భూపసంకులే ॥౨౮॥ స్మృతా మయా మహాదేవీ రక్ష
ణార్థముపాగతా। తచ్ఛ్రుత్వా వచనం సేనాపతిస్తేన పథా ప్ర
జత్ ॥౨౯॥ యుధాజిత్తు సుసంక్రుద్ధస్తానువాచ మహీపతీన్।
సంస్థితా భయసంత్రస్తా నిఘ్నంతు కన్యకాహృతం ॥౩౦॥ అహమే
కశ్చ సఃసర్వాన్ బలహీనో బలాధికాన్। కన్యాం గృహీత్వా
సంయాతి నిర్భయస్తరసా శిశుః ॥౩౧॥ కింభీతాః కామినీం పశ్యత
సింహోపరి సుసంస్థితాం। నోపేక్ష్యోహి మహాభాగా హంత
వ్యాస్త్రసమాహితైః ॥౩౨॥ హత్వైనం సంగ్రహీష్యామః కన్యాం
చారువిభూషణాం। నాయం కేసరిణాదత్తాం ఛేత్తుం మృగ్యతి
జంబుకః ॥33 ఇత్యుక్త్వా సైన్యసంయుక్తః శత్రుజిత్సహితస్తదా
యోద్ధుకామః సుసంప్రాప్తో యుధాజిత్క్రోధసంవృతః ॥ ౩౪॥
ముమోచ విశిఖాంస్తూర్ణం సమపుంఖాన్ శిలాశితాన్। ధను
రాకృష్య కర్ణాంతం కర్మారపరిమార్జితాన్ ॥౩౫॥ హంతుకామః
సుమేధాః సుదర్శనరథోపరి। సుదర్శనస్తు తాన్ బాణాంశ్చి
చ్ఛేదాపతతః క్షణాత్ ॥౩౬॥ ఏవం యుద్ధే ప్రవృత్తేథ చకోప చం
డికాభృశం। దుర్గాదేవీ ముమోచాథ బాణాన్ యుధాజితం ప్ర
తి ॥౩౭॥ నానారూపా తదాజాతా నానాశస్త్రధరా శివా। సం
ప్రాప్తా తుములం తత్ర చకార జగదంబికా ॥ ౩౮॥ శత్రుజిన్ని
హతస్తత్ర యుధాజిదపి పార్థివః। పతితౌ తౌ రథాభ్యాంతు
జయశబ్దస్తదాభవత్ ॥౩౯॥ విస్మయం పరమం ప్రాప్తా భూపాః

మును స్వయము నిగ్రహించి అత్యాదరముతో ఋషి ఛందస్సు ధ్యానము న్యాసము మొదలగునవి లేకయే తరచుగను, స్ఫుటముగను, క్రీడయుండను, నిద్రయందునుగూడ నిదేసారమని మెలుకువ మనసా సర్వకాలము జపించుచుండెను. ఆబాలునికి 11వ వత్సరమందు మునులచేత నుపనయనము విద్యాభ్యాసము చేయబడెను. సకలవిద్యలు నామమాత్రబలముచే నతఁడుబొందెను కొంతకాలమునకామమాత్రాధిష్ఠానదేవతయగు బాలాత్రిపురసుందరి రక్తవర్ణముగలదై సర్వాంగభూషణములతో గరుడవాహనారూఢురాలై సుదర్శనునకు తనదివ్యరూపమును కనపర్చి ధనస్సు తీక్ష్ణమయినబాణములు, అంబులపొది, కవచము మొదలగువానినిచ్చెను. అంత సుదర్శనుడు కాశీరాజకుమార్తె శశికలయొక్క స్వయంవరమునకుబోదలచి రథమునుగూర్చుండినపుడితడామంత్రప్రభావమున నక్షౌహిణీసేనతోనున్నటులితరులకు కనపించెను. కనుక నద్భుతచరిత్రగల కామరాజబీజమైన 'క్లీం' కారమును సద్గురువువలనబొంది శుచికలిగి శాంతులై జపించువారికి సమస్తకోరికలు సిద్ధించుననుటకు సందియములేదు. పరమేశ్వరి ప్రపన్నురాలైనప్పుడు భక్తులకు పొందబడని వస్తువేదియను భూలోకమునందుగాని, స్వర్గమందుగాని యుండదు. ఆమెయొక్క జపార్చనాదులయందు విశ్వాసములేని మూఢులు అదృష్టహీనులును, రోగపీడితులు నగుదురు. సర్గాదియందు సకలదేవతలకు తల్లి యామెయే. మాయామోహితులీపరమేశ్వరియొక్క తత్వమును తెలిసికొనలేరు. బ్రహ్మ, విష్ణువు, శివుడు, ఇంద్రుడు, వరుణుడు, యముడు, వాయువు, అగ్నిహోత్రుడు, కుబేరుడు, విశ్వకర్మ, సూర్యుడు, అశ్వినీదేవతలు, ద్వా

దశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, విశ్వేదేవతలు మొదలగువారు సృష్టిస్థితిలయకారిణియగు యాదేవినిధ్యానించు చుండిరి. శశికలాస్వయంవరమునకు అనేకదేశపు మహారాజులు ను, సుదర్శనుడును కాశికివచ్చిరి. శశికల తల్లిదండ్రులెన్ని చెప్పి నను సభాస్థలికిరావనియు, సుదర్శనునికే వివాహముచేయుమని యు చెప్పగా మరునాడు స్వయంవరమని కాశిరాజు చెప్పినందున రాజులందరును తమతమబసలకేగిరి. ఆరాత్రియే సుదర్శనునకు వివాహముచేసిరి. సుదర్శనుడును, భార్యయును భారద్వాజాశ్ర మమునకు పోవుచుండగా తక్కినరాజులందరు తమ్ము వంచించి రనేకోపముతో సుదర్శనుని సంహరించి అతనిభార్యను హరింప వలయునని తమతమసేనలతో అడ్డమువచ్చిరి. వారిలో ముఖ్యు లయిన శత్రుజిత్తును అతనిమాతామహుడును ముందుగా సుద ర్శనునితో యుద్ధము చేయుచు విడిచిన బాణములను సుదర్శనుడు ఖండించెను. ఇతడుచేయుజపము చేత సత్వము భక్తవాత్సల్యము గలపరమేశ్వరి సింహమునందు కూర్చుని అనేకాయుధములను అనేకాలంకారములను ధరించి పీతాంబరధారిణియయి ప్రత్యక్ష మాయెను. వధూవరులిద్దరు నామెకు నమస్కరించిరి. ఆమెవా హనమయిన సింహము చేసిన గొప్పధ్వనిచేత శత్రువుల యేను గులుమొదలగునవి జడిసి వణకుచుండెను. నన్ను రక్షించుటకు పరమేశ్వరివచ్చినది భయములేదు. రథమునడుపుమని సారథితో సుదర్శనుడు చెప్పెను. శత్రుజిత్తుయొక్క మాతామహుడు తక్కి నరాజులతోను, సేనలతోను సింహమందున్న స్త్రీనిచూచి జడి యవద్దని చెప్పి సుదర్శనునిపైని విడిచిన పదునైన బాణములను అతడు ఖండించెను. ఇట్టియుద్ధములో దుర్గాదేవి భక్తునియందు

గలవయు చేత నతికోపముతో ననేకరూపములు ధరించి యుద్ధా జిత్తుమీదను, శత్రుజిత్తుమీదను, వారి సేనమీదను అనేక బాణములనువిడువ వారుమృతులైరి. అప్పుడు పరమేశ్వరిని సుదర్శన మహారాజును అతనిమామగారగు సుబాహుమహారాజును ఇతరులును జయశబ్దములచేత స్తుతించిరి. సుబాహుమహారాజు ప్రార్థింపగా నామెయిచ్చిన వరముచేత తనరాజధానియగు కాశి యందాలయముకట్టించి దుర్గాదేవిని స్థాపించి తానును తనజనులును పూజించుచుండిరి. సుదర్శనమహారాజు కోసలదేశమునకు రాజై తానును తనరాజ్యములోనివారును దేవ్యాలయములు కట్టించి పరమేశ్వరినిపూజించుచుండిరని జనమేజయునితో వ్యాసులు చెప్పిరి.

III భాగము— స్వల్పభక్తివిషయము.

ల॥ స॥ 353

శక్తిరహస్యము— అక్రమేణార్థభక్త్యావా భవాన్యాః కృతమర్చనం। జన్మాంతరే క్రమప్రాప్త్యై పూర్ణభక్త్యైవ కల్ప్యతే ఇతి।

తా॥ పరమేశ్వరియొక్క ఆరాధన క్రమహీనముగగాని, స్వల్పభక్తిచేతగాని చేసినను అందువల్లను జన్మాంతరమునందు క్రమమగు ఆరాధనయు పూర్ణభక్తియు కలుగును.

ల॥ స॥ 869 క్షిప్రప్రసాదినీ

భా॥ వ్యా॥ క్షిప్రం స్వల్పదినైరేవ ప్రసీదతి—

I శివపురాణము— అల్పశ్రావ్యాపి మహామత్యాః పాతి జన్మత్రయాత్పరం। నయోనియంత్రపీడాయై భవిష్యతి నసంశయ ఇతి।

II సౌరపురాణము— క్రమేణ లభ్యతే స్వేషాం ముక్తిరారాధనాద్ద్విజాః। ఆరాధనాదుమేశస్య తస్మిన్ జన్మని ముచ్యతే ఇతి। ఇదంతు తీవ్రతరభక్తిమత్పురుషవిషయపరం॥

III తంత్రరాజము— అన్యథా సంప్రదాయేన జపహోమార్చనాదికం। కృతం జన్మాంతరే సమ్యక్సంప్రదాయాయ కల్పత ఇతి॥

తా॥ I ఈశ్వరునియందు భక్తి అల్పమైనను మూడు జన్మములకు పైని తిరిగి జన్మింపడు. సంశయము లేదు.

II ఇతరదేవతల నారాధించుటచేత కొన్ని జన్మములకుగాని ముక్తి కలుగదు. ఈశ్వరారాధనచేత నాజన్మమునందే ముక్తి గలుగును. ఈముక్తి తీవ్రతరభక్తిగలపురుషశ్రేష్ఠులకులభ్యము.

III క్రమముకాని సంప్రదాయముచేత జపహోమార్చనాదులు చేసినను, జన్మాంతరమునందు క్రమమగు సంప్రదాయము సిద్ధించును.

# అయిదవ ప్రకరణము

## దీక్షాఫలకథనము.

అ॥ సమస్తమంత్రములకును దీక్ష ముఖ్యమనియు, దీక్ష లేకుండ చేసిన జపము ఫలింపదనియు, శ్రుతిస్మృతిపురాణాదులు చెప్పుచున్నవి.

త్రిశతి 207 హ్రీంకారభాస్కరరుచయే నమః॥

శం॥ వ్యా॥ గురుకృపాపాంగావలోకనరూపదీక్షావశేన ప్రతి

జంఘోరదురితాపగమే పరదేవతారూపం హ్రీంకారః పురశ్చర్య యా సాక్షాద్ధ్యానాద్ధా పరోక్షజ్ఞానహేతుర్భవతి ॥

తా॥ దీక్ష చేత పాపములు నశింపగా స్వమంత్రపురశ్చరణము చే సుప్రీతమైన హ్రీంకారరూపయగు పరదేవత భక్తులకు అపరోక్షజ్ఞానమును గలిగించును.

అ॥ సమస్తమంత్రములకు దీక్ష ఆవశ్యకము॥

కులార్ణవము 14 ఉల్లాసము॥

అదీక్షితాయే కుర్వంతి జపపూజాదికాక్రియాః। నఫలంతి ప్రియే తేషాం శిలాయాముప్తబీజవత్ ॥ దేవిదీక్షావిహీనస్య నసిద్ధిర్నచ సద్గతిః। తస్మాత్సర్వప్రయత్నేన గురుణా దీక్షితో భవేత్ ॥

తా॥ ఓపార్వతీ దీక్ష లేకుండ చేసిన జపపూజాది క్రియలు "రాతియందు విత్తిన బీజమువలె" ఫలింపదు. దేవీదీక్ష లేనివానికి మంత్రసిద్ధిలేదు. సద్గతియును లేదు. కనుక సర్వయత్నముల చేత గురువునుండి దీక్షితుడు కావలయును.

దీక్షాస్వరూపము॥

రూ॥ సం॥ య॥ వై॥ ఖం॥ 34 అ॥

*** విలిఖ్య మండలం సాక్షాద్గురూక్తేనైవ వర్త్మనా। ఏవం మంత్రేణ సంపూజ్య కుసుమైః చందనాదిభిః। పారంపర్యక్రమంబుధ్వా సంచింత్య శ్రద్ధయాసహ। స్థాపయిత్వా గురుశ్శిష్యం మండలస్యతుమధ్యమే ॥ కృతాంజలిపుటంపూర్ణప్రకాశనిజాత్మకే। శివానందే సమాసీనమేవం భావనయాయుతం ॥ దేశికస్స్వాత్మనాత్మానమవలోక్య సునిశ్చలః। శిష్యం చాత్మతయాసాక్షాద్దృఢం సంచిత్య సాక్షిణః॥ స్వాత్మనో న్యతయా

ధ్యాత్వాతం స్వాత్మమాత్రతయాస్వరూపం । చింతయేన్నిశ్చలో వం
త్రిం జపిత్వా పూర్వమేవతు । గ్రంథిచ్ఛేదం పునః కుర్యాన్మాయా
శక్త్యైవ వర్త్మనా । కృతే తు శక్త్యైవ మాచార్యేణ ద్విజో
త్తమః । మహాదేవో మహానందో మహాకారుణికోత్తమః ॥
స్వాత్మభూతాం పరాంశక్తిం ప్రేరయత్యేవ సువ్రతాః ॥ ఇత్యాది ॥

తా ॥ గురుపరంపరాక్రమము చేత మండలమును లిఖించి పుష్పచందనాదులచేత మూలమంత్రముతో పూజించి పారంపర్యక్రమముగా శ్రద్ధతో మండలమధ్యమునందు శిష్యునికూర్చుండబెట్టి పూర్ణమగు ప్రకాశానందస్వరూపమును భావనచేయుచు, ఆచార్యుడు లోకదృష్టిని తనకంటె వేరుగాభాసించుచున్న శిష్యునిస్వాత్మరూపముగా నాలోచించి నిశ్చలుడై ముందుగా మంత్రమును జపించి గురుపరంపరాక్రమముచేత మరల శిష్యునియొక్క బ్రహ్మ, విష్ణు, రుద్ర, గ్రంథులను భావనామూలమున ఛేదింపవలెను. ఆచార్యునిచేత నిట్లు చేయబడగా ఆనందస్వరూపుడగు మహాదేవుడు దయతో ఆత్మస్వరూపమగు పరాశక్తిని ప్రేరణచేయును.

అ ॥ అంతరదీక్ష బహిర్దీక్ష యను రెండువిధములనియు, బహిర్దీక్ష దక్షవామ మార్గములచే రెండువిధములనియు, అంతరదీక్ష యుత్కృష్టమనియు చెప్పబడుచున్నది.

ద ॥ సం ॥ 12 అ ॥ ఈశ్వర ఉవాచ । సర్వజ్ఞాపి మహేశాని శంభితస్యాగమోద్భవం । ప్రకాశయామి [illegible] సావధానమనాశ్శృణు ॥ ౧ ॥ బాహ్యాంతర్భేదతో దీక్షాద్వైవిధ్యముచ్యతే । బాహ్యద్రవ్యప్రయుక్తాతు బహిర్దీక్షా ఇతి స్మృతా ॥ ౨ ॥ అంతరైరాంతరాఖ్యాతా దుర్లభా బాహ్యయోగినాం ।

బహిర్ద్వారాపి చేదేవి భిద్యతే క్రమయోగతః ॥ ౧౦ ॥ సద్యస్సనిష్ఠ
యోగేన చిత్తాదాత్మ్యఫలార్థినా । శ్రుతిస్మృత్యుదితో మార్గః
కేవలస్సన్న్యుచ్యతే ॥ ౧౧ ॥ సంహితాతంత్రబాహ్యేషు సర్వశాస్త్రాగ
మేష్వపి । ఉపదిష్టోహి యోమార్గ స్సోపసవ్య ఉదీరితః ॥ ౧౨ ॥
దక్షవామాత్మనామార్గౌ ఖ్యాతౌ ద్వౌ మంత్రసిద్ధిదౌ । తథా
పశ్వాత్మా బాహ్యతా బాహ్యద్రవ్యవద్యోగవాన్ ॥ ౧౩ ॥ అంతరః
పరమోమార్గో మానసద్రవ్యసంభవః । యత్రాధికారీ పూర్వ
స్మిన్ సంస్థితిం సముపాశ్రయేత్ । పాపీయాన్ జాయతే బాహ్య
ద్రవ్యస్యోపాలంభాత్ । అంతరేపరమే మార్గే స్థితః కశ్చి
చంచలః ॥ ౧౪ ॥ సంస్థితిం బ్రాహ్మపరమాం దుర్లభామపి గచ్ఛతి ।
మార్గాయాణాం బాహ్యానామాసా మందప్రజ్ఞస్సమాశ్రయేత్ ॥
౧౫ ॥ భావనా పరమోయోగీ సిద్ధః పూర్వోక్తసంశ్రయాత్ ।
శ్రేయోద్యాహ్యాంతరం మార్గం దీక్షాసందగ్ధకల్మషః ॥ వామోప
సవ్యదక్షిణేభ్యో మార్గో౽తిష్ఠ ఉచ్యతే । అపసవ్యంతు తత్రోప
క్తం మద్యం మాంసంచ మైథునం ॥ ౧౬ ॥ ఏతదభ్యర్చనపరం
వామాచారం జగుర్బుధాః । విలక్షణోపసనితత్వాద్వాహ్యామిత్యా
హురాగమాః ॥ ౧౭ ॥ తథాపి రాజ్యసుఖాని సర్వాణిత్యాగాత్తై
శివ । గీతాని శంభునా పూర్వం ఏతదభ్యర్చనక్రియాః ॥ ౧౮ ॥ ***
సర్వేషామపి మంత్రాణాం దీక్షామాదౌ ప్రయోజయేత్ ।
అదీక్షితస్య జననం వృథేత్యాహుర్మనీషిణః ॥ జన్మైవ దీక్షిత
స్యోక్తమతుపస్థనాస్పదం । తస్మాత్సకలమంత్రాదౌ దీక్షయా
దీక్షితోభవేత్ ॥ తత్రాపి విద్యా సామ్రాజ్ఞీ తేనయస్యావర
౧౯ ॥ అశ్వ
వాజిమేధాఘటితాయాం దీక్షితోనరః । యస్మిద్విద్యాగతసం

ధానదీక్షయా విముక్తో భవేత్ ॥ దీక్షితో రాజసూయే వా వాజపేయమహాతిరాత్రయోః । పౌండరీకద్వాదశాహ విశ్వజిత్స్వపి దీక్షితః ॥ అదీక్షితో బ్రహ్మవిద్యా దీక్షాయాం సనదీక్షితః । అదీక్షితోశ్వమేధాదౌ వాజపేయాదికేషు చ ॥ దీక్షితశ్చేద్బ్రహ్మవిద్యా దీక్షాయాం సహి దీక్షితః । అదీక్షితస్య విద్యాయాం వృథా జన్మ కులం వయః ॥ అదీక్షితస్య విద్యాయాం వృథాదార సుహృత్సుతాః । దీక్షితో నివసేద్యత్ర వింధ్యదేశేపి కీటకే ॥ తం దేశం దేవతాక్షేత్రం ముక్తిదం ప్రాహురాగమాః । ఆచార్యానుగ్రహాద్దేవి దీక్షాం లబ్ధ్వా శివో భవేత్ ॥ ౫౧ ॥ తస్మాచ్ఛివత్వసంసిద్ధిదీక్షాం ప్రాప్య సుఖీ భవేత్ ॥ ఇతి ॥

తా॥ శివాద్వైత సమస్తాగమములవలన బుట్టిన గుహ్యమగు జ్ఞానము వినుము. దీక్ష రెండువిధములు. బాహ్యద్రవ్యములతో కూడినది బాహ్యదీక్ష. అంతఃకల్పితద్రవ్యములతో కూడినది అంతరదీక్ష. అంతరదీక్ష బాహ్యయోగులకు దుర్లభము. జ్ఞానయోగులకు సులభము. సవ్యమని అపసవ్యమని బహిర్దీక్ష రెండువిధములు. శ్రుతిస్మృతులలో చెప్పిన మార్గము కేవలముసవ్యమనియు, సంహితలయందును, తంత్ర, పురాణ, ఆగమములయందును చెప్పిన మార్గము అపసవ్యమనియు చెప్పబడును. మంత్రసిద్ధికి దక్షవామమార్గములు రెండును సమర్థములు. ఇవి బాహ్యద్రవ్యములచే చేయబడును. మనఃకల్పితద్రవ్యములవలన నాచరింపబడు అంతరమార్గము శ్రేయము. ముందు చెప్పిన బాహ్యమార్గములలో దేనియందున్నవాడైనను ముక్తినిబొందలేక మరలజన్మమును బొందును. కనుక ఉత్కృష్టమయిన యోగాంతర మార్గమందు చలనములేనివాడై దుర్లభము, ఉత్కృష్టమునగు

దినయొక్క శిష్యులుగాగలవారు తమకు శివదీక్షాధికారము సంపాదించు టకై దీక్షనుబొంది ముఖ్యులుకావలయును.

అ॥ దీక్ష మూడువిధములనియు, దీక్షకు మూడుకాలములనియు చెప్పబడుచున్నది.

డా॥ సం॥ 68 అ॥ పరమాత్మా పరానందః సర్వజ్ఞః పరమే శ్వరః। యస్య పంచముఖేభ్యశ్చ పంచామ్నాయావినిర్గతాః॥ పూర్వశ్చ పశ్చిమశ్చైవ దక్షిణశ్చోత్తర స్తథా। ఊర్ధ్వామ్నా యశ్చ పంచైతే మోక్షహేతవఈరితాః॥ పూర్వామ్నాయ స్తథార్గ్వేదో యజుర్వేదస్తు దక్షిణః। పశ్చిమస్సామవేదశ్చ స్యాదథర్వణఉత్తరః॥ సర్వోపనిషదాంజాలమూర్ధ్వామ్నాయః ప్రకీర్తితః॥ ఇత్యాది॥ పరంతు॥ అవశ్యం దీక్షితోభూత్వా పాప చార్యాజ్ఞాపురస్సరం। శ్రీవిద్యాం ప్రజపేద్ధీమాన్ బ్రహ్మానంద రసాప్తయే। దీక్షాస్త్రిస్రః సమాఖ్యాతాః సర్వపాపవినాశనాః ఆద్యా పాశుపతీ దీక్షా శైష్ణవీచ తతఃపరం। అపరా త్రైపురీ దీక్షా మహాసిద్ధికరీస్మృతా॥ ఏకత్ర దీక్షితోవాపి శుచిర్భవతి సంతతం॥ దీక్షాద్వితయసంయుక్తో భవేద్బ్రహ్మ సభాపతిః। దీక్షాత్రితయసంయుక్తో త్రిమూర్తిర్భవితాశివః॥ ఏకత్ర దీక్షి తోవాపి సమస్తాఘవివర్జితః। జప్తుం సకలవిద్యానా మధికారీ భవేచ్ఛుచిః॥***॥ అనేన దీక్షావిధినా దీక్షితోయోభవేద్భువి అశ్వమేధసహస్రేషు దీక్షితస్సభవేన్నరః॥ త్రిధా దీక్షేయమా ఖ్యాతా హ్యుత్తమా మధ్యమా ధమా। చూడామణౌ మహా యోగే నవరాత్రివ్రతేశివే॥ ఉత్తమాసా సమాఖ్యాతా దీక్షా సంపూర్ణదక్షిణా। అర్ధోదయాదౌ యా దీక్షా మధ్యమా సా ప్రకీర్తితా। శుభమాసే శుభదినే దీక్షాస్యా దధమా శివే॥

ఆచార్యానుగ్రహాద్దిష్టం దీక్షితస్సాధకోత్తమః ॥ అవశ్యం మహా
లింసిద్ధిం ప్రాప్నోత్యత్ర సంశయః ॥ ప్రజపేన్మహాలిం విద్యాం
న్యాసధ్యానాదిపూర్వకం ॥ ఇ ॥

తా॥ పరమాత్మను, పరానందుడును, సర్వజ్ఞుడు నగు పరమేశ్వరునయిదుముఖములవలన పూర్వము, పశ్చిమము దక్షిణము ఉత్తరము, ఊర్ధ్వము ననెడి అయిదామ్నాయములు పుట్టెను. అవి మోక్షకారణములు. పూర్వామ్నాయము ఋగ్వేదమనియు, దక్షిణామ్నాయము యజుర్వేదమనియు, పశ్చిమామ్నాయము సామవేదమనియు, ఉత్తరామ్నాయము అథర్వణవేదమనియు, ఊర్ధ్వామ్నాయము ఉపనిషత్తులకెల్ల సమూహమనియు చెప్పబడుచున్నది. ఋషిమంతుడు బ్రహ్మానందప్రాప్తికొరకు గుర్వాజ్ఞానుసారముగ దీక్షను ముఖ్యముగబొంది శ్రీవిద్యను విశేషముగా జపము చేయవలెను. సర్వపాపహరములగు దీక్షలుమూడు. వానిలో మొదటిది పాశుపతదీక్ష. రెండవది వైష్ణవదీక్ష. మూడవది మహాసిద్ధులనిచ్చు త్రిపురసుందరీదీక్ష ఒకదీక్షగలవాడయినను సర్వదా శుచిమంతుడగును రెండుదీక్షలుగలవాడు బ్రహ్మసభకధిపతియగును. మూడుదీక్షలుగలవాడు బ్రహ్మ, విష్ణు, రుద్రరూపమయిన పరమేశ్వరుడు కాగలడు. ఏకదీక్షగలవాడైనను అన్నిపాపములు నశించుటవలన శుచియయిఅన్నివిద్యలను జపముచేయుటకర్హుడగును. ఇట్లు విధిచేత దీక్షితుడగువాడు సహస్రాశ్వమేధములదీక్షగలవాడగును. దీక్ష ఉత్తమము మధ్యమము, అధమమని మూడువిధములుగనున్నది ఓపార్వతీ చూడామణిమహాయోగకాలమునందును, నవరాత్రివ్రతమునందును చేసినదీక్ష సంపూర్ణదక్షిణతోగూడిన ఉత్త

మదీక్షయనియు, అర్ధోదయాకాలయందు చేసిన దీక్ష మహోదయ దీక్షయనియు, శుభమాసమున శుభదినమునందు చేసినదీక్ష అనఘదీక్షయనియు చెప్పబడెను. సాధకోత్తముడగు శిష్యుడు ఈ ప్రకారము గుర్వనుగ్రహము వలన దీక్షనుపొంది గోప్యసిద్ధిని త్వరగ పొందగలడు. ఈయుత్కృష్టవిద్యను న్యాసములతోను, ధ్యానాదులతోను జపింపవలెను.

లలి॥ స॥ 122 శాంభవీ యను నామభాష్యమునందు కల్పసూత్రము—దీక్షాస్తిస్రః శాక్తీ శాంభవీ మాంత్రీ చేతి

తా॥ శాక్తదీక్ష, శాంభవదీక్ష, మాంత్రిదీక్ష యని మూడు విధములు.

పరశురామకృత—కల్పసూత్రమునందు॥

«తత్ర సర్వథా మతిమాన్ దీక్షేత» 31 సూత్రము॥

వ్యా॥ శ్రీవిద్యోపాసనాఽవ్యవహిత పూర్వవృత్తి దీక్షయాత్మానం భావయేదితి॥ సర్వథా అవశ్యం మతిమాన్ ప్రాగుక్తభూమికారూఢః ఏతత్పదస్వారస్యాదేవాయమధికారీ విశ్వరపి తాదృశభూమికారూఢస్యైవాధికారో నాన్యస్యేతి సిద్ధః॥ *** దీక్షిత ఉపాసీతేతి ఉపాసనాధికారి స్వావశ్యకత్వాత్। తస్యాం దీక్షాయాః ఫలం కిమితి చేదుచ్యతే। అనంతకోటిజన్మసంచితం పాపరూపం మలం తన్నాశః। తదుక్తం। నిశాటనామవ్యాఖ్యానే తంత్రాలోకే॥ «దీక్షయా గళితేప్యంతరజ్ఞానే పౌరుషాత్మని ధీగస్యానివృత్తత్వాద్వికల్పోపిహి సంభవేత్। దేహాంతఏవ మోక్షస్యాత్పౌరుషజ్ఞానహానితః। బౌద్ధజ్ఞాననివృత్తౌతు వికల్పోన్మూలనాద్ధ్రువం। తత్రైవ మోక్ష ఇత్యుక్తం ధాత్రా శ్రీమన్నిశాటనే॥ అస్యార్థః॥ పౌరుషం బౌద్ధంచేతి ద్వివిధం జ్ఞానం।

తత్ర పౌరుషం జ్ఞానం స్వస్వరూపాత్మకం బౌద్ధంచ యన్మ
హావాక్యజన్యం చరమవృత్తిరూపం తద్విజ్ఞాన మిత్యుచ్యతే।
ఏతదావరణరూపం అజ్ఞానమపి ద్వివిధం। పౌరుషం పురు
షనిష్ఠపాతకం, బౌద్ధం భేదబుద్ధిః, తత్ర దీక్షయా పౌరుషాజ్ఞాన
నాశేపి బౌద్ధమలస్య శాస్త్రజ్ఞానేనైవ నాశ్యత్వాత్। దీక్షా
నంతరమాగమసిద్ధాంతజ్ఞానసంపాదనే తదైవ మోక్షః। యది
శాస్త్రజ్ఞానం నసంపాదితం। కేవలదీక్షైవ జ్ఞాతా। తస్య దేహాం
తేముక్తిరితి॥ నచ బౌద్ధమలసత్త్వే కథం దేహాంతేవా ముక్తిరితి
శంకనీయం। త్రిపురారహస్యే॥ " దీక్షావంతస్తు దేహాంతే పారి
వ్యలోకం పరాత్పరం। సదాశివేన తేసమ్యక్ ప్రబుద్ధాశ్శివరూ
పిణః॥" ఇతి। తాదృశశంకాయా నిరస్తత్వాత్॥ ఏవం శ్రౌతా
గ్నిష్టోమాది దీక్షావాదేపి పాప్మనోపహతిరితి శ్రూయతే। ఏవం
పూర్వమీమాంసాయామపి దీక్షాయాః యాగజన్యాఽపూర్వో
త్పత్తౌ సన్యాద్యుత్పత్తౌ కర్మణామివ స్థలస్యాత్మనః శోధకమిత్యేవ
సిద్ధాంతితం। బ్రహ్మోత్తరఖండే॥ ప్రథమాధ్యాయే॥ రాజ్ఞః
పంచాక్షరమంత్రస్య కర్ణప్రవేశమాత్రేణ తచ్ఛరీరాపసృతాః
కాకాః నిర్గతా ఇతి లింగంచ। ఏవం పరమానందతంత్రే। దీక్షా
నామనిరుక్తౌ॥ దీయతే శివసాయుజ్యం క్షీయతే పాశబంధనం।
అతో దీక్షేతి కథితేతి చ। నిత్యోత్సవనిబంధే। శ్రేయస్కా
మోహమముకవిద్యాగ్రహణార్థమముకగురోర్దీక్షాం గృహీష్యా
మీతి తదత్యంతానవధానలిఖితం। ఇత్యాది॥ తద్భాష్యే విశే
షః ద్రష్టవ్యః॥

టీ॥ శ్రీవిద్యోపాసనపూర్వము వ్యవధిలేకుండ పొందిన
దీక్షచేత కోరినఫలమును బొందును. త్రిపురసుందరియొక్క భా

ము చెప్పబడెను. నిత్యోత్సవనిబంధనమునందు శ్రేయస్సునకో రకు నేను ఆము: విద్యను గ్రహించుటకొరకు గురువువలన దీక్షను గ్రహించుచున్నానని చెప్పబడెను.

దీక్షాకాలనిర్ణయము.

వైశాఖే శ్రావణేవాపి ఆశ్వినే కార్తికే తథా। ఫాల్గునే మార్గశీర్షేవా కుర్యాన్మంత్రస్య దీక్షణం ॥ ఇతి సిద్ధాంతశేఖరే॥

తా॥ వైశాఖ, శ్రావణాశ్వయుజ, కార్తిక, ఫాల్గుణ, మార్గశిరమాసములయందు మంత్రముయొక్క దీక్షను చేయవలయును.

శరత్కాలేచ వైశాఖే దీక్షా శ్రేష్ఠఫలప్రదా। ఫాల్గునేమార్గశీర్షేచ జ్యేష్ఠే దీక్షాతు మధ్యమా ॥ ఆషాఢే శ్రావణే మాఘే కనిష్ఠా సత్ఫరాప్యతా। నిందితాశ్చాపి మాసాస్యు పౌషోభాద్రపదస్తథా॥ నిందితేష్వపి మాసేషు దీక్షోక్తా గ్రహణే శుభా। ఇతి మాసనిర్ణయః॥

తా॥ ఆశ్వయుజ, కార్తిక, వైశాఖమాసములయందుచే యుదీక్ష శ్రేష్ఠఫలమునిచ్చును. ఫాల్గున, మార్గశిర, జ్యేష్ఠమాసములయందు చేయుదీక్ష మధ్యమము, ఆషాఢ, శ్రావణ, మాఘమాసములయందు కనిష్ఠము అని చెప్పబడెను. పౌష, భాద్రపదమాసములు కేవలనిందితములు. అనిందితమాసములయందైనను సూర్యచంద్రగ్రహణములయందు పొందినదీక్ష శుభమునిచ్చును.

తిథులు.

పూర్ణిమా పంచమీచైవ ద్వితీయా సప్తమీ తథా। త్రయోదశీచ దశమీ ప్రశస్తా సర్వకర్మదాః॥ ద్వితీయాపంచమీచాపి షష్ఠీచాపి విశేషతః। ద్వాదశ్యామపి కర్తవ్యం త్రిసో

దశ్యా మథాపివా॥ శుక్లేచిన్మిపిద్ధశ్వం। వష్టీత్రయోదశోర్మధ్యమాత్వా॥

తా॥ పూర్ణిమ, పంచమి, ద్వితీయ, సప్తమి, త్రయోదశి, దశమి యను తిథులు ప్రశస్తము. ద్వితీయ, పంచమి, షష్ఠి, ద్వాదశి, త్రయోదశి తిథులయందు విశేషముగలదు. ఒకానొకస్థలమునందు షష్ఠి, త్రియోదశితిథులు మధ్యమమని చెప్పబడినది.

షష్ఠీ భాద్రపదేమాసి ఇషే. కృష్ణత్రియోదశీ। కార్తికేనవమీశుక్లా శ్రావణే కృష్ణపంచమీ॥ ఏతాని దేవపర్వాణితీర్థకోటిఫలానచ। కృష్ణాష్టమ్యాం చతుర్దశ్యాం పంచపర్వదినే తథా। గ్రహణాదౌ వ్యతీపాతే పరివేషేంమసూర్యయోః। సవారమాసదోషోస్తి గ్రహణె సూర్యచంద్రయోః। గ్రహణె దేవదవేరి కాలస్సప్తదివానథిః॥ ఇతి॥

తా॥ భాద్రపదశుక్లషష్ఠి, ఆశ్వయుజబహుళ త్రియోదశి, కార్తికశుక్లనవమి, శ్రావణబహుళపంచమి యనునవి దేవపర్వములు. కోటితీర్థఫలము నిచ్చునవి. అట్లు కృష్ణాష్టమి. కృష్ణచతుర్దశి, పంచపర్వదినములు, గ్రహణములు, వ్యతీపాతము, సూర్యచంద్రులపరివేషములు ఫలప్రదములు. సూర్యచంద్రులగ్రహణములయందేడు దినములవరకును వార మాసదోషములు లేవు.

నక్షత్రములు.

అశ్విసీ, రోహిణీ, స్వాతీ, విశాఖా, హస్తభేషుచ। జ్యేష్ఠోత్తరాత్రియేష్వేవ కుర్యాన్మంత్రాభిషేచనం। శ్రవణార్ద్రాధనిష్టాచ పుష్యః శతభిషస్తథా। దీక్షానక్షత్రిజాతాని హ్యేషామంత్రార్థకోవిదాః. ఇతి॥

తా॥ అశ్విని, రోహిణి, స్వాతి, విశాఖ, హస్త, జ్యేష్ఠ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈనక్షత్రములయందు దీక్ష చేయవలయును. శ్రవణము, ఆర్ద్ర, ధనిష్ఠ, పుష్యమి, శతభిష నక్షత్రములయందలి దీక్ష జన్మనక్షత్రమైనను మంచిదని తంత్రవేత్తలు చెప్పిరి.

వారములు.

రవౌ గురౌ విధౌ దీక్షా కర్తవ్యా బుధశుక్రయోః । మంత్రారంభే రవౌ శుక్రే బుధే జీవే విశేషతః । శనౌ మృత్యుః క్షయం భౌమే సోమే సర్వంచ నిష్ఫలం ॥ ఇతివచనాత్సోమస్య మధ్యమత్వం ॥

తా॥ ఆదివారమందును, గురు, బుధ, శుక్రవారములయందును దీక్ష చేయవలెను. ఆది, శుక్ర, బుధ, గురు వారములయందు మంత్రారంభము మంచిది. శనివారమందు మృత్యువు మంగళవారమందు క్షయము, సోమవారమందు సర్వమునిష్ఫలమనియు చెప్పబడెను.

ఇతరపర్వములు.

గురుశుక్రోదయే శుద్ధే లగ్నే సద్వారశోభితే । చంద్రతారానుకూల్యేచ గ్రహణే చంద్రసూర్యయోః । దీక్షావిధేయా మంత్రజ్ఞైః పురుషార్థప్రసిద్ధయే । నమాసతిథివారాది శోధనం సూర్యపర్వణి । దదాతీష్టంచ కృష్ణాయాం త్తస్మిన్ కాలే గురోర్నరః సిద్ధిర్భవతి మంత్రస్య వినాభ్యాసేన కేవలం । ప్రబుద్ధే బలసంయుక్తే శుక్రే దేవగురౌ తథా । శుక్లపక్షేచ కృష్ణేవా దీక్షా సర్వశుభావహా ॥ కాలోత్తరే॥ ముక్తికామైః కృష్ణపక్షే భూతికామైస్సితేసదా ॥ ఇతి ॥ సూతసంహితాయాం ॥ మేషకర్కట

కన్యాసు తులాయాం వృశ్చికే తథా । కుంభేచ మకరే చైవ దీక్షా సర్వశుభావహా ॥ రుద్రయామళే॥ సతీర్థే౽ర్కే విధుగ్రాసే (చమఇతి) సుదమనపర్వణి । మంత్రదీక్షాం ప్రకుర్వాణో మాసర్క్షాదీన్నశోధయేత్ । చైత్రే దమనకీం పూజాం కృత్వా దీక్షాం సమాచరేత్ । అష్టమీ ద్వాదశీ భూతా చతుర్థీ రవిసప్తమీ । శ్రావణే తంతుపూజాయాం కృత్వా సంస్కారమాచరేత్ ॥ ఇత్యాగమేచ ॥ సతీర్థేర్కవిధుగ్రాసే పుణ్యారణ్యే వనేషుచ । పుణ్యక్షేత్రే కురుక్షేత్రే దేవీపీఠ చతుష్టయే । ప్రయాగే శ్రీగిరా కాశ్యాం కాలాకాలౌ నశోధయేత్ ॥

తా॥ గురు, శుక్రులయుదయమందును, తారాబలచంద్రబలములుగల శుద్ధమగులగ్నమందును, చంద్రసూర్యులగ్రహణములయందును, చతుర్విధపురుషార్థసిద్ధికొరకు మంత్రవేత్తలు దీక్షనాచరింపదగును. సూర్యపర్వమునందు మాస, తిథి, వారశోధనమనవసరము. అట్టికాలమందు కోరికగలమంత్రిముగ్రహింపవచ్చును. అట్టిమంత్రము పురశ్చరణలేకయె సిద్ధించును. గురుశుక్రులు బలసంయుక్తులయియుండగా శుక్లకృష్ణపక్షములలో దేనియందైనను దీక్ష సర్వశుభములనిచ్చును. ముక్తినికోరినవారు కృష్ణపక్షమందును, భుక్తిని కోరినవారు శుక్లపక్షమునందును దీక్షను పొందవలయును.

తత్వసారసంహితాయాం ॥ తిథింవినాపి దీక్షాయాం విశిష్టావసరం శ్రుణు । దుర్లభే సద్గురూణాంచ సకృత్సంగఉపస్థితే; తదనుజ్ఞా యథాలబ్ధా సదీక్షావసరో మహాన్ । గ్రామేవాయదివారణ్యే క్షేత్రేవా యదివా నిశి । ఆగచ్ఛతి గురుర్దైవాత్ యుదాదీక్షా తదా భవేత్ ॥ ఇతి ॥

తా॥ గ్రహవిషయము యిచ్చు చెప్పబడిన తిథి కాకున్నను విశేష కాలము విరుము. సద్గురువులయొక్క సమూవేశము దొరకుట దుర్లభము. అదిదొరికి వారనుజ్ఞ యిచ్చినయెడల నట్టిసమయమే మంచిది. గ్రామమందుగాని, అరణ్యమందుగాని, క్షేత్రమందుగాని, రాత్రియందుగాని, దైవవశము వలన గురువువచ్చిన కాలమందే దీక్షను పొందవలయును.

ముముక్షుంప్రతి నకాలనియమః॥ నిందాన్యపిచ పర్వాణి ప్రశస్తాని విముక్తయే॥ వైశంపాయనసంహిత॥ సంధ్యాగర్జిత నిర్ఘోష భూకంపోల్కానిపాతనే। ఏతానన్యాంశ్చ దివసాన్ స్మృత్యుక్తాంశ్చ పరిత్యజేత్॥ ఇతి కామివిషయః॥ తదేవలగ్న మితి సామాన్యదీక్షా కాలః॥

తా॥ ముక్తినికోరినవారిని గురించి కాలనియమము లేదు. నిషిద్ధమయిన పర్వములును మోక్షమునకు శ్రేష్ఠమయినవే.

సంధ్యాకాలమందును, గాలివాన, భూకంపము, కొరువులు పడుట లీనిచేతోసూచించినకాలమందును, స్మృతులలో కూడదని చెప్పిన అన్యదివసములయందును దీక్ష చేయకూడదని చెప్పినని షేధము కామివిషయములో వర్ణించును. సంకల్పముకలిగినసమయమందే లగ్నమని సామాన్యదీక్షా కాలము చెప్పబడినది.

గరుడపురాణము॥ 13 అధ్యాయము॥

వ్రతినో మంత్రపూతస్య సాగ్నికస్య ద్విజస్యచ। బ్రహ్మనిష్ఠస్య యతినో సహి రాజ్ఞాం చ సూతకం॥

వ్యా॥ వ్రతినః బ్రహ్మచారిణః తేన గురుశుశ్రూషా నత్యాజ్యా ఇతి। యద్వా చాంద్రాయణాది మహావ్రతయుక్తస్య తేనాపి వ్రతభంగో నకర్తవ్యశ్చేతి భావః। మంత్రపూతస్య

మహామంత్రజపైః సదాపవిత్రస్య జపత్యాగో నోచితఇతి। సాగ్నికస్య హవనస్యావశ్యకత్వాత్। బ్రహ్మనిష్ఠస్య గృహస్థస్యాపి తస్యాతివర్ణాశ్రమిత్వాద్వర్ణాశ్రమోచితం సూతకం నాస్త్యేవ। జన్మమరణయోరవాస్తవత్వాచ్చేతి। యతినః సంన్యాసినః తస్యాపి లోకేషణాయాప్యత్యక్తత్వాత్। రాజ్ఞాం మూర్ధాభిషిక్తానాం దానం గ్రాహ్యమేవేతి భావః॥ 23 ॥

తా॥ వ్రతముగలవానికిని, మహామంత్రజపముచేయువానికిని నిత్యాగ్నిహోత్రునకును, బ్రహ్మనిష్ఠగలవానికిని, యతికిని, చక్రవర్తికిని ఆశౌచములేదు. ఏమనగా, వీరిజ్ఞాతులకు ఆశౌచమువచ్చినప్పటికి నియతమైన బ్రహ్మచర్యవ్రతముగలవాడుగురుశుశ్రూషను మానరాదు. లేకనియతముగ చాంద్రాయణవ్రతముచేయువాడావ్రతమును మానరాదు. సదా మహామంత్రమును జపించుచు పవిత్రుడయినవాడు జపమును మాననవసరములేదు. నిత్యాగ్నిహోత్రి అగ్నిహోత్రమును మాననక్కరలేదు. వర్ణాశ్రమధర్మములను దేహాభిమానముతోగూడ వదిలినవాడగుటవలనను, జననమరణములు మాయాకల్పితములుకాని వాస్తవముకానందునను గృహస్థాశ్రమములో నున్నను బ్రహ్మజ్ఞానిని దారేషణ, ధనేషణ, పుత్రేషణలను వదలుటచేత యతిని పూజింపకపోరాదు. నిత్యదాతయగుటవలన చక్రవర్తి నుండి దానమును పట్టకపోరాదు. కనుక నీకారణములచే వీరికి ఆశౌచములేదు.

# ఆరవ ప్రకరణము

## చిచ్ఛక్తి బహురూపకథనము.

అ॥ చిచ్ఛక్తి సమస్తతత్వస్వరూపిణియు, ప్రపంచస్వరూపిణియు, సమస్త మంత్రదేవతా స్వరూపిణియు అని చెప్పబడుచున్నది. హంసవాహనా—త్రిశతి 110 నామము

శం॥ వ్యా॥ బ్రాహ్మీరూపేణేత్యర్థః॥

తా॥ పరమేశ్వరి బ్రాహ్మీశక్తిరూపము చేత హంసవాహనముగలది.

### త్రిశతి 23 ఏకానేకాక్షరాకృతిః।

శం॥ వ్యా॥ ఏకం ఈశ్వరప్రతిబింబోపాధితయా శుద్ధసత్వప్రధానం అక్షరమజ్ఞానం । అనేకాని మలినసత్వప్రధానతయా జీవోపాధిభూతాన్యక్షరాణి అజ్ఞానాని । "మాయాచావిద్యాచ స్వయమేవ భవతి" ఇతిశ్రుతేః । ఏకంచానేకానిచ । ఏకానేకానిచ । తానిచ అక్షరాణిచ తాని తథా— "మాయాంతు ప్రకృతిం వింద్యాన్మాయినం తు మహేశ్వర" మితి శ్రుతేః । తేషామాకృతయః ప్రతిబింబాన్యవచ్ఛిన్నానివా । చైతన్యాని ఘటస్థోదకావచ్ఛిన్నప్రతిబింబితాకాశవద్యస్యాః సా తథా । అథవా ఏకానిచ ప్రణవాద్యాని, అనేకానిచ అకారాది క్షకారాంతాని అక్షరాణి వర్ణాః ఆకృతిః స్వరూపం యస్యాః సా । మాతృకాస్వరూపత్వేనవా । అకారాది క్షకారాంతా మాతృకేత్యభిధీయతే । ఇతివచనాత్ । అథవా ఏశ్చకశ్చ ఏకారకకారౌ తౌచ ఇతరాణ్యనేకాక్షరాణిచ సర్వంమిళిత్వా పంచదశవర్ణాత్మికా । మూలవిద్యా, ఆకృతిః స్వరూపం శోధితతత్త్వం పదార్థసామరస్యాత్మకం యస్యాః సా తథా॥

తా॥ “మాయాచావిద్యాచ స్వయమేవ భవతి” అనుశ్రుతివలన మాయయని అవిద్యయని రెండువిధములగ చిచ్ఛక్తియే యగుచున్నది. అజ్ఞానరూపమయి శుద్ధసత్త్వప్రధానమగు మాయయందొకరూపముగ ప్రతిబింబించి యీశ్వరసంజ్ఞను బొందెను. అజ్ఞానరూపమయి మలినసత్త్వప్రధానమగు అవిద్యయందు అనేకరూపములుగ ప్రతిబింబించి అనేకజీవసంజ్ఞను బొందెను. లేక “మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం” అనుశ్రుతివలన నీచిచ్ఛక్తి మహాకాశమువలె మాయయందుండి ప్రతిబింబించి వశీకృతమాయుడైన మహేశ్వరరూపముగను బహువిధములగు దేహస్థాంతఃకరణోపాధులందు అనేకఘటములందున్న జలములలో మహాకాశమువలె ప్రతిబింబించి మాయకధీనములగుచున్న అనేకజీవరూపములుగనున్నది. లేక ఈచిచ్ఛక్తి ఓంకారరూపమగు ఏకాక్షరముగను, అకారము మొదలుగుచు క్షకారమంతమందుగల పంచాశద్వర్ణరూపముగనున్నది. “అకారాది క్షకారాంతా మాతృకేత్యభిధీయతే” అనువచనమువలన బహువిధములుగ విస్తరించిన భాషకు తానొకమాతృకగనున్నది. లేక ఈచిచ్ఛక్తి ఏకార కకారములును వీనికంటె భిన్నములగు ఈకార లకారాదులును గలిసి పదునేను వర్ణములుగల పంచదశీమంత్రరూపముగనున్నది. లేక అనేకాంతఃకరణోపాధులందు ప్రతిబింబించిన జీవులు “తత్త్వమసి” యనుమహావాక్యమును విమర్శించునపుడు మాయాప్రతిబింబుడై సర్వజ్ఞుడగుచు నొకడగు నీశ్వరుడనే వాచ్యార్థమును, అవిద్యాప్రతిబింబుడై కించిజ్ఞులగుచు ననేకజీవులనే వాచ్యార్థమును జహాదజహల్లక్షణచేత కొంతభాగమగు నుపాధులనుమాత్రము

కడకు త్రోసి కొంతభాగమగు చైతన్యమనే లక్ష్యార్థమును గ్రి
హింపగా మాయావిద్యల రెంటింటియందు నున్న నిత్యచైతన్య
మొకటియేయగుచున్నది. కొంతభాగమును వదలుట జహత్తని
కొంతభాగమును వదలకుండుట అజహత్తని యీరెంటింటి
మేళనముగల లక్షణ జహదజహల్లక్షణయని ఆలంకారికసిద్ధాం
తము. ఈజహదజహల్లక్షణచేత వాచ్యార్థములగు కించిజ్ఞ
సర్వజ్ఞత్వధర్మములుగల జీవేశ్వరులకు సంభవింపని యేకత్వము
సకలోపాధులందు సాక్షియై, యేధర్మములులేని లక్ష్యార్థమగు
నిత్యచైతన్యమొకటిగ జూచుటయే అద్వైతబ్రహ్మజ్ఞానమని
వేదాంతిమతము. చిచ్ఛక్తి యీప్రకారము ఏకాకారముగను,
అనేకాకారముగ నున్నది.

త్రిశతి 46 ఈశానాది బ్రహ్మమయీ ॥

శం॥ వ్యా॥ ఈశాన తత్పురుషాఘోర వామదేవ సద్యోజా
తాఖ్యాని పంచబ్రహ్మాణి। తన్మయం స్వరూపమస్యా అస్తీతి
తథా। అథవా ఈశానః ఆదిరేషాం తే తథా। అధికారిపురు
షాః విష్ణుబ్రహ్మేంద్రాదయః తేషామపి తత్తన్నామరూపవిశి
ష్టానాం అహంబుద్ధిమతాం అంతర్యామిస్వరూపేణ బుద్ధిప్రేరక
సచ్చిదానందస్వరూపబ్రహ్మానందప్రకాశాత్మనాస్ఫురతీతితథా॥

తా॥ ఈశాన తత్పురుషాఘోర వామదేవ సద్యోజాతము
లను ఐదుబ్రహ్మములును చిచ్ఛక్తిస్వరూపములే. అధికారిపు
రుషులగు ఈశ్వర, బ్రహ్మ, విష్ణు, శక్రాదులు అహంబుద్ధిగల
వారు. అంతర్యామియగు చిచ్ఛక్తి వీరిబుద్ధిని ప్రేరేపించుచు
సచ్చిదానందప్రకాశబ్రహ్మస్వరూపముగ స్ఫురించును.

త్రిశతి 154 కాంతా ॥

శం॥ వ్యా॥ అత్యంతమనోహరతమేత్యర్థః । మదనగోపాల విగ్రహా । “ కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా । వంశనాదవినోదేన కరోతి వివశం జగదితి త్రిపురాతాపిని శ్రుతిః ॥

తా॥ ఆదిశక్తియగు లలితాత్రిపురసుందరి భక్తులతృప్తికై మిగుల మనోహరమైన రూపముగలది. లేక ఒకానొకప్పుడు పురుషరూపకృష్ణవిగ్రహయయి వేణునాదముచేత జగత్తును వివశముచేసెను. అను త్రిపురాతాపిన్యుపనిషత్తువలన గోపాలస్వరూపముగలది.

ల॥ స॥ 199 సర్వశక్తిమయీ ॥

భా॥ వ్యా॥ బాలాబగళాది నిఖిలశక్త్యభేదాత్, సర్వశక్తిమయీ । బ్రహ్మమయం జగదిత్యాదావివ మయడభేదార్థకోపి సర్వదేవశక్తిసమూహరూపత్వాదపి సర్వశక్తిమయీ । తదుక్తం పాంచరాత్రేలక్ష్మీతంత్రేయోగీంద్రంప్రతి దేవ్యైవ । శ్లో॥ మహాలక్ష్మీరహం శక్ర పునస్స్వయంభువేస్తరే । హితాయసర్వదేవానాం జాతా మహిషమర్దినీ । మదీయాశ్శక్తిలేశాయే తత్తద్దేవ శరీరగాః । సంభూయ తే మహాభూవన్ రూపం పరమశోభనం । ఆయుధానిచ దేవానాం యానియాని సురేశ్వర । మచ్ఛక్త్యయస్తదాకారా ఆయుధాని తథాభవన్నితి । మార్కండేయపురాణే త్వయమర్థో విస్తరేణ ద్రష్టవ్యః ॥

తా॥ బాలా, బగళ మొదలగు శక్తులన్నియు లలితాత్రిపురసుందరియే. “కనకమయం కటకం” అనువాక్యమునందు బంగారము మురుగుగమారినదని మయట్ ప్రత్యయమునకర్థము

ఉన్నట్లు సర్వశక్తిమయీ అనుపదమునందున్న మయట్ప్రత్య యమునకు లలితాత్రిపురసుందరి బాలా బగళా మొదలగురూప ములుగ మారినది అని యర్థము చెప్పరాదు. ఏలయనగా—బ్రహ్మమయం జగత్తను వాక్యములోనున్న మయట్ప్రత్యయ మునకు అభేదము అర్థము చెప్పి జగత్తుయొక్క సత్తబ్రహ్మ సత్తకంటె వేరుకాక బ్రహ్మసత్తయేయగుటవలన జగత్తు బ్రహ్మమేయని జగద్బ్రహ్మములకు అభేదముచెప్పినట్లు సర్వశక్తి మయీ అనుపదములోనున్న మయట్ప్రత్యయమునకు అభేద ము అర్థము చెప్పగా సకలదేవతలయందున్న శక్తి యీచిచ్ఛక్తి కంటె వేరుకాక చిచ్ఛక్తియే యగును. పాంచరాత్ర లక్ష్మీతంత్రములందు పార్వతి యింద్రునితో చెప్పినదేమనగా— నేనే మహాలక్ష్మిని. స్వాయంభువమన్వంతరమందు దేవతలక్షేమము కొఱకు పొందిన మహిషమర్దనీరూపమును నేనే. సకలదేవతల యందున్న నాశక్తిలేశములన్నియు గలిసి మనోహరమగు నాయీరూపమయినది. దేవతలకేయే ఆయుధములుగలవో అవి యన్నియు నాయొక్క శక్తులే. మార్కండేయపురాణమందు ఈయర్థము సవిస్తరముగ చెప్పబడినది.

ల॥ స॥ 267 గోవిందరూపిణీ॥

భా॥ వ్యా॥ గోవిందస్త్వద్యశఈశ్వరోవిష్ణుః। సఏవరూపమస్యాః॥

తా॥ గోవిందుడనగా విష్ణువు. అతడే రూపముగాగలది. లలితకు గోవిందునకు భేదము లేదు.

ల॥ స॥ 757 క్షరాక్షరాత్మికా॥

క్షరాణి- అనియతసంఖ్యాకాన్యక్షరాణి వర్ణాని, ఆత్మా స్వభావం యస్యాః సా॥

వరాహపురాణము— ఏకాక్షరేతి విఖ్యాతా సర్వాక్షరమయీ శుభా। సైవ విశ్వేశ్వరీదేవీ సైవ హ్యానేకాక్షరేతి। యద్వా— క్షరస్సర్వాణి భూతాని కూటస్థో క్షరఉచ్యతే। తదుభయ మాత్మస్వరూపం యస్యాః। సదసత్, క్షరమక్షరమితి। మహాభారతే,॥ విష్ణుభాగవతేపి॥ విష్ణోస్తు త్రీణిరూపాణి పురుషాఖ్యాని యేవిదుః। ప్రథమం మహతస్స్రష్టా ద్వితీయస్త్వండసంస్థితం। తృతీయం సర్వభూతస్థం తాని జ్ఞాత్వా విముచ్యతఇతి॥

తా॥ ఈలలితామహాదేవి అనేకసంఖ్యగల అకారాదివర్ణములు స్వరూపముగలది. పరమేశ్వరి ఏకాక్షరరూప. అనేకాక్షరరూప అని వరాహపురాణమునందు చెప్పబడెను. లేకసకల భూతస్వరూపురాలు, కూటస్థస్వరూపురాలు అనియర్థము. క్షరస్సర్వాణి భూతాని కూటస్థోక్షరఉచ్యతే అని గీతావచనము. సత్ అనునది అక్షరమనియు, అసత్ అనునది క్షరమనియు, మహాభారతమునందు చెప్పబడినది. విష్ణువునకు మూడు రూపములు. మొదటిది సృష్టిచేయురూపము. రెండవది అండరూపము. మూడవది సమస్తభూతరూపము. ఇట్లు తెలిసికొనినవారు ముక్తులు.

ల॥ స॥ 824 బహురూపా॥

భా॥ వ్యా॥ బహూని రూపాణి యస్యాః సా।

I దేవీపురాణము— అరూపాపరభావత్వాద్బహురూపా క్రియాత్మికేతి॥ [నేకేతి॥

II గౌడపాదసూత్రము— భండాసురహననార్థమేకైవా

III దేవీపురాణేపి ప్రకృష్టకాంతరే—బహూని యస్యా రూపాణి స్థిరాణిచ చరాణిచ। దేవమానుషతిర్యంచ బహురూపా తతస్స్మృతేతి।

IV సూ॥ సంహిత॥ ఏకధాచ ద్విధాచైవ తథా షోడశధా స్థితా। ద్వాత్రింశద్భేదభిన్నావాయా తాంవందే పరాత్పరామితి॥ ద్విధా స్వరవ్యంజనరూపావా। అకారాది స్వరభేదాత్ షోడశధా। కకారాది భేదేన ద్వాత్రింశద్విధా ఇత్యాది॥

తా॥ I రూపములేనిది బ్రహ్మము. బహురూపములయినది జగత్తు.

II భండాసురుని సంహారముకొరకు ఒకేశక్తి అనేక రూపములుబొందెను.

III స్థిరములు, చరములు, దేవతలు, మనుష్యులు, తిర్యగ్జంతువులు ఇవియన్నియు చిచ్ఛక్తిరూపములే గనుక బహురూపయని చెప్పబడినది.

IV ఒకటిఅనగ చిచ్ఛక్తి. రెండనగ అచ్చులు, హల్లులు. పదునారనగ అచ్చులు. ముప్పదిరెండనగ హల్లులు. ఇటువంటి పరాత్పరురాలగు పరమేశ్వరిని నమస్కరించుచున్నాను.

ల॥ న॥ 838 ముకుందా॥

భా॥ వ్యా॥ ముక్తిం దదాతీతి ముకుందా। విష్ణురూపత్వాద్వా। తదుక్తం॥ తంత్రరాజే గోపాలమంత్రభేదారంభే-కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా। సంవేశనాదనారంభా దకరోద్వశగం జగత్। తతస్సగోపీసంజ్ఞాభిరావృతో భూత్స్వశక్తిభిః। తదా తేన వినోదాయ స్వం షోఢాకల్పయద్వపురిత్యాది॥

తా॥ ముక్తినిచ్చునది గనుక ముకుంద, లేక విష్ణురూపిణి. ఒకానొకప్పుడు లలితాత్రిపురసుందరి పురుషరూపముగ కృష్ణుడై వేణుగానముచేత జగత్తును పరవశముగ జేసెను. అనంతర

ము గోపికలనెనసి తనశక్తులచేత నావరింపబడి వినోదముకొరకు తనదేహము నానావిధములుగఁ గల్పించెను.

ల॥ స॥ 893 విష్ణురూపిణీ॥

భా॥ వ్యా॥ విష్ణురేవరూపమస్యాః। తదుక్తం॥

I లలితోపాఖ్యానము—మమైవం పౌరుషం రూపం గోపికాజనమోహనమితి దేవీవచనాత్॥

II వీరభద్రచంద్రప్రతి విష్ణువచనం— ఆద్యాశక్తిర్మహేశస్య చతుర్ధా భిన్నవిగ్రహా। భోగే భవానీరూపా సా దుర్గారూపా చ సంగరే। కోపేచ కాళికారూపా పుంరూపాచ మదాత్మికేతి॥

III కూర్మపు॥ హిమవత్కృతదేవీస్తవము— సహస్రమూర్ధానమనంతశక్తిం సహస్రబాహుం పురుషం పురాణం। శయానమబ్ధౌ లలితే తవైవ నారాయణాఖ్యం ప్రణతోస్మిరూపమితి॥

IV సనత్కుమారసంహిత—ప్రభాకరాఖ్యస్య రాజ్ఞో విష్ణుభక్తిం తన్మహిష్యాః పద్మిన్యాఖ్యాయాశ్చ పార్వతీభక్తిం వర్ణయిత్వోక్తం। ఏవం దేవ్యాత్మనా స్వేనరూపేణచ జనార్దనః। దంపత్యోరేకకార్యత్వాదేకఏవ ద్విధార్చితఇతి॥

V బృహత్పరాశరస్మృతి—దుర్గాం కాత్యాయనీం చైవ యజన్యాద్గేవతామపి। చేతసా సుప్రసన్నేన విష్ణులోకమవాప్నుయాత్॥

VI పద్మపురాణము—చండికాం స్నపయేద్యస్తు ఇక్షువేణా రసేనచ। సౌవర్ణేన సయానేన విష్ణునాసహ మోదతఇతి॥

VII ఆదిత్యశివపురాణములు— యాతస్య పార్శ్వగాబాలా సా పార్వత్యంశజోహరిరితి॥ [అని పరమేశ్వరి చెప్పెను.

తా॥ I గోపికలను మోహింపచేసిన పురుషరూపము తానే

II ఈశ్వరునియొక్క ఆదిశక్తి నాలుగువిధములయ్యెను. భోగకాలమునందు పార్వతిగాను, యుద్ధకాలమునందు దుర్గగాను, కోపకాలమునందు కాళిగాను, తనస్వరూపము నీపురుషుడుగాను నుండెనని విష్ణువు వీరభద్రునితో జెప్పెను.

III సహస్రశిరస్సులు, సహస్రబాహువులు, అపరిమితశక్తులుగలిగి సముద్రమునందు శయనించియున్న నారాయణుడనుపేరుగల నీస్వరూపమును నమస్కరించుచున్నానని హిమవంతుడు పార్వతిని స్తుతించెను.

IV సత్రభాకరమహారాజుయొక్క విష్ణుభక్తిని, ఆయనభార్య పద్మినియొక్క పార్వతీభక్తిని వర్ణించి పార్వతీరూపముగాను, స్వకీయరూపముచేత విష్ణువుగాను దంపతులను ఏకకార్యమగుటవలన విష్ణువు రెండువిధములుగ బూజింపబడెనని చెప్పబడినది.

V దుర్గను, కాత్యాయనిని, సరస్వతిని వీరిలో నెవరినిగానినిర్మలచిత్తముతో నారాధించినవారు విష్ణులోకమును పొందుదురు.

VI చెరుకురసముతో చండికకు అభిషేకముఁ జేయువారు గరుడవాహనారూఢులై విష్ణువుతో కలిసి సంతోషించెదరు.

VII శివునియొక్క పార్శ్వమునుపొందిన బాలిక పార్వత్యంశసంభూతయగు విష్ణుమూర్తియే.

త్రిపురోపనిషత్తు— మదంతికామాని సమంగళాచ సుభగాచ సా సుందరీ సిద్ధిమత్తా। లజ్జామతిస్తుష్టిరిష్టాచ పుష్టా లక్ష్మీరుమా లలితా లాలపంతి ॥ 6 ॥

భా॥ వ్యా॥ క్షేత్రేషు వివిధేషు నామభేదేన యా వివిధరూపే పురాణేషు తంత్రేషు చోపలభ్యంతే। తాని సర్వాణ్యాస్యా

ఏ వేత్యుపదిష్టం షష్ఠీవ్యాచమాహ । మదంతికా ఇతి । పద్మపురాణే దేవీతీర్థపరిగణనావసరే కతిపయాని రూపాణ్యుక్తాని । ప్రయాగే లలితాదేవీ గయాయాం మంగళగౌరికా । లంకాయాం శాంకరీదేవీ త్రికూటే భద్రసుందరీ । కరవీరే మహాలక్ష్మీ రుమాదేవీ వినాయకే । దేవదారువనే పుష్టిః మేధా కాశ్మీరమండలే । తుష్టిర్వజ్రేశ్వరీ తథేత్యాదీని । అన్యాన్యపి రూపాణి తత్ర తత్రోక్తాన్యేవ । మదంతికేత్యాది చతుర్దశ । వారణస్యాం విశాలాక్షీత్యాదీనాముపలక్షణం । యద్దేవీ తద్దేవీరూపం తత్త్వేన లాలప్యమానాది నైవేత్యర్థః ॥ లాలపంతిపదం లాలప్యమానపదం ప్రాతిపదికార్థముచ్చరంతివిభక్తిః । ప్రాతిపదికార్థవిశేషక ఇత్యాసేంతి శాబరభాష్యే ప్రయోగదర్శనాత్ । అథవా, పంచదశాక్షరాణాం పంచదశైమా దేవతాః । క్షేత్రభేదేన దేవతానామభేదాః ॥ 6 ॥

తా॥ పురాణ, తంత్రములలో ననేకక్షేత్రములయందు నామభేదముచేత ననేకరూపములుగా చెప్పబడినది. అవియన్నియు పరదేవతాస్వరూపమేయని 6వ ఋక్కును చెప్పుచున్నారు.

ప్రయాగయందు లలిత, గయయందు మంగళగౌరి, లంకయందు శాంకరి, త్రికూటమందు భద్రసుందరి, కరవీరమందు మహాలక్ష్మి, వినాయకక్షేత్రమందు ఉమ, దేవదారువనమందు పుష్టి, కాశ్మీరమునందు మేధ, వజ్రమునందు తుష్టి యను పేరులతో పరదేవతయే యుండెనని పద్మపురాణమునందు చెప్పబడినది. అన్యమయిన రూపములు అక్కడక్కడ చెప్పబడినవి. మదంతిక మొదలగునవి పదునాలుగు. కాశియందు విశాలాక్షి మొదలగురూపములు గలవు.

# ఏడవ ప్రకరణము

## తంత్రి వైదికమార్గకథనము.

వర్ణనము—

శ్రీదేవినర్చించుటకు తంత్ర వైదికములను మార్గములు రెండు కలవు. వేదబాహ్యులకు తంత్రమార్గముమాత్రమే, కాని వేదవేత్తలకు తంత్ర వైదికమార్గములు రెండును చెప్పబడినవి. ఈగ్రంథమునందు చెప్పబడినవిద్యలు శ్రుతిసమ్మతమయినవి. శ్రుతిసమ్మతమయిన విద్యలకు తంత్రమార్గము నిషిద్ధముగా కాదని దత్తాత్రేయసంహిత మొదలగువానివలన స్పష్టముగాతెలియుచును. "ఇట్లుండగా నివి వైదికములు కావనియు, తాంత్రికములనియు, సౌందర్యలహరీవ్యాఖ్యానకర్త మొదలగువారు చెప్పిరి. కాని ప్రమాణము లేదనియు, శ్రుతిసమ్మతమయినవని ప్రమాణములు చూపించుచు సేతుబంధము ప్రథమపటలము 22శ్లోకభాష్యమునందు వైదికములుకావని చెప్పినవారి యభిప్రాయమును ఖండించి వైదికములేయని చెప్పిరి."

త్రిశతి 223 సకలాగమసంస్తుతా॥

శ॥ వ్యా॥ ఆసమంతాత్ గమయంతీతి ఆగమాః । సకలపదార్థగోచరసవికల్పకప్రమాజనకవేదాఇత్యర్థః । సకలైరస్యానాన్తరేకేతిహాసపురాణసహిత యావదంగోపాంగ రహస్యాదియోగిత్వాం సకలశబ్దార్థః । తైః సంస్తుతాః ॥

తా॥ లలితాదేవి సకలపదార్థములను గోచరింపజేయుజ్ఞానమును గలిగించు ఇతిహాసపురాణాది యావదంగోపాంగసహితములగు వేదములచేత లెస్సగా స్తోత్రముచేయబడునది.

శ్రీమద్భాగవతము- ఏకాదశస్కంధము॥ కరభాజనోపదేశే। ద్వాపరపూజావిధానే। కలిపూజాయాం చ వచనాని యథా—

యజంతి వేదతంత్రాభ్యాం పరం జిజ్ఞాసవో నృప। నానాతంత్ర విధానేన కలావపి యథాశృణ్వితి। కలౌ తంత్రమార్గస్య ప్రాధాన్యం దర్శయతి॥ అని శ్రీధరవ్యాఖ్య॥

ఏవం ఉద్ధవోపదేశే। వైదికైః తాంత్రికాద్యైశ్చ ఇతి మే ద్వివిధో మఖః। ఉభాభ్యాం వేదతంత్రాభ్యాం మహ్యంతూభయసిద్ధయఇతి। వైదికతాంత్రికభేదేన ద్విప్రకారపూజా శ్రీభగవతోపదిష్టా। సర్వైరుపలభ్యతే—

తా॥ వేదము చేతను, తంత్రము చేతను, బ్రహ్మజ్ఞానేచ్ఛగలవారు నానామంత్రవిధుల చేతను, కలియుగమునందు దేవతారాధన చేసెదరని కరభాజనుడు యదుమహారాజునకిట్లు కలియుగమునందు తంత్రమార్గప్రాధాన్యమును చెప్పెను. ఈప్రకారమే ఆస్కంధమునందే శ్రీకృష్ణుడు తనపూజ వైదిక తాంత్రికభేదముచే ద్వివిధముగనున్నదని ఉద్ధవునకి ఉపదేశించెను.

శ్రీమద్భాగవతము—బ్రహ్మస్తుతి॥ యూపంతి యత్పురుషపర్ణభేజ్యం శ్రేయోర్థిభిర్వైదికతాంత్రికేణేతి॥

తా॥ ఓకృష్ణా, నీస్వరూపము శ్రేయస్సుకోరినవారిచేత వైదిక తాంత్రికమార్గములతో ఆరాధింపబడినది.

బ్రహ్మోత్తరఖండము—ప్రదోషమాహాత్మ్యము॥ ప్రదోషపూజా తాంత్రికసరణ్యా బ్రాహ్మణరాజపుత్రయోరుపదిష్టా॥

తా॥ ప్రదోషకాలపూజ బ్రహ్మక్షత్రియులకు తాంత్రికక్రమము చేత నుపదేశింపబడినది.

శ్రీమహాభారతము- అర్జునస్తుతి॥ ఆమ్నాయాగమవేద్యాయ శుద్ధబుద్ధాయ తే నమః ఇతి॥

తా॥ ఆమ్నాయముల చేతను, ఆగమముల చేతను తెలియబడు శుద్ధజ్ఞానస్వరూపుడవయిన నీకొరకు నమస్కారమని అర్జునుడు కృష్ణుని స్తుతిచేసెను.

శ్రీమదధ్యాత్మరామాయణము— లక్ష్మణప్రశ్న॥ బ్రహ్మక్షత్రాది వర్ణానామాశ్రమాణాంచ మోక్షదం। స్త్రీశూద్రాణాంచ రాజేంద్ర సులభం ముక్తిసాధనం। తవభక్తాయ మే భ్రాత్రే బ్రూహి లోకోపకారకమితి। తదుక్తం శ్రీరామఃపవాచేత్యారభ్య। దశావరణపూజాం నైహ్యగమోక్తాం ప్రకారయేత్। హోమం కుర్యాత్స్వయత్నేన విధినా తంత్రికోవిదః। అగస్త్యోక్తేన మార్గేణ కుండేనాగమవిత్తమ ఇతి॥ ఏవం బ్రాహ్మణాదీనాం వైదికానాం బ్రహ్మచర్యాద్యాశ్రమిణాంచ మోక్షోపాయప్రశ్నే ఆగమోక్తపూజా కర్తవ్యేతి॥

తా॥ బ్రాహ్మణాదివర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును, స్త్రీశూద్రులకును, సులభమయిన ముక్తిసాధనమును భక్తుడవైన నాకు ఉపదేశింపుమని లక్ష్మణుడు కోరగా తంత్రము చేత, దశావరణపూజను, హోమమును జేసి అగస్త్యమహర్షి చే చెప్పబడిన మార్గము చేత తత్పూజను చేయవలయునని తంత్రప్రాధాన్యమును శ్రీరామమూర్తి తమ్మునకు చెప్పెను.

సూతసంహిత॥ పూజాశక్తః పరాయాస్తు ద్వివిధాపరికీర్తితా। బాహ్యాభ్యంతరభేదేన బాహ్యాచ ద్వివిధామతా। వైదికీ తాంత్రికీచేతి ద్వివిధంచాః తాంత్రికీతుసా। తాంత్రికస్యైవ

వాన్యస్య వైదికీ వైదికస్యహి । ఇత్థం సమస్తదేవానాం పూజా విప్రావ్యవస్థితా ॥ ఇతి ॥

తా॥ పరాశక్తియొక్క పూజ అంతర్యాగ, బహిర్యాగక్రియలచేత రెండువిధములనియు, బాహ్యపూజ వైదికతాంత్రిక భేదముచేత రెండువిధములనియు, తాంత్రికపూజ ఆగమవేత్తలకును, వైదికపూజ వైదికులకును ఇట్టివ్యవస్థతో పూజ సర్వదేవతలకుండెననియు సూతుడు మహర్షులతో చెప్పెను.

ద॥ సం॥ 26 అ॥ ఉపాసనాచ ద్వివిధా వేదబాహ్యాచ వైదికీ 101॥ వేదాంతగతవిద్యానా ముపాస్తిర్వైదికీ స్మృతా। ఉపాస్తిః వైదికీవర్వవిప్రాణామేవ కథ్యతే॥ 102 ॥ ఉపాస్తిర్వేదబాహ్యాతు శూద్రాదీనాముదాహృతా । శ్రుతితంత్రవిమిశ్రాశ్చ విద్యాయూప్యముదాహృతాః ॥ 103 ॥ ఏతాసామపి విద్యానాముపాస్తిర్వైదికీపరా। శుద్ధతంత్రోదీరితానాం విద్యానాం తథైవ వల్లభే ॥104॥ శ్రుతిబాహ్యేన మార్గేణ శూద్రాదీనా ముపాసనా। వేదబాహ్యోపాసకానామైహికం విద్యతే సుఖం ॥ 105 ॥ నాముష్మికీతి సంప్రోక్తా జన్మకోటిశతేష్వపి। శ్రౌతమార్గేణ విద్యానాముపాస్తినిరతాత్మనాం ॥ 106 ॥ బ్రహ్మతాదాత్మ్యతా ముక్తిర్భవేదేకేన జన్మనా। ఏతన్మయోక్తం నచ్ఛాస్త్రం సర్వవేదాంతభూషణం ॥107॥ మహాసారస్వతంతంత్రం తద్వద్వేదాంతభూషణం। సంహితా సనకస్యాపి సనందనమునేరపి ॥ 108 ॥ సనత్కుమారస్యమునేస్సనాతనమునేస్తథా। సంహితాః స్సర్వపుణ్యార్థసిద్ధిదా శ్రుతిసమ్మతాః ॥109॥ సంహితా భగవద్దత్తాత్రేయస్యోయం మహత్తరా। సమస్తపుణ్యఫలదా ప్రఖ్యాతా సా మతశ్శివే॥ 110 ॥ ముక్త్యర్థిభ్యాఃఖలం సర్వం కృతవాన్మదనుగ్ర

హాత్ । సంహితాం పరమాం పుణ్యాం మానసోల్లాసగర్భితాం
నానయా సదృశీ పుణ్యా విద్యతే సంహితా భువి । ఉద్ధారమా-
త్రం విద్యానామత్ర యద్యదుదీరితం ॥113॥ విద్యాజాలం తదఖి-
లం శ్రౌతమేవ నసంశయః । నవేదబాహ్యవిద్యానా ముద్ధార
శ్చాత్ర దృశ్యతే । తస్మాద్వేదేషు వేదాంతపురాణేష్వాగమేష్వపి
సారభూతమిదం శాస్త్రముక్తం వేదాంతభూషణం ॥ అథ దాశ-
రథీయాచ సంహితా హనుమత్కృతా । బ్రహ్మవిద్యావిలాసా-
ఖ్యం తంత్రం పాశుపతం మహత్ ॥115॥ దధీచిసంహితా పుణ్యా
వాసుదేవస్య సంహితా । వాసిష్ఠసంహితా వేదవ్యాసవృత్రోర్వ్య
సంహితా ॥ వైనతేయకృతం శాస్త్రమేతత్సర్వం తు వైదికం ।
శాస్త్రం నారాయణీయాఖ్యం నారదీయం తథైవచ ॥ తంత్రం
చైదంబరమపి నందికేశ్వరకల్పితం । రహస్యభూతం తదపి
విశుద్ధం వైదికం మహత్ ॥118॥ జ్ఞానార్ణవం మహాశాస్త్రం
లలితా సంహితాభిధం । మహాత్రైపుర సిద్ధాంతం లలితా
జ్ఞానమవ్యయ ॥119॥ లలితాసంహితాఖ్యం చ తంత్రం కామే
శ్వరాభిధం । లలితాపరిశిష్టంచ కల్పసూత్రమతఃపరం ॥120॥
ఏతాని శుద్ధతంత్రాణి వైదికాని నసంశయః । రుద్రయామళ
ముఖ్యాని మత్స్యకృతాన్యపి కానిచిత్ । వామవైదికమిశ్రాణి
తంత్రాణి కులమంజరీ । మత్స్యసూక్తాది తంత్రాణి వామాన్యే
వ నసంశయః ॥122॥ మిశ్రకం శుద్ధవామంచ తంత్రం త్యాజ్యం
బుధోత్తమైః । భిన్నమస్తాది విద్యానాం వామమార్గేణస్రవతే
యత్రోపాస్తిర్నిగదితా తత్తంత్రం వామముచ్యతే । తదేవ
శాక్తం సుమహాతంత్రం వేదైర్నిషిధ్యతే ॥ తత్తంత్రం వేదబా
హ్యం స్యాత్ తచ్ఛాస్త్రం సూక్తదర్శనం । గణేశోచ్ఛిష్టవిద్యానాం

యత్ర మాహాత్మ్యముచ్యతే ॥125॥ గాణాపత్యం మహాతంత్రం వేదబాహ్యం తదుచ్యతే। భైరవాది మహావిద్యోపాస్తిః శ్రుతి బహిష్కృతా॥ తత్కాపాలికమిత్యుక్తం వేదబాహ్యం మమ ప్రియే। ఇత్యాది॥

తా॥ ఉపాసన వేదబాహ్యమని, వైదికమనియు రెండువిధములు. ఉపనిషత్తులలో చెప్పబడిన మంత్రోపాసన వైదికము. ఆయుపాసన బ్రాహ్మణులకు చెప్పబడినది. వేదబాహ్యోపాసన శూద్రులు మొదలగువారికి చెప్పబడినది. శ్రుతితంత్రములు రెంటియందు చెప్పబడిన విద్యోపాసన వైదికము. కేవల తంత్రములయందు చెప్పబడినవిద్యోపాసన వేదబాహ్యులకు చెప్పబడినది. వేదబాహ్యోపాసకులకు ఇహలోకఫలమేగాని వారు కోటిజన్మములకైనను పరలోకఫలము లేదు. శ్రుతిమార్గముచేతనుపాసనచేయువారికి బ్రహ్మజ్ఞానముచేత నొకజన్మమందే ముక్తి కలుగును.

మహాసారస్వతతంత్రము వేదాంతభూషణము. సనక, సనందన, సనత్కుమార, సనాతనసంహితలును, ఇవి సమస్తపుణ్యాగసిద్ధులనిచ్చునవి, శ్రుతిసమ్మతమయినవి.

మహత్తరమయిన ఈదత్తాత్రేయసంహిత। నామముచేతగూడ ప్రసిద్ధమయి సమస్తపుణ్యఫలము నిచ్చునదియును, నావలన సమస్తవిద్యలను చదివి నాఅనుగ్రహమువలన దత్తాత్రేయునిచేత చేయబడినదియు, ఉత్కృష్టమయిన పుణ్యమునిచ్చునదియు, మనస్సుకు ఆనందమునిచ్చునదియు నగు, ఈదత్తాత్రేయసంహితతో సమానమయిన పుణ్యసంహిత భూలోకమునందు లేదని పరమేశ్వరుడు పార్వతికి చెప్పి మరలనిట్లనియె, ఈదత్తా

త్రేయసంహితయందు చెప్పబడిన విద్యోపాసనమంతయు వేదస
మ్మతమే; సంశయము లేదు. వేదబాహ్యములయిన విద్యలు యీ
దత్తాత్రేయసంహితయందు చెప్పబడలేదు. కనుక నిది వేద,
వేదాంతపురాణాగమములందును సారభూతమయి వేదాంతము
సకలంకారముగనున్నది. ఇవియే కాక ఆంజనేయులచేత చెప్పబ
డిన దాశరథిసంహిత, బ్రహ్మవిద్యావిలాసయను పాశుపతసం
హిత, దధీచిసంహిత, పుణ్యమయిన వామదేవసంహిత, వసిష్ఠ
సంహిత, శుకసంహిత, వైనతేయసంహిత, ఇవి యన్నియు
వైదికములు. నారాయణసంహిత, నారదతంత్రము, చిదంబర
తంత్రము, నందికేశ్వరతంత్రము నను నివియు రహస్యమును,
శుద్ధమునయి వేదసమ్మతమయినవి.

లలితాసంహితయను జ్ఞానార్ణవము, త్రిపురాసిద్ధాంతము,
వామకేశ్వరతంత్రమను లలితాసంహిత, లలితాపరిశిష్టము,
కల్పసూత్రములు (పరశురామసూత్రములు) ఇవి యన్నియు
శుద్ధములు వైదికములు. సంశయము లేదు. నాచేత చెప్పబడిన
రుద్రయామళము మొదలగు కొన్ని తంత్రములు వామవైదిక
ములతో కలిసి మిశ్రమముగానున్నవి. వామమనగ వేదబాహ్య
ము. మత్స్యసూక్తము మొదలగు తంత్రములు కేవలవామము
లు. సంశయము లేదు. మిశ్రమము, కేవలవామమునయు నీతం
త్రములు వైదికులచేత విడిచిపెట్టతగియున్నవి. ఛిన్నమస్త మొ
దలగు దేవతోపాస్తిని చెప్పు తంత్రములు కేవలవామములు.
ఆతంత్రములే శాక్తమనునవి. అవి వేదబాహ్యములు. కనుక
వైదికులచేత విడువతగినవి. రశ్మిసూక్తములయందు చెప్పిన
విద్యలుమాత్రము శుద్ధమయినవి. ఉచ్ఛిష్టగణపతిమాహాత్మ్య

క్షునువర్ణించుతంత్రము వేదబాహ్యము. భైరవాదిమహాదేవోపాసన వేదబాహ్యము. అదే కాపాలికమని చెప్పబడుచున్నది.

ద॥ సం॥ 12-26 అధ్యాయములు శివప్రకరణమునకు సంబద్ధము. 12 అధ్యాయము 5వ ప్రకరణమునందును, 26 అధ్యాయము 15 ప్రకరణమునందును వ్రాయబడినవి.

దేవీభాగవతము- 3 స్కంధము 25 అధ్యాయము॥

సుబాహురపి కాశ్యాంతు దుర్గాయాః ప్రతిమాం శుభాం। కారయిత్వాచ ప్రాసాదం స్థాపయామాస భక్తితః ॥41॥ తత్రత్యాజనాస్సర్వే ప్రేమభక్తిపరాయణాః। పూజాం చక్రుర్యథాశేవ యథా విశ్వేశ్వరస్యహ ॥42॥ విఖ్యాతా సాబభూవాథ దుర్గాదేవీ ధరాతలే। దేశేదేశే మహారాజ తస్యా భక్తిర్వ్యవర్ధత ॥43॥ సర్వత్ర భారతేలోకే సర్వవర్ణేషు సర్వథా। భవానీయా భవానీతు సర్వేషామభవత్తదా ॥ 44 ॥ శక్తిభక్తిరతాః సర్వే మానవాశ్చాభవన్నృప। ఆగమోక్తైరథస్తోత్రైర్జపధ్యానపరాయణాః ॥ 45 ॥

తా. సుబాహుమహారాజు కాశియందు దుర్గాలయము గట్టించి దుర్గాదేవియొక్క ప్రతిమనుంచి భక్తితో తానును కాశీయందుగల ప్రజలును విధిచేత విశ్వేశ్వరునివలెనే పూజించిరి అనంతరము భూతలమున దుర్గాదేవి ప్రసిద్ధిగాంచెను. ప్రతిదేశమందును ఆమెయందు భక్తి వృద్ధిబొందెను. ఆకాలమున భరతఖండములోని జనులందరు ఆగమోక్తములగు జపధ్యానస్తోత్రపూజలచే దుర్గామహాదేవిని భక్తితో పూజించి దుర్గాప్రసాదమున పునీతులైరి.

# ఎనిమిదవ ప్రకరణము

## కలియుగోపాసనకథనము.

అ॥ కలియుగమునందు జనించిన మనుజులకు జన్మమాత్రముచేతకలుగు నింద్యములగు పాపములు పరాశక్తియొక్క ధ్యానాదులవలన నశించునని చెప్పబడుచున్నది.

కలిదోషహరా॥ త్రిశతి 15 నామము॥

శ॥ వ్యా॥ కలేః నింద్యాః జాయమానానాం పురుషాణాం జన్మమాత్రేణ యే దోషాః పాపాని ఆయాంతి, తాన్ దృష్టా, శ్రుతా, కీర్తితా, సంస్తుతా, పూజితా, ధ్యాతాసతీ హరతీతి తథా. కలేః అన్యోన్యవాదినాం కలహాత్ తత్తన్మతాభినివేశవశాజ్జాయమానా యే దోషాః పరబ్రహ్మవిషయే అస్తిత్వదేహాదివ్యతిరిక్తత్వ భిన్నత్వాభిన్నత్వగుణిత్వాది సాధకయుక్త్యాభాస తదనుగుణసమ్మత్యాభాస శ్రుతితాత్పర్యవిఘటనాన్యథాకరణ దురాగ్రహజన్య కామక్రోధపరుష పరవశక్రియమాణ నిందాపహానాదిరూపాః బహువిధాః దోషాః; తానద్వైతబ్రహ్మజ్ఞానసాధనముక్తిరూపేణ హరతీతి—

తా॥ కలియుగమునందు జనించినపురుషులకు జన్మమాత్రముచేతనే కలిగెడి నింద్యములగు పాపములన్నిటిని పరమేశ్వరి తనను చూచుట, వినుట, కీర్తించుట, స్తోత్రముచేయుట, పూజించుట, ధ్యానించుట మొదలగు భక్తిమార్గములచే హరింపచేసును. అట్లు కలియందు అన్యోన్యవాదులయొక్క కలహమువలన వారివారి మతాభిమానమువలనపుట్టిన దోషములుకు పరబ్రహ్మము (ఆత్మవస్తువు) ఉన్నదని, లేదని, దేహరూపమని

దేహముకంటె విలక్షణమని, ఈవిధముగా ననేకవిధములయిన యుక్తులచేతను నిర్ణయింపబడిన అభాసజ్ఞానమువలనను, వేదములకు విరుద్ధతాత్పర్యకల్పనవలనను, పరనింద మొదలగువాని వలనను, పుట్టిన అనేకవిధపాపములను పోగొట్టునని యుతాత్పర్యము.

త్రి॥ సి॥ కలౌశక్తింగనా స్యాణాం పరదానహి విద్యతే।

తా॥ కలియుగమునందు మనుష్యులకు శక్తికంటె నితరులు పరములనిచ్చువారు లేరు.

లిం॥ పు॥ కలౌ వారాధనం శంభో రాగమేనైవ నాన్యధేతి॥

తా॥ కలియుగమునందు ఈశ్వరోపాసన ఆగమములచేతనే చేయవలయును. మరియొకవిధముగా చేయకూడదు.

రహస్యాగ్నపము— కలౌయుగే మహాదేవి బ్రాహ్మణాద్యైస్సుపూజితా॥ తా॥ కలియుగమునందు పరదేవత బ్రాహ్మణాదులచేత చక్కగా పూజింపబడుచున్నది.

శ్రీమద్భాగవతము— యజంతి వేదతంత్రాభ్యాం పరం జిజ్ఞాస్వ నృప। నానాతంత్రవిధానేన కలావపి యథా శృణు ఇతి

తా॥ కలియుగమునందు ఆత్మజ్ఞానేచ్ఛగలవారు వేద, తంత్రమార్గములచేత దేవతోపాసన చేయుచున్నారని శుకులవారు పరీక్షిన్మహారాజునకు చెప్పిరి.

॥ స॥ లేపన కలికల్మష నాశనే

భా॥ న్యా॥ కలియుగ కల్మషపాపక్షయస్యాపర్యేక త్వేత్రిస్నానం శమునస్యసాధ్యమేవ కరోతి॥ లెదుత్తం॥

I కూ॥ పు॥ శమాయ్యాలం జలం వహ్నేస్తమసో భాస్కరోదయః। శాన్త్యై కలేరఘౌఘస్య దేవనామానుకీర్తనమితి॥

II బ్ర॥ పు॥ కృతస్యాఖిలపాపస్య జ్ఞానతోఽజ్ఞానతోపివా।
ప్రాయశ్చిత్తం పరంప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః॥

తా॥ కలియుగమునందు కలుగు మహాపాపములన్నిటిని పర దేవతకంటె నితరదేవతలు నశింపచేయలేరు.

I ఉదకమువలన అగ్నియు, సూర్యునివలన చీకటియు నశించునట్టుల కలియందలి నవాపసంఘములు నశించుటకు పర దేవతయొక్క నామకీర్తనము సమర్థము.

II జ్ఞానమువలనగాని, అజ్ఞానమువలనగాని చేయబడిన సమస్త పాపములకు పరదేవతయొక్క నామోచ్చారణమే ప్రాయశ్చిత్తము.

## త్రొమ్మిదవ ప్రకరణము

### పంచదశీమంత్రజపాదివివరణము.

అ॥ హాది కాదివిద్యలలో త్రిపురోపనిషత్తు, త్రిశతినామ ములు, బ్రహ్మాండపురాణము, దత్తాత్రేయసంహిత, సాంఖ్యా యనసూత్రము, వామకేశ్వరతంత్రము, ఆంతరవరివస్య మొద లగు గ్రంథములవలన కాదివిద్య ప్రధానమని కనబడును. వరి వస్యారహస్యముయొక్క వ్యాఖ్యానము పూర్ణమైన పాండిత్య ములేనివారికి గురుసంప్రదాయమువలనను, పరదేవతయొక్క కటాక్షమువలనను, దెలియదగినదై యున్నది. అధికమస్తిష్కయు స్కుడను, అల్పప్రజ్ఞుడనైనను. అనల్పకాలసేవితయగు పరదేవ తయొక్క కటాక్షప్రేరణావశముచేత వరివస్యాయొక్క మూల మును, వ్యాఖ్యానమునందలి కొంత తాత్పర్యమును వ్రాసితిని.

జపాదికములు అర్థము తెలిసి చేయుటముఖ్యము-
రెండవఅంశము-

శ్లో॥ నార్థజ్ఞానవిహీనం శబ్దస్యోచ్చారణం ఫలతి। భస్మని వహ్నివిహీనే నప్రక్షిప్తం హవిర్జ్వలతి ॥ 1 ॥

అర్థమజానానానాం, నానావిధశబ్దమాత్రపాఠకానాం, ఉప మేయశ్చక్రీవాన్ మలయజభారస్య వోఢేవ ॥ 2 ॥

పురుషార్థానిచ్ఛద్భిః పురుషైరర్థాః పరిజ్ఞేయాః । అర్థానాద రభాజాం నైవార్థాః ప్రత్యుతానర్థాః ॥ 3 ॥

తా॥ అగ్నిలేనిభస్మమందుంచబడిన హవిస్సు హుతముకాన ట్లు అర్థము తెలియక శబ్దమునుచ్చరించుటచేత ఫలములేదు. అర్థము తెలిసికొనక అనేకశబ్దములను పఠించువారికి చందనపు కర్రలబరువును మోయుచు దానిపరిమళమును గ్రహించనిగా డిదకువలెనే ఫలములేదు. పురుషార్థములు కోరెడివారు అర్థ మును తెలిసికొనవలెను. అర్థమునందనాదరణకలవారికి పురుషా ర్థములునులేవు. అనర్థములుగూడకలుగును. మొదటిఅంశము.

కామో యోనిః కమలేత్యేవం సంకేతితైః శబ్దైః వ్యవహ రతి నపక్రాశం యాం విద్యాం వేదపురుషోపి ॥ 4 ॥

శ్రుతి॥ కామో యోనిః కమలా వజ్రపాణిర్గుహాహసా మా తరిశ్వాభ్రమింద్రః పునర్గుహా సకలామాయయాచ పురూచ్యే షా విశ్వమాతాదివిద్యా ॥

తా॥ వేదపురుషుడు కాదివిద్యను కామః, మొదలగు సంకే తశబ్దములచేతనే చెప్పెను. కాని స్పష్టముగా చెప్పలేదు. 4 ॥ కామః కకారము। యోనిః ఏకారము। కమలా ఈకారము।

వజ్రపాణిః లకారము । గుహా హ్రీంకారము । హసా- హవి । మాతరిశ్వా కకారము । అభ్రం హకారము । ఇంద్రః లకారము । పునర్గుహా హ్రీంకారము । సకలావకల । మాయా హ్రీంకారము । జగన్మాతయగుఈ ఆదివిద్య విశేషముగా పూజింపతగినది. కనుకనే అతిరహస్యమని సమర్థింపబడినది.

హృల్లేఖాయాః స్వరూపంతు వ్యోమాగ్ని ర్వామలోచనా ।
బింద్వర్థచంద్రరోధిన్యో నాదనాదాంతశక్తయః ॥12॥ వ్యాపికా
సమనోన్మన్య ఇతి ద్వాదశసంహతిః । బింద్వాదీనాం నవానాం
తు సమష్టిర్నాదఉచ్యతే ॥ 13 ॥

తా॥ హ్రీంకారము హ్, ర్, ఈ, బిందువు అర్ధచంద్రుడు రోధిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మని యను పండ్రెండుస్వరూపములుగలిగియున్నది. బిందువు మొదలుకొని ఉన్మన్యంతమువరకుగల తొమ్మిదింటికి నాదమని పేరు. ఈతొమ్మిది సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ, కాలములచే నుచ్చరింపబడు ధ్వనివిశేషములని, లేక అక్షరవిశేషములని చెప్పబడుచున్నవి.

ప్రథమేऽష్టాదశవర్ణా ద్వావింశతిరక్షరాణి మధ్యే స్యుః ।
ప్రథమేన తుల్యమంత్యా సంఘాతేనాష్టపంచాశత్ ॥ 14 ॥

తా॥ అచ్చుతోకూడిన హల్లు రెండువర్ణములును, అచ్చు ఒకవర్ణమును, గనుక మొదటికూటమునందు "క" వర్ణముకు 3 "ల" వర్ణమునకు 2 "ఏ" వర్ణముకు 1 "ఈ" వర్ణముకు 1 హ్రీంకారమునకు 12ను కలిసి మొత్తము పదునెనిమిది. రెండవకూటమునందు "హ,స,క,హ,ల వర్ణములకు ఒక్కొక్కదానికి రెండుచొ॥ పది. హ్రీంకారమునకు 12 మొత్తము 22 । మూడవ

కూటమునందు "స,క,ల" అను వర్ణములును 6 । హ్రీంకారమునకు 12 మొత్తము 18.

వర్ణములనుచ్చరించవలసిన కాలము ॥

మాత్రాద్వితయోచ్చార్యా కామకలాంచ త్రికోణాచ । బిందురహిత హృల్లేఖా మాత్రాకాల త్రయోచ్చార్యాః ॥ ౧౫ ॥
అన్యేషాంవర్ణానాం మాత్రాకాలోర్ధమాత్రయాసహితః । బిందోరర్ధం మాత్రా పరేపరేచాపి పూర్వపూర్వార్ధా ॥ ౧౬ ॥
సంహత్యైకలవో నోమాత్రాకాలస్య నాదస్య ॥

తా॥ లఘుఅక్షరమునకు ఒకమాత్రకాలమును, గుర్వక్షరములకు రెండుమాత్రలకాలమును, కేవలహల్లులకు అర్ధమాత్రకాలమును కనుక "ఏ, ఈ" లకు రెండేసిమాత్రల కాలము— బిందువులేని "హ్రీ" కారమునకు మూడుమాత్రలకాలము. ("హ్రీ"లోని "హ్,ర్" అనువానికి ఒకమాత్రకాలము । ఈకారమునకు రెండుమాత్రలకాలము") అకారములో కలిసినతక్కిన పదియక్షరములకు ఒక్కొకదానికి ఒకటిన్నరమాత్రలకాలము బిందువు వ్యంజనమగుటచేత మాత్రలో అర్ధకాలము । అనంతరము క్రమముగా అర్ధచంద్రుడు, రోధిని, మొదలగునవి వెనుకనున్నవానికాలములో సగముసగముకలవి అనగా బిందువు యొక్కకాలములో సగము అర్ధచంద్రునికి, అర్ధచంద్రుని కాలములో సగము రోధినికి । ఈక్రమముగానే కాలముకలదు। రెండువందలయేబదియారు (256) లవములు ఒకమాత్రకాలము । లవమనగా తామరాకును సన్ననూదిచేత గ్రుచ్చుటకు పట్టినకాలము । కనుక అర్ధమాత్రముగల బిందువునకు 128 లవములు । అర్ధచంద్రునికి 64, రోధినికి 32, నాదమునకు 16,

నాదాంతమునకు 8, శక్తికి 4, వ్యాపికకు 2 లవములు। సమనకు ఒకలవము। ఉన్మనికి కాలనులేదు॥

ఏకాదశవాక్కూటే సార్ధా ఏకాదశోదితా మధ్యే॥ 17॥
సార్ధా అష్టాశక్తావేకైకలవ్యూనితా మాత్రాః। సంహాత్యైక త్రింశన్మాత్రా మంత్రే లవత్రియన్యూనాః॥ 18॥

తా॥ మొదటిది వాగ్భవకూటము। రెండవది కామరాజకూటము। మూడవది శక్తికూటము। మొదటికూటములోని "క" వర్ణమునకు 1½ లవర్ణమునకు 1½ "ఏ, ఈ" లకు ఒక్కొక దానికి రెండు మా॥ 4 హ్రీంకి 3. బిందువు మొదలుకొని ఉన్మన్యంతమువరకు ఒకలవము తక్కువ ఒకమాత్ర। మొత్తము ఒకలవముతక్కువ పదునొకండుమాత్రలు। రెండవకూటమునందు హ్రీంకారమునకు ఒకలవముతక్కువ నాలుగు। తక్కిన అయిదువర్ణములకు ఒక్కొకదానికి పకటిన్నరచొ॥ యేడున్నర। మొత్తము ఒకలవముతక్కువ 11½ మాత్రలు। మూడవకూటమునందు పైవిధముననే ఒకలవముతక్కువ యెనిమిదిన్నర। మొత్తము మూడులవములుతక్కువ ముప్పదియొకమాత్రలకాలములో మంత్రము ఒకమారుచ్చరింపవలెను॥ 18॥

అక్షరములయొక్క ఉత్పత్తిస్థానమును,
యత్నములను చెప్పుచున్నారు॥

కంఠేచ కంఠతాలుని తాలుని దంతేషు మూర్ధ్ని నాసాయాం
స్పృష్టవివారాద్యాంతరబాహ్యైర్యత్నైస్తదక్షరోత్పత్తిః॥ 19

తా॥ కకారములు మూడును, హ్రీంకారములలోని హకారములు మూడును, రెండవకూటములోని హకారములు రెండును, వాల్గులవిూదనుండిన అకారములు పదియును, కంఠస్థాన

మునందును, ఏకారము కంఠతాలువ్వనందును, హ్రీంకారము
లలోని మూర్ధను ఈకారములును, మొదటికూటములోని ఈకా
రమును తాలువ్వనంమును, లకార సకారములు దంతముల
యందును, హ్రీంకారములలోని రేఫలు శిరస్సునందును, బిం
ద్వాదినవకములు మూడును నాసికయందును ఉత్పన్నమగును॥
క కారములు స్పృష్టమనడియు, ఈకారములు, ఏకారము
వివృతమనడియు, రేఫ, లకారములు ఈషత్స్పృష్టమనడియు,
హకార, సకారములు ఈషద్వివృతమనడియు, బిందువుమొద
లగు తొమ్మిది, విశేషముగా సంవృతమనడియు, ప్రయత్నము
లుకలవి। ఈక్రమముగా నీవర్ణములకు లోపలప్రయత్నము॥
క కారములు- వివార, శ్వాస, అఘోష, అనడి బాహ్యా
యత్నముకలవి। సకారములు—మహాప్రాణమనడు బాహ్యాయ
త్నముకలవియు, వివారమనడు ప్రయత్నముకలవియును, అన్ని
అచ్చులు ఉదాత్తమనే బాహ్యాయత్నముకలవి। రేఫ, లకార
ములు- సంవార, నాద, ఘోష, అల్పప్రాణమనడు బాహ్యా
యత్నముకలవి। హకారములు—సంవార, నాద, ఘోషమన
డు బాహ్యాయత్నములు। మహాప్రాణమనడు బాహ్యాయత్న
మును కలవి। బిందువుమొదలగునవి అత్యంతమునుండెడి సం
వార, నాద, ఘోష, మహాప్రాణమనడు నాలుగు బాహ్యాయ
త్నములు కలవి। ఈవర్ణములకు ఇవి వెలపలయత్నములు॥19॥

మంత్రవర్ణములయొక్క స్థితిని, స్థానమును,
రూపమును, ఆకారమును చెప్పుచున్నారు॥

ప్రళయాగ్నినిభం ప్రథమంమూలాధారాదనాహతంస్పృశతి
తస్మాదాజ్ఞాచక్రం ద్వితీయకూటంతు కోటిసూర్యాభం॥ 20॥

తస్మాల్లలాటమధ్యం తార్తీయం కోటిచంద్రాభం। మాలామణివద్వర్ణాః క్రమేణ భావ్యా ఉపర్యుపరి ॥ 21 ॥

తా॥ మొదటికూటము ప్రళయకాలమందైన అగ్నివలెనే కాంతిగలిగి మూలాధారము మొదలుకొని అనాహతము (హృదయము) వరకును, రెండవకూటము కోటిసూర్యులకాంతికలిగి అనాహతము మొదలుకొని ఆజ్ఞాచక్రము (భ్రూమధ్యము) వరకును, మూడవకూటము కోటిచంద్రులకాంతికలిగి ఆజ్ఞాచక్రము మొదలుకొని లలాటమధ్యమువరకును ప్రకాశించుచున్నది॥ మాలికలోనుండు మాణిక్యములువలెనే మూడుకూటములలోనుండు వర్ణములు వరుసగా ఒకఅక్షరముమీద మరియొకయక్షరమున్నట్లుల భావనచేయవలయును। బింద్వాదినవకమునకుముందు చెప్పబడును. సహస్రారమందున్న సుషుమ్నయను నాడి తనస్థానమునుండి మూలాధారమువరకును, మూలాధారమునుండి సహస్రారమువరకును తిరుగుచుండును. మూలాధార సహస్రారములమధ్యను ఎనిమిది, ఆరు, మొదలగుదళములుగల ముప్పది పద్మములున్నవని సవిస్తరముగా స్వచ్ఛందసంగ్రహాది గ్రంథములయందు చెప్పబడినది।

మూలాధారమనెడు నాలుగుదళములపద్మము గుదస్థానము కంటె రెండుఅంగుళములమీదను, స్వాధిష్ఠానమనెడు ఆరుదళములపద్మము లింగమందును, మణిపూరమనే పదిదళముల పద్మము నాభియందును, అనాహతమనే పండ్రెండుదళముల పద్మము హృదయమందును, విశుద్ధమనే 16 దళములపద్మము కంఠమందును, ఆజ్ఞాచక్రమనే రెండుదళముల పద్మము భ్రూమధ్యమందును ఉండును.

రెండురెండుగ్రంథులచేతను మధ్యయందు వ్యాపింపబడిన చక్రముల నే పేరుగలిగిన ఆఱుపద్మములున్న వని అస్పష్ట సవిస్తరముగా చెప్పబడెను॥ 21 ॥

శ్లో॥ ఆధారోత్థితనాదో గుణఇవ పరిభాతి వర్ణమధ్యగతః।

తా॥ మూలాధారమునుండి బయలుదేరిన నాదము ఈఅక్షరములమధ్యను (మణులమధ్యనున్న సూత్రమువలెనే) ప్రకాశించును. శబ్దసృష్టియొక్క ప్రక్రియ ఎట్లనగా— మఱ్ఱివిత్తనములో నున్న మఱ్ఱిచెట్టుయొక్క సూక్ష్మరూపముతో సమానమయి నట్టి శబ్దసృష్టియొక్క సూక్ష్మరూపశాలియగు త్రిపురసుందరియె అట్టిసూక్ష్మముగల ప్రసృతి, నిమిత్తక, మగు, పరా శబ్దము చేత చెప్పబడుచున్నది. తెలిసికొనునది, తరింపచేయునది, ప్రకాశింపచేయునది అను అర్థములచేత ఆమెయే మాతృకయని చెప్పబడును.

ఘటమునందు మృత్తువలెనే అక్షరములయందు నాదమును అనుసరించియున్నది. అట్టినాదము ప్రతిరెండక్షరములయొక్క మధ్యభాగమందును, ప్రతిఅక్షరముయొక్క లోపలిభాగమందును, (రెండుమణులయొక్క మధ్యయందున్న పరిశుద్ధధారము వలెనే) ప్రకాశించును. మిగిలిన బిందువుమొదలుకొని ఉన్మన్యంతమువరకుగల తొమ్మిదింటియొక్క స్థితిని, స్థానమును, రూపమును, ఆకారమును చెప్పుచున్నారు.

శ్లో॥ మధ్యే ఫాలం బిందుర్దీపఇవాభాతి వర్తులాకారః॥22॥ తదుపరి మతోర్ధచంద్రోస్వర్థః కాంత్యా తథాకృత్యా। అధరో ధోశి త్తదూర్ధ్వం త్రికోణరూపాచ చంద్రికాకాంతిః॥23॥ నాదస్తు పద్మరాగపదంపద్మోయుమధ్యవర్తిశివసిరా॥ నాదాంతస్తటిదా

భః సవ్యస్థితబిందుయుక్తలాంగలవత్ ॥24॥ తిర్యక్బిందుద్వితయే వామోర్ధ్వచ్ఛత్రిరాకృతిశ్శక్తిః । బిందూర్ధ్వచ్ఛత్ర్యశ్రాకారాథ వ్యాపికా ప్రోక్తా ॥25॥ ఊర్ధ్వాధోబిందుద్వయరేఖాకృతిస్సమనా । స్యైవోర్ధ్వబిందుహీనోన్మనా తదూర్ధ్వం మహాబిందుః ॥ 26॥ శక్త్యాదీనాం తు వపుర్ద్వాదశరవికాంతిపుంజాభం ॥ 26½ ॥

తాత్పర్యము.

బిందువు—ఫాలమధ్యమందు దీపమువలె కాంతికలిగి గుండ్రముగానున్నది.

అర్ధచంద్రుడు—బిందువుపైని కాంతిచేతను, ఆకారముచేతను, అర్ధచంద్రునివలెనున్నది.

రోధిని—అర్ధచంద్రునిపైని వెన్నెలవలెకాంతికలిగి త్రికోణరూపముగా నున్నది.

నాదము—పద్మరాగకాంతికలిగి బిందుద్వయమధ్యవర్తిగానున్న సిర (లింగము) వలె నున్నది.

నాదాంతము—మెరుపువలె కాంతియు, యెడమభాగమునందు బిందువునుకలిగి నాగలివలె నున్నది. నాగలిమీద అగ్రము వక్రీభవించుగలది.

శక్తి—అడ్డముగానుండు రెండుబిందువులలో యెడమభాగబిందువుపైని ఊర్ధ్వముగా బయలుదేరు సిరయొక్క ఆకారముగలది.

వ్యాపిక—బిందువుతోకలిపికొనిన త్రికోణముయొక్క ఆకారము కలది. 25॥

సమన—మీదను క్రిందను బిందువులతోకూడిన రేఖయొక్క ఆకారముకలది.

ఉన్మని—మీఁదను బిందువు లేకుండ క్రిందబిందువుతో కూడిన రేఖ యొక్క ఆకారముగల సమనయే ఉన్మని యన బడును. అనగా రూపాంతరమును పొందిన మన స్సును నిలువునదే ఉన్మనియనబడును. ఉన్మనికి పైని మహాబిందువు కలదు. 26॥

శక్తి, వ్యాపిక, సమన అనునవి చంద్రసూర్యులయొ క్క కాంతికలవి.

బింద్వాదిస్వరూపములు స్వచ్ఛంద సంగ్రహమునందు సవిస్తరముగా చెప్పబడినవి.

శ్లో॥ ఇత్యేవం వర్ణానాం స్థానం జ్ఞాత్వోచ్చరేద్యత్నాత్ ॥27

తా॥ ఇట్లు ప్రతిఅక్షరమునకును, ఉత్పత్తిస్థానమును, స్థితి స్థానమును తెలిసికొని అంతరబాహ్యప్రయత్నములతో నుచ్చ రింపవలయును.

మానసికజపమునందు ఉచ్చారణలేనందున నీనియమము లేదు. గాని అపుడును వర్ణములయొక్క స్థానములను, యత్న ములను భావనమాత్రము చేయవలయును.

నాదః ప్రాథమికస్తు ద్వితీయకూటేన సాకముచ్చార్యః।
ద్వితీయాకం నాదం తార్తీయేనోచ్చరేన్నపృథక్ ॥ 28॥

తా॥ మొదటికూటమందైన బింద్వాదినవకముయొక్క నాద ము రెండవకూటముతోను, రెండవకూటముయొక్క ఆనాద మును మూడవకూటముతోను కలిపి ఉచ్చరింపవలయును. కాని వేరుగానుచ్చరింపరాదు.

బింద్వాది నవకయోస్తు ప్రాక్తనకూటస్థయో రనయోః।
సంమేలనేన శబలం తార్తీయాకం విభావయేత్కూటం ॥ 29॥

తా॥ బింద్వాది నవకనాదము మొదటిరెండుకూటములయం దంతర్భూతముగను, మూడవకూటమునందు స్పష్టముగాను భావింపవలెను.

బింద్వాదికసమనాంతం క్రమేణ తార్తీయముచ్చరేన్నాదం
ఉన్మన్యంతర్లీనం విభావయేదేతదుచ్చరణం ॥ 30 ॥

తా॥ మూడవకూటమునందు బిందువుమొదలుకొని సమన వరకు క్రమముగా నాదమునుచ్చరించుచు దీనిని ఉన్మనియందు లీనమయినటుల భావింపవలెను.

ఇదివరకు విద్యయొక్క స్వరూపకాలము చెప్పబడినది।
ఇప్పుడుచ్చారణకాలమును చెప్పుచున్నారు॥

ఆద్యే దశ మధ్యే తాః సార్ధాస్తార్తీయకూటేఒన్త్యే।
ఏకలవోనా ఊనత్రింశన్మాత్రా మనోర్జపేకాలః ॥ 31 ॥

మొదటికూటమునందు పది। రెండవకూటమునందు పదిన్నర మూడవకూటమునందు ఒకలవముతక్కువ యెనిమిదిన్నర మాత్రలకాలము। కనుక ఒకమారు మంత్రముజపించుటకు ఒకలవ ముతక్కువ యిరువదితొమ్మిదిమాత్రలకాలము పట్టును. ఈ కాలాదులు వాచికజపమునకేగాని మానసికజపమునకు కాదు. జపకాలమునందుగాక, సంధ్యావందనాదులయందును, న్యాసాదులయందును, ప్రత్యేకకూటము నుచ్చరించునపుడు మొదటి రెండుకూటములయందుకూడ బింద్వాదులనుచ్చరింపవలెను॥

అ॥ ఈకూటములకు వ్యష్టి సమష్టిభేదములచే నాలుగువిధ ములుగానున్న స్వరూపవిశేషమును చెప్పుచున్నారు॥

వ్యష్టిసమష్టివిభేదాదస్యాం చత్వారి బీజాని।
సృష్టిస్థితి సంహారానాఖ్యా రూపాణి భావయేన్మాని ॥ 32 ॥

తా॥ ఈకూటములందు వ్యష్టి సమష్టిభేదములవలన నాలుగుబీజములు. సృష్టి, స్థితి, సంహార, అనాఖ్య యను నాలుగు రూపములుగా భావింపతగినవి. అనాఖ్య అనగా తిరోధాన, అనుగ్రహములయొక్క సమష్టి. లేక ఉదాసీనావస్థతో కలసిన సృష్టి, స్థితి, లయము, లయినను నాలుగు ॥ మూడుకూటములును వ్యష్టిచేత మూడుబీజములు। సమష్టిచేత ఒకేబీజము। మొత్తమునాలుగు ॥

పుట ధామ తత్త్వపీఠాన్వయ లింగక మాతృతత్సమష్టీనాం।
రూపాంతరాణి బీజాన్యమూని చత్వారి చింతనీయాని ॥33॥

తా॥ పుట, ధామ, తత్త్వ, పీఠ, అన్వయ, లింగ, మాతృ, అనువానికిని, వీనియొక్కసమష్టికిని, రూపాంతరములుగా నాలుగుబీజముల నాలోచింపతగినవి.

(1) పుటములు, జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయరూపములు, తత్సమష్టి ఒకటియు,
ధామసప్తకమనగా— చక్ర, నాథ, దశా, శక్తిత్రయ, ఆత్మరూపములు. అనగా— [చక్రమును,
(2) 1 చక్రాణి—అగ్ని, సూర్య, సోమ చక్రములు, బ్రహ్మ
2 నాథాః—మిత్రేశనాథ, షష్ఠీశనాథ, ఉడ్డీశ నాథులు, చర్యానందనాథుడును, [మును,
3 దశాః—జాగ్రదవస్థ, స్వప్నము, సుషుప్తియు, తురీయ
4 శక్తయః—వామా, జ్యేష్ఠా, రౌద్రియు, శాంతయును,
5 2 ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులును, అంబికయును, [మహాత్రిపురసుందరియును,
6 3 కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలినీ శక్తులును

7 ఆత్మానః—ఆత్మ, అంతరాత్మ, పరమాత్మయు, జ్ఞానాత్మయును ఇవి ధామసప్తకము॥

(3) తత్త్వములు—ఆత్మతత్త్వము, విద్యాతత్త్వము, శివతత్త్వము, సర్వతత్త్వమును, [ఓఘ్యాణపీఠమును,

(4) పీఠములు— కామగిరి, పూర్ణగిరి, జాలంధరపీఠములు,

(5) అన్వయములు అనగా ఆమ్నాయములు. } పూర్వామ్నాయ, దక్షిణామ్నాయ, పశ్చిమామ్నాయములు, ఉత్తరామ్నాయమును,

(6) లింగములు—స్వయంభులింగము, బాణలింగము, ఇతరలింగము, పరలింగమును,

(7) మాతృకలు—పశ్యంతి, మధ్యమ, వైఖరియు, పరయును, ధామపదార్థముగా చెప్పబడిన మూడుశక్తులుకూడా మాతృకాశబ్దమునకు అర్థము.

ఇవి పుటాదిషట్కము॥ 33 ॥

ఏకైకస్మిన్కర్మణి సృష్ట్యాదివిభేదతస్త్రివిధే । బ్రహ్మాద్యా అధిపతయో భారత్యాది స్వశక్తిభిస్సహితాః ॥ 34॥

బ్రహ్మాదయస్త్రయోమీ భారత్యాద్యాశ్చ శక్తయస్త్రిస్రః ప్రత్యక్షరస్వరూపాః శాక్తాశ్చే వక్ష్యమాణయాకీత్యా ॥ 35 ॥

తా॥ సృష్టి, స్థితి, లయములనెడు మూడువిధములగు కర్మములందు సరస్వతి మొదలగు శక్తులతోకూడిన బ్రహ్మాదులు ప్రభువులు.

సృష్టికర్మము మూడువిధములు—సృష్టిలో సృష్టి, సృష్టిలో స్థితి, సృష్టిలో సంహారము అని ; [ము.

ఇట్లేస్థితికర్మము—స్థితిలో సృష్టి, స్థితిలో స్థితి, స్థితిలో సంహార

ఇట్లు సంహారకర్మయును—సంహారములో సృష్టి, సంహారములో స్థితి, సంహారములో సంహారము.

ఇచ్చట ప్రతిమూడింటియందును బ్రహ్మ, విష్ణు, రుద్రులు ముగ్గురు, భారతి, పృథివి, రుద్రాణి సయితముగా అధిపతులు.

ఇట్లయితే "క" బ్రహ్మ, "ఏ" సరస్వతి. "ఈ" విష్ణువు, "ల" లక్ష్మి, హ్రీంకారములోని "హ" రుద్రుడు, "ర్" రుద్రాణి, "ఈ" శాంతాంబికలమిథునమునని బీజస్వరూపములు। ఇవి ప్రథమకూటము। ద్వితీయకూటములోని రెండవహకారమును తీసివేయుగా మిగిలినఅక్షరములకు పైవిధముగానే అర్థము. అనగా. "హ" బ్రహ్మ, "స" సరస్వతి, "క" విష్ణువు, "ల" లక్ష్మి, హ్రీం పైవిధముగానే బీజస్వరూపములు। ఇవి ద్వితీయకూటము। రెండవకూటములోతీసి వేసిన రెండవహకారమును మూడవకూటములో మొదటచేర్చినయెడల పైప్రకారమే బీజస్వరూపములు। తృతీయకూటము శక్తికూటప్రాధాన్యము చేత ముందుగాసరస్వతీరూపమగుసకారము చేత ప్రారంభించబడెను.

మిగిలిన బిందువుమొదలగు వాని రూపమేమనగా—

శ్లో॥ హ్యాలేఖా కామకలా సపరార్ధకలాతు కుండలినీ।
నాదాశ్చక్రత్రితయత్రితయాత్మకో విభావ్యాస్యః॥

తా॥ సపరార్థకల అనగా సకారమునకు పరమందున్న అక్షరము "హ" కారము. ఆహకారము విసర్గఅని, రెండుబిందువుల స్వరూపమని చెప్పబడెను. కనుక అందులో అర్థకల ఒకబిందువు. అదియే సపరార్ధకలయనబడును. అట్టిబిందుకలమూడుహ్రీంకారములలోని ఈకారములయందుండి "కుండలి" యనబడును ఆమూడుఈకారములయందుగల మూడునాదములకు నాదమొ

కటిక మూడుచక్రములనో॥ త్రొమ్మిదిచక్రములు. ఆబిందుకల ఒకటి, రెండు, మూడు, కూటములయందు క్రమముగా వహ్ని కుండలి, సూర్యకుండలి, చంద్రకుండలి, అని చెప్పబడును. వహ్నికుండలియొక్క స్వరూపము గురుముఖమువలననే తెలిసికొనతగినది. ఆనాదము బిందువుమొదలుకొని ఉన్మనివరకుగల త్రొమ్మిదింటికి సమష్టిరూపముగానుండి దీపముయొక్క శిఖాగ్రమందు కాటుకరేఖపుట్టువిధమున నపరాగ్నికలవలననే పుట్టును. అనాహతచక్రమునుండి ఆజ్ఞాచక్రమువరకును బయలుదేరిన ప్రథమకూటమందలి నాదము, త్రైలోక్యమోహనము, సర్వాశాపరిపూరకము, సర్వసంక్షోభణము, అను చక్రనామములు గలదై సృష్టిచక్రముయొక్క నామాంతరముగనున్నది. ఆజ్ఞాచక్రమునుండి బిందుస్థానమువరకును బయలుదేరిన రెండవకూటమందలి నాదము, సర్వసౌభాగ్యదాయకము, సర్వార్థసాధకము. సర్వరక్షాకరము, అను చక్రనామములుగలదై స్థితిచక్రముయొక్క నామాంతరముగ నున్నది. బిందుస్థానమునుండి ద్వాదశాంతమువరకు బయలుదేరిననాదము, సర్వరోగహరము, సర్వసిద్ధిప్రదము, సర్వానందమయము, అను చక్రనామములు గలదై సంహారచక్రముయొక్క నామాంతరముగనున్నది. ఇట్లు భావనచేయవలయును.

అవస్థాపంచకమును, శూన్యషట్కమును, విషువత్సప్తకమును, జపకాలమునందు భావనచేయవలయునని చెప్పుచున్నారు.

శ్లో॥ ఇంద్రియదశక వ్యవహృతిరూపా యా జాగరావస్థా ।
తత్ప్రకాశరూపో హేతుర్భావ్యస్త్రితీయగే రేఫే ॥ 37 ॥

తా॥ వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలనెడి కర్మేం

ద్రియములచేతను, ఘ్రాణము, రసనము, చక్షువు, త్వక్కు, శ్రోత్రములనెడి జ్ఞానేంద్రియములచేతను వ్యవహరించబడు కాలము జాగరావస్థ. అచ్చట కారణమయిన జ్ఞానమునకు రూపము లేనందున ప్రకాశస్వరూపముగా మూడవకూట రేఫస్థానమునందు భావనచేయతగినది. ఇదియే మొదటిఅవస్థ ॥ 37 ॥

శ్లో॥ అంతఃకరణచతుష్క వ్యవహారః స్వాప్నికావస్థా ।
సా తార్తీయకూటాత్ బోధ్యాపి గలస్థలే చింత్యా ॥38

తా॥ అంతఃకరణరూపమగు మనస్సు, బుద్ధి అహంకారము, చిత్తము అనెడు నాలుగింటిచేతను వ్యవహరింపబడు కాలము స్వప్నావస్థ। దానినిపుట్టించు ప్రకాశరూపము మూడవకూటహ్రీంకారములోని ఈకారమునందు భావనచేయతగినప్పటికి ద్వితీయకూటలకారమునందే భావనచేయవలయును॥38॥

శ్లో॥ అంతరస్య వృత్తేర్లయతో లీనప్రాయస్య జీవస్య ।
వేదనమేవ సుషుప్తిః చింత్యా తార్తీయబిందావా॥39

తా॥ చిత్తవృత్తినాశమువలన నశించినవానితో సమానమగు జీవునియొక్క అవస్థయే సుషుప్తియనబడును। దానిని మూడవకూటబిందువునందు అనగా లలాటస్థానమునందు భావింపతగినది॥

వివరణమతమందు ఆత్మ, సుఖాజ్ఞానములు విషయముగాగల అవిద్యావృత్తులు మూడును స్వీకరింపబడినవి. వృత్తియనగ అంతఃకరణపరిణామము. వార్త్తికమతమందు వృత్తిశూన్యమే సుషుప్తి ॥ 39 ॥

శ్లో॥ తుర్యావస్థా చిదభివ్యంజకనాదస్య వేదనం ప్రోక్తం।
తద్భావనార్ధచంద్రాదికం వ్యాప్య కర్తవ్యా ॥ 40 ॥

తా॥ జ్ఞానమును ప్రకటనచేయు నాదమును తెలిసికొనుట తుర్యావస్థ అనబడును. అట్టి ప్రకాశరూపము అర్ధచంద్ర, రోధిని నాదము అను మూడింటియందు వ్యాపించినదిగా భావనచేయ వలయును.

శ్లో॥ ఆనందైకఘనత్వం యద్వాచామపి నగోచరోస్థానాం।
తుర్యాతీతావస్థా సా నాదాంతాది పంచకే విభావ్యా ॥41॥

తా॥ పూర్ణమగు ఆనందావస్థ నరులకు చెప్పనలవికాదు. అట్టి తుర్యాతీతావస్థ యనెడు ప్రకాశస్వరూపమును నాదాంతము, శక్తి, వ్యాపిని, సమన, ఉన్మని యను నయిదుస్థానముల యందును భావనచేయవలయును ॥41॥

శూన్యషట్కమును చెప్పుచున్నారు॥

శ్లో॥ తార్తీయీకే రేఫస్థానే బిందౌచ రోధిన్యాం నాదాం
తవ్యాపికయోః పంచప్రకటితాని పంచశూన్యాని ॥ 42 ॥
ఉన్మన్యాఖ్యంరూపం షష్ఠం చింత్యం మహాశూన్యం ।

తా॥ మూడవకూటమందలి హ్రీంకారములోని రేఫస్థానము బిందువు, రోధిని, నాదాంతము, వ్యాపిక, అను అయిదింటియం దును నెమలిపింఛమందుండు కన్నులతో సమానములగు అయిదు శూన్యములును, ఉన్మనియను స్వరూపములేని ఆరవశూన్య మును భావనచేయవలయును. నెమలిపింఛముయొక్క అగ్రమును బొందిన చంద్రునివలె ఆకారముగలది శూన్యము. అదే స్వచ్ఛందసంగ్రహమునందు నెమలిపింఛమువలెనే చమత్కార మగు మండలముతో కూడుకొనిన శూన్యపంచకమును ధ్యాన ము చేయువానికి పరమందు ఆకాశస్వరూపమువలె సర్వోత్కృష్ట గల గొప్పశూన్యము భాసించుచున్నదని చెప్పబడినది ॥ 42 ॥

విషువత్స్వరూపము॥

ప్రాణాత్మమానసానాం సంయోగః ప్రాణవిషువాఖ్యః ॥43॥

తా॥ ప్రాణములకు, ఆత్మకు, మనస్సుకు, ఐక్యము చేయుటయే ప్రాణవిషువము. అకారాది అక్షరరూపమగు వాయువే ప్రాణవిషువమని కొందరిమతము. మంత్రవిషువము॥

ప్రాథమికకూటనాదే త్వనాహతాద్బ్రహ్మరంధ్రాంతే ।
వ్యష్టిసమష్టివిభేదాత్ బీజచతుష్కస్యచ స్వస్య ॥ 44 ॥
ఐక్యేన నాదమయతా విభావనం మంత్రవిషువాఖ్యం ।

తా॥ తనయొక్క మూలాధారమునుండి బయలుదేరిన నాదమును, ప్రథమకూటసంబంధమగు నాలుగుబీజములతోను, ప్రథమకూటనాదముతోను ఐక్యముచేసి అనాహతము మొదలు బ్రహ్మరంధ్రమువరకు వ్యష్టి, సమష్టి, అనుభేదమువలన నాదమును భావనచేయుట మంత్రవిషువము ॥

నాడీవిషువము॥

ఆధారోత్థితనాదస్యోచ్చారాత్ బ్రహ్మరంధ్రాంతం ॥45॥
షట్చక్రాణాం గ్రంథీన్ ద్వాదశభిందన్ సుషుమ్నయైవ
తథా నాడినాదార్ణానాం సంయోగో నాడికావిషువం ॥ 46॥

తా॥ మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ, అనెడు ఆరుచక్రములకు ఒక్కొక్క చక్రమునకు క్రిందను, మీదను, రెండురెండు చొ౹ పండ్రెండు గ్రంథులు। వానిని భేదించుచు సుషుమ్నానాడి మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమును పొందుచున్నది। అట్టిమార్గముచేతనే సుషుమ్నానాడి నాదములకు, వర్ణములకు కలసియున్నట్లు భావనచేయుచు ఉచ్చరించుట నాడీవిషువము ॥45-46॥

## ప్రశాంతవిషువము॥

రేఫకామకలార్ధే హార్ధకలాయాంచ బిందావినా ।
నాదాంతావధినాదః సూక్ష్మతరో జాయతే తత్ర ॥ 47॥
శక్తేర్మధ్యే తల్లయచింతనముదితం ప్రశాంతవిషువాఖ్యా ।

తా॥ మూలాధారమునుండి బయలుదేరిన నాదము మూడవకూటమందలి రేఫ, ఈకార, హార్ధకల, బిందు, అర్ధచంద్ర, రోధిని, నాదమనెడు స్థానములయందును, నాదాంతపర్యంతమును, మిక్కిలిసూక్ష్మముగనుండును. ఆనాదము శక్తియొక్క మధ్యమున లీనమయినటుల భావనచేయుట ప్రశాంతవిషువము అట్టినాదముయొక్క ధ్వని కంచుతాళము కొట్టినతరువాత క్రమముగా ఆఖరుకాలముయొక్క ధ్వనివలెనుండును.

## శక్తి, కాల, విషువములు॥

శక్త్యంతర్గతనాదం సమనాయాం భావయేల్లీనం ॥ 48 ॥
శక్తిస్థానాదూర్ధ్వం పునరప్యుజ్జీవితస్య నాదస్య ।
సమనాగతమున్మన్యామేతే ద్వే శక్తి కాలవిషువాఖ్యే ॥ 49॥

తా॥ శక్తియొక్క లోపలనున్న నాదము మిక్కిలిసూక్ష్మముగా వ్యాపికను అతిక్రమించి, సమనయందు లీనమగుట శక్తివిషువము. సమనకు పరమందు మిక్కిలిసూక్ష్మముగా ఉన్మనియందు లీనమగునాదము కాలవిషువము ॥

## తత్వవిషువము॥

శ్రీవిద్యాకూటావయవేషు కకారాదిషూన్మనాంతేషు ।
అకులాదికోన్మనా తత్ప్రదేశసంస్థేషు కమలేషు ॥ 50 ॥
అధ్యుష్టనిమేషోత్తరసప్తదశాధికశతత్రయత్రుటిభిః ।
ఉచ్చరితే నాదేసతి తస్యాంతే తత్వవేదనం భవతి ॥ 51 ॥

తదిదం చైతన్యాభివ్యక్తిస్థానంతు తత్త్వవిషువాఖ్యం ॥51॥

తా॥ కకారాదులు మూలాధారము మొదలుకొని ఉన్మన్యంతమువరకుగల కూటములయొక్క అవయవములయందును, అకులాదికములు, ఉన్మనియుగల ఆయాప్రదేశకమలముల యందును, 10817 త్రుటులపర్యంతము నాదము నుచ్చరింపగా తత్త్వజ్ఞానము గుచున్నది. బ్రహ్మనాడీద్వారమునకు కారణమగు ఈయుచ్చారణ తత్త్వవిషువమనబడును. చెప్పబడిన 32 పద్మములలో క్రిందనున్న రెండును, అన్నిటికంటె పైనున్నదియు అకులపద్మములు. మిగిలినవి కులపద్మములు. ఆలోచింపగా మూలాధారమనెడు అకులపద్మమువలననే మంత్రముయొక్క అక్షరములకు ప్రారంభమగును. కాని చక్రరాజముయొక్క సకలాఖ్యభావన క్రింది సహస్రదలకమలము మొదలుకొని ఆరంభమని (అకులే విషుసంజ్ఞే చ) ఇత్యాదినా। చతుశ్శతి (సేతుబంధము) యందు చెప్పుటచేతను, చక్రమునకును, మంత్రమునకును, అభేదముచేత మంత్రమునకుకూడా క్రిందిసహస్రారమువలనే ఆరంభమని తంత్రములయందు చెప్పబడినది.

అర్ధ్యుష్టమనగా మూడున్నర। నిమేషమనగా నేత్రముయొక్క రెప్పపాటుకాలము। మూడువేలత్రుటులు ఒకనిమేషము। “స్వస్థే నరే సమాసీనే యావత్స్పందతి లోచనం। తస్య త్రింశత్తమో భాగః తత్పరః పరికీర్తితః॥ తత్పరస్య శతాంశస్తు త్రుటిరిత్యభిధీయతే” ఈవచనమునందు మనుష్యుడు స్వస్థచిత్తుడై కూర్చుండియుండగా నేత్రముయొక్క రెప్ప యెంతకాలములో వాల్చబడునో అదినిమేషమనియు, ఆనిమేషములో ముప్పదియవభాగము తత్పరమనియు, దానిలో నూరవభాగము త్రుటి

యనియు చెప్పబడెను. ఇట్లు 10817 త్రుటులపర్యంతము మంత్రముయొక్క అవయవములను, స్థానములను, కలిపి నాదమును చ్ఛారణచేయగా తనకును, బ్రహ్మమునకును, అభేదమనే బోధ యగుచున్నది. ఇట్లుచ్చరించుట తత్త్వవిషువము ॥ 51॥

ఏవమవస్థాశూన్యే విషువచ్చక్రాణి పంచషట్సప్తనవచ ।
మనోరర్థాంశ్చ స్మరతోర్ణోచ్చారణంతు జపః ॥ 52 ॥

తా॥ ఈవిధముగా 5 అవస్థలను, 6 శూన్యములను, 7 విషువములను, 9 చక్రములను, మంత్రముయొక్క 15 అర్థములను స్మరించుచు అక్షరములను ఉచ్చరించుటయే జపము ॥

మూడునాదములును, మూడుచక్రములుగా భావింపుమని పూర్వమందే చెప్పబడెను. చక్రసంకేతమనెడు గ్రంథమునందు సకల, నిష్కల, సకలనిష్కల మని చక్రభావన మూడువిధములుగాఁగూడ చెప్పబడినది.

అకులసహస్రారము, మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము. అనెడు ఆరుచక్రములయందును, సూక్ష్మజిహ్వ, భ్రూమధ్యము, బిందుస్థానములయందును, మొత్తము 9 స్థానములయందును, త్రైలోక్యమోహనము, 2 సర్వాశాపరిపూరకము, 3 సర్వసంక్షోభణము, 4 సర్వసౌభాగ్యదాయకము, 5 సర్వార్థసాధకము. 6 సర్వరక్షాకరము 7 సర్వరోగహరము, 8 సర్వసిద్ధిప్రదము, 9 సర్వానందమయము అను 9 చక్రములను భావించుట సకలభావనయనబడును.

బిందువు, అర్థచంద్రము, రోధిని, నాదము, నాదాంతము, శక్తి, వ్యాపిక, సమన, ఉన్మనులయందు తొమ్మిదిచక్రములను భావించుట నిష్కలభావన.

ఉన్మన్యంతముసంగాగల మహాబిందువునందే 9 చక్రములను భావించుట సకలనిష్కళభావన.

ఇట్లు మంత్రముయొక్క అర్థములను భావించువారికి మంత్రమందైన 58 అక్షరములలో మొదటి రెండు కూటములయందున్న బిందువుమొదలగు 18ని విడిచి మిగిలిన 40 అక్షరములనుచ్చరించుటయే జపమనబడును.

అంతరవరివస్య—రెండవఅంశము॥

అ॥ పంచదశికి అక్షరములవలెనే యర్థములును పదునయిదుగలవు॥

మొదటిది పూర్ణగాయత్రియొక్క అర్థము। 2 భావార్థము, 3 సంప్రదాయార్థము, 4 నిగర్భార్థము, 5 కౌలికార్థము, 6 రహస్యార్థము, 7 మహాతత్త్వార్థము. 8 నామార్థము, 9 శబ్దరూపార్థము, 10 నామైకదేశార్థము, 11 శాక్తార్థము, 12 సామరస్యార్థము, 13 సమస్తార్థము, 14 సగుణార్థము, 15 మహావాక్యార్థము. వీనిలో మొదటిఅర్థము 13వ ప్రకరణమునందును, 7-15 అర్థములు పదునయిదవప్రకరణమునందును వ్రాయబడును.

భావార్థము మొదలగు ఆరు అర్థములు యోగినీహృదయోక్త ప్రకారము చెప్పబడుచున్నవి.

2 భావార్థము॥

వామేచ్ఛా బ్రహ్మభారత్యౌ జ్యేష్ఠాజ్ఞానే హరిక్షితీ।
రౌద్రీ క్రియా శివాపర్ణే ఇత్యేతస్మిన్ఘనత్రయం॥ 11॥
త్రిభిఃకూటైః క్రమాద్వాచ్య మీంకారత్రితయే నతు।
ఏతత్త్రయసమష్ట్యాత్మ వాచ్యం శాంతాంబికాత్మకం॥ 12॥

తా॥ ప్రకాశయొక్క అంశభూతములగు వామ, జ్యేష్ఠ, రౌద్రి

యను శక్తులుమూడును, బ్రహ్మ, విష్ణు, రుద్రులు అను పురుష రూపములుగనున్నవి. వీనిసమష్టి శక్తి శాంతయనబడును.

విమర్శయొక్క అంశభూతములగు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శక్తులుమూడును, బ్రహ్మాదులభార్యలగు సరస్వతి, పృథివి, పార్వతి, అను ప్రసిద్ధమగు స్త్రీరూపములుగనున్నవి. వీనియొక్క సమష్టి శక్తి అంబికయనబడును. వీనిలో మొదటిమూడు మిథునములు క్రమముగ ఈంకారముగాక మిగిలిన మూడుకూటములకు వరుసగా ఒక్కొకకూటమునకు ఒక్కొకమిథునము అర్థము. ఈంకారములకు నాలగవమిథునమగు శాంతాంబికలు అర్థము. ముందు చెప్పబోవు శాక్తార్థమందైతే ప్రతికూటములోను రేఫాంతమువరకుగల ఆరువర్ణములకును, మొదటిమూడుమిథునములును అర్థము. ఈభావార్థమునకును, శాక్తార్థమునకును, ఇట్టిఅర్థభేదముకలదు. ఇందుకు యోగినీహృదయమునందు— "అక్షరార్థోహి భావార్థః కేవలః పరమేశ్వరి। యోగినీభిః తథావీరై ర్వీరేంద్రైః సర్వదాప్రియె। శివశక్తిసమాయోగాజ్జనితో మంత్రరాజకః" అను శ్లోకమునందు సరస్వతిమొదలగు యోగినులతోను, వీరేంద్రులయి ఉపాసనశ్రేష్ఠులగు బ్రహ్మాదులతోను, వీరులైన ఉపాసకులతోను, శివశక్తులయొక్క సమష్టితోను, మంత్రరాజము పుట్టెను. ఉపాసకులు మూడువిధములు సకలులు, ప్రళయకలులు, విజ్ఞానకేవలులు, అని "అహమిప్రళయంకుర్వన్నిదమః ప్రతియోగినః। పరాక్రమపరో భుంక్తే స్వాత్మానమశివాపహం" అను శ్లోకమునందు ఇదంశబ్దార్థమగు సకలవస్తువులను తనయందు లయముచేయు వీడు పరాక్రమముగలవాడై సమస్తఅమంగళములను పోగొట్టునట్టి ఆత్మరూప

మును అనుభవించుచున్నాడని చెప్పబడినది. ఈమొదటను శ్లోకములందును, పరాపంచాశిక యనుగ్రంథమునందును, ఇతరస్థలములయందును, వీరశబ్దమునకు ఉపాసకులని అర్థము చెప్పబడినది. కనుక బ్రహ్మమొదలగు వీరేంద్రులు ముగ్గురు, సరస్వతి మొదలగు యోగినులు ముగ్గురు, సకలులు మొదలగుఉపాసకులు ముగ్గురు, హ్రీంకారముగాక మిగిలినమూడుకూటములందలిబీజముల చేతను క్రమముగా చెప్పబడుచున్నారు. "హ్రీంకారఉభయాత్మకః" అనువచనమువలన హ్రీంకారములకు శివశక్తుల యొక్క సమష్టిరూపమగు నాలగవమిథునము అర్థము. ఈ మంత్రరాజము ఇట్లు యోగినులు మొదలగువారితో కూడికొని యున్నదని అర్థము. పై అర్థమే చెప్పబడుచున్నది.

యద్వా గిస్సకలబ్రహ్మప్రభృతీనాం త్రయం త్రయం।
త్రికూటవాచ్యం మాయాయా స్తురీయం మిథునం మతం॥13

తా॥ లేక, పైనిచెప్పిన వీరపదము భారతీమొదలగు యోగినులకే విశేషణము. కాని స్త్రీలింగముమాత్రముకాదు. అందువలననే బ్రహ్మమొదలగువారికి వీరులయొక్క భర్తలను చెప్పనట్టి వీరేంద్రశబ్దముచేత వ్యవహారముకలిగెను.

శాస్త్రార్థమునందు భారతీ మొదలగువారిని చెప్పనట్టి ఆరు అక్షరములు, యోగిని, వీరేంద్ర, పదములచేత గ్రహింపవలయును. శివశక్తిసమాయోగమనేపదముచేత కామకల (ఈకారము) చెప్పబడినది. కామకలయందు శివశక్తులయొక్క సంబంధము సవిస్తరముగా ముందు చెప్పబడును. ఒక్కొకఆవృత్తికి వసుఅక్షరములచేతను మూడుఆవృత్తులుగల మంత్రరాజముపుట్టినది. ఈపేడుగురుదేవతలయొక్క రూపాంతరమగుటచే ఈమం

త్రము దేవతాస్వరూపమే. మంత్రమునకు పుట్టుకను అంగీకరించినను అనాదిత్వమునకు భంగము లేదు. నిర్గుణబ్రహ్మముకంటె వ్యతిరిక్తమగు సమస్తము శాస్త్రప్రామాణ్యము వలన పుట్టుక కలదే. పుట్టుకలేదియు, అనాదియునగు చిచ్ఛక్తివలె మంత్రము పుట్టుకలేని అనాది కాదు. పుట్టుకగల అనాది కావచ్చును. పుట్టుకనంగీకరించినను పరంపరా అనాదియనుటకు బాధలేదు. స్థూలసూక్ష్మరూపములుగల సర్వకార్యములు పుట్టుకకు పూర్వముకూడ కారణములోపల సూక్ష్మరూపముగ నుండుటచేత కార్యము నిత్యమని అంగీకరించుటవలన ప్రవాహానాదిత్వమును నిత్యవాక్యములకు భంగములేదు. కావున ఈరెండుపక్షములయందును చెప్పిన పుట్టుకలుగు అర్థము సమంజసము కాదు. ఉచ్చరింపబడునట్టి భారతీకంఠములందు సిద్ధమగు నీయక్షరసమష్టిరూపము పరదేవతా మంత్రమునకంటె వేఱుకాదని చెప్పుట శబ్దార్థములకు భేదములేదని వారించు మాయొక్క మతమునకు విరుద్ధముకాదు.

శ్లో॥ తన్మయీం పరమానందనందితాం స్పందరూపిణీమ్ ।
సన్నిరూపకం దేవం జ్ఞాత్వా వైరముపాసతే॥

తా॥ నిత్యానందస్వరూపమై షట్త్రింశత్తత్త్వములుగ పరిణమించినను తత్త్వములకంటె భిన్నముకాని త్రిపురసుందరిని మంత్రముకంటెను, జగత్తుకంటెను భిన్నముకాదని తెలిసి పూజింపవలయును. ఇట్లు దేవతయే మంత్రము, మంత్రమే దేవతయని రెండింటికి అభేదమును చెప్పి మాతృకలను స్తుతింపఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ శివశక్త్యాత్మసంఘట్టరూపే బ్రహ్మణి శాశ్వతే।
తత్త్వధాప్రసరాశ్లేషశాలిన్యం ద్రోపలక్షితే॥
జ్ఞాతృజ్ఞానమయాకారకరణాన్మంత్రరూపిణీం।
తేషాం సమష్టిరూపేణ పరాశక్తిస్తు మాతృకాం॥

తా॥ ఆద్యంతములు లేని చిచ్ఛక్తి కాకాక్షిన్యాయమున సగుణరూపముతో భక్తులకు అభీష్టములిచ్చునట్టి యాకారమును ధరించి గురురూపజ్ఞానస్వరూపమును మననము చేయువారిని జ్ఞానాకారమును బోధించి నిర్భయులను జేయుచు రక్షించుటవలన మంత్రమని వ్యుత్పత్త్యర్థము. శారదామొదలగు సమస్తదేవతా సమష్టిరూపమగు పరాశక్తియే మంత్రరాజమనబడును.

తత్త్వరూపురాలు, తత్త్వములకంటె భేదము లేనిది యని చెప్పుటచేత దేవతారూపమగు ప్రపంచమునకును, మంత్రమునకును భేదము లేదని సూచన చేయబడినది. ఇట్లు మంత్రమునకు, దేవతకు, ఆత్మకు, భేదము లేదని ధ్యానము చేయుచు మంత్రమును జపము చేయవలసినదని విధించుచున్నది.

ఇట్లు పరదేవతకును మంత్రమునకును అభేదమును జెప్పి మంత్రపదమునకు అవయవశక్తి గూడ గలదని చెప్పుచున్నారు.

కలిసియున్న శివశక్తులయొక్క సామరస్యరూపమయినదియు, ఆద్యంతములు లేనిదియు, బ్రహ్మముయొక్క విస్తారమగు జగద్రూపము బ్రహ్మముయొక్క సంబంధముచేత ప్రకాశించుచున్నను, జగత్తులయొక్క ఐశ్వర్యములతో బ్రహ్మము కలిసి యుండలేదు. సత్యము, జ్ఞానము, మొదలగు ధర్మములతో కలిసిన శుద్ధబ్రహ్మము ఒకటియే విషయముగాగల నిర్వికల్పకజ్ఞానముగల భక్తశ్రేష్ఠునకు జ్ఞానమగు యోబ్రహ్మాకారము కలదో

అట్టిఈకారమును చేయుటవలన, అట్టిజ్ఞానరూపముగా మననము చేయువానిని భయమునుపుట్టించునట్టి సమస్త దితిసుతపుంగవులను అనగా దైత్యములను తొలగించి రక్షించుచున్నది.

పైనిచెప్పిన అఖిలఅర్థమును సిద్ధాంతముగా శ్లోకరూపము చేత చెప్పుచున్నారు.

శ్లో॥ వామేచ్ఛాద్యా యదీకార ఇతి సప్తభిరక్షరైః ।
త్రిరావృత్తిరియం విద్యా సంజాతా తేనతన్మయీ ॥14॥
వామాది సప్తశక్తీనాం సమష్టిః పరదేవతా ।
షట్త్రింశత్తత్త్వరూపాప్యన్యా త్రియాపి నభిద్యతే ॥15॥

తా॥ వామ, ఇచ్ఛ, మొదలగుశక్తులను చెప్పునట్టి ఆరుఅక్షరములను, ఈకారమును కలిసి యేడుఅక్షరములచేత మూడు ఆవృత్తులుగల ఈపంచదశీవృత్తి దేవతాస్వరూపమయినది. అట్టి యేడుశక్తులయొక్క సమష్టిస్వరూపమును, షట్త్రింశ (36) త్తత్త్వస్వరూపమును అగు పరదేవతకును ఈకారమునకును భేదము కొంచెమైనను లేదు. మంత్రమందుగల మూడవకూటమందలి ఈకారము జ్యేష్ఠాశక్తివిన్యాసముచేతను, వామ మొదలగు శక్తులలో కలిసియుండుటచేతను హ్రీంకారములలోని ఈకారములనే చెప్పబడినందున మూడుఆవృత్తులు అనుటకు విరోధములేదు. వామ మొదలగు ఆరుశక్తులకును, ఈకారమునకును భేదములేదని శాస్త్రమందు చెప్పబడెను. ఈకారాంతమువరకుగల యేడుఅక్షరములతో భేదములేని మంత్రమునకును, షట్త్రింశ (36) త్తత్త్వరూపమగు పరదేవతకును, భేదములేదని భావార్థమందు చెప్పబడెను. కనుక శాస్త్రభావార్థములకు చాలాభేదము కలదు. లేక మంత్రరాజమనెడి శివశక్తులసమావేశమువల

ష్టమన్నది శబ్దసృష్టికి అర్థసృష్టి మూలమగుటచేత శబ్దబ్రహ్మ
ము అని చెప్పబడినను నిది ప్రకాశైకరూపమగు నిర్గుణపరబ్ర
హ్మముకంటె నన్యము కాదు. కేవలప్రకాశము సృష్టికారణము
కానేరదు. కేవలశివునకుగాని, కేవలశక్తికిగాని సృష్టికర్తలు కాజా
లరనియు. శివశక్తులసమష్టియే సృష్టిహేతువనియు, కామకలా
విలాసవ్యాఖ్యయందు చెప్పబడెను. అకారము శివస్వరూపము
శివవాచకము. హకారము శక్తిస్వరూపము శక్తివాచకము.
ఈఅకారహకారములసమష్టి పరమేశ్వరరూపమని అతిసూక్ష్మ
మనియు చెప్పబడినది. పరామేశ్వరులగువారియొక్క సృష్టికి కార
ణమగు బీజమయిన బిందువు వ్యక్తము, అవ్యక్తము, విలక్షణ
మని చెప్పబడుచున్నది. బిందువునుపుట్టించు పరబ్రహ్మ అవ్య
క్తమగు (స్పష్టముకాని) అవయవములుగల శూన్యరూపమని
చెప్పబడును. "యతో వాచో నివర్తంతే" ఇత్యాది శ్రుతుల
యందు యేబ్రహ్మమును వాక్కులుకూడా చెప్పలేక మళ్లిపో
వుచున్నవో అని చెప్పుటచేత నిర్గుణస్వరూపమని అర్థము. ఈ
శ్రుతిలో వాచః అనెడు బహువచనముచేత పరమాదులుగాని
వైఖరివరకుగల వాక్కులుగ్రహింపబడినవి. అస్మి అహమిత్యేక
మద్వైతం యత్ప్రకాశాత్మవిగ్రహమః। అకారః సర్వవర్ణాగ్ర్యః
ప్రకాశః పరమః శివః। హకారోఽన్త్యః కలారూపో విమర్శాఖ్యః
ప్రకీర్తితః। అనయోస్సామరస్యం యత్ పరస్మిన్నహమితి స్ఫుటం
అనెడు స్మృతియందు అహం అనునది ఒకటేద్వితీయవస్తువనియు
అన్ని అక్షరములలో మొదటిదగు అకారమే ప్రకాశరూపమగు
పరశివుడనియు, ఆఖరుఅక్షరమగు హకారము కల, విమర్శము
అను నామములుగల శక్తియనియు, ఈరెంటియొక్క సా

ష్టిరూపమే - ఉత్కృష్టమగు అహం అనియు స్పష్టపర్చబడినది. భగవద్గీతలలో " అక్షరాణాం అకారోస్మి 10-33 " అక్షరములలో అకారరూపుడనని చెప్పబడినది. యోగినీహృదయమునందు "శూన్యాకారాద్విసర్గాంతాత్ బిందుప్రస్పందసంపద " అనెడు శ్లోకమువల్లన అచ్చులలో 16 అక్షరముయొక్క అంత్యమునున్న శూన్యస్వరూపముగల విసర్గవల్లనే బిందువిశేషము పుట్టినదని అర్థము. విసర్గలు ఉచ్చారణయందు స్ఫుటముకాని హాకారముతో తుల్యమగుటచేతను అకారము అక్కడనుండుటచేతను 16వ అచ్చును చెప్పుట ప్రసక్తమయినది. అకారహాకారములు రెండును బిందు (నిర్గుణ) రూపములుగా తెలిసికొనవలెను.

## సృష్టిక్రమము.

సూర్యునకెదురనున్న అద్దమునందు ప్రవేశించిన సూర్యకిరణములు గోడమొదలగువానియందు స్ఫురించునట్లే, ప్రకాశరూపమగు బ్రహ్మము సృష్టినిజేయతలచి తనశక్తికి అభిముఖుడైనపుడు ఆబ్రహ్మమే శుక్లబిందురూపముగను, తచ్ఛక్తి రక్తబిందురూపముగనై మిశ్రబిందువయ్యెను. అక్కడ "హా" యొక్క అర్ధకలారూపమగు పదార్థమొకటి పుట్టును. వాచ్యము ( చెప్పదగినది) కాని యాపదార్థమును సద్గురుకృపవలననే గ్రహింపవలెనుగాని వ్రాయుటకలవికాదు. అట్టిబిందువు సమష్టిస్వరూపముచేత నొకటిగానుండి శివశక్తిసామరస్యమును స్ఫుటమయిన పేరుకలదై "కామో రవిరగ్నిసోమాత్మక" అనువాక్యమువలన అగ్నిచంద్రులయొక్క సమష్టిరూపమగు కాముడనియు, సూర్యుడనియు వ్యవహరింపబడును. ఆసమష్టిబిందువే వ్యష్టిరూపముచేత రెండుగా నున్నప్పుడు శుక్లబిందువు చంద్రుడనియు, రక్తబిందువు అగ్ని

యునియు, ఆ రెండు బిందువులయొక్క స్వరూపము విసర్గయని యు పవహరింపబడుచున్నది. కనుకనే సూర్యుడు, రాత్రి అగ్నియం దును, అమావాస్యరోజున చంద్రునియందును, ప్రవేశించునని చెప్పిన శ్రుతి వాక్యమువలన సమష్టిబిందువుకు సూర్యుడనేనామ ముసిద్ధించినది. ఈప్రకారముగా కాముడనే పేరుగల మిశ్రబిందు వు విసర్గలతో కలిసి "హా" యొక్క అర్థకలయనెడు మూడుఅవ యవములుగల ఒక పదార్థము (అణుమొదలగు పరిణామముల వలెనే) కామకలయని చెప్పబడుచున్నది. ఇదియే సమస్తప్ర పంచమునకును సృష్టిబీజము.

ఈబిందువుకుమూలభూతమగుబ్రహ్మము నాలగవబిందువని చెప్పబడును. అకారహాకారములవలన చెప్పబడుచు రూపరహి తమయిన బ్రహ్మమును కామకల వ్యక్తావ్యక్తవిలక్షణమును అహం శబ్దము చే చెప్పబడును. అహంశబ్దమునకు అకారహాకారసమష్టి యు, శివశక్తిసమష్టియు, ముఖ్యమగుఅర్థము. కనుకనే సమస్త సృష్టులు అహంశబ్దముచేత చెప్పబడుచున్నది. ఉదుంబరబీజము వలనపుట్టిన పత్రములు, పుష్పములు, ఫలములు, కీటకములు, మొదలగునవి అన్యోన్యము భేదముకలవైనను వానికి ఉదుంబర పత్రములు, ఉదుంబరకీటకములు, మొదలగు వ్యవహారమొట్లుకలి గెనో ఆప్రకారమే "బ్రహ్మవాఇదమగ్ర ఆసీత్ తదాత్మానమే వావేదహం బ్రహ్మాస్మి" 3-4-10 ఇతి బృహదారణ్యకే॥ "త్వం వా అహామహం వై త్వమసి" ఐతరేయకే। "కస్త్వమిత్యాహా మితిహోవాచ త్వమేవేదం సర్వం తస్మాదహమితి సర్వాభిధా నం" ఇతి తాపనీయే। అను శ్రుతులయందును ప్రపంచముఅహం శబ్దముచేత చెప్పబడినది. పాణినిచేతను సర్వనామములలో అస్మ

చ్ఛబ్దమునకు సత్యము అని అర్థము చెప్పబడినది. ఉపనిషత్తుల యందే మరియొకస్థలమునందు "తద్వా ఏతద్బ్రహ్మద్వయం" మొదలగు శ్రుతులచేతను అహంశబ్దమునకు బ్రహ్మమును చెప్ప బ్రహ్మముయొక్క యుపాసన పూర్ణమగు అహంభావనారూప మయినదని "హంసస్సోహం" మొదలగువానిచేత చెప్పచున్నా రు. అట్టి ఉపాసనపద్ధతి అనుగ్రహస్వరూపులగు గురుచరణము చేతనే లభించవలసినది. ఛాందోగ్యమునందు "అహమేవాధస్తా దహముపరిష్టాదహం పశ్చాదహం పురస్తాదహం దక్షిణతోఽహ ముత్తరతోఽహమేవేదం సర్వం" ఈ శ్రుతియందు అహంచేత నే శుద్ధబ్రహ్మస్వరూపము చెప్పబడినది. [illegible]పంచాశిక యందు "స్వపరావభాసనక్షమ ఆత్మా విశ్వస్య యః ప్రకాశోఽ సౌ । అహమితి స ఏకరసోఽహంతా స్ఫూర్తిః శ్రీతస్య" శుద్ధబ్ర హ్మాత్మస్వరూపము గోచరించుటకు సమర్థమయి ప్రపంచమును ప్రకా శింపచేయునట్టి యీ ఆత్మనుప్రకాశమే యిదే అహమని ప్రసిద్ధము గా చెప్పబడినది. ఆత్మస్వరూపము "అహం" రూపము చేతనున్నదని అనేక వేదవచనములు చెప్పబడినవి. "అన్యాయోఽనేకశబ్దత్వం" అనే న్యాయమువలన అకారమునకు అనేకశబ్దములర్థములగుట న్యా యమే. బిందువునందు దాని అవయవములయిన అకార హకార ములు కనుపించకపోయినను శాస్త్రనిదర్శనమువలన సూక్ష్మ రూపముతోనున్నవని స్వీకరింపవలసినది. ఇకారమునకు హార్ధ కలాసంబంధము కలిగిన యెడల దీర్ఘము వచ్చుచున్నది. కనుక ఈకారము కామకలారూపమనబడుచున్నది. ** అకార హకా రములస్వరూపమే కామకల. ఈ కామకలవలన పుట్టిన మంత్రము లో నిత్యమైన అక్షరములను వైఖరీరూపముగ (స్పష్టముగ)

లేకున్నను మరియివ్యక్తమునందును దీనికొమ్మలయందును, ఆకులయందును, ఉన్నవటబీజమువలె సూక్ష్మమైన పరారూపముగనున్నది. రహస్యమగుటచే నీయర్థమును మిగుల స్పష్టపర్చలేదు.

శ్లో॥ అహాకారౌ శివశక్తిస్వరూపావ్యాకారౌ పరస్పరాశ్లిష్టౌ ।
స్ఫురణప్రకాశరూపావుపనిషదుక్తం పరబ్రహ్మ ॥ 16 ॥

తా॥ అకారహకారస్వరూపులును, స్ఫురణ. ప్రకాశస్వరూపులును, బిందుస్వరూపులునయి అన్యోన్యముకలిసియున్న శివశక్తులే. ఉపనిషత్తులయందు చెప్పబడిన పరబ్రహ్మము. 16

2లం॥ ధ్యానార్థము॥

విశ్వంసిసృక్షూ పశివః స్వార్ధాం శక్తిం విలోకయన్ద్రష్టా ।
బిందూభవతి తయోంశం ప్రవిశతి శక్తిస్తు రక్తబిందుతయా ॥

తా॥ ప్రపంచమును సృష్టిచేయు కోరికవలన తనయొక్క అర్థభాగమైన శక్తిని చూచుచున్నశివుడు శుక్లబిందురూపుడగుచున్నాడు. శక్తి రక్తబిందువై ఆశుక్లబిందువునందు ప్రవేశించుచున్నది. శివబిందువు తెల్లనిదై చంద్రస్వరూపమును, బిందుమును, చెప్పనదియగుటవలన బకారరహితమగు ఇందుశబ్దము వను చంద్రుడని యర్థముకలిగినది. 17॥

ఏతత్పిండద్వితయం విసర్గసంజ్ఞం హాకారచైతన్యం ।
మిశ్రస్తు తత్సమష్టిః కామాఖ్యో రవిరకారచైతన్యం ॥ 18॥

తా॥ రక్త, శుక్లబిందువులు రెండును విసర్గయనబడును. ఆ విసర్గ హాకారమునకు రూపాంతరము. మిశ్రబిందువు కాముడనియు, రవియనియు అనబడును. అది అకారమునకు రూపాంతరము కనుక అకార హాకారములు శివశక్త్యాత్మకమైన బిందురూపములు. 18॥

ఏషాహం పదతుర్యస్వరకామకలాది శబ్దనిర్దేశ్యా ।
వాగర్థసృష్టిబీజం తేనాహంతామయం విశ్వం ॥19॥

తా॥ "అహం" అనుపదముచేతను, ఈకారముచేతను చెప్పబడు బ్రహ్మము శబ్దార్థములసృష్టికి బీజము. కనుక ప్రపంచము అహంతాస్వరూపముగనున్నది. 19॥

అంత్యప్రథమే మధ్యచతుర్థే మంత్రేపి తౌ వ్యక్తౌ ।
తేనాంబామనుజగతామభేదవవాత్ర భావార్థః ॥ 20 ॥

తా॥ ఆఖరుకూటములోని మొదటిసకారములోగల అచ్చు అయిన అకారమునందును, మధ్యమకూటముయొక్క నాలగవ వర్ణముగు హాకారమునందును, శివశక్తులు స్పష్టపరుపబడినారు కనుక దేవికిన్ని మంత్రమునకును, జగత్తుకును అభేదమే. భావార్థము భావః అనుదానికి పుట్టుకఅర్థము. "భావస్సత్తాస్వభావాభిప్రాయచేష్టాత్మజన్మసు" ఇత్యమరః । పుట్టుకను తెలిసికొనతగినది భావార్థము. భావార్థము ముగిసెను.

౩ సంప్రదాయార్థము.

శ్లో॥ వ్యోమాది జనక హాకరసలాఖ్యైర్ఘటనేన పంచభూతమయీ । పంచచతుస్త్రిద్వ్యేకగ శబ్దాది గుణాత్మ పంచదశ వర్ణాః ॥ 21 ॥

తా॥ పంచదశిమంత్రము హ, క, ర, స, ల అనుఅక్షరములతో కలిసియుండుటచేత పంచమహాభూతస్వరూపమయి పంచమహాభూతములతో భేదములేనిదిగానున్నది. ప్రకాశవిమర్శలయొక్క విశ్వస్వరూపమువలననే శబ్దార్థములయొక్క సృష్టి చెప్పబడెను. ప్రకాశాంశవలన అర్థసృష్టియు, విమర్శాంశవలన శబ్దసృష్టియు పుట్టును. వానికి అన్యోన్యము ఒకదానిఅపేక్ష మరియొకదానికి

కలిగియుండుటచేతనే తమతమకార్యములు పుట్టించుటయందు శ్రుతిస్మృతులలో చెప్పినప్రకారము ఒకటితనకార్యము చేయు వెడల రెండవది ఆకార్యమునకు కారణముగానుండును. కనుక కారణమునకును, విశేషణవిశేష్యభావములకును, నియమము లేకపోవుటచేత ప్రకాశ విమర్శలు రెండును పరస్పరకారణమగు చున్నది, అట్టితాత్పర్యముచేతనే తంత్రములయందు ఒకదానికే కారణము తెలియచేయు వాక్యములున్నవి. "శబ్దఇతి చేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం" అనువ్యాసనూత్రమునందు జగత్తు శబ్దమువలన పుట్టినట్టు శ్రుతిస్మృతులలోనున్నదని చెప్ప బడినది కాని సూత్రభాష్యమునందు యుక్తిగా చెప్పబడినది. ముందుగా విమర్శశక్తివలన హాకార, కకార, రేఫ, సకార, లకార ములుపుట్టినవి. అనంతరము ప్రకాశచేత హాకారమువలన ఆకా శమును, కకారమువలన వాయువును, రేఫవలన అగ్నియును, సకారమువలన జలమును, లకారమువలన పృథివియునుపుట్టినవి. ఇట్లుపంచమహాభూతములుపుట్టినను విమర్శముతో కలిసిన ప్రకా శము ఆకాశమునుగురించి కారణమగుటచేత ఆకాశబీజమయిన హాకారమునకు ప్రకాశమునయితము కారణమగును. ఇట్లే కకారాదులయందును తెలిసికొనవలయును.

గుణములు—ఆకాశమందు శబ్దమొకటి. వాయువునందుశబ్ద స్పర్శములు రెండు. వహ్నియందు శబ్దస్పర్శరూపములు మూడు జలమందు శబ్దస్పర్శరూపరసములు నాలుగు. పృథివియందు శబ్ద స్పర్శ రూప రస గంధములయిదు. మొత్తము 15 గుణములు. మంత్రమునందలి పదునయిదక్షరముల చేతను చెప్పబడుచున్నవి.

శ్లో॥ తత్తజ్జనకైర్వర్ణైస్తైస్తత్త్వంబ్ధైర్న్యస్తైస్తద్గుణా ష్టాదశా

తా॥ ఆయాభూతములను పుట్టించు హకార, కకార, రేఫ, వకార, లకారములవలన పంచమహాభూతములందున్న శబ్దాదులగు 15 గుణములు పుట్టినవి. హ్రీంకారములయందలి హకారములు మూడును, రెండవకూటమందలి హకారములు రెండును, మొత్తము అయిదింటిచేతను పంచభూతములందున్న యిదుశబ్దములుపుట్టినవి. కనుక హకారములకు శబ్దములే అర్థము. ఏయేఅక్షరములు ఏయేగుణములను పుట్టించునో ఆయా అక్షరములకు ఆయాగుణములే అర్థమని చెప్పబడుచున్నవి.

స్తవమువలన శివశక్తులస్వరూపమునకు మూలబీజములయిన అకార హకారములు రెండును మిక్కిలి సూక్ష్మరూపములని చెప్పబడినవి. కాని వైఖరీరూపస్థూలహకారములే శబ్దములను చెప్పుచున్నవి.

మధ్యమకూటమందైన మధ్యహకారమునందుగల ధ్వన్యంశపరబ్రహ్మమును, అక్షరాంశశబ్దమును చెప్పునని తెలిసికొనవలెను. వాయువునుపుట్టించు కకారములు నాలుగువిధములై స్పర్శలను పుట్టించుట ముఖ్యము. కాని విద్యయందు నాలుగు కకారములు లేనందున నిట్లుసందర్భమందువేని

శ్లో॥ కామకలాభిస్పర్శాస్తా ఈ యీకారతశ్చత్వారః ॥ 32 ॥

తా॥ హ్రీంకారములలోని మూడు ఈకారములచేతను విద్యయందుగల మూడవఅక్షరమైన ఈకారముచేతను మొత్తము నాలుగింటిచేతను నాలుగుస్పర్శలుపుట్టినవి. కాని కకారములచే పుట్టలేదు. "మహామాయాత్రయేణాపి కారణేనచ బిందునా। వాయ్వగ్నిజలభూమీనాం స్పర్శానాంచ చతుష్టయం। ఉత్పన్నం భావమేకైవ స్థూలసూక్ష్మవిభేదతః॥" అనునీశ్లోకమువలన

పైనివ్రాసిన అర్థమే చెప్పబడినది. ఈకారములు బింబరూపములు. బిందునా అనేకార్థము నాలుగు ఈకారములకు విశేషణము । ఈకారములు నాలగవబిందువుచేత పుట్టింపబడునవి. దీనిచేత వాయుమండలమునకు బిందువుచేత చిహ్నకలదని తెలియదగినది. వాయువుయందుగలస్పర్శ స్థూలమయినది. అగ్ని జల భూములయందుగల స్పర్శ సూక్ష్మమయినది. హ్రీంకారములలోనిమూడురేఫలచేత మూడువిధములగు రూపములు పుట్టింపబడుచున్నవి. "రూపాణాం త్రితయంతద్వత్ త్రిభిరేఫై ర్వ్యభావితం" అను వచనము ప్రమాణము। "విద్యాస్థై శ్చంద్రబీజైస్తు స్థూలసూక్ష్మో రసస్మృతః" అనువాక్యమువలన విద్యయందలి చంద్రబీజములైన సకారములచేత స్థూలసూక్ష్మరూపములగు రెండురసములు పుట్టినవని చెప్పబడినది. భూమియందుగల రసము సూక్ష్మమయినది. ఉదకమందుగల రసము స్థూలమయినది. "వసుంధరాగతో గంధః తల్లిపిర్గంధవాచికేతి" అను వాక్యమువలన లకారముచేత భూమియు, గంధమును చెప్పబడుచున్నవి.

ఒకలకారముచేతనే గంధము సిద్ధించినపుడు తక్కినరెండు లకారములకు ఫలమేమనిన చెప్పుచున్నారు.

శ్లో॥ భువనత్రయసంబంధాదాసీత్త్రిధా లకారోపి ।
యేయే యద్వ్యంజకాః తేషాం తేషాం తయేవార్థః ॥౨౪॥

తా॥ మూడుభువనములతోసంబంధమువలన మూడులకారములున్నవి. ఏయేఅక్షరములు ఏయేభూతములను పుట్టించునో ఆయాఅక్షరములకు ఆయాభూతగుణములే అర్థము. ఇచట "భువనత్రియసంబంధాత్ త్రిధా త్వంతు మహేశ్వరి" అను వచనము ప్రమాణము. ౨౪॥

కకారములకు వాయువును పుట్టించు అర్థముగాక మరియొక అర్థమున్నదని చెప్పుచున్నారు॥

శ్లో॥ కకారత్రయవాచ్యాస్తు సకలాః ప్రలయాకలాః।
విజ్ఞానకేవలాశ్చేతి త్రిప్రకారా ఉపాసకాః ॥ 24 ॥

టీ॥ మూడుకకారముల చేత సకలులు, ప్రళయాకలలు, విజ్ఞాన కేవలులు నని మూడువిధములగు ఉపాసకులు చెప్పబడుచున్నారు॥

సకలః-సాధకాః-ప్రమాతారః అనియును, లేక అధమా-మధ్యమా-ఉత్తమా అనియును, లేక అశుద్ధులు-మిశ్రులు-శుద్ధులు అనియును, లేక సకలులు, ప్రళయాకలులు, విజ్ఞానకేవలులు, అనియును ఉపాసకులు మూడువిధములుగ చెప్పబడుచున్నారు. వీరిలో శివోహం అను భావన లేకుండగ భేదదృష్టితో కర్మమందాసక్తి గలవారు అధములు. పాపకర్మములందు పరిపాకమును బొంది "చితిశ్చేత్యంచ చైతన్యం చేతనద్వయకర్మచ। జీవః కలాశరీరంచ సూక్ష్మం పుర్యష్టకంఛ వేత్" అనువాక్యమందు చెప్పిన సూక్ష్మపుర్యష్టకసంబంధము చేత ప్రకాశించుచున్నవారై కర్మమార్గమందును, జ్ఞానమార్గమందును సమదృష్టిగలవారు మధ్యములు. భేదబుద్ధిలేకుండ అంతట శివభావము కలిగిన పూర్ణజ్ఞానులు ఉత్తములు. వీరిసంగతి స్వచ్ఛందసంగ్రహము నందు విశేషముగా చెప్పబడినది. "అశుద్ధశుద్ధమిశ్రాణాం ప్రమాతౄణాం పరంవపుః। క్రోధీశత్రితయేనాస్య విద్యాస్థేన ప్రకాశితం" అనువచనము పై అర్థమునే బోధించెను. అచ్చులైన అకారములకు ముందు వేరుగా అర్థము చెప్పబడును. హకారము కకారము మొదలగువానిలో హల్లుస్వరూపమునకే పైనివాని వేఱర్థము చెప్పబడినది.

శ్లో॥ అకారైర్దశభిస్సంఖ్యాకై రుచ్యంతే జీవరాశయః ।
విద్యాయాః ప్రాణభూతిస్స్యం స్సద్యా చ్చైకాదశస్వరః ॥25

తా॥ పదిఅకారములచేతను జీవరాసులు చెప్పబడినవి. ఎట్లన గ వటబీజమునుండి పుట్టినవృక్షము వటవృక్షమే యనబడును గద. ఈవటబీజము ఆమూలబీజమునుండి కలిగినదే కనుక అకారరూపమూలబీజమగు బ్రహ్మమునుండి కలిగినజీవులను అకారవాచ్యమనుటకు సంశయము లేదు. అచ్చులలో పదునొకండవదియయిన "ఏ" అనునది విద్యకుప్రాణమై పరబ్రహ్మమును చెప్పును । "ఏ, ఈ" అనుఅక్షరములు రెండింటిని, హ్రీంకారములు మూడింటిని విడిచిపెట్టగా మిగిలినఅక్షరములయందు పదిఅకారములున్నవి। వానికి జీవరాసులర్థము। జీవులనేక అకారముచే చెప్పదగియున్నను జీవులనంతమనే సూచనకొరకు పదిఅకారములచేత చెప్పబడినవి। మూడవకూటములోని సకారమందలి అకారము మూలబీజమని భావార్థప్రకరణమునందు ధ్వన్యర్థకముగ చెప్పుటచేత నిక్కడ దానితో విరోధము లేదు । "ఏ" విద్యాస్వరూపమనేమూలబీజమువలన పుట్టినవృక్షమునకు లోపలనున్న ముఖ్యమయినప్రాణముకూడ వృక్షమునే చెప్పును ॥

శ్లో॥ బిందుభిస్త్రిభిరుచ్యంతే రుద్రేశ్వరసదాశివాః ।
శాంతిః శక్తిశ్చ శంభుశ్చ నాదత్రితయబోధితాః ॥26

తా॥ మూడుబిందువులచేతను రుద్ర, ఈశ్వర, సదాశివులును, మూడునాదములచేతను శాంతి, శక్తి, శంభు అను ముగ్గురును చెప్పబడుచున్నారు. రుద్రుడు తేజస్తత్త్వము. అందువలన పురుష, నియతి, కాల, రాగ, విద్యా, మాయలు అను ఆరును తేజస్తత్త్వమని గ్రహింపబడును। స్వచ్ఛందసంగ్రహమునందు

"పురుషాదిక్షమాయాంతం తేజస్తత్త్వం మహేశ్వరి॥ అనువాక్యమును, "రుద్రో వావమయదగ్నిః" అనుశ్రుతియు, రుద్రుని అగ్నిహోత్రునిగఁ జెప్పినవి. శాంతి, ప్రకృతి, శుద్ధవిద్య యనునవియు, అర్ధచంద్రుడు మొదలు ఉన్మనాంతమువరకుగల యేవిదిందియును వాదపదముచేత చెప్పబడును.

శ్లో॥ ఏవం సప్తత్రింశత్సంఖ్యాకపదైర్మహావిద్యా ।
షట్త్రింశత్తత్వానాం తత్వాతీతస్య చాభిధాత్రీయం ॥

తా॥ వెనుకటి ఆగుశ్లోకములచేతను విద్యయందు ఆకాశబీజములైన హాకారములు 5 కామకలలు 4 చంద్రబీజములైన సకారములు 2 రేఫలు 3 లకారములు 3 కకారములు 3 బిందువులు 3 వాదములు 3 అకారములు 10 ఏకారము ఒకటి మొత్తము 37 ఉన్నవని చెప్పబడెను. వానికి 36 తత్వములును, తత్వములనతిక్రమించిన అద్వితీయబ్రహ్మమును, అర్థము.

శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య, మాయా, కలా విద్యా, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, అహంకారము బుద్ధి, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, నేత్రము, జిహ్వ, ఘ్రాణము, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, ఆకాశము, వాయువు అగ్ని, జలము, భూమి, యను ముప్పదియారు తత్వములు । వీని యొక్క స్వరూపవివరణము, ఉత్పత్తిక్రమము, సౌభాగ్యసుధోదయమను గ్రంథమునందు సవిస్తరముగ కనబడును । వీనిలో శివ, శక్తి, శుద్ధవిద్య, ప్రకృతి అను తత్వములునాలుగును ప్రతిబిందువునకును అర్థము। సదాశివతత్వము మొదలుకొని పురుషాంతతత్వమువరకుగల పదితత్వములలో శుద్ధవిద్య కింద్వాశిఁ

ములో చేరినందున తక్కిన 9 తత్వములు నాదమునకు అర్థము। శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములయిదును, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూములయిదును, శ్రోత్ర, త్వక్కు, నేత్ర, జిహ్వా ఘ్రాణములయిదును, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ అను అయిదును, మొత్తము ఇరువదితత్వములును, హకారము మొదలగువానికి అర్థము। అహంకారము బుద్ధి, మనస్సుఅను తత్వములు మూడును, మూడుకకారములకును, పదిఅకారములకును అర్థము. ఏకారమునకు తత్వాతీతమైన బ్రహ్మము అర్థమని తెలిసికొనవలెను. హకారాదులకు శబ్దాదులు అర్థమని చెప్పినటుల ఇంద్రియములు మొదలగునవి ఈయూఅక్షరములకర్థమని చెప్పలేదు. కాని అచ్చులు హల్లులయొక్క విభాగముచేత 36 తత్వములును, తత్వములనతిక్రమించిన బ్రహ్మమును చెప్పునట్టి ఈమహావిద్య నాచేత నుపాసన చేయబడుచున్నదని "స్వరవ్యంజనభేదేన సప్తత్రింశత్ప్రభోధినీ। సప్తత్రింశత్ప్రభేదేన షట్త్రింశత్తత్వరూపిణీ। తత్వాతీతస్వభావాచ విద్యైషా భావ్యతే మయా" అనుశ్లోకముచేత చెప్పబడుచున్నది.

ఇక్కడఫలితార్థమేమనగా— మంత్రమందైన మిగిలినఅక్షరములకు వాచ్యార్థముచేతను, లక్ష్యార్థముచేతను చెప్పబడిన 36 తత్వములును, ఏకారముచేత చెప్పబడిన తత్వాతీతబ్రహ్మమేకాని వేఱుకాదు. మంత్రావయవములచే చెప్పబడు విశ్వము విద్యారూపమగు మంత్రముకంటె వేఱుకాదు. జన్యము (పుట్టించబడిన) ఘటము. జనక (పుట్టించెడి) మృత్తుకంటె వేఱుకాదు. వాచ్యమగు నర్థము వాచకమగు శబ్దముకంటె వేఱుకాదు. కలము అను శబ్దము కలము అనే అర్థమును చెప్పునప్పుడును

విడిచియుండదు. ఇట్లు బ్రహ్మమునుండిపుట్టిన ఏకారవాచ్యమగు జగత్తు ఏకారేతరబీజవాచ్యమయినను బ్రహ్మ జగత్తులకు అభేదమనియు, నీజగత్తునకు విద్యతో అభేదమనియు, గురు శిష్యపరంపరవలన నీయర్థమును తెలియవలయుననియు నని గురుసంప్రదాయము.

జన్యజనకయోః భేదాభావాత్ వాచ్యస్య వాచకేనాపి ।
బ్రహ్మణి జగతో జగతిచ విద్యాఽభేదస్తు సంప్రదాయార్థః॥

తా॥ శబ్దార్థములవలెనే పుట్టినదానికిని పుట్టించుదానికిని భేదము లేనందున బ్రహ్మమును జగత్తుకును, జగత్తుయందు విద్యకును, అభేదమే సంప్రదాయార్థము. యోగ్యమైనగురు పారంపర్యక్రమముచేత నివ్వబడినది కనుక సంప్రదాయార్థము.

4 నిగర్భార్థము॥

పరమశివే నిష్కలతా తదభిన్నత్వం స్వదేశికేంద్రస్య ।
తత్కారుణాతస్స్వస్మిన్నపి తదభేదో నిగర్భార్థః ॥ 29 ॥

తా॥ పరశివుడైన బ్రహ్మమందు నిర్గుణత్వమును, అట్టిబ్రహ్మముతో తనగురువరునకు అభేదమును, అట్టి గురుకృపవలన శివగర్భమువందు ప్రవేశముగల తనకు వారితో నభేదమే నిగర్భార్థము. 29 ॥

5 కౌలికార్థము॥

పరదేవతకును, మంత్రమునకును, శ్రీచక్రమునకును, గురువునకును, తనకును, అభేదమే కౌలికార్థము.

ఈ అయిదింటిధర్మము సమానమగుటచేత భేదము లేదు. తంత్రరాజమునందు "గణేశగ్రహనక్షత్రయోగినీరాశిపీఠతః" అనుశ్లోకమువలన పరదేవత గణేశులు మొదలగు ఆఱుగురియొక్క స్వరూపమని చెప్పబడినది కనుక సమానధర్మము॥

ముందుగాపరదేవతయందు గణేశత్వమును చెప్పుచున్నారు:

మాతా నిరుపమతేజోమయ్యా స్వస్యామరీచిరూపాణాం।
ఆవరణదేవతానా మీశత్వాదుచ్యతే గణేశీతి ॥ 30 ॥

తా॥ సాటిలేని తేజస్సుగల పరదేవత తనకిరణములగు 111 రు ఆవరణదేవతలను, తంత్రభేదముచేత నితరదేవతలను నియమించుటచేత గణేశి అని చెప్పబడుచున్నది.

ఇచ్ఛాది త్రిసమష్టిః గుణత్రయాధ్యాఽనలేందురవినేత్రా।
ఏవం నవభిర్యోగాత్ గ్రహరూపేత్యుచ్యతే మాతా ॥ 31॥

తా॥ సూర్య చంద్రాగ్నులనెడి నేత్రములు మూడును సత్వరజస్తమోగుణములు మూడును, ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులుమూడును మొత్తము 9 చే పరదేవత గ్రహరూపురాలనబడును.

శ్లో॥ ఇంద్రియదశకే నాంతఃకరణచతుష్కేణ విషయదశకేన। ప్రతిపురుషం గుణతత్త్వైః (ప్రకృతిగుణపురుషతత్త్వైః) జాతా నక్షత్రరూపిణీ మాతా ॥ 32 ॥

తా॥ శ్రోత్రము, త్వక్కు, నేత్రము, జిహ్వా, ఘ్రాణములను జ్ఞానేంద్రియములు 5, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలను కర్మేంద్రియములు 5, ప్రకృతి, అహంకారము, బుద్ధి, మనస్సులు 4, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మాట్లాడుట, గ్రహించుట, నడుచుట. విడిచిపెట్టుట, ఆనందించుట అనువిషయములు 10 సత్వరజస్తమోగుణములు 3 (లేక ప్రకృతి, గుణ, పురుష, తత్వములు 3) మొత్తము 27ను ప్రతిపురుషునియందును గలవు గనుక జగద్రూపయగు పరదేవత నక్షత్రరూపురాలు.

శ్లో॥ నరపతి రవికాష్టా వట్సముద్రద్విసంఖ్యై రకడబవహా పూర్వై రక్షరై ర్వ్యాప్తితాభిః। డరలకసహావర్ణా ద్యాకినీభిస్తు షడ్భిః ఘటితతనురితీయం కథ్యతే యోగినీతి ॥ 33 ॥

తా॥ అకారాది అచ్చులు 16 కకారాది ఠకారాంతమువరకు 12 డకారాది ఫకారాంతమువరకు 10 బకారాది లకారాంతమువరకు 6 వకారాది సకారాంతమువరకు 4 హక్షఅనువి2 మొత్తము 50 అక్షరములతోను. డాకినీ, రాకినీ, లాకినీ, కాకినీ, సాకినీ, హాకినీ అను ఆరుశక్తులతోను కలిసియున్న శరీరము గలది గనుక పరదేవత యోగిని అని చెప్పబడుచున్నది.

I 16 దళములుగల విశుద్ధిచక్రమునందు చర్మమునకు ప్రభువగు డాకినీశక్తి అకారాది అచ్చులు 16 ను చెప్పు అమృతా మొదలగు దేవతలతోను.

II 12 దళములుగల అనాహతచక్రమునందు రక్తమునకు ప్రభువగు రాకినీశక్తి కకారాది 12 అక్షరములను చెప్పు కాలరాత్రి మొదలగు శక్తులతోను,

III 10 దళములుగల మణిపూరకచక్రమునందు మాంసమునకు ప్రభువగు లాకినీశక్తి డకారము మొదలుగాగల 10 అక్షరములను చెప్పు డామర్యాదిశక్తులతోను,

IV 6 దళములుగల స్వాధిష్ఠానచక్రమునందు మెదడునకు ప్రభువగు కాకినీశక్తి బకారాది ఆరక్షరములను చెప్పు బందిన్యాది శక్తులతోను,

V 4 దళములుగల మూలాధారచక్రమునందు ఎముకలకు ప్రభువగు సాకినీశక్తి వకారాది నాలుగక్షరములను చెప్పు వరదా మొదలగు శక్తులతోను,

VI 2 దళములుగల ఆజ్ఞాచక్రమునందు కొవ్వునకు ప్రభువగు హాకినీశక్తి "హం, క్షం" అను రెండక్షరములనుచెప్పు హంసవతి, క్షమావతి యను శక్తులతోను ఆవరింపబడియున్నవి. అట్టి డాకినిమొదలగు శక్తులతోను, ఆవరణదేవతలతోను కూడియున్న శరీరముగలది గనుక పరదేవత యోగిని అని చెప్పబడును. ధాతువులేడని ప్రసిద్ధము. అట్టిధాతువులకు ప్రభువగు యాకినీశక్తి, అమృతామొదలగు సమస్తశక్తులతో సహస్రారమునందు ఆయాసంఖ్యలుగల దళములయందు ఉండునని తంత్రములయందుప్రసిద్ధము. అట్లే షోఢాన్యాసమందును ఒక్కొక్కస్థలమందు చూడబడును. గాని యోగినిహృదయమునందు చెప్పినట్లే ఆరున్యాసములుమాత్రమిక్కడ చెప్పబడెను.

పంచభిర్నాగకూర్మాద్యైః ప్రాణాపానాది పంచభిః ।
జీవాత్మపరమాత్మాభ్యాం చైషా రాశిస్వరూపిణీ ॥ 34 ॥

తా॥ నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయ మమనయిదు నుపవాయువులు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అను నయిదువాయువులు. జీవాత్మ, పరమాత్మ అనునవి రెండు మొత్తము 12 యొక్క స్వరూపమగుటవలన పరదేవత రాశిస్వరూపురాలు.

గణేశాదులకువలెనే పీఠములకును సంఖ్య సమానము కనుక వేరుగా చెప్పలేదు.

విద్యయందు గణేశాదిత్వమును చెప్పుచున్నారు.

అకథాదిక షోడశాక్షరాత్మక తార్తీయక కామవాగ్భవైః ।
ఘటితాచ వరాది వాగ్భవైరితి విద్యాపి గణేశరూపిణీ ॥ 35 ॥

తా॥ అకారాది 16 అచ్చులును శక్తికూటము. కకారాది

16ను కామరాజకూటము. కకారాది 16 ను వాగ్భవకూటము. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీరూపములుకూడా వ్యష్టిస సమష్టిభేదములచేత నీమూనుకూటములే. అందువలన శబ్దస మూహమునకు అధిష్ఠానమగు నీవిద్య గణేశరూపమని చెప్పఁబడెను.

శ్లో॥ బిందుత్రయ నాదత్రయ తదన్యకూటైర్గ్రహత్వమిహ ।
నక్షత్రత్వంచ దశాకారాణాం వ్యంజనైరపార్థక్యాత్ ॥

తా॥ మూడుకూటములలోని బిందువులుమూడును, నాదములు మూడును, బిందునాదములకంటె నన్యమయిన బీజకూటములు మూడును కలిసిన మొత్తము 9 కనుక "బీజబిందుధ్వనీనాంచ త్రికూటేషు గ్రహాత్మికా" అను వచనమువలన విద్య గ్రహరూపము.

సంప్రదాయార్థప్రకరణమునందు విద్యకు హల్లులమీదనుండు అచ్చులను పదింటిని వేరుగా లెక్కచేసి 37 అక్షరములు చెప్పబడినవి. అట్లువేరుచేయని యెడల 27 అక్షరములు. కనుక నక్షత్రరూపమయినది. "హ్రల్లేఖాత్రయసంభూతైః తిథిసంఖ్యైస్తథాక్షరైః । అన్యైర్ద్వాదశభిర్వ్యక్తా రేఖా నక్షత్రరూపిణీ" అను వచనము ప్రమాణము.

హృల్లేఖాభిస్తిసృభిః తదన్యకూటైశ్చ యోగినీయోగాత్ ।
రాశీభూతాప్యేషా తిసృణాం పూర్వాక్షరైకైక్యాత్ ॥ 37 ॥

తా॥ హ్రీంకారములు 3 వీనికంటె అన్యమైనకూటములు3 మొత్తము 6 గనుక నీవిద్య యోగిని యనబడును. విద్యయందు గల15 అక్షరములలో లకారములు మూడును హ్రీంకారములతో నైక్యము చేయునపుడు 12అక్షరములు గనుక రాశిరూపము.

శ్లో॥ దేవ్యా రూపాంతరత్వేన విద్యాయా స్తదభేదతః।
గణేశగ్రహనక్షత్రయోగినీరాశిపీఠతా ॥ 38 ॥

తా॥ విద్య దేవియొక్క రూపాంతరము. కనుక గణేశగ్రహనక్షత్రయోగినీరాశిపీఠములు దేవికివలె విద్యకును గలవు.

చక్రరాజమందు గణేశాదిత్వమును చెప్పుచున్నారు.

శ్లో॥ రేఖాదలకోణగణైః ఘటనాచ్చక్రే గణేశత్వం।
త్రైలోక్యమోహనాద్యైః నవభిః చక్రైః గ్రహత్వంచ ॥

తా॥ చక్రమునందు చతురశ్రములు 3 వర్తులములు 3 దళములు 24 కోణములు 43 ఉండుటవలన చక్రమునకు గణేశరూపము. త్రైలోక్యమోహనచక్రము మొదలుకొని సర్వానందమయచక్రమువరకు 9 చక్రములు కనుక నవగ్రహస్వరూపము.

వృత్తత్రయ ధరణీత్రయ మన్వశ్రాణాం విభజ్య గణనేన।
సప్తభిరితరై శ్చక్రైః చక్రే నక్షత్రరూపత్వం ॥ 40 ॥

తా॥ చక్రమునందు వృత్తములు 3 భూపురములు 3 మన్వశ్రములు 14 ఇతరమగుచక్రములు 7 మొత్తము 27 ఉండుటవలన నది నక్షత్రరూపము. ॥ 40 ॥

శ్లో॥ పంచచతుశ్శక్తిశివలాబిందుర్వృత్తంచ భూబింబం।
ఏవం ద్వాదశసంఖ్యై ర్ఘటనాచ్చక్రస్య రాశిత్వం ॥41॥

తా॥ చక్రమునందు శక్తిచక్రములు 5 (తనకు అభిముఖముగా అగ్రకోణములు గలవి) శివచక్రములు 4 బిందువు 1 వృత్తము 1 భూపురము 1 మొత్తము 12 ఉండుటవలన రాశిరూపము. వృత్తమనగా రెండుపద్మములతో కలిసినది.

శ్లో॥ చక్రం విద్యాత్మకత్వేన జననాత్తదభేదవత్ ।

దేవ్యా రూపాంతరత్వాచ్చ తేనయుక్తో క్త రూపతా ॥42

తా॥ చక్రము విద్యాక్షరములచేత పుట్టుటవలనను, దేవి యొక్క రూపాంతరమైన మంత్రముతో అభేదమగుటవలనను, చక్రమునకు దేవీస్వరూపముకలుగుట యుక్తమే.

శ్లో॥ యావన్మాతృకముదితాన్యేకనమేతాని పంచాశత్ ।
పీఠాని పునర్గణితాన్యోజాపూకాని చత్వారి ॥ 43 ॥

తా॥ మాతృకాక్షరములవలెనే పీఠములును ఏబదియొకటి। అవిగాక ఓఢ్యాణ, జాలంధర, పూర్ణగిరి, కామగిరి అనెడు నాలుగుపీఠములు కూడాకలవు.

శ్లో॥ గణపగ్రహాభాదీనాంశశినిధితారర్తుసూర్యసంఖ్యానాం
మేలనతః పీఠాని జ్ఞేయాన్యేతేషు పంచపంచాశత్ ॥44

తా॥ గణపతి 1 గ్రహములు 9 నక్షత్రములు 27 యోగినులు 6 రాసులు 12 మొత్తము 55 పీఠములుగా తెలిసికొనవలెను.

చక్రరాజము మంత్రముయొక్క అక్షరములచేత పుట్టినదని రెండుశ్లోకములచేత చెప్పుచున్నారు.

శ్లో॥ కత్రితయాదీకారాత్ బిందుర్జాతః తదగ్రిమేచక్రే।
హృల్లేఖాభిస్తత్పరచక్రత్రితయం హకారాభ్యాం ॥
ఏకారేణచ తత్పరచక్రం జాతే సకారాభ్యాంచతు
రశ్రాణి లకారైరేవం విద్యాక్షరేణ చక్రజనిః ॥ 46 ॥

తా॥ శ్రీచక్రమందలి బిందువు ఈకారముచేతను, మూడు కకారములచేతను, త్రికోణ, వసుకోణములు రెండును, మూడు హ్రీంకారములచేతను, అంతర్దశార, బహిర్దశార, చతుర్దశారములు మూడును, రెండు హకారములచేతను, ఏకారముచేతను, నాగదళ, షోడశారములు 2ను, సకారములచేతను, చతురశ్రము,

లకారములు మూడింటిచేతను పుట్టినవి. కనుక విద్యాక్షరము
లచేత శ్రీచక్రోత్పత్తియయినది.

శ్లో॥ ఏతత్త్రితయాభిన్న స్వగురుస్తదభేదభావనాదార్ఢ్యాత్ ।
తేన గణేశాదిమయస్తద్ద్వయయాచ స్వయంతథారూపః॥

తా॥ మంత్రము, దేవత, చక్రము, అనునీమూడింటికి దృఢ
మైన అభేదధ్యానమువలన తనగురువు ఆమూడింటితో భేదము
లేనివాడును, గణేశ గ్రహనక్షత్ర యోగినీరాశిపీఠములయొక్క
స్వరూపుడును, గురుకృపచేత తానును (సాధకుడు) అట్టిరూప
ముగలవాడే. ॥ 47 ॥

శ్లో॥ ఇత్థం మాతా విద్యా చక్రం స్వగురు స్స్వయంచేతి ।
పంచానామపి భేదాభావో మంత్రస్య కౌలికార్థోయం ॥

తా॥ ఇట్లు పరదేవతకు, మంత్రమునకు, చక్రమునకు, తన
గురువునకు, తనకును భేదములేకపోవుటయే కౌలికార్థము. ॥48

కౌలికార్థము సమాప్తము.

6 సర్వరహస్యార్థము॥

శ్లో॥ ద్వాదశ షోడశ దశభి స్తపన శశి దహన కలాభిరాకీ
ర్ణైః । పంచాశద్భిర్వర్ణై రభిన్నదేహాకులీనకుండలినీ ॥ 49 ॥
బిసతన్వీ తటిదాభా మూలాధారస్థ పద్మశృంగాటాత్ । భిత్వా
మూలహృదాజ్ఞాగతవహ్ని రవీందుమండలత్రితయం ॥ 50 ॥

తా॥ సూర్యకళలైన తపిన్యాదులు 12ను కకారము మొదలు
కొని క్రమముగా ముందుకు పండ్రెండక్షరములతోను, భకా
రము మొదలుకొని క్రమముగా వెనుకకు 12 అక్షరములతోను,
చంద్రకళలైన అమృతాదులు 16ను అకారాది 16 అచ్చులతో

ను, అగ్నికళలయిన ధూమ్రార్చి మొదలగునవి పదియును యకారము మొదలుకొని పదియక్షరములతోను, కూడికొనియున్నవి. ఇట్లు ఏబదియక్షరములతో నైక్యముకలది కులకుండలియనబడును. ఆకుండలి త్రికోణమునకు పైని మూడున్నరచుట్లు వలయాకారముకలిగి అధోముఖముగ కూర్చుండినదై యోగమర్యాద తెలిసిన యోగులచేత ఊర్ధ్వముఖముగా లేపబడుచున్నది. ఆకుండలి తామరకాడలోని దారమువలె సూక్ష్మముగనుండి మెరుపుతీగవంటికాంతితో మూలాధారపద్మమునుండి బయలుదేరి మూలాధార, అనాహత, ఆజ్ఞాచక్రములందలి అగ్ని, సూర్య చంద్రమండలములు మూడింటిని భేదించుచున్నది.

శ్లో॥ సా వ్యోమ్ని చిచ్ఛరీరక మండలమధ్యేఽకులేన (వ్యోమని చిచ్ఛశిమండలమధ్యేత్వకులేన) సంగమ్య । ఉభయాంగసంగజన్యం ప్రవాహయంతీ సుధాపూరం ॥ 51 ॥

తా॥ మూలాధారమునుండి బయలుదేరిన కులకుండలి పరమవ్యోమయందు జ్ఞాన, చంద్రమండలమందలి అధోముఖసహస్రదళకమలములమధ్యనున్న అకులకుండలితోకలిసికొని రెండింటియొక్క సంబంధమువలన పుట్టిన అమృతధారను ప్రవహింపచేయుచు డాకిన్యాదులయొక్క మండలములను తడుపుచున్నది. పరమవ్యోమ యనగ లలాటమునకు పైని కపాలోర్ధ్వభాగమున కంటెమున రెండుఅంగుళములకు పైనున్న ద్వాదశాంతమనెడి శిరస్సుయొక్క ప్రదేశము ॥ 51 ॥

శ్లో॥ స్వయమపి తత్పానవశాత్ మత్తాభూత్వా పునశ్చ తేనైవ । (సుషుమ్నా) మార్గేణ పరావృత్య స్వస్మిన్ స్థానే సుఖం స్వపితి ॥ 52 ॥

తా॥ అమృతపానసంబంధమువలన కుండలియును మదించి తిరిగి ఆసుషుమ్నామార్గము చేతనే వెనుకకువచ్చి తనస్థానము నందు సుఖముగా నిద్రించుచున్నది. ఇవి యోగులకు అనుభవసిద్ధము శాస్త్రము తెలిసి అనుభవము లేనపుడు గురుముఖము వలననే విచారణచేసి తెలిసికొనతగినది.

సాకూద్విద్యైషా నతతో భిన్నా (శివా) జగన్మాతా।
అస్యాస్స్వాభిన్నత్వం శ్రీవిద్యాయా రహస్యార్థః ॥ 55 ॥

తా॥ ఈకుండలినియు శ్రీవిద్యయే కాని యన్యముకాదు. కనుక ఈకుండలి, శ్రీవిద్య, పరదేవత, తాను సకరూపులే కాని వీరికి భేదమేమియులేదు.

8 నామార్థము—9 శబ్దరూపార్థము॥

శ్లో॥ తత్తద్వర్ణార్థేయం తత్తద్వర్ణస్వరూపేయం।
ఇతితు శ్రీవిద్యాయాః నామార్థః శబ్దరూపార్థః ॥ 56॥

తా॥ ఈపరదేవత విద్యయందుగల ఆయావర్ణములకు అర్థమయినది గనుక నామార్థము. ఆయావర్ణశబ్దములచేత కకారము మొదలగు ఏబదియెనిమిది వర్ణములు గ్రహింపబడుచున్నవి కనుక శబ్దరూపార్థము. నామార్థము మూడు విధములు. 58 వర్ణములుగలది అని 37 వర్ణములు గలదని లేక 15 వర్ణములు గలదని॥

10 నామైకదేశార్థము॥

శ్లో॥ కల్యాణ్యేకాక్షర్యా వీశత్రీచాపి లలితాచ। ఇత్థం నామ త్రిశతీ వాచ్యోర్థః తత్తదక్షరస్యాపి ॥ 57 ॥ తిథిమిత బిందుగణోత్తరగజరపగిరిదస్ననామసంఖ్యాకాః। అర్థాభవంతి యోగాత్ నామ్నా నామైకదేశస్య ॥ 58 ॥

తా॥ కల్యాణీ, ఏకాక్షరి, ఈశిత్రి, లలిత, అని ఆయాఅక్షరములకు అర్థము త్రిశతినామములలో చెప్పబడినది. నామమునకును, నామములో కొంతభాగమునకును సంబంధమువలన 15 బిందువులు అంతమునందుగల 8-6.7-2-3 సంఖ్యగల అర్థములగును. నామార్థ, శబ్దరూపార్థ, నామైకదేశార్థముల లో మూడవదైన నామైకదేశార్థమందు నామములో కొంత భాగమయిన ఒక్కొకఅక్షరమునకు 19 విధములయినఅర్థము చెప్పుటవలన ఇన్నిఅర్థములగును. “ అంకానాం వామతో గతిః ” అను శాస్త్రమువలన ముందుగా 15 బిందువులనువ్రాసి వానికి వామభాగమునందు 8 మొదలగు సంఖ్యలనుక్రమముగా వ్రాయవలయును. ఈప్రకారము అంకెలను వ్రాయగా 327 పరార్థములు 68 అంత్యములుగల అర్థభేదములు త్రిశతికి కలుగుచున్నవి. (327 68 000000000000000) ఒకటి, పది, నూరు, వెయ్యి, పదివేలు, లక్ష, పదిలక్షలు, కోటి అనియు, అర్బుదం, అబ్దం, ఖర్వం, నిఖర్వం, మహాపద్మం, శంఖం, అనియు, తరువాత జలధి, అంత్యం, పరార్థం అనియు క్రమముగా పదిరెట్లు ఎక్కువకలిగినపేర్లు లీలావతియందున్నవి.

11 శాక్తార్థము॥

శాక్తార్థము రెండువిధములు। అవయవార్థము, శక్తి సమూహార్థము అని॥ అవయవార్థమనగా పరదేవతయొక్క అవయవములను వర్ణించుట॥

శ్లో॥ వాక్కామశక్తికూటై రవయవశో విగ్రహోమాతుః।
ప్రతిపాద్యోత్రశాకంఠా దామధ్యాదాచ పాదాగ్రాత్ ॥

తా॥ ఈఅవయవార్థమునందు కంఠపర్యంతమును, కంఠము

మొదలు మధ్యమమువరకును, మధ్యమము మొదలు పాదాగ్ర
మువరకును, వాగ్భవ, కామరాజ, శక్తికూటములను భేదము
చేత పరదేవతకు అవయవవిభాగము చెప్పబడినది.

శక్తిసమూహార్థము॥

శ్లో॥ వేధో భారత్యౌ మాధవలక్ష్మ్యౌ రుద్రపార్వత్యౌ।
రేఫాంతవర్ణషట్కస్యార్థాః క్రమశో విజానీయాత్॥

తా॥ రేఫవరకుగల ఆరక్షరములకు క్రమముగా బ్రహ్మయు
సరస్వతి, విష్ణువు, లక్ష్మీదేవి, శివుడు, పార్వతి అనువారర్థము.

శ్లో॥ తావేతాస్సకలాఅపి కామకలా ఏవ నతతోన్యాః।
సామానాధికరణ్యాదీకారేణాయమర్థోస్య॥ 61॥

తా॥ వాణీబ్రహ్మాదులనుచెప్ప రేఫాంతవర్ణషట్కముతో
కామకలారూపమగు ఈకారము సమానమంత్రమందు చెప్పబడి
నందున వీరుఆరుగురును కామకలారూపులేకానియితరులుకారు.

శ్లో॥ అయమేవ కూటయోరపి పరయోరర్థః పరంతుతా
ర్తీయే। ద్వైతీయీకద్వైతీయీక హకారస్సకారితఃపూర్వః॥
62॥ అన్వయిలిపోక్షరశక్త్యా శక్త్యా స్వభావత్వాత్ । వామే
చ్ఛాదికశక్తిమయతోక్తే రేవ శాక్తార్థః॥ 63॥

తా॥ ఇట్లు తక్కిన రెండుకూటములకును అర్థము. కాని రెం
డవకూటమందున్న రెండవహకారము మూడవకూటమునందు
సకారముకంటె పూర్వమునందు (మొదటనున్నదిగా) అక్షర
క్రమమువలన అన్వయము చెప్పవలయును. దీనివలన మూడుకూట
ములు సమానవర్ణములగును. వాణీ బ్రహ్మాదులను చెప్పెడి
యీయారక్షరములే వామేచ్ఛాది శక్తిరూపములగుటవలన
మంత్రమునకు శక్తిసమూహము అర్థము.

12 సామరస్యార్థము॥

శ్లో॥ కహయోర్లసయోరర్థా శివశక్తీశుద్ధయోరచోశ్శక్తిః॥
ఉభయోస్సమరవభావో హ్రల్లేఖాయాః పరంబ్రహ్మ॥

తా॥ కకార హాకారములకు శివుడును, లకార సకారములకు శక్తియు అర్థము. కేవలముఅచ్చులగు ఎ,ఈలకు శక్తి అర్థము. హ్రీంకారములకు శివశక్తులిద్దరియొక్క సామరస్యమే అర్థము. అదే పరబ్రహ్మము.

బ్రహ్మైవ శివశ్శక్తిశ్చేతి ప్రత్యేకకూటార్థః।
శివశక్తిసామరస్యాద్విద్యాయాఏవ సామరస్యార్థః॥

తా॥ శివుడును, శక్తియు శుద్ధబ్రహ్మస్వరూపమని ప్రతికూటమునకు అర్థము. శివశక్తులసామరస్యమువలననే విద్యకును ఈసామరస్యార్థము కలిగెను. "కత్రయం హాద్వయం చైవ శైవో భాగః ప్రకీర్తితః। శక్త్యక్షరాణి శేషాణి హ్రీంకార ఉభయాత్మకః" ఈవచనముచేత కకారములు మూడు హాకారములు రెండును శివబీజములు. హ్రీంకారములు మూడును ఉభయస్వరూపబీజములు. మిగిలినవి శక్తిబీజములు అని చెప్పబడెను.

13 సమస్తార్థము॥

కనదీప్తావితిధాతోః ప్రకాశకత్వం కకారార్థః।
అధ్యయనార్థకతేజస్యాదేకారస్తదీయకరణార్థః॥ 66॥

తా॥ కనధాతువు ప్రకాశను చెప్పును. దీనివలన కకారమునకు ప్రకాశింపచేసుట అర్థము. ఎకారమునకు ప్రకాశకలుగ చేయుటని అర్థము.

శ్లో॥ వర్ణద్వయమేలనతః ప్రకాశికాబుద్ధిరిత్యర్థః।
ఈవ్యాప్తావితి ధాతో స్తస్యావ్యాప్తిస్తృతీయవర్ణార్థః॥

తా॥ ఈ రెండు అక్షరముల సమష్టివలన ప్రకాశింపచేయు బుద్ధి అని అర్థము. ఈ అనే ధాతువునకు వ్యాపించుట అని అర్థమగుట వలన ఈకారమునకు బుద్ధి వ్యాపించుట అర్థము.

శ్లో॥ తస్యాలహార్యాధిక్యం తన్నిర్మాణం లకారార్థః । హన హింసాయామితి వై శౌర్యం ప్రత్యర్థి హననకరణత్వాత్ ॥ 68 ॥

తా॥ అట్టిబుద్ధిని అధికముగా వ్యాపింపచేయుట లకారమునకు అర్థము. హనధాతువు హింసను చెప్పును. గనుక హకారమునకు అంతశ్శత్రువులయొక్క నాశమునకు కారణమగు పరాక్రమము అర్థము.

శ్లో॥ సంభోగసాధనం ధనముపభోగార్థాత్ । స్యతేః సునోతేర్వా । కముకాంతావితి ధాతోరిచ్ఛావిషయోంగనాదిః కం ॥

తా॥ విశేషభోగములకు సాధనమగు ధనము సోధాతువువలనగాని, సుధాతువువలనగాని పుట్టినసకారమునకు ఉపభోగము అర్థము. కముధాతువునకు ఇచ్ఛ యర్థము. కనుక కవర్ణమునకు ఇచ్ఛలోవిషయమగు స్త్రీమొదలగునవి అర్థము.

శ్లో॥ ఏషాం గమనం ప్రాపణమోహాజ్ గత్యర్థధాతుజన్యం హం। తస్యాతిశయోలహరీ తత్రశిష్టస్స్వవర్ణదీర్ఘేణ ॥ 70 ॥ ఈకారస్తస్యార్థః కీర్తిస్సర్వాసు దిక్షు దీప్తత్వాత్ । ఈవ్యాప్తావితి ధాతోర్నిర్మితిరనయోర్మకారార్థః ॥ 71 ॥

తా॥ పరాక్రమమును, ధనమును, స్త్రీమొదలగు వానిని పొందించుటయే గత్యర్థముగల హకారమునకు అర్థము. అట్లు విశేషముగా పొందించుటయే లహరీ అను మూడు అక్షరములకు మిళితార్థము. ఈకారమునందు సవర్ణదీర్ఘము చేత రెండు ఈకారములు కలిసియున్నవి. ఒక ఈకారమునకు

కీర్తియు, రెండవ ఈకారమునకు వ్యాప్తియు, మకారమునకు వీనిని వ్యాపింపచేయుటయు అర్థము.

శ్లో॥ వాగ్భవకూటస్యార్థః సూక్ష్మమతివ్యాపనాధిక్యం।
శౌర్యధనస్త్రీ (శ్రీ) యశసామాధిక్యం కామరాజార్థః॥72॥

తా॥ సూక్ష్మబుద్ధిని అధికముగా వ్యాపింపచేయుట వాగ్భవకూటమునకు అర్థము. పరాక్రమము, ధనము, స్త్రీ, కీర్తి, వీనియొక్క ఆధిక్యము కామరాజకూటమునకు అర్థము.

ఏతే సమ్యక్కలయతి సకలహాతేహాకారస్యాత్।
నిఖిలజగత్సంహర్త్రీత్యర్థస్తస్యాపి వర్ణస్య॥73॥

తా॥ ఈ రెండుకూటములఅర్థమును లెస్సగా గలిగించుట సకలశబ్దమునకర్థము. హృధాతువునకు హరించుట అర్థముండుటవలన సమస్తలోకములను సంహరించునదియని హ్రాకారమునకర్థము.

ఈకారః ప్రశ్లిష్టస్సృష్టిస్థితిరూపదీప్తికర్త్ర్యర్థః।
యద్వా హృదిఖే దహరే ప్రకాశతే తేన మాతాహ్రీః।

తా॥ మిగిలిన ఈకారమునకు సృష్టి, స్థితి, రూపమగు కాంతిని చేయునదని అర్థము. లేక హృదయాకాశమునందు ప్రకాశించుచున్నది గనుక పరదేవత హ్రీః అని చెప్పబడుచున్నది.

సకలాంతేన పదేన హ్రీంకారే కర్మధారయః కార్యః।
తస్య విశేష్యోమస్స్యాన్నాదార్థ స్సంవిదర్థో వా॥75॥

తా॥ సకలశబ్దము అంతమందుగల పదమునకును, హ్రీశబ్దమునకును కర్మధారయసమాసము చేయతగినది. దానికి విశేష్యమగు మకారమునకు నాదముగాని, జ్ఞానముగాని అర్థము కనుక బుద్ధి, శౌర్యము, ధనము, స్త్రీ, కీర్తి యనువానిని విశే

వముగా చేయునదియు, సమస్త జగత్సృష్టి స్థితి సంహారముల ను చేయునదియు, హృదయాకాశమునందు న్నదియు, నాద, జ్ఞాన స్వరూపమయినదయు నగు బ్రహ్మమే. మంత్రమునకు అర్థము.

శ్లో॥ ధాతోర్బహ్వర్థత్వాత్ బహులగ్రహణాత్ పృషోదరా దిత్వాత్ । ఆకృతిగణపాఠేన స్వేచ్ఛానుగుణాధుణాది కల్పనతః॥ 76 ॥ ఛందసి సర్వవిధీనాం వైకల్పికతావశా దముష్యమనోః । సిద్ధైః కథితేర్థేస్మిన్ వైయాకరణానుశాసనానుమతిః ॥ 77 ॥

తా॥ ధాతువు అనేకర్థములుకలదగుటవలన బహులశబ్దము యొక్క గ్రహించుటవలనను, పృషోదరాది ఆకృతిగణమందు పఠించుటవలనను తనఇచ్ఛకు అనుగుణముగా ఉణాదిప్రత్యయ ములను చేయుటవలనను ఛందస్సునందు సమస్తశాస్త్రములకు వికల్పముండుటవలనను, మంత్రమునకు ఈఅర్థము చెప్పుట వ్యా కరణశాస్త్రసమ్మతమయియున్నది. ॥ 76-77 ॥

శ్లో॥ బహుతరసమాసయోగాత్సమస్తపురుషార్థసాధనతోక్తేః । సంక్షేపాత్సారోక్తేః శ్రీవిద్యాయాస్సమస్తార్థః ॥ 78 ॥

తా॥ అనేకసమాసములయొక్క సంబంధమువలనను, అనేక పురుషార్థములకు సాధనముగా చెప్పుటవలనను, స్వల్పశబ్దమువ లననే ముఖ్యార్థము చెప్పుటవలనను శ్రీవిద్యకు ఇదిసమస్తార్థము.

14 సగుణార్థము.

శ్లో॥ విధిరేకారో హరిరకార ఈశస్త్వార్థమీడపదం ।
ద్విస్వరమధ్యగతస్య డకారస్య లకారాదేశః ॥ 79 ॥

తా॥ క కారము బ్రహ్మను, ఏకారము విష్ణువును, అకారము శివుని చెప్పును. ఆఅకారము ఏకారమునందు పూర్వరూపము

చేత కలిసియున్నది. ఈడశబ్దమునకు స్తోత్రము అర్థము. రెండు అచ్చులైన ఈకారమునకును, డకారముమీదనున్న అకారమునకును మధ్యనున్న డకారమునకు లకారమాదేశమగును.

తేన ఋగ్వేదాత్మత్వం సూచితమాద్యస్య కూటస్య।
క్రమశో౽గ్రిమకూటయుగే తేనయజుస్సామతా సిద్ధా ॥ 80॥

తా॥ కనుక మొదటికూటమునకు ఋగ్వేదరూపత్వము సూచింపబడినది. క్రమముచేత తక్కిన రెండుకూటములకు యజుర్వేద సామవేదరూపములని సిద్ధించినది.

హ్రీమితి నామవిశేష్యం నపుంసకం బ్రహ్మలకత్వేన।
విధిహరిగిరిశై రీడ్యం బ్రహ్మేతి ప్రథమకూటార్థః ॥ 81 ॥

తా॥ హ్రీం అనునది విశేష్యము. బ్రహ్మను చెప్పుటచేత నపుంసకలింగము. బ్రహ్మ విష్ణు శివులచేత స్తోత్రముచేయబడు బ్రహ్మమని మొదటికూటమునకు అర్థము.

శ్లో॥ హసకంతు హసద్వదనం మతం కకారస్య వదనవాచిత్వాత్ । యద్వా హస ఆనందః కస్సూర్యో హస్తు చంద్రస్స్యాత్ ॥ 82 ॥ ఏతౌ లౌ నయనే యస్సై్యతత్కహలం రవీందునేత్రమితి। తేన ప్రకాశకత్వాత్ చిద్రూపత్వంచ నిగదితంభవతి॥

తా॥ "హస" శబ్దమునకు ప్రకాశించుటయు, "క" శబ్దమునకు ముఖమును అర్థము. కనుక "హసక" శబ్దమునకు ప్రకాశించుచున్న ముఖముకలదని అర్థము. లేక "హస" శబ్దమునకు ఆనందము అర్థము. కకారమునకు సూర్యుడును, హకారమునకు చంద్రుడును, లకారమునకు నేత్రములును అర్థము. కనుక "హసకహల" అనుశబ్దముచేత పరమేశ్వరి సూర్యచంద్రులు నేత్రములుగల్లదై ఆనందరూపయగుటవలన చిద్రూపమనిసిద్ధించినది.

విధిహరిగిరీశేడ్యత్వే హేతూపతే హసత్వే కహలత్వే।
తేనాత్మమితానందం చిద్బ్రహ్మేతి ద్వితీయకూటార్థః॥84॥

తా॥ రెండవకూటముచేత పరమేశ్వరి సూర్య చంద్రులు నేత్రములుగలదై ఆనందరూపయగుటవలన బ్రహ్మవిష్ణుశివులచేత స్తోత్రముచేయబడు పరమానందమయిన చిద్బ్రహ్మమని చెప్పబడుచున్నది.

సకలాభిన్నహితం సకలం బ్రహ్మేతు తృతీయకూటార్థః।
ఇత్థం గుణగణకథనాత్. విద్యాయా ఏవ సగుణార్థః॥85॥

తా॥ మూడవకూటమందలి సకలశబ్దముచేతపరమేశ్వరిసమస్తకళల (విద్యల) తోకూడిన పరబ్రహ్మమని చెప్పబడుచున్నది. ఇట్లు గుణసమూహమును చెప్పుటచే విద్యకు ఇది సగుణార్థము.

# 10 వ ప్రకరణము

## గురుశిష్యలక్షణకథనము.

గురూపదేశములేని విద్య నిష్ప్రయోజనము. సద్గురువువలన సచ్ఛిష్యునకుపదేశింపబడు నెడల పురుషార్థములు సిద్ధించును. కనుక గురుశిష్యలక్షణములు ముఖ్యముగ దెలియవలయును.

త్రిశతి 71 లక్ష్యార్థా॥

శం॥ వ్యా॥ మనోవిలయరూప హఠ రాజయోగాది సాధనపరిపాకవశేన సాక్షాత్కృతం చైతన్యం లక్ష్యఇత్యుచ్యతే। అర్థ్యతే యాచ్యతే గురుంప్రతి ఇతి అర్థః। లక్ష్యోయోఽర్థః। చిత్స్వరూపపరమానందరూపః। సోపి సైవేతి తథా॥

తా॥ మనోలయరూపములగు హఠయోగము, రాజయోగ ముమొదలగు దృఢసాధనములచేత సాక్షాత్కరింపబడిన చైతన్యము లక్ష్యమనబడును. గురువులనాశ్రయించి తెలియదగిన చిదానందస్వరూపమే చిచ్ఛక్తి. వాచ్యార్థమును విడిచి యీ లక్ష్యార్థమును గ్రహించుటకు గురుశిష్యలక్షణము చెప్పఁదగినది.

పరివస్యారహస్యము— శ్లో॥ సద్గురుకులతః కృపయా లబ్ధాకామానియం సూతే। నిజబుద్ధిమాత్రజన్యా పాపం కన్యా యథా స్వైరా॥

సద్గురుకృపచేత పొందబడిన ఈవిద్య ధర్మార్థ కామమోక్షములనిచ్చును. స్వబుద్ధిమాత్రముచే గ్రహించిన విద్య తనకన్యనుపొందినంతపాపమునిచ్చును.

ద॥ సం॥ 10అ॥ గురుశిష్యవిధిం దేవి సమ్యగ్వక్ష్యామ్యనంశయం ।**॥ జితేంద్రియో జితక్రోధో బ్రహ్మవిద్యాపరాయణః । బ్రహ్మనిష్ఠః శుచిర్దాంతో దుష్ప్రతిగ్రహవర్జితః । మేధావీ వీతరాగశ్చ శాంతోదాంతస్సమాహితః । శ్రద్ధావాననసూయశ్చ సమ్యగాగమతత్త్వవిత్ । అంతర్యాగపరో నిత్యం న్యాసత్రియవిశోధితః । చిద్విద్యార్థసమాధిస్థః సాంప్రదాయ విచక్షణః ॥ 4 ॥ సమ్యక్సంపుటితజ్ఞానీ సదాచారపరోఋజుః । ప్రత్యక్బ్రహ్మైక్యనిపుణ శ్చిద్విద్యాకర్మతత్పరః । బాహ్యార్చనపరిత్యాగీ సదాంతర్యాగయోగవిత్ । బాహ్యాంతరాత్మసందృష్టి నిర్ధూతాఖిలకల్మషః । శక్తిమాత్రపరిజ్ఞానీ శక్తితత్త్వార్థవిత్తమః । ఏతాదృశో గురుశ్రేష్ఠో బ్రహ్మవిద్యాపరిగ్రహే ॥ 7 ॥

తా॥ ఈబ్రహ్మవిద్యను అపేక్షించువాఁడు ఇంద్రియనిగ్రహము, క్రోధనిగ్రహము, బ్రహ్మవిద్యయందు ఆసక్తి, బ్రహ్మ

ధ్యానము, పరిశుద్ధి, మనోనిగ్రహము, దుష్టప్రతిగ్రహము లేక పోవుట, మంచిబుద్ధి, వైరాగ్యము, శమము, దమము, సమాధి శ్రద్ధ, అవమానము లేకపోవుట, ఆగమములను బాగుగా తెలిసి కొనుట, అంతర్యాగము, షోఢా, మహాషోఢా, శ్రీచక్ర, న్యాస ములను తెలిసియుండుట, చిద్విద్యయొక్క అర్థమును విచా రణచేయుట, సాంప్రదాయములు తెలిసియుండుట, యుక్తమగు జ్ఞానము, సదాచారమునందాసక్తి, న్యాయప్రవృత్తి, జీవబ్ర హ్మములకు ఐక్యబుద్ధి కలిగియుండుట, చిద్విద్యాకర్మలయందా సక్తి, బాహ్యార్చననువిడిచి సదా అంతర్యాగమునందాసక్తి, సర్వత్ర ఆత్మదృష్టిచేత పాపములులేకపోవుట, శక్తిసూత్రము లనెరిగియుండుట, పరదేవతయొక్క తత్వమును తెలిసియుండుట మొదలగు గుణములుగల గురువును ఆశ్రయింపవలయును.

వరివస్య॥ శ్లో॥ బంధనం యోనిముద్రాయా మంత్రాణాం పీర్యయోజనం। గురోర్లక్షణమేతావదాదిమాద్యంతువేదయేత్

తా॥ యోనిముద్రను కూర్చుటయు, మంత్రములయొక్క తాదాత్మ్యవిమర్శమును, అకార హకార స్వరూపవిమర్శమును తెలిసియుండుటయే గురువుయొక్క లక్షణము॥

కులార్ణవము— ఆనందాద్వైయజపస్తోత్ర ధ్యానహోమా ర్చనాదిభిః। జ్ఞానోపదేశసామర్థ్యం మంత్రశుద్ధిమపీశ్వరి। బో ధకత్వంచ విజ్ఞాయ శిష్యోభూయాన్నచాన్యథా॥

తా॥ ఆనందశాంత్యాదులుగలిగి వానిచేతను, జప, స్తోత్ర, ౹న, హోమార్చనాదులచేతను, జ్ఞానమునుపదేశించు సామ ర్థ్యమును, మంత్రశుద్ధియును, శిష్యునికిబోధచేయు నేర్పుమ గల గురువునే శిష్యుడు ఆశ్రయింపవలసినది.

క్రియాసాగరము॥ శ్రీగురుః పరమేశాని శుద్ధవేషో మనోహరః। సర్వలక్షణసంపన్న స్సర్వావయవశోభితః॥ అగ్రగణ్యో గభీరశ్చ పాత్రాపాత్రవిశేషవిత్। శివవిష్ణుస్సమ స్సాధుర్న చ దర్శనమానకః। నిత్యే నైమిత్తికే న్యే చ రతః కర్మణ్యానిందితే। యదృచ్ఛాలాభసంతుష్టో గుణదోషవిభేదకః। ఇత్యాదిలక్షణోపేతః శ్రీగురుః కరుణావహః॥

తా॥ ఓపార్వతీ దంభవేషములేకుండ మనోహరమయిన ఆకారము, సర్వావయవశోభితుడు, సర్వలక్షణములు, సుస్వభావము గలిగి, అగ్రగణ్యుడు, గంభీరుడు, పాత్రాపాత్రవివేకవిచక్షణుడు, శివవిష్ణుసమభావుడు, సాధువు, అన్యమతమునుదూషించనివాడు, అనిందితనిత్యనైమిత్తికకర్మనిరతుడు, యదృచ్ఛాలాభసంతుష్టుడు, గుణదోషవివేచకుడు నగు గురువు తనకరుణచే శిష్యునిదరింపచేయగలడు.

ఆగమము— శ్విత్రీచైవ గళత్కుష్ఠీ నేత్రరోగీచ వామనః। కునఖీ శ్యావదంతశ్చ స్త్రీజితో హ్యధికాంగకః। హీనాంగః కపటీ రోగి బహ్వాశీ బహుజల్పకః। ఏతైర్దోషైర్విహీనో యః సగురుశ్శిష్యసంమతః॥ ఇతి॥

తా॥ శ్విత్రము, కుష్ఠము, నేత్రరోగము, మిగులపొట్టితనము పుప్పిగోళ్ళు, పుప్పిదంతిములు, విశేషకామము, అధికాంగములు, హీనాంగములు, కాపట్యము, రోగము, అతిభోజనము, అతిసంభాషణము మొదలగుదోషములులేని గురువు శిష్యునిచే సేవింపతగినవాడని ఆగమము చెప్పుచున్నది.

పరీక్షాకాలము॥

జ్ఞానేనక్రియయావాపి గురుశ్శిష్యం పరీక్షయేత్। సంవత్స

రం తదర్ధంవా తదర్ధార్ధంవా ప్రియత్నతః। శిష్యోపి లక్షణైరే తైః కుర్యాద్గురుపరీక్షణం ॥ ఇతి ॥

తా॥ గురువు శిష్యునియొక్క తెలివిని, గుణములను, వ్యాపారములను, ఒకసంవత్సరముగాని, ఆఱునెలలుగాని, అధమము మూడునెలలుగాని పరీక్షించి వానిని గ్రహింపవలయును. శిష్యుడును గురువుయొక్క జ్ఞానవ్యాపారములను అరసి కనిపెట్టి వానిని ఆశ్రయింపవలయును.

సూ॥ సం॥ ఉత్తమః పంచధాప్రోక్తో గురుర్బ్రహ్మసువేదిభిః బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః। అతివర్ణాశ్రమీ చేతి క్రమాచ్ఛ్రేష్ఠో విచక్షణః ॥

తా॥ బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు. సంన్యాసి, అవధూత అను వీరైదుగురిలో క్రమముగ మొదటివారికంటె తరువాతివారు శ్రేష్ఠులని బ్రహ్మవేత్తలు చెప్పచుర.

గురుః గృహస్థప్వైకో నకదాచిద్యతిర్గురుః।
కేవలకామ్యపరోయం నియమః॥

తా॥ గృహస్థే గురువుగాని యతీశ్వరుడు గురువుగా నుండ కూడదు అనునిషేధము కామ్యవిషయములోగాని మోక్షవిషయములోగాదు. మోక్షవిషయమందు గురువుగానుండవచ్చునని భావము.

సూ॥ సం॥ రు॥ ఖం॥ 4 అధ్యాయము॥

త్రిచతుర్వత్సరం శిష్యం పరీక్ష్య సతతం పునః। ఈశ్వరాదేశతో దేయో మంత్రోయం మంత్రిసత్తమైః। అపరీక్ష్య ప్రదానేన శీఘ్రం మృత్యుమవాప్నుయాత్। అర్జితః పురుషార్థోపి వృథా భవతి తస్యతు ॥ ఇతి ॥

తా॥ శిష్యుని మూడు నాలుగు సంవత్సరములు నిరంతరము పరీక్షించి ఈశ్వర ప్రేరణమువలన మంత్రము నుపదేశింపవలసి నది. పరీక్షింపక నుపదేశించుటచేత శీఘ్రముగా మృత్యువు ప్రాప్తించును. తనపురుషార్థముగూడవ్యర్థమగును. అనగా సంపాదించిన పురుషార్థము చెడుట శీఘ్రమరణము మొదలగు దోషములు గురువునకు తటస్థించును.

సూ॥ సం॥ యు॥ ఖం॥ 4 అధ్యాయము॥

ఆచార్యముఖతఃప్రాప్తా స్సిద్ధ్యత్యేవాచిరేణతు।
ఆచార్యరహితో మంత్రః పుంసోనర్థస్య కారణం॥

తా॥ గురువుచేతనుపదేశింపబడిన మంత్రము శీఘ్రకాలములోనే సిద్ధించును. గురూపదేశములేకుండగ నభ్యసించిన మంత్రము ఆపదనుపుట్టించును.

పరీక్షలేకపోవుటవలన కలుగు హాని॥

శ్లో॥ గురుశిష్యావుభౌ మోహాదపరీక్ష్య పరస్పరం। ఉపదేశం దదద్గృహ్ణన్ ప్రాప్నుయాత్తాం పిశాచతాం॥ అశాస్త్రీయోపదేశంతు యోగృహ్ణాతి దదాతిచ। భుంజాతే తావుభౌ ఘోరాన్నరకానేకవింశతిం॥ అన్యాన్మంత్రవిజ్ఞానం నతిష్ఠతి కదాచన। తస్మాత్పరీక్ష్య వక్తవ్యం అన్యథా నిష్ఫలంభవేత్॥ యఃస్నేహభయలోభాద్యై రయోగ్యం యదిదీక్షయేత్। దేవతాశాపమాప్నోతి కృతంచేన్నిష్ఫలం భవేత్॥

తా॥ ఒకరినొకరు పరీక్షింపక మోహమువలన గురువుఉపదేశించినను, శిష్యుడుఉపదేశమును పొందినను, ఉభయులు పిశాచరూపమును బొందుదురు. శాస్త్రసమ్మతముకాని యుపదేశము చేసినవారును, పొందినవారును ఉభయులు నిరువదియొక్క నర

కములను బొందుదురు. అయోగ్యునియందు మంత్రశక్తి యె స్నడును ఉండదు. గనుక పరీక్షించి ఉపదేశింపవలయును. లే యెడల వ్యర్థమగును. ఎవరైనను స్నేహము, భయము, లోభము మొదలగు కారణములచేత అయోగ్యునకు దీక్ష నిచ్చిన యెడల వారిని దేవతలు శపింతురు. వారు చేసినదియు నిష్ఫలమగును.

గురుదోషములు.

సూ॥ సం॥ శూద్రాణాంచ తథా స్త్రీణాం గురుత్వం న కదాచన। ఇతి శివః॥ [లుకాదు.

తా॥ స్త్రీలుగాని, శూద్రులుగాని, ఉపదేశించుటకు అర్హు

శ్లో॥ నాస్తికాన్ భిన్నమర్యాదాన్ కృతఘ్నాన్ వేదనిందకాన్। మంత్రాక్షరోపదేశేతు దూరతః పరివర్జయేత్॥ ఇతి సనత్కుమారశ్చ॥

తా॥ పరలోకము లేదనువారిని, వర్ణాశ్రమమర్యాదకు భిన్నముగా ప్రవర్తించువారిని, ఉపకారమును మరచినవారిని, మంత్రోపదేశమునందు గురువులనుగాఁబొందక దూరముగా విడువవలయును.

శిష్యలక్షణాని—దత్తాత్రేయసం॥ 10 అ॥

శ్లో॥ నిత్యకర్మరతశ్శాంతో నిర్మలజ్ఞానదీపితః। నిర్ద్వంద్వో నిష్పరిగ్రాహీ ప్రయతశ్శాంతకల్మషః। గురుసేవాపరో నిత్యం గుర్వర్పితధనక్రియః ॥ 11 ॥ చిదైక్యావ్యగ్రచిత్తాత్మా సదా ధ్యానపరాయణః। విద్యావిశుద్ధధీర్నిత్యం సత్సంసర్గపరో మృదుః పరస్త్రీవిముఖో బ్రహ్మ సమర్పితవిధిక్రియః। గురు పుత్ర కళత్రేషు తత్పౌత్రాదిషు సక్తధీః। సమర్పితాత్మనిచయో వేదశాస్త్రవిచక్షణః। బ్రహ్మచారీ గృహస్థోవా వానప్రస్థో

భిక్షుకః । గుణై రేతైర్విశిష్టశ్చేచ్ఛిష్యస్త్వేతం నియోజయేత్ ॥

తా॥ నిత్యకర్మపరాయణుడు, శాంతుడు, నిర్మలమగు జ్ఞానముకలవాడు, శత్రుమిత్రభావము, సుఖదుఃఖభేదములేనివాడు, ప్రతిగ్రహము చేయనివాడు, నియమముగలవాడు, తనధనవ్యాపారములను గురువునకర్పించెడివాడు, ఆత్మధ్యానమునందే స్థిరచిత్తముగలవాడు, జ్ఞానముకలవాడు, సత్పురుషులతో సహవాసమునపేక్షించువాడు. పరస్త్రీవిముఖుడు, బ్రహ్మార్పణబుద్ధిచే కర్మములుచేయువాడు, గురు పుత్ర పౌత్ర కళత్రాదులయందు భక్తిగలవాడును, తనవిగాభావించెడి చిత్తేంద్రియశరీరవ్యాపారధనాదులను గురుదేవతార్పణముచేయువాడును, వేదశాస్త్రములయొక్క విమర్శగలవాడు నగు బ్రహ్మచారిగాని, గృహస్థుగాని, వానప్రస్థుగాని, సన్యాసిగాని, శిష్యుడుగా గ్రహింపబడదగినవాడు.

ద॥ సం॥ 10అ॥ శ్లో॥ కశయా తాడితోవాపి క్రోధితో భర్త్సితోపివా । మహాప్రసాద ఇత్యేవ గురుం ప్రత్యనుమోదయేత్ । గురుం త్వంకృత్య హుంకృత్య గురుపుత్రాదికానపి । అరణ్యే నిర్జలే ఘోరే భవతి బ్రహ్మరాక్షసః । గుణై రేతైర్విశిష్టంతు శిష్యం సేవాపరాయణం । వర్షత్రయేణ దేవేశి గుణవంతం పరిగ్రహేత్ । చిద్విద్యాలాభమన్విచ్ఛన్ శిష్యో వర్షత్రయం ధనైః । సంపూజయేదథాచార్యం ధనలోభవివర్జితః । పరిచర్యాపరో భూయాత్కామక్రోధవివర్జితః । యతోజాతస్త్వయం దేహస్తౌ మాతాపితరౌ స్మృతౌ । శతాంశైః పితృతః శ్రేష్ఠా మాతాభరణపోషణైః । శతాంశై ర్మాతృతః శ్రేష్ఠో గురురిత్యేవ కీర్త్యతే ॥

తా॥ గురువు తనను కొరడాతో కొట్టినను, తనమీద కోపము చేసినను, జడిపించినను, శిష్యుడు వాటినన్నిటిని గుర్వనుగ్రహముగానే తలంపవలెను. శిష్యుడు మహాప్రసాదమని అందుకు బ్రీతిగా గురువును సంతోషింపచేయవలెను. గురువునుగాని గురుపుత్రాదులనుగాని నీవునీవుఅని యేకవచనము ప్రయోగింపక బెదిరింపకయుండవలెను. కానిఅట్లుతిరస్కరించునడలశిష్యుడు ఉదకములేని ఘోరారణ్యమునందు బ్రహ్మరాక్షసుడగును. శిష్యుని మూడుసంవత్సరములు పరీక్షించి గుణవంతుడైనవానినే గ్రహింపవలయును. చిద్విద్యాలాభమును బొందగోరిన శిష్యుడు మూడుసంవత్సరములు ధనముచే నాచార్యునిబూజించుచు ధనలోభమును, కామక్రోధములను విడిచి శుశ్రూష చేయవలెను. దేహమునకు కారణము తల్లిదండ్రులు. భరణపోషణములంబట్టి తండ్రికంటె తల్లి నూరురెట్లు అధికురాలు. తల్లికంటె గురువు నూరురెట్లు అధికుడు.

శ్లో॥ గురౌ సన్నిహితే దారపుత్రాదీన్నతథా యజేత్ । అభావే స్వగురోర్దారపుత్రాదీన్గురువద్యజేత్ ॥ గురోస్సకాశాదప్రాప్తం రహస్యం తత్సుతాల్లభేత్ । అసంప్రాప్తో గురోరాత్మదీక్షాం తత్సుతతో లభేత్ ॥ ఇతి ద॥ సం॥ 10 అ॥

తా॥ గురుసన్నిధానమందు గురుభార్యను, గురుపుత్రాదులను గురువునువలె పూజింపనక్కరలేదు. గురువులేని కాలమందు గురుభార్యాదులను గురువునువలెనే పూజింపవలెను. గురువువలన ప్రాప్తింపనిరహస్యము గురుపుత్రునివలన తెలిసికొనవలెను. గురువువలన తరువాయిపడ్డ దీక్షను గురుపుత్రునివలన బొందవలెను.

శ్లో॥ నదేయమర్ధలుబ్ధాయ పిశునాయాస్థిరాయచ । భక్తిశ్రద్ధావిహీనాయ శుశ్రూషావిముఖాయచ ॥ ఇతి అర్ణవే ॥

తా॥ ద్రవ్యలుబ్ధుఁడు, తంత్రములుచెప్పువాఁడు, స్థిరచిత్తములేనివాఁడు, భక్తిశ్రద్ధలులేనివాఁడు, శుశ్రూషనుచెయ్యనివాఁడు నగు శిష్యునకుపదేశింపఁగూడదు.

శ్లో॥ స్వాహాప్రణవసంయుక్తం మంత్రం శూద్రే దదద్ద్విజః శూద్రశ్చండాలతామేతి విప్రశ్శూద్రత్వమేవహి ॥ ఇతి అర్ణవే ॥

తా॥ స్వాహాకారము, ఓంకారములోఁ గలిసిన మంత్రమును శూద్రునికి బ్రాహ్మణుఁడుపదేశించినయెడల నుభయులకు హాని కలుగును.

శ్లో॥ దాసస్య శివభక్తస్య హితప్రియకరస్యచ । శూద్రస్యాపి ప్రదాతవ్యం నమోంతం ప్రణవంవినా ॥ వినా మంత్రైః ప్రణవేన స్త్రీశూద్రాణాం ప్రసాదకః । ప్రణవేనసమాయుక్తః స్త్రయోర్దేవి విషోపమః ॥ ఇతి ఆగమే ॥

తా॥ దాసుఁడై శివభక్తుఁడై మంచిబుద్ధిగల శూద్రునకు ఓంకారమునువిడిచి నమశ్శబ్దము అంతమందుంచి మంత్రమునుపదేశింపఁదగును. శూద్రులకు ఓంకారములేనిమంత్రమే క్షేమమును చేయును. కాని ఓంకారములోఁ గలిసినయెడల విషప్రాయమగును.

శ్లో॥ అమాత్యదోషో రాజానం భార్యాదోషం పతింయథా తథా శిష్యకృతో దోషో గురుంప్రాప్నోత్యసంశయః ॥ తస్మాచ్ఛిష్యం గురుర్నిత్యం పరీక్ష్యైవ పరిగ్రహేత్ ॥

తా॥ మంత్రిచేసినదోషము రాజును, భార్యచేసిన దోషము భర్తను పొందునటుల శిష్యుఁడుచేసిన దోషము గురువును

పొందును. కనుక శిష్యునిపరీక్షించి ఉపదేశింపవలయును.

ల॥ స॥ 713 గురుమండలరూపిణీ॥

వ్యా॥ అవిచ్ఛిన్నగురుపరంపర్యక్రమాగతమిదం రహస్యం నతు పుస్తకే లిఖ్యతఇతి భావః॥ అతఏవోక్తం యోగినీహృదయే॥ కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తమవనీతలఇతి॥

తా॥ ఎడతెగని గురుపరంపరాక్రమముచేత నీరహస్యవిద్య సంప్రాప్తమయినది. కాని పుస్తకమునందు లిఖించినదానినిపట్టి కాదు. అని యిందులభావము. అందుచేతనే యోగినీహృదయమునందు ఒకరిచెవినుండి మరియొకరిచెవియందు ఉపదేశించుటచేత భూలోకమునకు సంప్రాప్తమయినదని చెప్పబడినది.

ల॥ స॥ 171 లోభనాశినీ॥ లోభ స్సర్వగుణాన్ హంతీతి నిందితం లోభం భక్తానాం నాశయతీతి తథా॥

తంత్రరాజే గురులక్షణకథనదశాయాం॥ అసంశయస్సంశయచ్ఛిన్నిరపేక్షో గురుర్మతఇత్యుక్త్వా తయోర్విశేషణయోర్లక్షణముక్తం॥

తా॥ లోభము సమస్తగుణములను హరించుటచే నిందితమగును. పరమేశ్వరి భక్తులయొక్క అట్టిలోభమును నశింపచేసును.

తంత్రరాజమునందు గురులక్షణప్రస్తావములో తనకు సంశయములేక యితరులసంశయములను పోగొట్టగలిగి దేనియందును అపేక్షలేనిగురువును సేవింపవలయునని గురువుయొక్కవిశేషలక్షణములుగూడ చెప్పబడినవి.

6వ గౌడపాదసూత్రవిద్యారణ్యభాష్యమునందు— యథా ఘటశ్చ కలశః కుంభశ్చైకార్థవాచకః। తథా దేవశ్చ మంత్ర

శ్చగురుశ్చైకార్థ ఉచ్యత ఇతి సుందరీతాపనీయే॥ తస్మాదీశ్వర ఏవ మంత్రిః ఈశ్వర ఏవ గురుః స ఏవ మంత్రాధిష్ఠాన దేవతా। భేదాభావాత్ ఈశ్వరో గురురాత్మేతి వచనాత్ ॥

గుకారస్సదితి ప్రోక్తో రుకారో జ్ఞానవాచకః। తద్బ్రహ్మానందసంజ్ఞోయం గురురిత్యభిధీయతే॥ గుకార స్త్వంధకారస్యాద్రుకార స్తన్నివారకః। అంధకారనివర్తిత్వా ద్గురురిత్యభిధీయతే॥ ఇతి వచనాత్తస్యైవాభేదః॥

తా॥ ఘటము, కలశ, కుంభము అనునవి ఒకేవస్తువును చెప్పునట్లే దేవత, మంత్రము, గురువు అనునవి యొకస్వరూపమే అని సుందరీతాపినీయశ్రుతియందు చెప్పబడినది. కనుక ఈశ్వరుడే మంత్రిస్వరూపుడు. గురుస్వరూపుడు. కనుక నీమూడును భేదముగలవి కావు. గుకారము బ్రహ్మమును, రుకారము జ్ఞానమును చెప్పును కనుక గురుశబ్దమునకు బ్రహ్మజ్ఞానమును బోధచేయునదియని యర్థము. మఱియు గుకారమునకు అంధకారమును, రుకారమునకు తన్నివారణయును అర్థము. కనుక గురుశబ్దమునకు అంధకారనివృత్తి చేయునదని అర్థము. కనుక గురుమంత్రిదేవతలకు అభేదము.

# 11 వ ప్రకరణము

సిద్ధారి (మిత్రశత్రుమంత్ర) వివరణము.

సిద్ధారిచక్రమునుబట్టి కొన్నిమంత్రములు మిత్రవర్గములోను కొన్నిమంత్రములు శత్రువర్గములోను నుండును. అట్టిమంత్రములు పరీక్షించి పొందవలెను. కొన్నిమంత్రములకు సిద్ధారిశోధనమవసరము లేదు. అందులవివరణమేమనగా:—

హ్రీంకారాదులకు సిద్ధారిశోధన మనవసరములేదు.

ద॥ సం॥ 10అ॥ ప్రణవత్ర్యక్షరీమాయా వ్యోమబీజాదికోమ నుః। ప్రాసాదమంత్రశ్చిద్విద్యా షడిమేస్యుః సమాఃస్మృతాః॥ సౌరాయేవైష్ణవాయేచ నృసింహాస్యచ యేస్మృతాః। ఏతేషు మనవస్సర్వే సిద్ధారిపరివర్జితాః॥ సపిండబీజమంత్రాణాం వారాహాస్స్వప్నలబ్ధయోః। పితృదత్తే, మాతృదత్తే గుర్వనుగ్రహాలబ్ధకే। నపుంసకాభిధే మంత్రే హంసార్ణమనవా అపి। ఏకబీజ త్ర్యాదిబీజేచ మనౌ పంచాక్షరే మనౌ। ఏకాక్షరేచ మాలాయాం వేదసిద్ధమనుష్వపి। మంత్రే ప్రేమాస్పదేవాపి సిద్ధారీన్నైవ శోధయేత్ ॥ వైరిమంత్రాశ్చ యేకేచిజ్జప్తామాతృకయాశ్శివె। వింశత్సంఖ్యాయుతశతోపేత సాహస్రవర్ణయా। ద్వ్యుత్తరస్థశతార్ణాఖ్య మంత్రావా కులసుందరి। తేశత్రుభావము త్సృజ్య మిత్రభూతాశ్చ సిద్ధిదాః। శత్రుష్వపిచ మిత్రేషుమాయాకామశ్రియశ్శివె। నిక్షిప్యానులోమేన ప్రతిలోమేనవా జపేత్ । వైరిమంత్రాశ్చ సిద్ధ్యర్థఫలదామిత్రభావతః। కేవలేనాపి తారేణ యుక్తస్సర్వఫలప్రదః। యస్య యస్మిన్ భవేద్భక్తిస్సోపి తస్య ఫలప్రదః॥

తా॥ ఓంకారము, మూడుఅక్షరములుగల బాలామంత్రము మాయాబీజమైన హ్రీంకారమంత్రము, వ్యోమబీజమైన హాకారాదిమంత్రము, ప్రాసాదమంత్రము, చిద్విద్యయను త్రిపుర సుందరీమంత్రము, ఇవియారును సమానములు. వీనికివి సౌర, వైష్ణవ, నృసింహామంత్రములకును, సిద్ధారివిమర్శ మనవసరము లేదు. మఱియు సపిండబీజమంత్రములును, వరాహామంత్రమును, స్వప్నలబ్ధమంత్రమును, పితృదత్తము, మాతృదత్తమున

యువమంత్రములును, గురువుయొక్క అనుగ్రహమువలననియ్య బడిన మంత్రమును, నపుంసకమంత్రములును, హంసమంత్రము లును, ఒకటి రెండు మూడు బీజములుగల మంత్రములును, వం చాక్షరీమంత్రమును, మాలామంత్రములును, వేదసిద్ధమంత్ర ములును, శ్రీమాస్పదమగుమంత్రములును. సిద్ధాదిశోధనమవ సరములేనివి. శత్రువర్గమందున్న మంత్రములును మాతృకాక్ష రములతో మేళనముచేసినను, 1120గాని 102గాని వర్ణములు గల మాలామంత్రములును జపముచేసినవానికి ఆమంత్రములు మిత్రభావముచే సిద్ధినిచ్చును. శత్రుమంత్రములయందును, మిత్ర మంత్రములయందును మాయా కామశ్రీబీజములైన హ్రీం క్లీం శ్రీం అను బీజములనుచేర్చి వానిని అనులోమ విలోమములుగా జపముచేయునెడల శత్రుమంత్రములునుగూడ మిత్రభావమును పొంది సిద్ధినిచ్చును. కేవలము ఓంకారముచేర్చినను అన్నికోర్కె కలనిచ్చును. ఎవరికేమంత్రమందు భక్తికలుగునో వారికి అది ఫలమునిచ్చును.

ద॥ సం॥ 6అ॥ ఛిన్నమస్తా మంత్రరాజేస్మిన్ నపరీక్ష్యాం క్వచిత్ప రం। మర్త్యదేహమిమం బిభ్రజ్జీవో యోగ్య స్స్వయం భవేత్ ॥ నోపాసీత మహావిద్యాం యది కోన్యః పశుర్వద। వాంఛంతి జన్మమానుష్యం భువి దేవైః శతక్రతుః॥***॥ మానుష్యంజన్మ లబ్ధ్వాపి భువి బ్రహ్మాది దుర్లభం। నోపాస్తే శ్రీశ్రీయోవిద్యాం యస్తతోన్యః క ఆత్మహా ॥ ఇత్యాది ॥

తా॥ మంత్రరాజమగు ఈఛిన్నమంత్రమునందు పరీక్ష యెవ్వ దును అవసరములేదు. జీవుడు యోగ్యమయిన మనుష్యశరీర మునుపొంది మహావిద్యనుపాసనచేయనియెడల నింతకంటె పశు

త్వమేమున్నది. భూలోకమునందు మనుష్యజన్మము ఇంద్రాదిదేవతలచేతగూడ కోరబడుచున్నది. భూలోకమునందు బ్రహ్మాది దేవతలకును దుర్లభమయిన మనుష్యజన్మమును పొందియు నీవిద్యను ఉపాసన చెయ్యనివానికంటె నాత్మఘాతి యితరుడులేడు.

---

# 12 వ ప్రకరణము

## మానసికవిశేషము.

జపముచేయు విధములు మూడు. నిగదము, అనగ బిగ్గరగ ఉచ్చరించుట ఉపాంశు అనగ తనశ్రోత్రములకుమాత్రము వినబడుట. మానసికము అనగ మనస్సుచేతనే ఉచ్చరించుట. వీనిలో మానసికము అత్యుత్తమము. జప హోమార్చనాదులు మానసికముచే చేయుటవలన అనంతఫలముగలదు. ఎట్లనగా-

వామకేశ్వరతంత్రము పంచమపటలము 39 శ్లో॥

సంయతేంద్రియసంచారం ప్రోచ్చారేన్నాదమాంతరం ।
ఏషఏవ జపః ప్రోక్తో నచ బాహ్యజపో జపః ॥

వ్యా॥ సంయతః నిరుద్ధఇంద్రియాణాం జ్ఞానకర్మేంద్రియాణాం సంచారః స్వస్వవిషయాభిముఖీ ప్రవృత్తిః యస్మిన్కర్మణి తద్యథా భవతి తథా । ఆంతరం అంతరకృత్రిమతయా ప్రసరంతంనాదం అనాహతంప్రోచ్చరేత్ । ఏషఏవజపః సర్వవర్ణప్రకృతిభూతనాదాభ్యాసేన సర్వమంత్రాణాంయుగపదేవసిద్ధిజనకత్వాత్ । బాహ్యస్తువైఖరీ రూపవర్ణాను పూర్వీవిశేషోచ్చారణరూపో జపోనజపో నాఖిలమంత్రసిద్ధిదాయకః । తత్తదానుపూర్వీమాత్రసిద్ధిజనకత్వాదితిభావః ॥

తా॥ జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములనెడు పదియింద్రియముల చేతను కలుగు బాహ్యవ్యాపారమును మఱచి అంతరంగమున సహజముగ ప్రసరించుచున్న అనాహతనాదము ననుభవించుటయే మానసికజపము. ఈనాదము సకలాక్షరములకు మూలము। అక్షరములు సర్వమంత్రములకు మూలము। కావున నాదానుభవమే సకలమంత్రసిద్ధిని గలిగించును। వర్ణములను వెలుపలికి బిగ్గరగా నుచ్చరించు వైఖరీరూపజపమువలననామంత్రమొకటియే సిద్ధించును, కానినాదానుభవము వలె సకల మంత్రసిద్ధికలుగదు.

అరుణోపనిషది— "యద్రహస్యం ప్రవిశేత్ మిథోచరిత్వా ప్రవిశేదితి" శ్రీవిద్యోపాసకానాంమార్గేరహస్యంపాద్యైవ ప్రవిశేదితి తదర్థః। మిథోన్యోన్యార్థవిభావనం। ప్రకాశామర్శహస్తాభ్యామవలంబ్యోన్మనీస్రుచా। ధర్మాధర్మకలాస్నేహం పూర్ణవహ్నౌ జుహోమ్యహం॥ ఇతి॥

తా॥ రహస్యమును సంపాదించుమార్గమునందు ప్రవేశించవలయునేని అన్యోన్యార్థములను విమర్శింపవలయును. ప్రకాశవిమర్శలనెడు హస్తముల చేత ఉన్మనియను స్రుక్కునుబట్టి ధర్మాధర్మములనే ఆజ్యమును పరిపూర్ణాత్మయనెడు అగ్నియందుహోమమును చేయుచున్నానని ఉపనిషత్తునందు చెప్పబడెను.

సే॥ బం॥ ౫ప॥ 40శ్లో॥ తావదగ్నౌ నహోతవ్యం తత్తత్తంత్రోదితం యథా। యావదాత్మమహావహ్నౌ మనః పూర్ణాహుతింహునేత్॥

వ్యా॥ సంకల్పవికల్పాత్మకస్య మనఏవ। మనఏవ విశ్వస్యరూపం హవిః। ఆత్మైవ సర్వభక్షకత్వాదగ్నిః। అతఏవ శక్తి

సూత్రం॥ "చిద్వహ్నౌ రవరోహపదే చ్ఛన్నోపి చిన్మాత్రయా మేయేంధనం పుష్యతీతి" తతశ్చ యావదాత్మాగ్నౌ విశ్వస్య పూర్ణాహుతిర్నహుతా తావత్తత్తంత్రోక్తమగ్నౌ హోతవ్యం। తత్తత్ హోతవ్యం నభవతి। హవిషోఽప్రక్షీణత్వాత్। మనస్యాత్మనిహుతేతు బాహ్యాహోమేఽపి హోమపవేత్యర్థః। తదుక్తం॥ "అంతర్నిరంతరనిరింధనమేధమానే మోహాంధకార పరిపంథిని సంవిదగ్నౌ। కస్మింశ్చిదద్భుత మరీచివికాసభూమౌ విశ్వం జుహోమి వసుధాది శివావసానం" ఇతి॥ పూర్ణాహుతి పదేవ విశ్వవిషయకామనోవికల్పాన్వృత్తిరూపా యావంతః తావతాం సర్వేషాం విలాపనముచ్యతే॥ "హోమో విశ్వవికల్పానామాత్మన్యస్తమయోమతః" ఇతి తంత్రరాజోక్తేః॥

తా॥ సంకల్పవికల్పాత్మకమయి ప్రపంచస్వరూపమగు మనస్సేహవిస్సు. సర్వభక్షకమగు ఆత్మస్వరూపమే అగ్ని. ఆత్మయనెడు అగ్నియందు ప్రపంచమును హోమముచేయుటముఖ్యము. ఈహోమము సిద్ధింపకముందు ఆయాతంత్రములయందు చెప్పినరీతిగా అగ్నియందు హోమము చేయవలయును. ప్రపంచస్వరూపమగు హవిస్సు క్షీణింపకపోవుటవలన నది న్యాయమైన హోమముకాదు. ఆత్మయందు మనస్సు హోమమైనపక్షమందు బాహ్యహోమముగూడ హోమమగును. అంతరంగమున నిరంతరము కట్టెలులేకుండగ వెలుగుచు మోహమనె అంధకారముకు శత్రువయి అద్భుతమయిన కాంతులచేత ప్రకాశించుచున్న చిదగ్నియందు సగుణబ్రహ్మ మొదలుకుని భూమివరకునుండు సమస్తప్రపంచమునుహోమముచేయుచున్నాను. పూర్ణాహుతిపదముచేత ప్రపంచసంబంధమయిన

ధీతి తుర్యార్థః। పృథివీమహీంలకారస్తృతీయ తుర్యాంఘ్రిబోధి కామాయా॥ 8॥

తా॥ వ్యాఖ్యానమున ననుసరించి ఈతాత్పర్యము చెప్పబడుచున్నది. గాయత్రియందైన తత్... పదమునకు బ్రహ్మము అర్థము. ఇందుకు "ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధస్స్మృతః" ఓం తత్ సత్ అను మూడువిధములుగ బ్రహ్మమును చెప్పినట్టి స్మృతియు, "తదితి బ్రహ్మ శాశ్వతం" అను శ్రుతియు ప్రమాణములు.

మంత్రమందైన క కారమునకును బ్రహ్మము అర్థము. "కం బ్రహ్మ" అను శ్రుతిప్రమాణము. కామః కామేశ్వరుడే బ్రహ్మము.

సవితుః...సవితృశబ్దమునకు ప్రాణులయొక్క ఉత్పత్తికి కారణమైన యోని అర్థము. అట్టికారణము ఇతరత్రా వుండదని వరేణ్యం (శ్రేష్ఠము) వరేణ్యం అని చెప్పబడినది. సవితుః వరేణ్యమను రెండుపదములచేత శ్రేష్ఠమైన జగద్యోనిత్వము సిద్ధించినది. కనుక కామేశ్వరి అర్థము.

ఏకారమునకును యోని అర్థము. ఏకారము నాగర (సంస్కృత) లిపియందు మూడుకోణములుగ నుండును. సవితుర్వరేణ్యమితిషూాజ్ప్రాణిప్రసవే సవితా ప్రాణినసూతే ఇత్యుపక్రమ్య "త్రికోణా శక్తిరేకా రేణ మహాభాగేన ప్రసూతే తస్మాదేకారవద గృహ్యాత" ఇత్యాదిశ్రుతులును "యదేకాదశమాధారం బీజం కోణత్రయోద్భవం। బ్రహ్మాండాది కటాహాంతం జగదద్యాపి దృశ్యతే" అను స్మృతియు ప్రమాణములు.

భర్గోదేవస్యధీ...దేవపదమునకు సర్వాంతర్యామియునయ్యు,

ధీవర్ణమునకు జగదాధారమః యు, భర్గపదమునకు తేజస్సు అని యు అర్థము. కనుక సర్వాంతర్యామియు, సమస్తజగత్తులకా ధారునగు శివుడని సిద్ధించినది.

ఈ కారమునకుగూడ ఇదే అర్థము. "భర్గో దేవస్యేత్యాస్య వక్రీమ్య తురీయమక్షరం సర్వాంతర్యాభితం" తస్మాద్భర్గో దేవ స్యధీత్యేవ మీకార" అను శ్రుతి ప్రమాణము. ఈ కారము మంత్రమునందు మూడవదైనను మాతృకాక్షరములలో నాల గవది కనుక తురీయమక్షరమని చెప్పబడినది.

మహీ...అను శబ్దమునకు భూమండలమనియు, గొప్పది, కఠినమైనదనియు అర్థము. ఇట్లు పంచమహాభూతములకును సూచన చేయబడినది.

ల కారమునకు నీయర్థమే. మహీ హాస్యవ్యాఖ్యానం ఇది మొదలు ససాగరం సకాననం ఇత్యాదినా భూమండలం ప్రతీయాత్। "భూమండలమేవోక్తం లకారేణ" అను శ్రుతి ప్రమాణము.

ధయోయోనఃప్రచోదయాత్...అనుపదములకు. నామొద లగువారియొక్క బుద్ధులను నిర్గుణవస్తువిషయమై ప్రేరణచేయు చుపరతత్వము విషయముగాగల జ్ఞానముకుపుట్టించునని అర్థము

పరోరజసే సావదోం (గాయత్రియొక్క నాలగవపాదము) పరోరజసే అనుపదమునకు రజోగుణమును మించిన నిర్మలమని గాని, నిర్గుణమనిగాని అర్థము. సావదోం అనుపదమునకు ఓం కారము బ్రహ్మమును చెప్పుటకు శక్యమైనది, శక్యముకానిదియు నని అర్థము. పరతత్వము (బ్రహ్మము) నందు అర్థములను చెప్పు నట్టి ధర్మము లేనందున నది శబ్దములచేతను, అర్థక్రియచేతను

చెప్పశక్యము కానిది. అయినను సత్యజ్ఞానాదిశబ్దముల కర్థమయి తాదాత్మ్యసంబంధముచేత ప్రకాశించుచున్నది. గనుక లక్షణయా చెప్పబడుచున్నది. "యతోవాచో నివర్తంతే" "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః" అనెడిశ్రుతులును, "లక్ష్యార్థా లక్షణాగమ్యా" అనుస్మృతియు ప్రమాణములు. పరతత్త్వమును చెప్పునట్టి ఓంకారము అకార ఉకార మకారములచే చెప్పబడు బ్రహ్మ విష్ణు రుద్రుల రూపము.

హ్రీంకారమునకు నీయర్థమే. హృదయమనెడి గృహమునందు హ్రీంకారమున్నది. "హృదయాగారవాసినీ హృల్లేఖా" అనుశ్రుతి ప్రమాణము.

ఫలితార్థమేమనగా:— జగత్సృష్టియందు ఇచ్ఛగలకామేశ్వరుడును, కారణమైన కామేశ్వరియును, సర్వాంతర్యామియు, సమస్తమునకాధారమైనదియు, పంచమహాభూతములు మొదలగు స్వరూపములచేత పరిణమించినదియు, బ్రహ్మమును గురించిన నిర్వికల్పకజ్ఞానమును పుట్టించునదియు, గుణములులేనిదియు, దోషములులేనిదియు, వేదములచే లక్షణయా గమ్యమగునదియు, మరియొకవిధమున గమ్యముకానిదియు, బ్రహ్మ, విష్ణు, రుద్రుల రూపమయినదియు నగు బ్రహ్మమే పూర్ణగాయత్రికిని, మంత్రమందలి మొదటికూటమునకును అర్థము. 8

2, 3 కూటములకు అర్థము॥

శ్లో॥ త్రిపదీ త్రివర్ణబోధ్యా తుర్యస్తదుపరి పదక్షరీ గమకః। అథతార్తీయే వర్ణద్వితయం త్రిపదీ మదక్షరీ గమకం॥9

కూటద్వితయే శేషం పూర్వవదున్నేయమితితు శ్రీవిద్యాయాః। గాయత్ర్యర్థస్త్రిపురోపనిషది కథితస్తథైవ భాగవతే॥ 10 ॥

తా॥ గాయత్రియందలి " తత్ సవితుః వరేణ్యం " అను మూడుపదములకును పైని చెప్పిన అర్థమే ద్వితీయకూటమందలి "హసక" అను మూడుబీజములకు అర్థము. " తత్ " అను పదమునకు బ్రహ్మము అర్థము. హకారమునకు పరశివుడు (బ్రహ్మము) అర్థము. తదితి " పరమాత్మేత్యారభ్య హకారాక్షరం శివరూపమిత్యాదినా ఉక్త్వా అంతే తత్పదవ్యాప్తిమాదాయ శక్త్యై దర్శయతి " అను శ్రుతిలో పరమాత్మస్వరూపమును ముందుగా చెప్పి హకారమునకు శివరూపమునే మొదలగు అర్థములను చెప్పి అనంతరము తత్ అనే శబ్దముయొక్క అర్థమును తీసికొనిరి. గనుక హకారమునకు బ్రహ్మము అర్థమని శ్రుతివలన సిద్ధించినది. సవితుః అనేపదమునకుగల అర్థమే సకారమునకును వరేణ్యమునకుగల అర్థమే కకారమునకును, " భర్గోదేవస్యధీ " అనుపదమునకుగల అర్థమే రెండవకూటమందలి నాలగవహకారమునకును అర్థము. " తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్యధీ " అను పదములకుగల అర్థమే మూడవకూటమందలి "సక" అనుబీజములకర్థము. "లహ్రీం" అను బీజములకుగలఅర్థమే ప్రథమకూటమునందు చెప్పినరీతిగా తక్కిన గాయత్రియొక్క అర్థము. ఈప్రకారము ఒక్కొకకూటమునకు ఒకపూర్ణగాయత్రి యొక్క అర్థము. గనుక మూడుకూటములకు మూడుమారులు పూర్ణగాయత్రి జపముచేసిన ఫలము కలుగును. ఇట్లు విద్య (మంత్రము) కు గాయత్రియొక్క అర్థమని త్రిపురోపనిషత్తునందును, దేవీభాగవతమునందును చెప్పబడినది. భగవతీ సంబంధముకలది గనుక భాగవతము. దేవీభాగవతమందు ప్రథమశ్లోకము— ' సర్వచైతన్యరూపాం తాం ఆద్యాం విద్యాం చ

ధీమహి। బుద్ధిం యానః ప్రచోదయాత్ ॥ అనిమూడుపాదము లుగల ఏవిద్యమాయొక్క బుద్ధిని సత్కర్మములయందు ప్రేరణ చేయుచున్నదో అట్టివిద్యను (ప్రసిద్ధమయి సమస్తజ్ఞానస్వరూపమైన మంత్రరాజమును) ఉపాసనచేయుచున్నానని అర్థము. ఈశ్లోకమునందు శ్రీవిద్యకును, గాయత్రి మొదలగు వానికిని విద్యాశబ్దముచేత బ్రహ్మమని చెప్పినఅర్థము ఆశ్లోకవ్యాఖ్యానముచూచువారికి స్పష్టమగును. న్యాయముచేత హయగ్రీవుడుచెప్పిన బ్రహ్మవిద్యయు, వృత్రాసురునియొక్కవధయు, గాయత్రిమంత్రముచేత ప్రారంభమును, ఉన్న గ్రంథమును భాగవతముగా చెప్పినారు. ఈలక్షణములు దేవీభాగవతమందున్నవి కాని 'జన్మాద్యస్య యతః' అనుశ్లోకమాదియందుగల గ్రంథమందులేనందున నది భాగవతశబ్దమునకర్థము కాదు.

---

# 14 వ ప్రకరణము

## భక్త్యాది విశేషకథనము.

జనులకు భక్తి యెక్కువఅయినకొలది ఉపాస్యదేవతలకు ప్రీతి యెక్కువకలుగును. ఆభక్తి బాహ్యభక్తి, అంతరభక్తి, యని ద్వివిధము. ఈదేవికి ఆంతరభక్తియే తృప్తికరము.

ఎట్లనగా:— లబ్ధభక్తిసులభా॥ త్రిశతి 192 నామము

శం॥ వ్యా॥ భక్తిః సామాన్యవిశేషాకారేణ ద్వివిధా। తత్రార్త్యాఆర్తజిజ్ఞాస్వర్థార్థిభిః యైర్లబ్ధా। తత్తత్ఫలోద్దేశేన సమయవిశేషే. విచ్ఛిద్య విచ్ఛిద్య ప్రాప్తాం తేషాం సులభా॥ ద్వితీయ

భక్తిస్తు బ్రహ్మసాక్షాత్కారవతా పురుషేణ యేనైకభక్తితయా లబ్ధా ॥ 'ఏకభక్తిర్విశిష్యతే' ఇతిస్మృతేః ॥ తస్యసులభా 'భక్త్యామామభిజానాతి' ఇతిస్మృతేః ॥

తా॥ సామాన్యభక్తి, విశేషభక్తి, అని భక్తి రెండువిధములు. రోగనివృత్తిగాని, ఈశ్వరానుగ్రహముగాని, ధనముగాని కోరుచు చేయబడినది సామాన్యభక్తి. భక్తసులభురాలయిన పరమేశ్వరి భక్తులయుద్దేశానుసారముగ ఫలమునిచ్చును.

బ్రహ్మసాక్షాత్కారముగల పురుషుడు నిష్కాముడైనను భక్తి విశేషభక్తి. అట్టిభక్తులకే దేవి సులభురాలు.

త్రిశతి 27 ఏకభక్తిమదర్చితా ॥

శం॥వ్యా॥ ఏకస్మిన్నభేదే జీవబ్రహ్మణోః భక్తిః భజనీయత్వబుద్ధిః తత్పరిజిజ్ఞాసా యేషాం సంతి। తైరర్చితా-పూజితా ఇత్యేతదుపలక్షణం। స్తుతా-ధ్యాతా నమస్కృతేత్యేవమాదీనాం॥

తా॥ జీవబ్రహ్మైక్యానుసంధానము ఉత్తమభక్తి. అట్టిభక్తిగలవారిచేతనే స్తోత్రము, ధ్యానము, నమస్కారము మొదలగు నుపచారములచేత నర్పింపబడునది పరమేశ్వరి.

ల॥ స॥ 870 అంతర్ముఖసమారాధ్యా ॥

భా॥వ్యా॥ అంతః స్వాత్మప్రవణం ముఖం చిత్తవృత్తిర్యేషాం తేః సమ

తా॥ అంతర్ముఖమగు చిత్తవృత్తులుగలవారిచేత నిర్విఘ్నముగ ఆరాధింపబడునది.

ల॥ స॥ 871 బహిర్ముఖసుదుర్లభా ॥

భా॥వ్యా॥ బహిః విషయైకప్రవణం ముఖం యేషాం తేషాం సుదుర్లభా। తరలతరణానామసులభేత్యానందలహర్యాం ॥

తా॥ విషయములనే ధ్యానించుచు గురులక్ష్యములేని వారికి దుర్లభయయినది.

ద॥సం॥ 48॥ జ్ఞానీ జిజ్ఞాసురేవేతి ద్వాతామత్రాధికారిణౌ। జ్ఞానినః సిద్ధముక్త్యైచ జీవన్ముక్తిస్మృతో మనుః॥ అసిద్ధముక్తే ర్జిజ్ఞాసోః మోక్షో వైవేరితో మనుః॥ శేషము మూడవప్రకరణ మునందు వ్రాయబడెను.

తా॥ జ్ఞానియనఁగాఁ దెలిసినవాఁడును, జిజ్ఞాసువనగా దెలియ గోరువాఁడును,

పంచదశాక్షరీమంత్రముచేత జ్ఞానులకు జీవన్ముక్తియు, జిజ్ఞాసువులకు మోక్షమును లభించును.

యోగినీహృదయము 6 పటలము 2 శ్లో॥ శృణుదేవి మహా గుహ్యాం యోగినీహృదయం పరం॥

భా॥వ్యా॥ గుహాయాం భవం గుహ్యాం। జీవాత్మపరమాత్మ నోరైక్యం। అతిరహస్యత్వాత్ మహాగుహ్యాం। బహిర్యాగా నుష్ఠానపరంపరయా శుద్ధచిత్తస్యైవాధికారాత్। దేవ్యుపదేశ మంతరేణ జ్ఞాతుమశక్యమితితు ధ్వనితం। యోగిన్యా త్రిపుర సుందర్యాహృచ్ఛిత్తం ప్రత్యయతే గచ్ఛతి ప్రాప్నోతి। దేవి మానోగతమితి యావత్॥

తా॥ ఓపార్వతీ యోగినీహృదయమను పరమరహస్యమును వినుము. జీవాత్మపరమాత్మలయొక్క ఐక్యము అతిరహస్యమగు టవలన గోప్యము. దీనికి బహిర్యాగానుష్ఠానపరంపరచేత చిత్త శుద్ధిగలవాఁడే అధికారి. అయినను పరమేశ్వరియొక్క ఉపదేశము లేకుంతగ తెలిసికొనుటకు శక్యముకాదు. యోగినీహృదయము అనగ త్రిపురసుందరియొక్క మనస్సునకుఁబొందు రహస్యము.

పూజాధికారః॥

ల॥ స॥ 3అ॥ 57శ్లో॥ భా॥నందు— అస్యాంచపూజాయాం సర్వజాతీయానామధికారః॥ తదుక్తం శతతత్క్రోశపత్రిమవవ భవిష్యోత్తరపురాణే॥ పూజనీయా జనైర్దేవీ స్థానేస్థానే పురేపురే గృహేగృహే శక్తిపరైర్గ్రామేగ్రామే వనేవనే। స్నాతైః ప్రముదితైః హృష్టైర్బ్రాహ్మణైః క్షత్రియైర్నరైః। వైశ్యైః శూద్రైః భక్తియుక్తైః మ్లేచ్ఛైరన్యైశ్చ మానవైః। స్త్రీభిశ్చకురుశార్దూల తద్విధానమిదం శ్రుణు ఇత్యాది॥ శక్తిపరైః చండీపరాయణైః। మ్లేచ్ఛైః శబర కిరాత పుళిందాదిభిః। అన్యైః అనులోమప్రతిలోమజైః। పరంతు। స్వకులాచారమనురుద్ధ్యైవ పూజయేత్। తదుక్తం ప్రీతఖండే॥ యస్యయస్యహి యాదేవీ కులమార్గేణసంస్థితా। తేనతేనచ సా పూజ్యా బలిగంధానులేపనైః। నైవేద్యైర్వివిధైశ్చైవ పూజయేత్కులమాతరం॥ఇతి॥

తా॥ శివశక్తిసామరస్యరూపమగు దేవీపూజయందు సర్వజాతులకు అధికారము కలదు. ప్రతిపట్టణమునందు, ప్రతిస్థానమునందు, ప్రతిగ్రామమునందు, ప్రతివనమందు, ప్రతిగృహమునందు బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, మ్లేచ్ఛ, శబర, కిరాత, పుళిందాదులు, అన్యములయినఅనులోమప్రతిలోమజాతులును, స్నానవ్రతము, మిక్కిలి సంతోషము, ఆసక్తియు, భక్తియుగలిగి వారివారి కులాచారమును అనుసరించి పరదేవతను పూజచేయవలయును. ఇట్లుభవిష్యోత్తరపురాణమునందు చెప్పబడినది. ఏదేవత యేకులముకు కులదేవతగానున్నదో ఆదేవతను ఆకులమువారు ఆమార్గముచేతనే పూజాద్రవ్యములు మొదలగువానిచేత పూజింపవలయును.

ల॥ స॥ 543 పుణ్యాలభ్యా ॥

వ్యా॥ పుణ్యైః ప్రాక్తనైర్లభ్యా। దే॥ భా॥ తృతీయసంధే॥ పశ్యంతి పుణ్యపుంజాయే యేన్యే దాంతాస్తపస్వినః। రాగిణో నైవ పశ్యంతి దేవీం భగవతీం శివాం ॥

తా॥ పరమేశ్వరిని విశేషపుణ్యమును జేసినవారును, జితేంద్రియులయిన తపశ్శాలులును చూచుచున్నారు. విషయాసక్తి గలవారు చూడలేరు.

ల॥ స॥ 777 వీరారాధ్యా ॥

వ్యా॥ అహమః ప్రళయం కుర్వన్నిదమః ప్రతియోగినః। పరాక్రమపరో భుంక్తే। స్వాత్మానమశివాపహం। ఇతి ఉక్తలక్షణా వీరాః॥ తై రారాధ్యా ॥

తా॥ బ్రహ్మముకంటె వ్యతిరేకమగు ఇదంశబ్దముచే చెప్పబడు జగద్వ్యాపారమంతయు బ్రహ్మమునందు లయము చేయు పరాక్రమపరులు ఆత్మస్వరూపమునే అనుభవించుచున్నారు. ఇట్టిలక్షణములు గలవారిచేత ఆరాధింపబడునది పరమేశ్వరి అని తాత్పర్యము.

# 15 వ ప్రకరణము

## అద్వైతవివరణము.

బ్రహ్మము నిర్గుణము, సగుణము అని ద్వివిధము. అందు శుద్ధచైతన్యము నిర్గుణము। స్త్రీపుంరూపము సగుణము। ఇది సృష్టికి బీజము। ఇట్టి బ్రహ్మమును భక్తితో సేవించువారికి ముక్తి సులభము. కాని, నిర్గుణము, నిరాకారమునగు బ్రహ్మమునందు

చిత్తమునిలుపుట కష్టమగుటచేత స్త్రీపుంరూపమగు సగుణో పాసనము తత్సాధనముగ నున్నది.

హ్రీం త్రిశతి 99 నామము॥

శ॥ భా॥ హృ ఞ్ హరణే ఇతి ధాతుపాఠాత్ సమస్తవిద్యై శ్వర్యప్రదానాది శక్త్యారోపాధిష్ఠానత్వే సత్యపవాదావశేషిత పరమానందరూపముక్తిరిత్యర్థః॥

తా॥ హ్రీంకారవాచ్యమగు పరదేవత సమస్తవిద్యలను, ఐశ్వర్యములను, పూర్ణముగనిచ్చుటయేకాక ప్రపంచాతీతమ యిన పరమానందరూపమగు ముక్తినికూడ నిచ్చును.

త్రిశతి 98 హ్రీంకారచింత్యా॥

శం॥భా॥ హ్రీంబీజస్య పంచప్రణవాంతర్గతత్వేన ఓంకార భేదే బ్రహ్మప్రతీతత్వావిశేషాత్। ప్రణవే యథా పరావరబ్ర హ్మోపాసనహేతుత్వవదస్మిన్ వా ప్రతీకే తద్భవతీతి వికల్పః। యథాభక్తిపార్థక్యేన మంత్రవిశేషేషు భవతీతి యోగవేదమా ర్గరహస్యం నవాదజల్పాద్యవకాశః। హ్రీంకారే ఉభయవిధ బ్రహ్మస్వరూపతయా చింతితుం యోగ్యా। ధ్యానస్య సాక్షా త్కారం ప్రత్యాదరాదుపకారకత్వేన ధ్యాతవ్యేత్యర్థః॥

తా॥ ఓం ఐం హ్రీం శ్రీం క్లీం అనునయిదును ప్రణవములు హ్రీంకారము ఓకారమువలెనే బ్రహ్మోపాసనకు సన్నిహితకా రణము. భక్తివిశేషముచేత మంత్రములయందు ఫలభేదముగ లదని యోగవేదమార్గరహస్యము. కనుక వాదదోషములకవ కాశములేదు. సాక్షాత్కారమునుగురించి ధ్యానము ప్రధాన కారణము. కనుక హ్రీంకారమును సగుణముగను నిర్గుణముగ ను ధ్యానింపవలయును.

త్రిశతి 139 సర్వమాతా॥

శం॥ భా॥ సర్వేణ కార్యేణ మీయతే అనుమీయతేఽభేదే నేతి తథా। తథాహి ఇదంజగత్ బ్రహ్మాభిన్నం తత్సత్తా స్ఫూర్తి నియతసత్తా ప్రకాశజ్ఞానవిషయత్వాత్। యోయన్నియత సత్తాప్రకాశవాన్ సతదభిన్నః। యథా తంతు కార్యః పటఇతి। సర్వాన్ మినోతి స్వాఽభేదేన జానాతీతి తథా॥

తా॥ శర్కరసహితమయిన సెనగపప్పునకు గలిగిన తీపు చక్కరదే కాని పప్పువది కాదు. ఇట్లుసచ్చిదానందరూపబ్రహ్మ మాతో కూడిన జడము, అసత్తు నగు జగత్తునకుగల సత్తాప్రకాశములు బ్రహ్మముదే కాని జగత్తునవి కానేరవు. నూలువలన కలిగిన వస్త్రమందంతటను నూలుకలిగియున్నది కాని నూలులేకుండ యేభాగమయినను లేదు. ఈవిధముననే బ్రహ్మమువలన బుట్టిన జగత్తునందంతటను బ్రహ్మముకలదు కాని బ్రహ్మము లేనిభాగమేదియునులేదు. అవ్యక్తమగు పరదేవత జగద్రూపమగు కార్యజాతమందంతటకలదని భావించుటచేత నీమె సర్వమాతయనబడును. కనకమువలన బుట్టిన కంకణములు హారములు మొదలగు నలంకారములు కనకముకంటె వేఱుకానివిధమున తనవలనగలిగిన ప్రపంచమంతయు తానేయని యెఱుగుటవలన నయినను పరదేవత సర్వమాతయనబడును.

సౌందర్యలహరి శ్లో॥ శంకరాచార్యకృతము॥

మనస్త్వం వ్యోమత్వం మరుదసి మరుత్సారథిరసి త్వమాపస్త్వం భూమిస్త్వయిపరిణతాయాం నహి పరం। త్వమేవ స్వాత్మానం పరిణమయితుం విశ్వవపుషా చిదానందాకారం శివయువతి భావేన బిభృషే॥

తా॥ తల్లీ నీవు షట్చక్రములందును మనఃపృథివ్యాది రూపముగ పరిణమించుటవలన నీకంటె నన్యమేమియులేదు. చిదానందాత్మకనుగు నీవు మొదట శివశక్తిరూపముగ పరిణమించి తరువాత జగదాకారముగ పరిణమించితివి.

త్రిశతి 294 హ్రీంకారవేదోపనిషదే నమః ॥

శం॥ భా॥ వేద్యంతే జ్ఞాయంతే సర్వపదార్థా అనేనేతి వేదః హ్రీంకార ఏవ వేదః। జ్ఞాపకత్వావిశేషాత్। తస్య ఉపనిషత్ వేదాంతభాగః। [illegible] వా, తద్ బ్రహ్మోపనిషత్పరమితి శ్రుతేః। కర్మోపాసనా జ్ఞానకాండభేదేన చత్వారోపి వేదాః త్రివిధాకారాః। "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి" ఇతివాక్యేన జ్ఞానసాధనతయా కర్మోపాసనయోః వినియుక్తత్వాత్। "అంధం తమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే। తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః" ఇతిశ్రుత్యా తయోరుభయోః సంసారఫలకత్వేన నిందితత్వాచ్చ॥ "ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః। కిమిచ్ఛన్ [illegible]

ప

[illegible] నిషచ్ఛబ్దవాచ్యస్య మోక్షఫలకత్వేన ఫలప్రతిపాదనాత్తదుభయప్రతిపాదకవేదభాగాపేక్షయా శ్రేష్ఠత్వం। లోకే సాధనాపేక్షయా ఫలస్య శ్రేష్ఠత్వోత్తమత్వప్రసిద్ధేః। తథాచ పూర్వకాండద్వయార్థస్య జన్యతయా తత్ప్రతిపాదకవేదభాగస్యోపనిషచ్ఛేషత్వవత్ హ్రీంకారస్యాపి పరదేవతాప్రకాశకత్వేన తచ్ఛేషత్వాత్తస్యాః ప్రాధాన్యముక్తమితి ద్రష్టవ్యం। వేదాంతేషూపనిషచ్ఛబ్దః తజ్జన్యతాదూపశక్యసంబంధేన ప్రవర్తతే। ముఖ్య

యావృత్త్యాతు బ్రహ్మవిద్యాయామేవ । తథాహి । ఉపశబ్దః సమీపదేశార్థకః । బ్రహ్మణ్యధ్యస్తమాయాసమీపదేశకః తత్ప్రదార్థప్రతిబింబితమవిద్యోపాధికచైతన్యం జీవశబ్దవాచ్యముపశబ్దార్థః లక్షణయా ప్రతిపాద్యతే । "ని" శబ్దః షద్ ఇతి పదస్య విశేషణం । సత్ ఇతి పదం షద్లృ శరణాగత్యవసాదనేషు భవతి। తథాచ। ఉపశబ్దవాచ్యోజీవః అవిద్యాంనిహత్య త్యక్త్వా బ్రహ్మస్వరూపేణ నిషీదతి వర్తతఇతి ఉపనిషదిత్యేకోఽర్థః। జీవఃబ్రహ్మస్వరూపత్వేన నిగచ్ఛతి జానాతీత్యన్యోఽర్థః । జీవః బ్రహ్మస్వరూపేణ అవసీదతి పరిసమాప్నోతీతి తృతీయోఽర్థః। ఏవముపనిషచ్ఛబ్దస్య బ్రహ్మవిద్యావాచకత్వేన ప్రసిద్ధస్య తద్వాచకవేదభాగే లక్షణవత్త్వేఽప్యుపనిషచ్ఛబ్దవాచ్యో భవతి। తథాచ హ్రీంకారఏవ వేదః తస్య ఉపనిషత్ప్రధానభూతా బ్రహ్మవిద్యేత్యర్థః ॥29

తా॥ సర్వమును తెలియచేయునది వేదము. హ్రీంకారము కూడ వేదమువలె సకలస్వరూపమును చెప్పుటవలన వేదమే. హ్రీంకారమునకు పరదేవత లక్ష్యార్థము. బ్రహ్మముయొక్క స్వరూపము ఉపనిషత్తులచే తెలియబడునని శ్రుతి చెప్పుచున్నది వేదములు నాలుగును కర్మకాండము, ఉపాసనాకాండము, జ్ఞానకాండము ననిమూడువిధములు. "తమేతం=మంత్రి" అనుశ్రుతి కర్మోపాసనలు జ్ఞానమునకు సాధనములని చెప్పినది. అవిద్యను పాసించెడివారు జ్ఞానములేక జననమరణరూపసంసారనిమగ్నులై. కర్మోపాసనలనే చేయుచుందురు అని "అంధంతమః" అను శ్రుతి కర్మోపాసనలను నిరాకరించెను. పురుషుడు తాను బ్రహ్మమేయని తెలిసికొనినయెడల నేదియునుకోరడు. మనస్తాపమును బొందడు. అట్టివాడు అన్నికోరికలను పొందినవాడే. ఈయెుద

లగు శ్రుతులవలన, అద్వైతజ్ఞానమును పుట్టించు "ఉపనిషత్తు" అనే వేదభాగమునకు మోక్షమే ఫలము. కనుక కర్మోపాసనల నుప్రతిపాదించు వేదముకంటె నిది శ్రేష్ఠము. లోకమునందు సాధనముకంటె ఫలము శ్రేష్ఠముగద. కర్మోపాసనలు వేదముచేత చెప్పబడినను వానినిప్రతిపాదించు వేదములకంటె జ్ఞానప్రతిపాదకములగు ఉపనిషత్తులు ఉత్తమములు. ఇట్లు పరదేవతను ప్రతిపాదించు హ్రీంకారముకంటె పరదేవత ప్రధానము. ముఖ్యముగా బ్రహ్మబోధకమగు ఉపనిషచ్ఛబ్దము వేదాంతవాక్యములనుగూడ బోధించును. ఎట్లనగా— ఉపశబ్దమునకు అవిద్యాప్రతిబింబితమయిన జీవచైతన్యమర్థము. 'నిష' శబ్దమునకట్టి జీవరూపమునువిడిచి శుద్ధబ్రహ్మస్వరూపముతో నుండుటయనిగాని, లేక ఆస్వరూపమును తెలిసికొనుటయనిగాని, లేక ఆస్వరూపమును పొందుటయనిగాని మూడుఅర్థములు ఇట్లు ఉపనిషచ్ఛబ్దమునకు శుద్ధబ్రహ్మమే యర్థమయినను ఆబ్రహ్మమును ప్రతిపాదించెడి వేదభాగములుకూడ ఉపనిషత్తులనబడును. కనుక హ్రీంకారరూపవేదవాచ్యమగు పరదేవత ఉపనిషత్ప్రధానమయిన బ్రహ్మవిద్యయే.

### వివర్తవాద పరిణామవాదములు॥

వా॥ తం॥ 4వ॥ శ్లో॥ కబలీకృతనిశ్శేష తత్త్వగ్రామస్వరూపిణీ। తస్యాం పరిణతాయాంతు నకశ్చిత్పరఇష్యతే॥ 5॥

భా॥భా॥ ప్రళయకాలే కబలీకృతాని గీర్ణాని శేషాస్తత్త్వగ్రామాః షట్త్రింశత్తత్త్వసమూహాయేన। తాదృశస్వరూపవతీ। తతశ్చ సూక్ష్మరూపేణ స్వాంతఃస్థితమేవ విశ్వం సృష్టికాలే ప్రకటయతి నాన్యత్। తదుక్తం భగవతా వసిష్ఠేన— 'యథాబీ

ాంతర్గతే బ (మ) హీనసర్వాస్మిదం తథాఽత్మని । ఫలపత్రలతా
పుష్పశాఖావిటపమూలవాన్ వృక్షబీజే యథా వృక్షస్తథేదం
బ్రహ్మణిస్థితం ' ఇతి । తథాచ ఫలవశేన శశశృంగాదేః సంస్థా
రరూపేణాప్యసత్వకల్పనయా నతదుత్పత్తిప్రసంగ ఇతి భావః ॥
తుశబ్దః పూర్వపక్షవ్యావర్తక ఆవశ్యకత్వావ్యంజకశ్చ । శక్తిప
రిణామకల్పనస్యాఽవశ్యకత్వేన తేనైవోపపత్తేః ప్రత్యేకపరిశిష్ట
కల్పనమేవ వ్యర్థత్వాన్నేష్యత ఇత్యర్థః । అయం భావః—

ఔపనిషదానాం పక్షస్తు పరస్య చిద్రూపస్య బ్రహ్మణః శక్తి
ర్మాయాఖ్యా । సాచ జడైవ । సైవచ జగతః పరిణామ్యుపా
దానం । పరంబ్రహ్మతు వివర్తోపాదానం। అతఏవ జగతోపిమా
యికత్వాజ్జడత్వం మిథ్యాత్వంచ । అద్వైతశ్రుతయస్తు పారమా
ర్థికవ్యతిరేకైవేత్యేవం పరాః । సర్వం బ్రహ్మేతి సామానాధిక
రణ్యంతు బాధాయామిత్యాదిః । తాంత్రికాణాంపక్షస్తు పరచిన్ని
ష్ఠాయాః చిచ్ఛక్తిరౌపనిషదానామపి సంమతా । సైవానంత
రూపత్వాన్మాయేత్యుచ్యతే । ' పరాఽస్యశక్తిర్వివిధైవ శ్రూయ
తే ' ' మాయాచావిద్యాచ స్వయమేవ భవతీత్యాదిశ్రుతేః '
తత్పరిణామఏవ ప్రపంచః । అతఏవ చిద్రూపః । చిద్విలాసః
ప్రపంచోయం నఖతే దుఃఖదః కథం । కిమందరివారుణీరామ
సితయాకటుకీకృతా ' ఇతి జ్ఞానవాసిష్ఠాత్ ॥ అతఏవచ సత్యోఽపి
సర్వంబ్రహ్మేతి సామానాధికరణ్య మత్యంతాభేదఏవ స్వారస
స్యాత్ । నచాద్వైతశ్రుతివిరోధః । విరోధాపాదకస్యైకస్యభేద
స్యైవ మిథ్యాత్వాంగీకారాదిత్యాదిః । ' ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృ
ష్టాంతానుపరోధాత్ ' ' ఆత్మకృతేఃపరిణామాత్ ' తదనన్యత్వ
మారంభణశబ్దాదిభ్య ఇత్యాది వైయాసికసూత్రాణామప్యస్మి

స్నేవాఖ్యాగే స్వరసఇతి స్పష్టమేవ॥ ఏవంచ పక్షద్వయేపి ప్రపంచ కారణతయా శక్తేరావశ్యకత్వే పరశివఏవాంతర్గతత్వాన్నైవని షద్భిః కల్ప్యః। నహి ఘటంప్రతి పరిణామిమృత్తికాపేక్షయా వివర్తరూపం కించిత్కారణాంతరముపలభామహే॥ అతఏవైక విజ్ఞానేన సర్వవిజ్ఞానం ప్రతిజ్ఞాయ యథాసౌమ్యైకేన మృత్పిండేన విజ్ఞాతేనేత్యాది దృష్టాంతప్రదర్శనం శ్రుతిషూపపద్యతే॥ఇతి॥

టీ॥ పరదేవత ప్రళయకాలమునందు షట్త్రింశత్ (36)తత్వ రూపసమస్తప్రపంచమును తనయందుంచుకొని అనంతరము సూక్ష్మరూపముతో తనయందున్న ప్రపంచమునే సృష్టికాల మునందు ప్రకటించును. గాని క్రొత్తదానినిపుట్టింపదు. భగవంతుడైన వసిష్ఠమహర్షి చేతను “ బ్రహ్మాండముయొక్క లోపల నున్న జలముపైని సర్వప్రపంచమెట్లున్నదో అట్లే ఆత్మస్వరూప మగు పరదేవతయందును సర్వప్రపంచము లీనమైయున్నదనియు పత్ర, పుష్ప, సహితవృక్షము బీజమందణగియున్నట్లే ఇదంశబ్ద ముచేత చెప్పబడుప్రపంచము బ్రహ్మమందణగియున్నదనియు ” చెప్పబడెను. కుందేటికి కొమ్ములెన్నడును లేనందున సృష్టికంటె పూర్వము సంస్కారరూపముతోనయిన నున్నవని చెప్పరాదు. సృష్టికాలమునందు తిరిగి ఆవిర్భవించిన ప్రపంచము శక్తిపరిణా మమే. చిద్రూపమగు బ్రహ్మముయొక్క శక్తి మాయయనియు నది జడస్వరూపమనియు నదే జగత్పరిణామమనియు, మిథ్యయ నియు చెప్పెడి వేదాంతపక్షమునందు జడమగు ప్రపంచమునకు చిద్రూపమగు బ్రహ్మముతో నభేదము చెప్పనొప్పదు గనుక “ సర్వం ఖల్విదం బ్రహ్మ ” అనుశ్రుతికి సమన్వయము కలుగదు తాంత్రికపక్షమున పరారూపమనెడు చిద్రూపమందున్న చిచ్ఛ

క్తి ఉపనిషదర్థమునకు సమ్మతమనియు, అట్టిచిచ్ఛక్తియే అనేక రూపములగుటవలన మాయయనియు చెప్పబడును. "పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే" ఇత్యాదిశ్రుతులు పరబ్రహ్మముయొక్క శక్తియే అనేకరూపములయినదనియు, మాయయును, అవిద్యయును తానే అగుచున్నదనియు చెప్పబడుచున్నవి. బ్రహ్మమంచున్న చిచ్ఛక్తియొక్క పరిణామమగుప్రపంచముచిద్రూపమే. జ్ఞానవాసిష్ఠమునందు "చిత్తుయొక్క విలాసరూపమగు ఈప్రపంచమునందు ఓశ్రీరామా నీకు దుఃఖమెట్లుకల్గుగును. పంచదారతో కలిసిన అమృతము వెగటగునా అని" శ్రీరామమూర్తితో వసిష్ఠమహర్షి చెప్పెను. సర్వము బ్రహ్మమనెడు శ్రుతికభేదమునందే తాత్పర్యముకనుకను ప్రపంచము సత్యస్వరూపమే. ఈపక్షమున జగత్తు చిద్రూపమే. కనుక అద్వైతశ్రుతులకు విరోధము లేదు. విరోధమునుకల్పించు భేదమే మిథ్యయని అంగీకరింపతగినది. "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా" మొదలగు మూడు వ్యాసనూత్రములకు పైనిచెప్పిన పరిణామమందే తాత్పర్యము. ఈప్రకారము రెండుపక్షములయందును ప్రపంచకారణముశక్తియేయగుచున్నది. కనుక ఘటమునుగురించిపరిణామకారణమగు మృత్తుకంటె నన్యమగు వివర్తకారణముయొక్క యపేక్ష లేని విధమున ప్రపంచమునకు పరిణామకారణముగు శక్తికంటె నన్యమగు వివర్తకారణమగు పరశివుని ఉపనిషత్తులచేత కల్పింపబనిలేదు. కనుకనే శ్రుతియందు ఒక్కటగు కారణమును దెలియుటవలన సకలకార్యములు తెలియబడును. కారణమగు మృత్తికను తెలియగా కార్యమగు ఘటము, శరావము (మూకుడు) మొదలగు కార్యములన్నియు మృత్తికయేయని తెలియునుగద

ఇట్లు చిచ్ఛక్తివలన గలిగిన జగత్తంతయు చిద్రూపముగ తెలియ వలయునని శ్రీభాసురానందనాథునిచే చెప్పబడినది.

వివరణము.

శ్రీశంకరులు వ్యాససూత్రములకు భాష్యము చేయుకాలము నందు ద్వైతఖండనము ప్రధానముగాతీసికొని జగత్తు జడశక్తి పరిణామమని చెప్పిరి. అనంతరము వారు శ్రీవిద్యారాధనచేసి సౌందర్యలహరి, దేవీవేదపాదస్తవము, త్రిశతీనామభాష్యము, మొదలగునవి రచించిరి. వానియందు చిచ్ఛక్తి బ్రహ్మమనియు జగత్తు చిచ్ఛక్తియొక్క పరిణామమనియు చెప్పినట్లు త్రిశతి 139 నామభాష్యము మొదలగువానివలన తెలియగలదు. ఇందువలన ప్రథమమందురచించిన సూత్రభాష్యకాలమందు ద్వైతఖండనము ప్రధానముగాజేసికొనినందున నివిమర్శను అవసరములేక చేయలేదనియు అనంతరము రచించినగ్రంథములయందు తాము అదివరకు చెప్పినదానికి వ్యతిరేకము కనుపించినను సమబుద్ధితో చెప్పినట్లును తోచును. జగత్తు జడశక్తియొక్క పరిణామమని మొదటను చిచ్ఛక్తియొక్క పరిణామమని తరువాతను చెప్పిన వాక్యములలో చివరచెప్పినది మొదటచెప్పిన దానినే ఖండించును కాని తాను మొదటచెప్పిన దానిచేత ఖండింపబడదు. చిచ్ఛక్తి బ్రహ్మమేయనుటకు గ్రంథవిస్తరభీతిచేత కొన్నిగ్రంథములలోని ప్రమాణములుమాత్రమిచట వ్రాయబడెను.

వేదాంతపంచదశీప్రకరణములు రచించిన శ్రీవిద్యారణ్యస్వామియును, సూతసంహితవ్యాఖ్యానము, జీవన్ముక్తివివేకము మొదలగునవి రచించి వానియందు చిచ్ఛక్తిబ్రహ్మమనియు జగత్తు చిచ్ఛక్తిపరిణామమనియు చెప్పెను.

ఓంకారముయొక్క ఉపాసనయెట్టిదో హ్రీంకారాద్యుపాసనయు అట్టిదేఅని త్రిశతి 98 నామభాష్యమందును, ఛాందోగ్యోపనిషద్భాష్యము ద్వితీయప్రపాఠకమునందును చెప్పబడెను.

బ్రహ్మోపాసనయు తత్త్వమసి మొదలగుమహావాక్యముల మననమును ఉపాసనాశబ్దములో చేరినవే. త్రిశతి 294 హ్రీంకారవేదోపనిషదే నమః అను నామభాష్యమునందు శ్రీవిద్యోపాసన చిద్విద్యోపాసనయనియు, జ్ఞానకాండమనియు చెప్పబడినది కనుక కర్మోపాసనలు నికృష్టములని శ్రుతియందు చెప్పిన ఉపాసనాశబ్దము ఇతరదేవతోపాస్తిని చెప్పును గాని చిద్విద్యోపాసనను చెప్పదు. అనేకజన్మములయందు చేసిన యితరదేవతారాధనవలన కడపటిజన్మమునందు శ్రీవిద్యోపాసకులయి అందువలనే ముక్తినిబొందుదురని శంకరాచార్యులచే దేవీవేదపాదస్తవమునందు శ్లో॥ దేవతాంతరమంత్రౌఘ జపశ్రీఫలభూతయా। జాపకాస్తవదేవ్యంతే విద్యయా విందతేఽమృతం॥ అని చెప్పబడినది "తదైక్షత బహుస్యాం ప్రజాయేయ" అను తైత్తిరీయశ్రుతియందు బ్రహ్మము స్వేచ్ఛతో చూచుటవలన జడశక్తి జగత్తును పుట్టించినట్లు చెప్పబడినవి. కాని చూచుటకు నొకశక్తియుండవలయును. ఆశక్తియే చిచ్ఛక్తియనబడును. "మాయాచావిద్యాచ స్వయమేవ భవతి" అనుశ్రుతి చిచ్ఛక్తితానే మాయగను, అవిద్యగను పరిణమించినట్లుచెప్పుటవలన జడములగు మాయాఽవిద్యలయొక్క ప్రకాశము చిచ్ఛక్తివలనకలిగినదే. "త్వం స్త్రీ త్వం పుమాన్" అనుశ్రుతి బ్రహ్మమునకు, చిచ్ఛక్తికి భేదములేదని చెప్పుటవలన జ్ఞానపరమగు ఈచిచ్ఛక్త్యుపాసన బ్రహ్మోపాసనయై ముక్తికారణమగును. కానియితర

దేవతోపాసనలవలె సంసారకారణముకాదు. తత్ అనుశబ్దము నకు బ్రహ్మమనియు, చిత్తు అనుశబ్దమునకు చిచ్ఛక్తియనియు, అనేకగ్రంథములయందు చెప్పబడినది. అట్టిరెండును నిర్గుణబ్రహ్మమును బోధించును. కనుక బ్రహ్మమువలె చిచ్ఛక్తియు, వివర్తరూపమనియు, ఆత్మ[illegible]యనియు, ఈశ్వరప్రత్యభిజ్ఞ సూత్రములలో 16వ సూత్రవ్యాఖ్యానమునందును, తత్త్వత్రే యసంహిత 14అధ్యాయమునందును, గౌడపాదసూత్రములలో మూడవసూత్రభాష్యమునందును, శంకరాచార్యకృత అపరో క్షానుభూతి 43-44-45 శ్లోకములందును చెప్పబడినది. 43శ్లో॥ చైతన్యస్యైకరూపత్వాద్భేదో యుక్తో నకర్హిచిత్ । జీవత్వంచ మృషాజ్ఞేయం రజ్జౌ సర్పగ్రహోయధా॥ తా॥ ఉపాధులకు భేద ముఉన్నను సకలోపాధులయందుండెడి చైతన్యమునకు భేదము లేక యేకరూపముగనుండుటవలన రజ్జువును సర్పము అనిభ్రమి సినట్లు చైతన్యమును జీవుడనుకొనుటయు భ్రాంతియే. శ్లో॥ రజ్జ్వ జ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ । భాతి తద్వచ్చితిః సాక్షాద్విశ్వాకారేణ కేవలం ॥44॥ తా॥ ఇదిరజ్జువని తెలియనిస మయమునసే త్రాడు సర్పమని తోచును. ఇట్లే అజ్ఞానదశయం దు ఏకమగుచైతన్యమే జగదాకారముగదోచును. కేవలమనగా అన్యములేదనుట. భ్రాంతికాలమున జగదాకారముగదోచిన చైతన్యము ఒక్కటియే. ఇదియె వివర్తకారణమనబడును. వివ ర్తమనగా నిజస్థితినివిడువక అన్యముగదోచుటయే త్రాడు పాము నిత్రలచునప్పుడును త్రాటియొక్క ఆకారము ఎంతమాత్రిమునుచె డలేదు. ఇట్లీజగదాకారముగదోచిన చైతన్యముయొక్కస్వరూ పము ఏకాలమందును చెడనందున సీబ్రహ్మచైతన్యము జగత్తు

నకు వివర్త కారణమనబడును. చైతన్యము ఆరంభోపాదానము కాదు. పరిణామోపాదానమును కాదు. వస్త్రమునకు కారణమైననూలు ఆరంభోపాదానము. పెరుగునకు కారణమైన పాలు పరిణామోపాదానము. శ్లో॥ ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణో న్యన్న విద్యతే। తస్మాత్సర్వప్రపంచోఽయం బ్రహ్మైవాస్తి నచేతరత్ ॥ 45 ॥ తా॥ ప్రపంచమునకు బ్రహ్మముకంటె నన్యమగు ఉపాదానము లేనందున జగత్తంతయు బ్రహ్మమేయగును. మఱియు ఆగామి, సంచిత, ప్రారబ్ధములు నశింపగా ముక్తియనియు ఆగామి అనగ ముందురాబోవునదనియు, సంచితమనగ గతజన్మములయందును జ్ఞానోత్పత్తివరకు ఈజన్మమందును చేసినదనియు, ప్రారబ్ధమనగ వర్తమానశరీరమునకు కారణమైన కర్మమనియు, తత్వజ్ఞానముచేత ఆగామిసంచితములు నశించుననియు భగవద్గీత మొదలగు అద్వైతగ్రంథములయందు చెప్పబడినది. కాని ప్రారబ్ధము లేదని అపరోక్షానుభూతి 90శ్లోకమునందు శంకరులచే నిరాకరింపబడినది. 90శ్లో॥ ఉత్పన్నే ప్యాత్మవిజ్ఞానే ప్రారబ్ధం నైవముంచతి। ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా ॥ తా॥ ఆత్మజ్ఞానముకలిగినను ప్రారబ్ధము విడువదని శాస్త్రములందెయ్యది వినబడుచున్నదో అదియిప్పుడు నిరాకరింపబడుచున్నది. సకలవ్యవహారకారణమైన అజ్ఞానము తొలగగా ప్రారబ్ధము లేదనిభావము.

తత్వజ్ఞానమనగ వాసనాక్షయమనోనాశములతో కూడిన జ్ఞానమే. బ్రహ్మజ్ఞానమనియు, అదిదృఢముగకలిగినపుడె ప్రకృతదేహానంతరము ముక్తియనియు, అట్లుకలుగనపుడు ముక్తికలుగదనియు, ఆవాసనాక్షయ, మనోనాశములు దృఢమైన ధ్యాన

సమాధులవలననే కలుగుననియు, ఆధ్యానసమాధులు సాక్షాత్కారపర్యంతముచేయు దేవతోపాసనలవలననే కలుగుననియు, జీవన్ముక్తివివేకము, సూతసంహిత, దత్తాత్రేయసంహిత మొదలగుగ్రంథములయందు చెప్పబడినది. భగవద్గీత 4 అ॥ 37 శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున । జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥ అనుశ్లోకభాష్యమువందు "అతో యుక్తం నిష్క్రియబ్రహ్మాత్మవిజ్ఞానస్య సమాధినాఽప్రతిబద్ధతాం ప్రాపితస్యావిద్యానిఃశేషనిర్మూలకత్వం" తా॥ జ్ఞానమునకు సంశయభావన, విపరీతభావనయనెడు ప్రతిబంధములు గలవు. ఇవి సమాధిచేతనే తొలగును. తరువాత కర్తృత్వాభిమానము లేకపోవుటచేత కర్తవ్యమగు కార్యముకూడనుండదు ఇట్టినిష్క్రియబ్రహ్మాత్మవిజ్ఞానమే అవిద్యను పూర్తిగ తొలగింపగలదు. ఇచ్చట సమాధినా, నిష్క్రియ, అను పదములచేతను జీవన్ముక్తి మొదలగు గ్రంథములలో చెప్పినట్లు వాసనాక్షయ, మనోనాశములు దృఢమయినపుడే వాసనలు, మనస్సు నశించిచేయవలసిన క్రియలులేనివాడై బ్రహ్మాత్మజ్ఞానముచేత ముక్తుడగునని కనబడును. కొందఱు వేదాంతశ్రవణము చేయునపుడే వాసనాక్షయ, మనోనాశములనుగుఱించి తాత్కాలికాభ్యాసము చేసెదరు. ఈజన్మమందు వానినిగుఱించి దృఢాభ్యాసము అయినదా లేదా; వాసనలు, మనస్సు నశించినదా లేదా; అనుసంగతి వారిప్రవృత్తిచేత వారికే తెలియవలయును.

జనకుడు జీవన్ముక్తుడై రాజ్యముచేసినను సుఖదుఃఖానుభవకారణమగు దేహాభిమానము లేనందున నభిమానకార్యమగు సుఖదుఃఖసంబంధము అతనికి లేకపోయెను. జనకునివలె దేహాభి

మానము లేనివారికందఱకు ముక్తి సులభమే. కానిలోకములో జనకమహారాజువలె దేహాభిమానము లేనివారే అరుదు. ఈజనకమహారాజు « మిథిలాయాం ప్రదగ్ధాయాం నమే కించనదహ్యాతే » మిథిలాపురమంతయు కాలినను నాదేమియు కాలలేదని చెప్పెను. ఈప్రకారము అందరును చెప్పవచ్చునుకాని అతనివలె చేయుటకష్టము. ఎట్లనగా— యాజ్ఞ్యవల్క్యమహర్షి జనకునితో గూడ అనేకమహర్షులకు బ్రహ్మవిద్య నుపదేశించుసమయమున కొందరుమునులు మనగురువుగారికి జనకునిమీద పక్షపాతము మెందు అని చెప్పుకొనుచుండగా ఆయాజ్ఞ్యవల్క్యమహర్షి తన యోగాభ్యాసమువలన నగ్నినికల్పించెను. ఆయోగాగ్నిచే నగరము వెలుపలిభాగమంటుకొనెను. క్రమక్రమమున జ్వాలలధికమయి నగరమంతయు కాలుచుండెను. లోపలిప్రాకారములంటుకొనుచుండెను. సభామంటపముసయితము అంటుకొనెను. వహ్నిజ్వాలలు సమీపించినకొలది అచ్చటమునులు తమదర్భాసనములనుపుచ్చుకొని పరుగెత్తుచుండిరి. సింహాసనము అంటుకొనినను జనకమహారాజు దృఢమగుజ్ఞానాభ్యాసమువలన దేహాభిమానము లేనందున నచటనుంచి కదలలేదట. అపుడు గురువుమిగిలిన మునులను పిలిచి జనకునకు, ఆమునులకుగల దేహాభిమానభేదమును వారికి జూపెనట. అపరోక్షానుభూతి 133 శ్లో॥ కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాః సురాగిణః। తేప్యజ్ఞానతమా నూనం పునరాయాంతి యాంతిచ॥ తా॥ విషయములందు వైరాగ్యము లేనివారు బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య అనియితరులకు బోధించినను జ్ఞానము దృఢముకానందున జననమరణరూపసంసారమునే పొందుచుందురు. వాసనాక్షయము, మనో

నాశ, తత్వజ్ఞానములుమూడును సమకాలమందు అభ్యసింపవలయును. లేనియెడల నవి మంచిఫలమునీయజాలవు. వాసిష్ఠము॥ శ్లో॥ వాసనాక్షయవిజ్ఞానమనోనాశామహామతే। సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదాఇమే॥ తా॥ ఓరామా వాసనాక్షయ, తత్వజ్ఞాన, మనోనాశములు మూడును ఏకకాలమునందే చిరకాలమభ్యసింపబడినట్లైన ఫలమునిచ్చును. శ్లో॥ త్రయమేతేసమం యావన్నస్వభ్యస్తాముహుర్ముహుః। తావన్న పదసంప్రాప్తిర్భవత్యపి సమాశతైః॥ తా॥ ఆమూడింటిని ఏకకాలమందు అభ్యసింపనియెడల ఎంతకాలము యత్నించినను ముక్తి కలుగదు. శ్లో॥ ఏకైకశో నిషేవ్యంతే యద్యేతే చిరమప్యలం। తన్న సిద్ధిం ప్రయచ్ఛంతి మంత్రాః సంకలితాఇవ॥ తా॥ షడంగన్యాసమ్ములలో కొన్ని ఒకరోజున మరికొన్ని మఱియొకరోజున చేయుటచే ఫలములేనట్లు యీమూడింటిని వేఱువేఱుకాలములయందభ్యసించుటచే ఫలములేదు. శ్లో॥ జన్మాంతరశతాభ్యస్తా రామసంసారసంస్థితిః। సాచిరాభ్యాసయోగేన వినా నక్షీయతే క్వచిత్॥ తా॥ ఓరామా చిరకాలమునుండి అభ్యసింపబడిన సంసారస్థితి, పైమూడింటిని చిరకాలము అభ్యసింపక నశింపదు. ఈమూడును అన్యోన్యసంబంధముకలవగుటచేత ఒక్కొకటి వేఱుగాచేయుటవలన ముక్తిసాధ్యముకాదనియు, శ్లో॥ తత్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయఏవచ। మిథః కారణతాం గత్వా దుఃసాధ్యాని స్థితానిహి॥ తా॥ తత్వజ్ఞానమనోనాశవాసనాక్షయమ్ములు వేఱువేఱుగా చేయుటకు సాధ్యముకావు. శ్లో॥ యావద్విలీనం నమనో నతావద్వాసనాక్షయః। నక్షీణావాసనాయావచ్చిత్తం తావన్నశామ్యతి॥ తా॥ మనస్సు నశింపనంతవరకు వాసనలు

క్షీణింపవు. వాసనలు క్షీణింపక చిత్తమునశింపదు. శ్లో॥ యావన్నతత్త్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః। యావన్నచిత్తోపశమో నతావత్తత్త్వవేదనం॥ తా॥ తత్త్వజ్ఞానము కలుగనిది చిత్తమునశింపదు. చిత్తశాంతిలేకుండ తత్త్వజ్ఞానము కలుగదు. శ్లో॥ యావన్నవాసనానాశ స్తావత్తత్త్వాగమః కుతః। యావన్న తత్త్వసంప్రాప్తి ర్నతావద్వాసనాక్షయః॥ తా॥ వాసనలు నశింపకుండ తత్త్వజ్ఞానము కలుగదు. తత్త్వజ్ఞానము కలుగకుండ వాసనలు నశింపవు అని వసిష్ఠుడు రామునకుపదేశించెను. వాసనలు, మనస్సు, క్షీణించుట బహుకష్టము. ఈయర్థమునే, భగవద్గీత॥ చంచలంహి మనః కృష్ణ ప్రమాథిబలవద్దృఢం। తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరం॥ తా॥ వాయువునైనను అరికట్టవచ్చునుగాని చంచలమూ, బలిష్ఠమునై బాధించు మనస్సును అరికట్టుట దుర్లభమని శ్రీకృష్ణునితో అర్జునుడు చెప్పెను॥ వాసిష్ఠము॥ పూర్వోర్ధ్యస్తు ప్రయత్నేభ్యో విషమోయంహి సమ్మతః దుఃసాధ్యో వాసనాత్యాగః సుమేరూన్మూలనాదపి॥ తా॥ పూర్వప్రయత్నములకంటె సదికష్టము. మేరుపర్వతమైనను పెకలింపవచ్చునుకాని వాసనలను క్షీణింపచేయశక్యముకాదు. జనకః శ్లో॥ సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః। అస్యసంసారవృక్షస్య మనో మూలమితిస్థితం॥ తా॥ అనేకములగు శాఖలు ఫలములు చిగుళ్లు మొదలగువానితో కూడిన యీసంసారవృక్షమునకు మనస్సే మొదలుగానున్నది. శ్లో॥ సంకల్పమేవ తన్మన్యే మనోమూలమితిస్థితం। సంకల్పమేవ తన్మన్యే సంకల్పోపశమవరత్॥ తా॥ సంకల్పరూపమయినదే మనస్సు. సంకల్పము లేనప్పుడు మనస్సులేదు. శ్లో॥ శోషయామి యథాశోషమేతి

సంసారపాదపః । ప్రబుద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి దృష్టశ్చౌరో మయాత్మనః ॥ తా॥ సంసారవృక్షమును నశించునట్లుగా మనస్సును నశింపచేసెదను. ఆత్మవస్తువును మరుగుపర్చిన మనస్సనెడి దొంగను జ్ఞానముకలిగి చూచితిని. శ్లో॥ మనోనామని హన్మ్యేనం మనసాఽస్మి చిరంహతః ॥ చిరకాలమునుండి మనస్సనెడిదొంగచేత పీడింపబడితిని అట్టిమనస్సును నశింపచేసెదను. వాసిష్ఠము॥ శ్లో॥ అస్యసంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః । ఉపాయఏకఏవాస్తి మనసః స్వస్యనిగ్రహః ॥ తా॥ అనేకకష్టములకు కారణమైన సంసారవృక్షమునశించుటకు మనస్సునుజయించుటయే ముఖ్యసాధనముగనున్నది. మనస్సును జయించుటకు ఉపాయము. శ్లో॥ ద్వౌక్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానంచ రాఘవ । యోగస్తద్వృత్తిరోధోహి జ్ఞానం సమ్యగవేక్షణం ॥ తా॥ ఓరామా మనోనాశముకు యోగమనియు, జ్ఞానమనియు రెండుసాధనములు. వృత్తులుకలుగకుండునటుల మనస్సునుఆపుటయోగము. ఆత్మవిమర్శము జ్ఞానము. శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః । ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః ॥ తా॥ కొందరికి జ్ఞానముసాధ్యము. యోగమసాధ్యము. కొందఱికి యోగముసాధ్యము. జ్ఞానమసాధ్యము. కనుక పరమేశ్వరుడు రెండుసాధనములను చెప్పెను. అపరోక్షానుభూతి 144శ్లో॥ పరిపక్వం మనోయేషాం కేవలోఽయంచసిద్ధిదః । గురుదైవతభక్తానాం సర్వేషాం సులభోజవాత్ ॥ తా॥ పరిపక్వహృదయముకలవారికి కేవలము నీరాజయోగము మోక్షమునొసంగును. ఈరాజయోగము గురువునందును, దైవమునందును భక్తిగల సకలజనులకును, శీఘ్రముగను, సులభము

గను సిద్ధించును. సకలజనులకును అనుటవలన వర్ణాశ్రమధర్మా పేక్షలేకయే మనుష్యమాత్రులకందఱకును సిద్ధించునని భావము. మఱియు బ్రహ్మజ్ఞానులనెడి వసిష్ఠ, కశ్యప, వ్యాసాది మహాత్ములుకూడ సంసారబంధమును బోగొట్టుటకై ఉపాయమేదియనినాలు గుప్రశ్నలడిగి దత్తాత్రేయునివలన చిద్విద్యోపాసన ముఖ్యమని తెలిసికొని యాచరించినట్లు దత్తాత్రేయసంహిత మొదలగు గ్రంథములయందు కనబడును. కనుక అద్వైత (నిర్గుణ) మునకు ముఖ్యాంగమై ముక్తినిచ్చుటవలన నీచిద్విద్యోపాసనయే నానావాసితమగు మనస్సును లయింపజేయుచు మంచిమార్గముగ నున్నది.

ద॥ సం॥ 47అ॥ ఈశ్వరఉవాచ॥ ** ॥ శివాదివిద్యా ప్రోక్తేయం శివసాయుజ్యదాయినీ। సర్వపాపక్షయకరీ శివసాక్షాత్కారిణీ॥ విద్యేయం దుర్లభా లోకే సర్వసామ్రాజ్యదాయినీ। సమస్తవిద్యాసామ్రాజ్ఞీ సర్వవిద్యామహేశ్వరీ॥ ధ్యానం తత్త్వస్య మంత్రస్య నిర్గుణబ్రహ్మగోచరం। నామరూపాత్మకం విశ్వం సర్వం మాయాప్రకల్పితం। అఖండబోధరూపార్థే ప్రతీచి పరమాత్మని ॥ 24 ॥ విభావ్యాశ్వస్తమేవేతి భోక్తృభోగ్యాత్మకం జగత్ । ఆత్మనో భోక్తృరూపస్య జగతో భోగ్యరూపిణః। మాయయా కల్పితత్వేన తత్సర్వం మాయికం త్వితి । విభావ్యాత్మన్యఖండార్థే సర్వం విశ్వం పుటాత్మకం॥ సుప్తావాత్మని నిర్ద్వైతే సుప్త్యవస్థాత్మసాక్షిణి। అవస్థాత్రయభోక్తుర్యద్భోగ్యం విశ్వమథాఖిలం ॥27॥ ప్రాగభావయుతం మత్వా నిర్ద్వైతమనుభూయచ। విశ్వబీజం యద్ధి సుప్తౌ తదద్వైతే పరాత్మని॥ తురీయేఽఖండసద్రూపే సతి భూమ్న్యత్ర కేవలే। నిర్వికారేచ కూటస్థే

కాలద్వైతాదివర్జితే ॥ 29 ॥ విలాప్య సర్వం సద్వస్తు శ్రీవిద్యార్థం విచింతయన్ । తన్మాత్రత్వం సమస్తస్య కల్పితస్య చభావయన్ ॥ అకల్పితం పరానందం భూమానం ద్వైతవర్జితం । సచ్చిదానం దైకరసం హాదివిద్యార్థమీశ్వరం ॥ భావయేత్పరమాత్మానం శాంతం నామాదివర్జితం । భావయేద్ధాదివిద్యాయా అర్థమేవం నిరంతరం ॥ 32 ॥ సమహాపాతకైర్ముక్తో భవేత్సాక్షాత్పరశ్శివః ॥

తా॥ ఓపార్వతీ! శివునియొక్క సారూప్య సాయుజ్యముల నిచ్చునదియు, సర్వపాపములను నశింపచేయునదియు, సకలైశ్వ ర్యములనిచ్చునదియు, సమస్తవిద్యలలోను ఉత్కృష్టమయిన దియునగు చిచ్ఛక్తిమంత్రముచే నిర్గుణబ్రహ్మమును ధ్యానించు విధమును వినుము. అని యీశ్వరుడిట్లనియె. నామరూపాత్మక మగు ప్రపంచమంతయును మాయవలన కల్పింపబడినదిగను, అఖండాకారమయిన పరమాత్మయందు భోక్తృభోగ్యరూప మయిన జగత్తు అణగియున్నదిగను భావింపుము. తానుభోక్తృ రూపముగను, జగత్తు భోగ్యరూపముగను మాయచే కల్పింప బడుటవలన నదియంతయు మాయామయమే. జాగ్రత్స్వప్నావ స్థలయందు భోక్తృభోగ్యరూపమయిన జగత్తు సుషుప్త్యవస్థ యందు సాక్షిమాత్రముగనుండి ద్వైతసంబంధములేని ఆత్మ స్వరూపమునందు మాయచేత కల్పింపబడినది గనుక లేనిదిగ భావించుచు ఆద్వైతమునే అనుభవమందుంచి. సుషుప్తియందు జగముపాధానముగ మిగిలిన చిచ్ఛక్తిని కాలము, ద్వైతము మొదలగు వికారములులేని తురీయరూపము, అఖండచిద్రూప ము నగు పరమాత్మయందు లయముచేసి జగత్తును చిద్బ్రహ్మ రూపముగ భావించుచు కల్పింపబడనందున ద్వైతభావన లేక

పరమానందరూపమయి సచ్చిదానందరూపమగు పంచదశి యొక్క అర్థమయిన పరశివుని నామరూపములులేని నిర్మలమయిన పరమాత్మస్వరూపముగను, జగత్తును కల్పింపబడినదిగను నిరంతరము భావనచేయువారు మహాపాతకములవలన విడువబడి సాక్షాత్పరశివరూపులగుదురు.

వరివస్యారహస్యము—మహాతత్త్వార్థము—శ్లో॥ వాగింద్రియైరగమ్యే మహాత్త్వశేషేఽనురతరే। వ్యోమ్నోప్యుపరిస్థితిమతి విశ్వాభిన్నే చిదానందే॥ 54॥ బ్రహ్మణిపరే నియోజ్య స్వాత్మా తదభేదసంప్రాప్త్యై। ఏష మహాతత్త్వార్థః శ్రీవిద్యాయాః శివేనోక్తః॥

తా॥ వాక్కులచేతను, ఇంద్రియములచేతను తెలియశక్యముకాక షట్త్రింశత్ (36) తత్త్వములనుమీరి అతిస్థూలము, అతిసూక్ష్మమునై ఆకాశముకంటె పైగనుండి ప్రపంచస్వరూపముపొందిన చిదానందబ్రహ్మములో తనకునభేదము సంపాదించుకొనుటకు సేవింపతగిన పరదేవతయే శ్రీవిద్యకు మహాతత్త్వార్థమని శివునిచేత చెప్పబడినది. 54-55.

మహాతత్త్వార్థము సమాప్తము.

వరివస్యారహస్యము—మహావాక్యార్థము—శ్లో॥ విధిహరిశివవచనాఅపి కకారఏకారకోకారాః। సృష్టిస్థితిభంగాత్మకతత్త్వత్ (కృత్య) జనకత్వాత్క్షణికాః॥ 86॥

తా॥ బ్రహ్మ, విష్ణు, రుద్రులను చెప్పునట్టి కకారఏకారఅకారములు లక్షణచేత వారికార్యములయిన సృష్టి, స్థితి, లయములనుకూడ చెప్పుచున్నవి. 86.

శ్లో॥ ఈశ్వరవాచీకారో వక్తి దకారస్సదాశివం తాభ్యాం। లక్షణయా తత్తిరోధానానుగ్రహకకృత్యతా గదితా॥ 87॥

తా॥ ఈశ్వరసదాశివులనుచెప్పి ఈకార దకారములు లక్ష ణచేత తిరోధానానుగ్రహములనుగూడ చెప్పుచున్నవి. దకార మునకు లకారమాదేశమని 9వ ప్రకరణమునందు చెప్పబడినది "యతోవాఇమాని" ఇత్యాదిశ్రుతులచేత బ్రహ్మమునకుతట స్థలక్షణము చెప్పబడినది. 87.

ద్వితీయకూటముచే స్వరూపలక్షణమును చెప్పుచున్నారు.

శ్లో॥ హస ఆనందః సత్యం కం హం అనంతంచ । లం జ్ఞానం ఇత్థం బ్రహ్మ తటస్థస్వరూపలక్షణయోగేన నిర్ణియ (నిష్క్రాష్టం) తదభేదం జీవగణే వక్తి తృతీయకూటేన । జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్యకలాత్రితయేన సాహిత్యాత్ ॥ 89 ॥ సకలం వదర జీవపరం బ్రహ్మపరం శక్తిబీజం స్యాత్ । సామానాధికరణ్యా త్తల్లక్షితశుద్ధయోరభేదార్థః ॥90॥

తా॥ హసశబ్దమునకు ఆనందమును, కశబ్దమునకు సత్యము ను, హశబ్దమునకు అనంతమును, లశబ్దమునకు జ్ఞానము అర్థ ము. ఇట్లు బ్రహ్మము తటస్థస్వరూపలక్షణములచేత చెప్పబడెను జాగ్రత్స్వప్నసుషుప్తియను మూడు కళలతో కలిసియుండుట వలన సకలశబ్దమునకు జీవులును, హ్రీంకారమునకు బ్రహ్మ మును అర్థము. అట్టిజీవులకు బ్రహ్మముతో నభేదము మూడవ- కూటముచేత చెప్పబడినది. 88-89-90.

శ్లో॥ అత్యల్పమిదం కథితం యత్సర్వం ఖల్విదం బ్రహ్మ । ఇత్యేవం బోధయితుం సకలపదంవా తృతీయకూటగతం ॥ 91 ॥

తా॥ "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతిచేత చెప్పబడు అర్థము స్వల్పాక్షరములైన మూడవకూటమందలి "సకల హ్రీం" అను పదముచేత చెప్పబడినదనియును అర్థము.

శ్లో॥ ఏవమవాంతరవాక్యైః జీవబ్రహ్మస్వరూప మభిధాయ।
తదభేదో వర్ణిత ఇత్యేవ మహావాక్యార్థః॥ 92॥

తా॥ ఇట్లు జీవబ్రహ్మములకు భేదము లేదని చెప్పుటవలన నిది మహావాక్యార్థము. "తత్త్వమసి" అనుమహావాక్యమునందు తత్పదమునకు బ్రహ్మమును, త్వంపదమునకు జీవుడును అర్థము. ఈరెండింటికి ఏకవిభక్తి కలుగుటవలన నభేదమే చెప్పబడుచున్నది. అట్టిఅభేదము వాచ్యార్థముచేసంభవింపకపోయినను లక్ష్యార్థముచే సంభవింపకపోదు. వానిలో తత్పదమునకు సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహములనెడి పంచకృత్యములను చేయు ఈశ్వరుడు వాచ్యార్థము. కృత్యములకతీతమయిన నిర్గుణబ్రహ్మము లక్ష్యార్థము. ఇట్లే త్వంపదమునకు జాగ్రత్స్వప్న సుషుప్తి, తురీయ, తురీయాతీతమను నయిదవస్థలతో కూడిన జీవులు వాచ్యార్థము. అవస్థాపంచకమునతిక్రమించిన నిర్గుణబ్రహ్మము లక్ష్యార్థము. "యతోవాఇమాని" అను శ్రుతి జగత్సృష్టికర్తను చెప్పుచున్నది. "సత్యంజ్ఞానం" అనుశ్రుతి నిర్గుణబ్రహ్మమును చెప్పుచున్నది. ఆకాశమునందు డేగఅయినను, గరుడపక్షిఅయినను తిరిగితిరిగి అలసి రెక్కలనుముసికొని తన వాసస్థానముదగ్గఱకు ఏప్రకారమువచ్చునో ఆప్రకారమే జీవులును నివాసముకొఱకు వచ్చుచున్నారు. "నదృష్టేర్ద్రష్టారం పశ్యేః" బృ. ఉ. 5-4-2. అన్నిటినిచూచే నేత్రములు ఆత్మను చూడలేవు. ఇత్యాద్యవాంతరవాక్యములచేత వాచ్యార్థ లక్ష్యార్థములు నిర్ణయింపబడినందున మహావాక్యమునందు లక్ష్యార్థములకభేదజ్ఞానము చెప్పబడినది. అయినను శ్రుతులయందు ఈశ్వరునకు పంచకృత్యములనియు, జీవునకు మూడవ

స్థలనియు చెప్పబడినను తంత్రములయందు వీనికిని పంచకృత్య ములనియు, అయిదవస్థలనియు చెప్పబడెను. ఈప్రకారము మూడవకూటమందలి సకలపదముచేత కళలతోను, అవస్థలతోను కూడినట్లు వాచ్యార్థము చెప్పినప్పటికి లక్ష్యార్థము చెప్పకపోవుటచే న్యూనతకలుగుచున్నందున మొదటిరెండుకూటములే ఆవృత్తిచేత "త్వంపదమునకు" వాచ్యార్థలక్ష్యార్థములని చెప్పతగియున్నది. లేక తంత్రప్రధానమతమునందు వాచ్యార్థములకుకూడ అభేదమును శాంభవానందకల్పలతాకారాదులు చెప్పియున్నందున ఒకటిరెండు కూటములకు సృష్టికర్తృత్వము మొదలగు ధర్మములతో కూడికొనిన యీశ్వరుడును, అయిదవస్థలతో కూడికొనిన వాచ్యార్థమయిన జీవులును అర్థము. మూడవకూటమునకు అట్టిజీవేశ్వరుల కభేదమని కాని, పూర్ణజగత్తుతో బ్రహ్మమునకభేదమనికాని అర్థము. ఇక్కడ నెంతచెప్పతగినదో అంతమాత్రమే చెప్పబడెను. సమస్తము చెప్ప నెడల వేదాంతశాస్త్రమంతయు వ్రాయవలసియుండును. హ్రీంకారపరసౌఖ్యదా। త్రిశతి 300 నామము॥

శం॥ భా॥ హ్రీంకారపరాః హ్రీంకారమంత్రజపపరాః హ్రీంకారఘటితశ్రీవిద్యాజపపరావా। తేషాం సౌఖ్యం చతుర్విధపురుషార్థప్రాప్తిజన్యానందః తద్దదాతీతి తథా। హ్రీంకారాణాం వ్యష్టివేషేణ వాచ్యార్థానాం త్రిమూర్తీనాం పరం సౌఖ్యం పామరస్యసుఖం ఏకీభావానందం దదాతీత్యర్థః। "యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా। యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతితదల్పం॥ "నాల్పే సుఖమస్తి" ఇతి। "ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబి

ఛేరి కుతశ్చన ” ఇతి । “ యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనా త్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే । అథ సోఽభయంగతో భవతి ” “ విజ్ఞానమానందం బ్రహ్మరాతిర్దాతుః పరాయణం ” ఇత్యాది బహుశ్రుతిభ్యః అఖండసచ్చిదానందబ్రహ్మస్వరూపతయా సైవ ఫలం భవతి। అన్యజ్ఞానాదస్య ఫల ప్రాప్తేరయోగాత్ । “ బ్రహ్మవేద బ్రహ్మైవభవతి ” “ తరతి శోకమాత్మవిత్ ” ‘ యేన మాముపయాంతితే । తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ’ ‘ బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి ’ ఇత్యాది శ్రుతిస్మృతిశతేభ్యః స్వస్వరూపప్రాప్తేరేవ పురుషార్థస్య ప్రధానత్వం సిద్ధం ॥

టీ॥ పరదేవత హ్రీంకారమునుగాని, హ్రీంకారముతో కూడిన శ్రీవిద్యామంత్రమునుగాని జపముచేయువారికి చతుర్విధపురుషార్థములనిచ్చును. లేక బ్రహ్మ, విష్ణు, రుద్రులయొక్క సామరస్యరూపమగు సుఖమునిచ్చును. ‘ యత్ర నాన్యత్ పశ్యతి ’ మొదలగు శ్రుతులచేత ఈమె అఖండసచ్చిదానంద బ్రహ్మమగుటచేత నట్టిఫలముకలుగుచున్నది. అన్యమైనజ్ఞానమువలన అల్పఫలముకలుగును. కాని ఇట్టిమహాఫలము కలుగదు. ‘ బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి ’ మొదలగు శ్రుతియు, స్మృతులును బ్రహ్మవేత్తకు స్వరూపప్రాప్తియను పరమపురుషార్థమునే చెప్పుచున్నవి.

వామకేశ్వరతంత్రము 5 వ॥ 41 శ్లో॥ న్యసంవిత్రిపురాదేవి లౌహిత్యం తద్విమర్శనం । పాశాంకుశౌ తదీయౌతు రాగద్వేషాత్మకౌ స్మృతౌ ॥ 41 ॥ శబ్దస్పర్శాదయో బాణా మనస్తస్యా భవద్ధనుః । విశ్వప్రతీతిజనికా శ్శక్తయశ్చ క్రమేణతాః ॥ 42 ॥

భా॥ వ్యా॥ స్వసంవిత్ స్వాత్మైవ త్రిపురాదేవీ। త్రిపుటీతః పూర్వకాలీనత్వాద్ద్యోతమానత్వాచ్చ । స్వాత్మనో విమర్శనమితరావిషయకత్వేసతి తదేకవిషయకమనుసంధానం । తచ్చ స్వాత్మన్యనురాగరూపమేవేతి లౌహిత్యముచ్యతే । ఉక్తంచతంత్రరాజే—** స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా ; లౌహిత్యం తద్విమర్శః స్యాదుపాస్తిరితి భావనా ॥ ఇతి॥ షట్త్రింశత్తత్త్వేషు రాగాత్మకం తత్త్వం పాశస్య సూక్ష్మంరూపం । అంకుశస్య వాసనాత్మకం రూపం ద్వేషః క్రోధః । శబ్దస్పర్శాదయ ఇత్యాదిపదేన రూపరసగంధాః । ఏతే పంచతత్త్వాత్మకా విషయా బాణాః పుష్పసాయకాత్మకాః । ముఖే సురూపత్వేసతి పరిణామే విరుషత్వాత్ । తస్య స్వాత్మనో ధనురిక్షుకోదండం తు మనస్తత్వం । విశ్వవిషయస్ఫూర్తిజనికా యా మనోవృత్తయస్తా ఏవ క్రమేణ చతురస్రాది బిందుచక్రాంతక్రమేణ విద్యమానాః శక్తయో జ్ఞేయాః ॥ ఇతి ॥

తా॥ జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను నీమూడు త్రిపుటియనబడును. ఈత్రిపుటికంటె పూర్వము స్వయంప్రకాశముగనున్న చిచ్ఛక్తియే లలితాదేవి. ఈచిచ్ఛక్తియే తనస్వరూపము. ఇట్టివిమర్శమువలన ఈలలితాదేవియే కల్పితమగు చరాచరప్రపంచముగ పరిణమించెనని భావింపవలయును. బాహ్యవిషయములను ధ్యానింపకుండుటయే ఆత్మానుసంధానమనబడును. ఆత్మయందలి ప్రేమరూపమగు ఈఅనుసంధానమే తంత్రరాజమందు లౌహిత్యము ఉపాసన అనిచెప్పబడును. షట్త్రింశత్తత్త్వములలో అనురాగము సూక్ష్మరూపమగు పాశమని, క్రోధము సూక్ష్మరూపమగు అంకుశమని, శబ్దస్పర్శరూపాదివిషయ

ములు సూక్ష్మరూపములగు బాణములని భావింపవలయును. శబ్దస్పర్శాది విషయములను బాధించే స్వభావముగల బాణములని చెప్పవచ్చునా? అనిశంకింపవలదు. ఈవిషయములు మొదట సేవించుకాలమున రమ్యములయినను తరువాత విషప్రాయములై బాధించుటవలన నీవిషయములు బాణములనదగును. మనస్సే ధనుస్సు. ప్రపంచమునుధ్యానించెడి మనోవృత్తులే చతురస్రము మొదలు బిందుచక్రమువరకు నుండెడి శక్తులు. ఇవియన్నియు చిచ్ఛక్తియొక్క పరివారమని ఆశక్తియే ఇట్లుజగదాకారముగ పరిణమించెనని, ఈచిచ్ఛక్తియే సర్వస్వరూపమని భావించుట ఆత్మానుసంధానమని భావము.

ద॥సం॥ 26అ॥ * ద్వివిధా శ్రుతిషూద్దిష్టా వ్యష్టిస్తత్వం ప్రకాశయ । యస్యాత్మనః పరంతారాదన్యద్వస్తు నభాతిహి ॥137 శాస్త్రనిశ్చయయుక్తస్య బుద్ధిస్తస్య ప్రతిష్ఠితా। పరమార్థాత్మచైతన్యాదన్యస్యాభానతశ్శివే ॥138॥ చైతన్యైకరసంబ్రహ్మపూర్ణమిత్యనుశాసనం। యస్య ప్రమాణతో భాతి సపరః పురుషోత్తమః ॥139॥ విశ్వం నతస్య భాత్యేవ విశ్వభావేన మత్ప్రియే భాతిచేద్బ్రహ్మభావేన విశ్వం బ్రహ్మాత్మనా స్ఫురేత్ ॥ 140 ॥ యథాదర్పస్థితం విశ్వం నాస్తి భాంతమపి స్వతః। అంతర్బహిశ్చాదర్శస్య విద్యమానతయా తథా ॥ 141 ॥ ఏవమాత్మన్యఖండార్థే భోక్తృభోగ్యమయం జగత్। భాతమప్యస్తి నో భాతి భూమాత్మైవాస్తి సర్వతః ॥ 142 ॥ ఏవం విజానతః సర్వవ్యవహారమతీత్యచ। పుంసోహి వర్తమానస్య వాసనానాశసిద్ధయే॥ తంత్రజాలం ప్రవృత్తంహి గుహ్యామేతన్నిబోధమే। అతివర్ణాశ్రమీ యోహి సహమాశ్రమీనిరాకారభాక్ ॥ 144 ॥ స్వాశ్రీకారమ

జానానః ప్రవృత్తస్తంత్రవర్త్మని। అజ్ఞశ్చాత్మనిష్ఠస్సన్ రౌ
రవం యాతి సాన్వయః ॥ 145 ॥ జ్ఞదృష్ట్యాహ్యఖిలోభావో బ్ర
హ్మాత్మచితితఃపరః। మిథ్యాభూతః కల్పితోస్య నిశ్చయః కల్పి
తార్థభాక్ ॥ 146 ॥ అజ్ఞదృష్ట్యాఖిలం ద్వైతం సత్యమిత్యస్య నిశ్చ
యః। అజ్ఞానస్యాధ్వస్తితోస్య దృష్టిమాశ్రిత్య కేవలం ॥147॥
మార్గభేదాదికం శాస్త్రం నిర్మమే శృణు పార్వతి। యావదజ్ఞా
నవిధ్వస్తిః పురుషస్య నజాయతే। రుద్రయామళముఖ్యానివావ
ర్త్యాని తత్తతః। అతిస్సమస్తదేవానాం మాతా త్రిపురసుం
దరీ ॥ 149 ॥ యస్తస్యా విధినాశశ్వద్గురుభక్తేన సర్వదా। ఆరా
ధితా పరాదేవీ భుక్తిం ముక్తిం ప్రయచ్ఛతి ॥ 150 ॥ ఇత్యాది ॥

తా॥ శ్రుతులయందు జీవులు వ్యష్టియనియు, ఆత్మసమష్టి
యనియు రెండువిధములుగ చెప్పబడినది. పరమార్థము చేత
ఆత్మవస్తువుకంటె నన్యమయినది ఆభాసవలన కనబడును. గాని
నిశ్చయమైనది కాదు అనుజ్ఞానముతో ఆత్మవస్తువునే చూచు
వారు జ్ఞానులు. చైతన్యమాత్రస్వరూపమగు బ్రహ్మము పరి
పూర్ణమని ప్రమాణములచే నెరిగినవారే పురుషులలో నుత్తము
లు. అట్టివానికి ప్రపంచము బ్రహ్మముగానే భాసించును కాని
వేఱుగా భాసింపదు. అద్దమునందు ప్రపంచము వేఱుగాకనబడి
నను వాస్తవముగ లేనట్లే ఆత్మయందు కల్పింపబడిన భోక్తృ
భోగ్యరూపమయిన జగత్తు వేఱుగాకనబడినను వేఱుకాదు.
సచ్చిదాత్మ అంతటనిండియున్నది అని తెలిసి వ్యవహరించుపురు
షుడు వర్తమానవ్యాపారము నశించుకొఱకును, అతిరహస్యమ
గు ఈబ్రహ్మస్వరూపమును తెలిసికొనుటకొఱకును తంత్రమా
ర్గమునవలంబింపవలయును. అవఘాతమైనవారే యీతంత్ర

మార్గమునకర్హులు. జ్ఞానము, ఆత్మనిష్ఠయు. అర్హతయులేకుం డగ తంత్రమార్గమునందు ప్రవేశించినవారు వంశపరంపరగనర కమును బొందుదురు. బ్రహ్మమనెడి చిత్తునందు సమస్తపదార్థ ములు కల్పింపబడినవి కనుక జ్ఞానదృష్టిచేత ప్రపంచము మిథ్య యని నిశ్చయము. అజ్ఞానదృష్టిచేత సమస్తప్రపంచము సత్య ముగదోచును. ఓ పార్వతీ నరులయజ్ఞానమును తొలగించుటకు శాస్త్రములందు వైదిక తంత్రమార్గములు అధికారిభేదమున వర్ణింపబడినవి. అజ్ఞానముతొలగక రుద్రయామళాదికము నభ్య సింపరాదు. కాని వేదమాతయగు త్రిపురసుందరిని సద్గురూక్త ప్రకారము భక్తితో నెల్లపుడును ఆరాధింపవలయును. భక్తితో సేవింపబడిన పరదేవత భక్తులనుపేక్షింపక వీరికి భుక్తిముక్తుల నిచ్చును అని ఈశ్వరుడు చెప్పెను.

(1సూ॥) శ్రీగౌడపాదాచార్యకృత మంత్రరత్నసూత్రములు—

అథ శాక్తమంత్రాగమాభిజిజ్ఞాసా ॥

వి॥ వ్యా॥ ససూత్రార్థో వర్ణ్యతే మయా। ప్రసాదేన తస్యాః అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖం। అస్తోభమనవ ద్యంచ సూత్రం సూత్రవిదో విదురితి సూత్రలక్షణం॥ వేదాంత సంబంధాభిధేయస్య శాస్త్రస్య అథో చితకర్మకృతధర్మసంపాదనా నంతరంవా। సాధనచతుష్టయసంపత్త్యనంతరంవా। నద్వితీయః। బ్రహ్మణి జిజ్ఞాసా కర్తవ్యా। అథాతో బ్రహ్మజిజ్ఞాసేతిసూత్రేణ చరితార్థత్వాత్। తస్మాత్సాధనచతుష్టయ సంపత్త్యనంతరమితి తదయుక్తం। కింతు ధర్మజిజ్ఞాసోత్తరం ధర్మసంపాదనానంతర మిత్యథశబ్దస్యార్థః। అథ అర్థిత్వ సమర్థత్వ విద్వత్వ సంపాదనా నంతరమిత్యంగీకారే అథాతో ధర్మజిజ్ఞాసేతి। సహస్రాధికరణీ

యపూర్వమీమాంసాశాస్త్రేణ చరితార్థత్వాత్తదత్రాసంగతం సిద్ధాంతస్తు॥ సాధనచతుష్టయసంపత్త్యనంతరం బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా। తథాపి ప్రబలప్రారబ్ధతయా ప్రతిబంధకనివృత్తిద్వారా శాక్తమంత్రాణామాగమస్యచ జిజ్ఞాసా కర్తవ్యా। లోకే శైవచైవ వైష్ణవ ప్రభృతి మంత్రాః బహవో వర్తంతే। శాక్తమంత్రాణామాగమస్యచ జిజ్ఞాసయైవ కింప్రయోజనం। సత్యం। శక్తిసంబంధావచ్ఛిన్నతయా సర్వస్య శాక్తత్వాత్సర్వం శక్తిమయం జగదితి ప్రసిద్ధత్వాత్। తస్మాత్సర్వేషాం మంత్రాణాం తదంతఃపాతిత్వం యుక్తం। మకారో మననం ప్రాహుస్త్రకారస్త్రాణఉచ్యతే। మననత్రాణసంయుక్తో మంత్రఇత్యభిధీయతే ఇతి। కేషాంచిత్పక్షః। మకారో జీవసంజ్ఞస్స్యాత్త్రకారస్త్వాత్మసంజ్ఞకః। జీవాత్మసంజ్ఞయోరైక్యం మంత్రఇత్యభిధీయతే। మకారో మానసం ప్రోక్తస్త్రకారో బుద్ధిలక్షణః। మనోబుద్ధ్యాదిసంజ్ఞేయం మంత్రఇత్యభిధీయతే॥ మంత్రస్య కింవా లక్షణం। మంత్రాభావప్రతియోగిత్వం। ఋషిశ్ఛందశ్చ బీజంచ కీలకం శక్తిరేవచ। అంగన్యాసస్తతోధ్యానం మంత్రాంగానాంచసప్తకం॥ ఋకారః సృష్టిసంజ్ఞస్స్యాత్ షికారః స్థితిసంజ్ఞకః। సృష్టిస్థితిభ్యాంసంజ్ఞేయం ఋషిరిత్యభిధీయతే। ఛకారః పదసంజ్ఞస్స్యాద్దకారశ్చాభిలాషకః। పదాభిలాషసంజ్ఞం తచ్ఛంద స్సద్భిరుదాహృతం। బీజం కారణమర్థానాం జగన్నిర్మాణరూపకం॥ ఇతి సుందరీతాపనీయే। సర్వకారణమిత్యర్థః॥ నన్వనేకేషాంమంత్రాణాం మధ్యే వాగ్భవ కామరాజ తార్తీయమిత్యాదీనాం తేషాం బీజసంజ్ఞత్వాత్సర్వకారణత్వంకథం। సత్యం ముఖ్యత్వగౌణత్వాభిప్రాయేణ తత్రాప్యస్తు నామ। “బీజత్వావఛిన్నబీజస్యశక్తిస్సా

బలముచ్యతే » ఇతిసుందరీతాపనీయే ॥ « వీర్యం తేజో బలం ఘా త్రిం సర్వం తచ్ఛక్తిరుచ్యతే» ఇతి త్రిపురాసిద్ధాంతే ॥ రథాంగ నేమీతి కీలకం । నీయతే సమ్యగనేనేతి న్యాసః । «త్వఙ్మజ్జారక్త యుక్తం తచ్ఛరీరమపవిత్రకం । న్యాసేనానేన శుద్ధ్యర్థమజస్రం న్యాసమాచరేత్ » ఇతి లక్ష్మీరత్నకోశే ॥ అజస్రంనామ ఉదయాద్యస్తమానపర్యంతంవా, నిత్యం కదాచిదపివా । ఆద్యపక్షుశ్చేద్దేవతాధ్యానాదికృత్యస్య కాలో నవిద్యతే । ద్వితీయేన్యాసమాత్రేణాలంవా । పూర్వోక్తసప్తాంగవిశిష్టక మంత్రోపాసనా కర్తవ్యా । సత్యం, నిత్యం కదాచిదపీతి, అనేన దేవతాధ్యానాది కృత్యస్య కాలోవిద్యతే । నతు న్యాసమాత్రేణ చరితార్థత్వాత్ ఏతావతా పూర్వోక్తమంత్రాంగసప్తకవిశిష్టమంత్రోపాసనైవ కర్తవ్యా । నన్వేకదివససంబంధిత్వాద్యవచ్ఛిన్నన్యాసేన పవిత్రప్రయోజకత్వాదజస్రన్యాసేన కింప్రయోజనం । సత్యం. ప్రాతరధీయానో రాత్రికృతం పాపంనాశయతి । సాయమధీయానో దివసకృతం పాపం నాశయతి । యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిముచ్యత ఇత్యుక్తత్వాదజ్ఞానసంబంధత్వావచ్ఛిన్నవిశిష్టతయాచ అంగన్యాసేన పరిశుద్ధస్య దూరీకృత దురితస్వాంతరత్వాత్ । అతోఆవశ్యకత్వాన్నిత్యమేవావశ్యం న్యాసః కార్యః ॥ తస్మాన్మంత్రాంగసప్తకవిశిష్టమంత్రోపాసనైవ కర్తవ్యేత్యుక్తం అగమశబ్దస్యానేకత్వం । మంత్రాణామనేకత్వమిత్యర్థః । నను సర్వం ఖల్విదంబ్రహ్మేతి శ్రుత్యా బ్రహ్మవ్యతిరిక్తం కిమపినాస్తీతి వేదాంతైర్నిరుక్తం । తస్మాదేకస్మిన్ బ్రహ్మణి మంత్రాణామనేకత్వం కథం । సత్యం । ఏకస్య బ్రహ్మణః యాస్వరూపభూతా వక్ష్యమాణా చిత్ జగన్నిర్మాణశక్తిరూపేణైకా । యదా

అనేకరూపేణోత్పన్నా తదీయసంబంధత్వావచ్ఛిన్నమంత్రాశ్చోత్పన్నాః। ఏతేన బ్రహ్మణః కాపానిః। బ్రహ్మణశ్చిన్మాయావశాత్పంచభూతాత్మకం యథా జగదుత్పన్నం తద్వదత్రాపి। జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా। నను మంత్రాణామనేకత్వస్య జ్ఞాతుమిచ్ఛయైవాలం। ఉపాసనాయాః వైయర్థ్యంస్యాత్। సత్యం। జ్ఞాతుమిచ్ఛయా అవ్యవహితక్షణావఛిన్నేన జ్ఞాత్వానుష్ఠానేన ఉపాస్యోపాసకభావత్వావఛిన్నేన మంత్రసిద్ధిః। తద్వారా తదధిష్ఠానదేవతాయా అనుగ్రహార్థత్వాన్న తస్యాః విరోధః ॥ 1 ॥

తా॥ ప్రశ్నము—అథశబ్దము సమర్థవిద్వాంసుడు చేసినయాగాదికర్మములతరువాతననే యర్థమును చెప్పనా? లేక నిత్యానిత్యవివేకము, ఇహపరలోకభోగవైరాగ్యము, శమదమతితిక్షాదులు, ముముక్షుత్వము నను సాధనములుకలిగినతరువాతననే యర్థమును చెప్పనా?

ఉత్తరము—మొదటి కర్మానంతర్యము పూర్వమీమాంసాప్రారంభమును, రెండవసాధనచతుష్టయసంపత్త్యనంతరము ఉత్తరమీమాంసా వేదాంతప్రారంభమును చెప్పుచున్నవి. కావుననివి రెండు నిచట చెల్లవు.

ప్ర॥ ఈశాస్త్రమునందు అథశబ్దమున కేమియర్థము?

ఉ॥ సాధనచతుష్టయసంపన్నుడు బ్రహ్మవిచారము చేయబూనినపుడు ప్రబలమగు ప్రారబ్ధము విషయవాసనలచే బ్రహ్మవిచారమునకాటంకమును గలిగించుచుండును. గనుక ఆప్రతిబంధకమును నివారించుటకై శాక్తమంత్రాగమవిమర్శనము చేయవలయునని బోధించుటచేత సాధనచతుష్టయసంపత్త్యనంతర మేయని పర్యవసానము.

ప్ర॥ లోకములో శైవ వైష్ణవాది మంత్రముల నేకములుండ గా శాక్త మంత్రములయు, ఆగమములయు, విమర్శము నేయేల చేయవలెను?

ఉ॥ సర్వం శక్తిమయం జగత్ అనుప్రసిద్ధినిబట్టి శక్తిసంబంధము లేనిది యేదియు లేనందున నీశాక్త విమర్శనము చేయతగినదే. కనుకనే సర్వమంత్రములు శక్త్యధీనములు. ఎంతవారును శక్తి లేనిదే యేపనిని చేయలేరు. నీవేల చేయలేవనిన నాకుశక్తి లేదనియె చెప్పను.

ఇందలిమంత్రశబ్దమునకు మకారము మననమును, త్రికారము రక్షణను చెప్పుటవలన మననము చేయువారిని రక్షించునని యర్థము. కొందరిపక్షమున మకారమునకు జీవుడర్థము. త్రికారమునకు ఆత్మయర్థము. కనుక అట్టిజీవాత్మలయైక్యమే మంత్రమనియు, మఱియొకపక్షమున మకారము మనస్సనియు, త్రికారము బుద్ధియనియు, మనోబుద్ధులసంయోగమే మంత్రమనియు చెప్పబడుచున్నది. మంత్రమునకు ఋషి, ఛందస్సు, బీజము, కీలకము, శక్తి, అంగన్యాసము, ధ్యానము నను ఏడంగములు, ఋషియనుదానిలో ఋకారము సృష్టిని, షికారము స్థితిని బోధించును. గనుక ఋషిశబ్దము చేత సృష్టిస్థితులు చెప్పబడుచున్నవి. ఛందః అనుదానిలో ఛకారమునకు పరమపదమనియు, దకారమునకు అభిలాషయను నర్థము. పదాభిలాషసంబంధము ఛందస్సు అనబడును. బీజము పురుషార్థములకు కారణమనియు, జగన్నిర్మాణరూపమనియు, సుందరీతాపనీఉపనిషత్తుయందు చెప్పబడినందున బీజమునకు సర్వకారణమర్థము.

ప్ర॥ అన్ని మంత్రములలోనున్న యక్షరములకును బీజసంజ్ఞ

యుండగా వాగ్భవము, కామరాజము, తార్తీయము మొదలగు వానికే సర్వకారణత్వమెట్లు?

ముఖ్యార్థముచేత జగత్కారణము కాజాలని బీజములును, గౌణార్థముచేత జగత్కారణముకావచ్చును. బీజములనే యక్షరములకు శక్తియనియర్థము. రథచక్రమునకు ముఖ్యము కీలకము (సీల) వలెనే మంత్రమునకు ముఖ్యము కీలకము. చర్మము మెదడు, రక్తము వీనితోకూడిన శరీరము పవిత్రముకానిదికనుక శుద్ధికొరకు న్యాసము సర్వదా చేయవలయునని లక్ష్మీరత్నకోశమునందు చెప్పబడినది.

ప్ర॥ సర్వదా అనుటకు ఉదయము మొదలు సాయంత్రమునరకా? నిత్యము నొకానొకప్పుడా? మొదటిపక్షమయితే దేవతయొక్క ధ్యానాదులకు కాలములేదు. రెండవపక్షమైతే న్యాసమాత్రముచాలునా? లేకపూర్వమందు చెప్పిన సప్తాంగములతో కూడిన మంత్రోపాసన చేయతగినదా?

ఉ॥ నిత్యము, ఒకానొకప్పుడనుటచేత దేవతయొక్క ధ్యానాదులకు కాలముండును. న్యాసమాత్రముచాలదు. సప్తాంగములతోకూడిన మంత్రోపాసననే చేయవలయును.

ప్ర॥ ఒకదినమందు జేసిన న్యాసముచేత పవిత్రతకలుగుచుండగా సర్వదాన్యాసము చేయుటచేతి ప్రయోజనమేమి?

ఉ॥ ప్రాతఃకాలమునందు చేయుటచేత రాత్రియందైన పాపమును, సాయంకాలమునందు చేయుటచేత పగటియందైన పాపమును, నశింపచేయును. ఎప్పుడుచేసినపాపమప్పుడే పోగొట్టవలసినదని (ప్రాతరధీయానో=ప్రతిముచ్యతే) అనుశ్రుతి చెప్పుటవలనను, అజ్ఞానసంబంధమైన పాపములనన్నిటిని పోగొట్టునదిగను

కను పరిశుద్ధికొఱకు న్యాసమవశ్యము చేయవలయును. అంగము లేడింటితోకూడిన మంత్రమునే ఉపాసనచేయతగినది. ఆగమములు అనేకములు గనుక మంత్రములును అనేకములు.

ప్ర॥ "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనుశ్రుతిచేత బ్రహ్మవ్యతిరిక్తమైనదేదియు లేదని బ్రహ్మమునకు ఏకత్వము వేదాంతమునందు చెప్పబడియుండగా నట్టి బ్రహ్మమంత్రనేకమంత్రములెట్లగును?

ఉ॥ శుద్ధబ్రహ్మస్వరూపమగు చిత్తొకటియయ్యును జగన్నిర్మాణశక్తితో ననేకములయినట్లు బహుమంత్రరూపమయినది దీనిచేత బ్రహ్మైకత్వమునకు హానియేమియు లేదు. బ్రహ్మమునుండి చిన్మాయావశమున జగత్తుకలిగినట్లు బహుమంత్రములును గలిగినవి.

ప్ర॥ మంత్రములను తెలిసికొనెడి యిచ్ఛమాత్రము కోరిన ఫలమునీయజాలియుండగా నుపాసనవలన నేమిప్రయోజనము.

తెలిసికొనవలెనను కోరికపుట్టినక్షణమందే తెలిసి శ్రద్ధతో చేసిన యనుష్ఠానముచేతను మంత్రముసిద్ధించును. మంత్రాధిష్ఠానదేవతకనుగ్రహమును కలుగును. గనుక ఉపాసనవ్యర్థముకాదు వి॥ ఔషధమును సేవింపక దాని పేర్కొన్న మాత్రాన రోగముతగ్గునా.

నను ఏకస్మిన్బ్రహ్మణి శక్తిత్వం కథం । కించప్రయోజనమనుద్దిశ్య నమందోపి ప్రవర్తతఇతి న్యాయోక్తస్యాః ప్రయోజనం కిం । తస్యబ్రహ్మణః అవాప్తసకలకర్మనిమిత్తత్వాత్ । కించ వస్త్వైవ చిత్ప్రకాశాశక్తిః కేనోపాయేన అనేకవిధం తత్సర్వం వక్తవ్యమితి శంకాకారే ప్రాప్తేసతి । ఆత్మైవాఖండాకార ఇత్యాది సూత్రైస్సింహావలోకనన్యాయేన పరిహారతి ॥

"ఆత్మైవాఖండాకారః" 2.

"ఆత్మావారె ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" ఇతి శ్రుతేః॥ ఆత్మైవాఖండాకార ఇత్యత్ర జీవాత్మనః అఖండాకారత్వంవా, పరమాత్మనో వేతివిశయః। ద్రష్టృత్వ శ్రోతృత్వాదికం జీవాత్మనో యుక్తం నతు పరమాత్మనః తస్య నిర్విశేషత్వాత్। "అస్థూలమనణ్విత్యాది శ్రుతేః" కథం అఖండాకారత్వం జీవస్యేతిచేత్। ఘటమహం జానామి। పటమహం జానామీత్యాది సర్వద్రష్టృతయా। తస్మాత్సర్వనియంతా జీవ ఇతి పూర్వపక్షః॥ సిద్ధాంతస్తు॥ ద్రష్టృత్వ శ్రోతృత్వాదికత్వం పరమాత్మనఏవ। కథం అంతఃకరణావఛిన్నస్య ప్రాదేశికస్య। స్వర్గనరకాది సంచారిణో జీవస్య ద్రష్టృత్వాదికం యుక్తం। ఘటమహం జానామీత్యనేన చిదాభాసస్య యత్కించిద్ద్రష్టృత్వాదికం వర్తతే। నతు సర్వపదార్థావభాసకత్వం। కింతు జానామీత్యేతావత్తయాఖండాకారత్వమప్రసిద్ధం। ఖండాకారత్వం ప్రసిద్ధం। ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మే త్యఖండాకారత్వం పరమాత్మనో యుక్తం। నను అఖండాకారఇత్యాకారవత్వం పరమాత్మనో నయుక్తం। తస్య అసంగోదాసీనత్వాత్। యత్రాకారవత్వం తత్ర పరిచ్ఛిన్నత్వమనిత్యత్వంచ దుర్వారం స్యాత్। ఉచ్యతే। అఖండత్వమేవాకారః అఖండాకారః। నైతావతా సోపాధికత్వమాకారత్వం। కింతు నిరుపాధికత్వమేవ। "అదృష్టం ద్రష్టృ। అశ్రుతం శ్రోతృ" ఇత్యాది శ్రుతేః॥ తస్మాదఖండాకారత్వం పరమాత్మనఏవ। నను భవన్మతె పరమాత్మాతిరిక్తతయా నహి వస్త్వంతరం అత్రోక్తం। స్వర్గనరకాదిసంచారిణో జీవాత్మనో ద్రష్టృత్వాది

కత్వమయుక్తం। పరమాత్మనస్తు యుక్తమేవేత్యేతేన అద్వైత హానిరితిచేన్న। "తత్సృష్ట్వా తదేవానుప్రావిశదితి" పరమాత్మనో జీవరూపేణ ప్రవిష్టత్వాత్। ఏవంచేత్తర్హి జీవాత్మనోప్యఖండా కారత్వం యుక్తం। సత్యం। జీవాత్మనస్త్వఖండాకారత్వం భ్రాంతితయా వ్యవహృతం। జీవత్వవిచారే యథా భ్రాంతిః తద్వత్। తత్సృష్ట్వేత్యాత్మనఏవ జీవత్వోక్త్యా కథం భ్రాంతిరితి చేన్న। జీవత్వస్య అనిత్యత్వమేవ వేదాంతె ప్రసిద్ధత్వాత్తత్రైవ విచారణీయం ॥ 2 ॥

అవతారిక॥ అద్వితీయబ్రహ్మమందు శక్తి యేలకలిగెను. అందుకుఫలమేమి. ఫలాపేక్ష లేకుండ మూఢుడైనను ప్రవర్తింపడు। పరిపూర్ణబ్రహ్మమునకు ఫలాపేక్షకలదని చెప్పరాదు। మఱియు చిచ్ఛక్తి బహుప్రకారమగుటకు కారణమేమి। అను శంకలకుత్తరముగా నీరెండవసూత్రము చెప్పబడినది॥

తా॥ ఆత్మ యఖండాకారమయినదే చూడతగినది, వినతగినది, మననముచేయతగినది, ధ్యానింపతగినదియు నాత్మస్వరూపమేయని(ఆత్మావారే=ఽ దిధ్యాసితవ్యః)అనుశ్రుతి చెప్పుచున్నది

ప్ర॥ అఖండాకారత్వము జీవునికా? పరమాత్మకా? చూచుట, వినుట మొదలైనవి జీవునికియుక్తము. కాని నిర్విశేషమగు పరమాత్మకు అదియుక్తముకాదు. బ్రహ్మము స్థూలముకాదు. అణువుకాదు. అని (అస్థూలమనణ్విత్యాది) శ్రుతిచెప్పుచున్నది జీవునకు అఖండాకారమెట్లుఅందువేని (ఘటమహంజానామి) ఘటమునెరుగుదును పటమునెరుగుదు ననుటచే సర్వమును చూచువాడును, సర్వనియంతయును జీవుడేగద ॥

ఉ॥ చూచుట, వినుట మొదలైనవి పరమాత్మకుయుక్తము

కాని స్వర్గనరకములకు సంచరించు పరిచ్ఛిన్నుడైన జీవునకుయుక్తముకాదు. ఘటము నెరుగుదుననినంతమాత్రముచేత చిదాభాసుడైన జీవునకు యత్కించిత్ ద్రష్టృత్వాదికముసంభవించును కాని సమస్తపదార్థద్రష్టృత్వాదికము సంభవింపదు. జానామి (ఎరుగుదును) అనుమాటచేత అఖండాకారమయిన పరమాత్మ చెప్పబడదు. ఏలననగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయాత్మకత్రిపుటి పరిచ్ఛిన్నుడగు జీవునికేగాని పరిపూర్ణమగు బ్రహ్మమునకు సంభవింపదు. (ఏకో దేవః=సర్వభూతాంతరాత్మా) అనుశ్రుతిచేత సర్వభూతములయందును ప్రవేశించి సర్వవ్యాపకుడును, సర్వభూతములకు అంతరాత్ముడునగువాడు పరమాత్ముడె. అతనికే యఖండాకారత్వము యుక్తము.

ప్ర॥ పరమాత్ముడు అసంగుడు, ఉదాసీనుడు అని శ్రుతిచెప్పుచుండగా అఖండాకారమని ఆకారముచెప్పుట యుక్తమా, ఆకారముగలవాడు పరిచ్ఛిన్నుడును, అనిత్యుడునుగద॥

ఉ॥ ఇక్కడ అఖండత్వమే యాకారము. కాని ఉపాధితోకూడిన యాకారముకాదు. పరమాత్మ నిరాకారము. నిరుపాధికమే. (అదృష్టం ద్రష్టృ=) అనుశ్రుతి చూడబడునది వినబడునది ఆత్మకాడనియు, చూచునది వినునది యాత్మయనియుచెప్పుచున్నది, చూడబడునది రూపము. ఇదియే ఆత్మకు ఉపాధి. ఇది వ్యవహారదశయందు కల్పితము. పరమార్థదశయందురూపము లేదు. కావున నిరాకారము, నిరుపాధికము, అఖండాకారము, బ్రహ్మమనుటకు బాధకములేదు.

ప్ర॥ పరమాత్మకంటె నన్యవస్తువులేదు అనిపైవాక్యమందు చెప్పబడెను. ఇపుడు స్వర్గనరకాదులకు బోవువాడు జీవుడేకాని

పరమాత్మకాదని చెప్పబడెను. ఈరెండువాక్యములకు పరస్పర విరోధమువలన అద్వైతమునకు హానికలుగదా?

ఉ॥ తత్సృష్ట్వా అను శ్రుతి పరమాత్మ జగత్తును సృజించి తాను ప్రతిబింబమువలె వ్యవహారతత్వముకొరకు దానియందు ప్రవేశించెను. అనిచెప్పుటవలనను, ప్రతిబింబములు బింబవస్తువులకంటె నన్యములు కాకపోవుటవలనను అద్వైతమునకు హానిలేదు.

ప్ర॥ జీవాత్మ పరమాత్మకంటె నన్యముకాదుగద । పరమాత్మకుగల అఖండాకారత్వము జీవాత్మకేల కలుగదు?

ఉ॥ పరమాత్మ చిద్రూపుడు. జీవాత్మ చిదాభాసుడు. ఆభాసమనగా ఉన్నట్లుతోచినను విమర్శించునపుడు లేకపోవుట. ఆభాస భ్రాంతివలన కలుగును. జీవవ్యవహారము భ్రాంతికల్పితమయినపుడు జీవునకు అఖండాకారత్వమును భ్రాంతికల్పితమే కాని వాస్తవముకాదు.

ప్ర॥ (తత్సృష్ట్వా=) అనుశ్రుతి పరమాత్మయే జీవుడై ప్రవేశించునని చెప్పుచుండగా నిది భ్రాంతియనవచ్చునా?

ఉ॥ అంతఃకరణమందు ప్రతిబింబించినపుడు జీవసంజ్ఞ కలిగెను ప్రతిబింబము నిత్యముకానందున జీవత్వము నిత్యముకాదు. దీనినిగురించి అధికముగ తెలిసికొనవలయునని తలంపు కలిగిన యెడల వేదాంతశాస్త్రమందే చర్చింపవలెను.

ప్రకృతే కిమాయాతమిత్యత ఆహ—

“ చైతన్యస్వరూపా చిచ్ఛక్తిః ” 3 ॥

చైతన్యస్య బ్రహ్మణః స్వరూపా చిత్ శక్తిస్సామర్థ్యం । “ సైషానందస్య మీమాంసా భవతి ” ఆనందస్య బ్రహ్మణః

సైషా స్వరూపాచిత్ మీమాగ్ంసా తేజోమయస్వరూపత్వేన శక్తిత్వేన విచారితా భవతీతి వాక్యస్యాభిప్రాయః। అత్ర సైషా చిత్ శక్తిత్వేన ప్రకారాంతరతయా విచారితా వా। చిదేవశక్తిత్వేన విచారితా వా। నతావద్ద్వితీయపక్షః॥ చిదేవ శక్తిత్వేన విచారితా చేత్ శక్తిత్వంనామ సర్వజ్ఞ సర్వకారణ కర్తృత్వం। చితో నిర్వికారావయవత్వాదసంగోదాసీనత్వాత్ । కించయత్ర తేజస్త్వం తత్ర శక్తిత్వం। అనేన సర్వరూపత్వముక్తం। చితః స్వరూపత్వాభావాత్ । తస్మాత్సైషా చిత్ శక్తిత్వేన ప్రకారాంతరతయా విచారితేతి వక్తవ్యమితి పూర్వపక్షః॥ కిముత్పాద్యోత్పాదకత్వేన ప్రకారాంతరతయా వక్తవ్యంవా। పరిణామిత్వేనవా। నతావదాద్యపక్షః। లోకే తావత్సావయవానాం సత్వపరిచ్ఛిన్నపదార్థానాం తత్వం నిరవయవస్య చైతన్యస్య నోత్పాదకత్వం వక్తవ్యం। పరిణామిత్వంచ తథైవ। క్షీరస్య దధ్యాత్మనా పరిణామిత్వేన అనిత్యత్వం। యథా మాయా ప్రతిబింబతయా ఈశ్వరత్వం తథా బింబప్రతిబింబపక్షమపి వక్తవ్యం। తస్మాత్ శైవశాక్తపురాణేషు వేదేషు వేదాంతేషుచ చిదేవ శక్తిరితి గృహ్యాతే। నను చైతన్యస్వరూపేత్యత్ర చైతన్యస్యేతి షష్ఠ్యా భేదత్వం ప్రతీయతే చేత్। సత్యం। చంద్రికాచంద్రయోర్యావచ్ఛేదస్తథైవ। నను శూన్యం తత్ప్రకృతిర్మాయా బ్రహ్మవిజ్ఞానమిత్యపి। శివః పురుష ఈశానో నిత్యమాత్మేతి కథ్యత ఇతి పర్యాయతాయాః చైతన్యస్య నిర్విశేషబ్రహ్మణశ్చ। భేదత్వం తదవశ్యమితి చేన్న। దృష్టాంతేపిచ చంద్రంవినా చంద్రికాభావాత్ । శిష్యస్య బోధనార్థం చైతన్యస్య స్వరూపేత్యుక్తం। వస్తుత్వేన బ్రహ్మణశ్చైతన్యస్యచ స్వరూపాయాః

నిత్యాయోః పరప్రకాశసహితాయోః అభేదత్వాత్ । "నిత్యో నిత్యానామితి శ్రుతేః" "నతస్య కార్యం కరణంచ విద్యతే । నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే । పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే । స్వాభావికీజ్ఞానబలక్రియాచ" శక్తిరిత్యభిన్నత్వే ననం దేహః ॥ కిము [illegible]

తా॥ అ॥ పూర్వసూత్రమందు చెప్పిన ఆత్మవిచారణవలన శక్తివాదమున కేమిలాభము. అనగా మూడవసూత్రము చెప్పబడెను.

తా॥ శుద్ధబ్రహ్మస్వరూపమే చిత్తు । శక్తియనగ సామర్థ్యము. "బ్రహ్మస్వరూపమగుచిత్తు ప్రకాశరూపముతోను, శక్తిరూపముతోనున్నదని (సైషానందస్య మీమాగ్ంసా భవతి) అను శ్రుతి చెప్పుచున్నది. పైశ్రుతిలో చెప్పిన శక్తి చిద్రూపమా? లేక అన్యమా? సర్వజ్ఞము, సర్వకారణమగునది శక్తి. సంగము, అవయవములు, వికారములు లేకుండగ ఉదాసీనమగునది చిత్తు. మఱియును ఎచటతేజస్సుండునో అచటనే శక్తియుండును. తేజస్సనునది రూపమే. చిత్తునకు రూపములేదు కనుక చిత్తే శక్తియను రెండవపక్షము చెప్పనొప్పదు. కనుక శక్తి మఱియొకప్రకారమని చెప్పవలసియున్నది. ఆప్రకారాంతరము కార్యకారణభావమా, లేక పరిణామమా లోకములో కొంచెము సత్వముగలిగి సావయవములగు పదార్థములు నిరవయవాఖండచైతన్యమువలన పుట్టినవని చెప్పకూడదు. కనుక కార్యకారణభావమనరాదు. పెరుగుగమారినపుడు క్షీరస్వరూపము నశించునట్లు సావయవముగ మారినపుడు నిరవయవాత్మ నశింపవలసియుండును. గనుక పరిణామమనుపయితము చెప్పరాదు

అద్వితీయబ్రహ్మము మాయయందు ప్రతిబింబించుటవలన నీశ్వరసంజ్ఞనుబొందినట్లు బింబప్రతిబింబభావముచేత చిత్తేశక్తి యనవలయును. శైవ శాక్త పురాణములు, వేదములు, వేదాంతములు నిట్లేబోధించుచున్నవి.

ప్ర॥ చిచ్ఛక్తి బ్రహ్మముయొక్క స్వరూపమని షష్ఠీతత్పురుషగా చెప్పినెడల భేదము కలుగుచున్నదిగద.

ఉ॥ చంద్రునియొక్క వెన్నెలయని లోకవ్యవహారముండినను వెన్నెల చంద్రునివిడిచి వేరుగా నుండనట్లు బ్రహ్మముయొక్కశక్తియనినప్పటికి ఈశక్తి బ్రహ్మముకంటె వేరుకాదు.

ప్ర॥ నిత్యమయిన ఆత్మకు "శూన్యము, బ్రహ్మము, ప్రకృతి, మాయ, బ్రహ్మవిజ్ఞానము, శివుడు, పురుషుడు, ఈశానుడు," అనునామములు చెప్పబడినవి. కనుక నవశ్యము భేదము చెప్పవలసియున్నదిగద.

ఉ॥ చంద్రుడు, చంద్రిక (వెన్నెల) యనుః పదద్వయమున్నను చంద్రచంద్రికలకు భేదములేదని చెప్పబడెను. ఇట్లే బ్రహ్మము, శక్తి యనుపదద్వయమున్నను శక్తిబ్రహ్మములకు భేదములేశములేదు. శిష్యబోధకొరకు బ్రహ్మముయొక్క స్వరూపము చిచ్ఛక్తియని చెప్పబడెను. వాస్తవముగ చిచ్ఛక్తి బ్రహ్మమువలె నిత్యము, పరప్రకాశము, బ్రహ్మముకంటె వేఱుకానిదియు నైయున్నది. "నిత్యోనిత్యానాం" అనుశ్రుతి బ్రహ్మమువలెనే బ్రహ్మముకంటె భేదములేని శక్తియు నిత్యమేయని చెప్పుచున్నది. బ్రహ్మముకు చేయతగినకార్యములేదు. చేయుటకు సాధనములులేవు. బ్రహ్మముతో సమమయినదిలేదు. అధికమైనదిలేదు. బ్రహ్మముయొక్క ఉత్కృష్టమయి స్వభావ

సిద్ధమైన బ్రహ్మశక్తియే ఇచ్ఛా, జ్ఞాన, క్రియాదిరూపములుగ నున్నవని (నతస్య కార్యం=క్రియాచ) అనుశ్రుతి చెప్పుచున్నది. కనుక చిచ్ఛక్తి బ్రహ్మముకంటె నభిన్నము కాదనుటకు సందేహము లేదు.

" సైవేయం అనామాఖ్యా శ్రీవిద్యేతి " 4 ॥

సా తేజఃపుంజాకృతిశ్శక్తిరేవ అనామాఖ్యా శ్రీవిద్యా। " ఇయమేవ సా యా ప్రథమా వ్యౌచ్ఛదంతరస్యాం చరతి ప్రవిష్టా " ఇతిశ్రుతేః। అస్యార్థః॥ యా ఇయం ఇయమేవచిత్ సా అనామాఖ్యా ప్రథమా విద్యా వ్యౌచ్ఛత్। స్వచ్ఛా- నిర్మలా। ఏతావతా మాయా తత్కార్యసంబంధరహితా। అంతరస్యాం ప్రవిష్టాసతీ చరతి। అంతరస్యామంతరస్మిన్నిత్యనేన చిదాకాశేవా—స్థూలశరీరవిశిష్టలింగశరీరేషువా—నద్వితీయః। చిత్తాకాశం చిదాకాశం ఆకాశంచ తృతీయకం। ద్వాభ్యాం శూన్యతరం విద్ధి చిదాకాశం వరాననే। చిదాకాశస్య అంతరత్వభావాత్। "ఆత్మన ఆకాశస్సంభూతః" ఇతిశ్రుత్యా పంచభూతాత్మక ప్రపంచస్యాధారత్వాత్ప్రపంచమూలత్వాత్ చిదాకాశస్యాంతరస్మిన్ చరతీతి యుక్తం। లింగశరీరేషు తదయుక్తం। లింగశరీరేష్వీత్యనేన ప్రాదేశికత్వసంభవాత్। కించ। తథైవోక్తంచేజ్జీవస్య యథా అనిత్యత్వం తద్వదస్య చిదాకాశస్య ప్రపంచమూలత్వాదంతరత్వం నవక్తవ్యమితి భవద్భిర్యదుక్తం తదప్యసంగతం ప్రపంచమూలత్వాత్తస్య అంతరత్వాత్। ఏతావతైవ అనామాఖ్యవిద్యాయా అపరిచ్ఛిన్నత్వం సర్వకారణత్వముక్తం॥

తా॥ ఫలితమేమనగా:— తేజఃపుంజరూపయగు చిచ్ఛక్తియే అనామాఖ్య (నిర్గుణ) యను శ్రీవిద్య। ఈశక్తియేచిత్తు। అనా

మాఖ్యయను నామొదటివిద్య నిర్మలమయినది అనగా మాయ తోను మాయాకార్యములతోను సంబంధములేనిది. ఇదిఅంత రమందు ప్రవేశించి ప్రకాశించుచున్నది అని (ఇయమేవ సా= ప్రవిష్టా) యనుశ్రుతి చెప్పుచున్నది.

ప్ర॥ అంతరమనునది చిదాకాశాంతరమా, లేక స్థూలశరీర విశిష్టలింగశరీరాంతరమా?

ఉ॥ లింగశరీరాంతరముకాదు. ఏలయనగా, చిత్తాకాశము, చిదాకాశము, ఆకాశము అను నీమూడింటిలో అతిసూక్ష్మమగు చిదాకాశము శ్రేష్ఠమని శివుడు పార్వతితో చెప్పెను. ఈశక్తి ప్రపంచమునకు మూలమయి భూతాకాశమునకు ఆధారమును సర్వాంతరమునగు చిదాకాశముయొక్క అంతరమందు ప్రవే శించి చరించుచున్నదని చెప్పవలెను. లింగశరీరమగు చిత్తాకా శమందు ప్రవేశించి చరించునని చెప్పినపక్షమున శక్తికూడ పరి చ్ఛిన్నము, అనిత్యత్వము కావలయును. కావున చిదాకాశమం దే ప్రవేశించి చరించునని చెప్పవలయును.

ప్ర॥ అట్లుచెప్పునెడల జీవుడు నిత్యముకానట్లే ప్రపంచమున కుమూలకారణమయిన చిదాకాశమును నిత్యము కాకపోవల యును. గనుక చిదాకాశము అంతరములని చెప్పకూడదుగదా॥

ఉ॥ చిదాకాశము ప్రపంచమునకు మూలము. అది అంతర మునగుటవలనను, రెండవసూత్రభాష్యమునందు జీవుడు అని త్యుడనియు, చిదాకాశము నిత్యమనియు చెప్పుటవలనను, నీవు చెప్పినది సరికాదు. కనుక పరమార్థముచేత అనామాఖ్యవిద్య (శ్రీవిద్య) పరిచ్ఛిన్నముకానిది, సర్వకారణమయినది, యని సిద్ధాంతము.

శుభమస్తు.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాం నమః॥

# ఈశ్వరప్రత్యభిజ్ఞసూత్రములు

## అనగా శక్తిసూత్రములు.

శ్లో॥ నమశ్శివాయ సతతం పంచకృత్యవిధాయినే । చిదానంద ఘనస్వాత్మపరమార్థావభాసినే । శంకరోపనిషత్సార ప్రత్యభిజ్ఞామహోదధేః । ఉద్ధరామ్యామృతం సారం సంసారవిషశాంతిదం ॥ ఇహ యే కోమలమతయ స్తర్క శాస్త్రపరిశ్రమాః శక్తిపాతవశోన్మిషత్పారమేశ్వరసమావేశాభిలాషితాః కతిచిద్భక్తిభాజః । తేషాం ఈశ్వరప్రత్యభిజ్ఞోపనిషత్తత్వం మనాగున్మీల్యతే । తత్ర స్వాత్మదేవతాయాఏవ సర్వకారణత్వం సుఖోపాయప్రాప్యత్వం చాభివ్యక్తమాహ ॥ శ్రీం ॥

**చితిస్స్వతంత్రా విశ్వసిద్ధిహేతుః॥ (1సూ॥)**

విశ్వస్య సదసదాదేర్భూమ్యంతస్య సిద్ధౌ నిష్పత్తౌ ప్రకాశనే స్థిత్యాత్మని । పరప్రమాతృవిశ్రాంత్యాత్మని సంహారే పరాశక్తిరూపా । చితిరేవ భగవతీ స్వతంత్రా । అనుత్తరవిమర్శమయీ శివభట్టారికా విభిన్నా । హేతుః కారణం । అస్యాం ప్రసృతాయాం జగదున్మిషతి । వ్యవతిష్ఠతేచ । నివృత్తప్రసరాయాంచ నిమిషతీతి । విమర్శమయస్వభావసత్తానుభవపవాత్రసాక్షీ । అన్యస్యతు మాయాప్రకృత్యాదేః చిత్ప్రకాశాద్భిన్నస్యాఽప్రకాశత్వేన నక్వచిదపి హేతుత్వం । తస్య ప్రకాశమానత్వేతు ప్రకాశైకాత్మ్యాత్ । ప్రకాశరూపా చితిరేవ హేతుః । న త్వసౌ కశ్చిత్ । అతఏవ దేశకాలాకారఏవ । "తత్సృష్టా తదేవాను

ప్రవిశదితి ” నతత్స్వరూపం వక్తు మలమితి। వ్యాపకః నిత్యో దితపరిపూర్ణస్వరూపోయమిత్యర్థలభ్యమేవైతత్ । నను జగదపి చితోఽవభిన్నం కించిత్ । అభేదే కథం హేతుహేతుమద్భావః— ఉచ్యతే—చితిరేవ భగవతీ స్వతంత్రరూపా । తత్తదనుజగదాత్మనా స్ఫురతీత్యేతావాన్ పరమార్థోఽయం కార్యకారణభావః యతశ్చేయమేవ ప్రమాతృప్రమాణప్రమేయస్య విశ్వస్యసిద్ధౌ ప్రకాశనే హేతుః తతోఽస్యాః స్వతంత్రాపరిచ్ఛిన్నస్వప్రకాశరూపాయాః సిద్ధౌ అభినవార్థప్రకాశరూపం । న ప్రమాణవతక ముపయుక్తముపపన్నంవా సంభవతి। ప్రత్యుత వతత్సిద్ధ్యధీనా ప్రమాణాది విశ్వవస్తుసిద్ధిః। తదుక్తం శ్రీతంత్రాలోకే అస్మద్గురుభిః। “ ప్రమాణాన్యపి వస్తూనాం జీవితం యేవితన్వతే। తేషామపి వరోజీవః సఏవ పరమేశ్వరః” ఇతి। తంత్రసద్భావే। “స్వపదా స్వశిరచ్ఛాయాం యద్వల్లంఘితుమీహతే । పాదదేశేశిరోనస్యాత్తథేయం బైందవీకలేతి ” యతఇయమేవ విశ్వస్యసిద్ధౌ పరమాద్వయసామరస్యాపాదనాదాత్మనిచ సంహారే హేతుః। అతఏవ స్వతంత్రా। ప్రత్యభిజ్ఞాతా। స్వాతంత్ర్యాదపి భోగమోక్షరూపాణాం విశ్వసిద్ధీనాం హేతురితి వ్యాఖ్యేయం॥ అపి చ మాయావధేః విశ్వస్యాస్మిలనసుఖదుఃఖమహాదాది ప్రమాణాదికతయా సిద్ధిః ప్రమాణావరోహక్రమేణ విమర్శమయప్రమాతృ్రవేశః। సైవ హేతుః। తత్పరిజ్ఞానే ఉపాయో యస్యాః అనేనైవ సంబంధోపాయత్వముక్తం॥ తదుక్తం శ్రీవిజ్ఞానభైరవ భట్టారకే—“గ్రాహ్యగ్రాహకసంపత్తిః సామాన్యా సర్వదేహినాం। యోగినాంతు విశేషోయం సంబంధే సావధానతేతి ” “ఉదేతి శక్తిచక్రవిభవప్రభవమితి” శక్తిచక్రస్య రశ్మిపుంజస్య

యోవిభవః అంతర్ముఖో వికాసః తతఃప్రభవః । ఉదయోభివ్య క్తిర్యస్యేతి బహువ్రీహిణాంతర్ముఖతత్స్వరూపవినిపాతనాత్ । అయత్నేన పరమేశ్వరస్వరూపం ప్రత్యభిజ్ఞాతం భవతీత్యర్థః । చితిరిత్యేకవచనం దేశకాలాద్యనవచ్ఛిన్నమభిదధత్ సమస్తభేద వాదానాం అవాస్తవతాం వ్యనక్తి । స్వతంత్రశబ్దో బ్రహ్మాదేః వైలక్షణ్యమాచక్షాణో అస్యాశ్చితే ర్మాహేశ్వర్యసారతాం బ్రూతే । విశ్వేత్యాదిపదం అశేషశక్తిత్వ మహాకారణత్వ సుఖోపాయ ప్రాప్యత్వ మహాఫలప్రాప్యత్వం బ్రవీతి ॥

తా॥ కార్యమైన జగత్తు ప్రకాశవిమర్శాత్మకమై కారణముగు చిత్తువలననే పుట్టి దానియందే లయమగుచున్నది. కాని శుద్ధపరమాత్మయందు విశ్రాంతిరూపమగు ముక్తి సర్వోత్తమమగు చిచ్ఛక్తివలననే కలుగుననియు, ఈచిచ్ఛక్తి బ్రహ్మముకంటె వేఱుకాదనియు, తెలియుటకు విమర్శరూపసాక్షాత్కారమే నిదర్శనము. జడమగు మాయాప్రకృత్యాదికము చిచ్ఛక్తి సహాయమువలననే ప్రకాశించుచు జగత్తునకు కారణమగును. కనుక నాచిచ్ఛక్తియే కార్యకారణరూపముగ పరిణమించును. ఈచిచ్ఛక్తి జగత్తును సృజించి జడమగు నీప్రపంచము ఏపనినిం జేయజాలదని దయతో తానందుప్రవేశించెనని "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనుశ్రుతి చెప్పుచున్నది. జగత్తుయొక్క సృష్టిలయములకు సాక్షియగు చిచ్ఛక్తి నిత్యము, పరిపూర్ణమునై యున్నది. జగత్తు తనకుకారణమగు చిత్తుకంటె వేఱుకాదు. ఒకవస్తువునే కార్యమని కారణమని యెట్లుచెప్పవచ్చుననగా ప్రమాత, ప్రమాణము, ప్రమేయము అను త్రిపుటికలుగుటకును, స్ఫురించుటకును ఈచితియే కారణము గనుక వ్యాప్తిక ఘ

టాకారముగ పరిణమించినట్లు చితియే జగదాకారముగ పరిణమించును. ఘటము మృత్తుకంటె వేఱుకాక మృత్తేకద. ఒక్కకుండనే ఘటాత్మనాకార్యమనియు, మృదాత్మనా కారణమనియు, విమర్శించునవుడు చెప్పదగును. ఇట్లెవిమర్శింపగా జగదాత్మనా కార్యమనియు, చిదాత్మనా కారణమనియు చెప్పకతప్పదు. కావున స్వతంత్రము, స్వప్రకాశము, దేశకాలవస్తునియమములేక యన్నిచోట్ల నెల్లకాలమున నన్నివస్తువులయందు వ్యాపించియున్న చిచ్ఛక్తియే, సకలజగత్తునందున్న ప్రకాశము కాని జగత్తునకన్యప్రకాశములేదు. ఈచిత్తువలననే ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయములు సిద్ధించినవి. ప్రమేయములగు సకల పదార్థములును ప్రత్యక్షము, అనుమానము మొదలగు ప్రమాణములచేత తెలిసికొనుచు ప్రమాతలనబడు జీవులకంటె నుత్తమమగు పరదేవతయొకటిగలదని తంత్రాలోకమను గ్రంథమున చెప్పబడెను. తననీడయందున్న తలనుఁ తనకాలినీడచే మీరిపోవుట యెంతఅసాధ్యమో సకలమునకు కారణమగు నీచిచ్ఛక్తిని కార్యవర్గములోనేదియు మీరుట అంతఅసాధ్యమనితంత్రసద్భావమునందు చెప్పబడెను. విశ్వసిద్ధికిని, పరమాత్మైక్యసంపాదనమునకును, చిచ్ఛక్తియే ముఖ్యకారణము. ఈచిచ్ఛక్తివలననే భక్తులకు నిరతిశయానందరూపముక్తియు, సకలభోగములు, సకలసిద్ధులు నొకజన్మముననే మిగులసులభమగును. సకలజనులు బహిర్వృత్తులచే బాహ్యమును తెలిసికొనునట్లు యోగులు అంతర్ముఖమగు ధీవృత్తిచేత నీనిరతిశయజ్ఞానమునుపొందుదురు ఈచిచ్ఛక్తి దేశకాలవస్తుకృతపరిచ్ఛేదములేక పరిపూర్ణ (అఖండాకార) ముగ నున్నదనేయర్థమును బోధించెడి "చితిః" అను

ఏకవచనము చేత భేదవాదములు కల్పితములే కాని వాస్తవము లుకావని స్పష్టపడుచున్నది. సృష్ట్యాది కార్యములందు నీచిచ్ఛక్తి బ్రహ్మాదులను నియమించునదియు, తాను ఇతరులచేత నియమింపబడనిదియు, సకలశక్తులుగలిగి మహాకారణమయిన దియు, సులభోపాయముగ మహాఫలములనిచ్చునదియు, స్వతంత్రియు నగుటచే విశ్వసిద్ధికి హేతువని చెప్పబడెను. 1.

అ॥ నను యదివిశ్వసిద్ధౌ చితిర్హేతుః తదస్యా ఉపాదానాద్య పేక్షాయాం అభేదవాదపరిత్యాగస్స్యాదిత్యాశంక్యాహ—

స్వేచ్ఛయా స్వభిత్తౌ విశ్వమున్మీలయతి ॥ 2 ॥

వ్యా॥ స్వేచ్ఛయా నతు బ్రహ్మాదివదన్యేచ్ఛయా। తథైవ చ నతూపాదానాద్యపేక్షయా। ఏవంహి ప్రాగుక్తస్వాతంత్ర్య హాన్యాదిక మేవ నఘటతే। స్వభిత్తౌ నత్వన్యత్ర క్వాపి ప్రాక్నిరతం విశ్వం దర్పణనగరవదభిన్నమపి భిన్నమివోన్మీలయతి। అవభాస యతి। ఉన్మీలనంచ అవస్థితస్యైవ ప్రకటీకరణమిత్యనేన జగతః ప్రాకాశైక్యాత్మ్యేన అవస్థానముక్తం॥

తా॥ ఆ॥ విశ్వసిద్ధికి చిద్రూపము కారణమనునెడల నుపాదా నాదికారణముల నపేక్షించుటచేత నద్వైతమునకు భంగము కలుగునందువా వినుము.

చిచ్ఛక్తి స్వేచ్ఛచేత పూర్వముతనయందు బీజరూపముగ నున్న ప్రపంచమునే సృష్టిమూలముగ ప్రకటనచేయుచున్నది. కాని బ్రహ్మాదులవలె అన్యులయొక్క యిచ్ఛచేతగాని, యితర కారణములచేతగాని సృజించుటలేదు. కనుక పూర్వమాత్రము నందు చిచ్ఛక్తి స్వతంత్రమయినదని చెప్పినదానికి బాధలేదు. అద్దమునందు కనబడు పట్టణము వేఱుకాకున్నను వేఱుగాకనబ

చునటుల చిచ్ఛక్తియందున్న ప్రపంచము చిచ్ఛక్తికంటె వేఱు కాకున్నను వేఱుగానున్నటుల కనుపించుచున్నది.

అ॥ అథ విశ్వస్వరూపం విజ్ఞానేన ప్రతిపాదయితుమాహ-

తన్నానారూపం గ్రాహ్యగ్రాహకభేదాత్ ॥ 3 ॥

వ్యా॥ తద్విశ్వం నానా అనేకరూపాణాం పరమేశ్వరాచిత్యే నావస్థితానాం గ్రాహ్యాణాం గ్రాహకాణాంచ భేదాద్వైచిత్ర్యాత్ । తథాచ । శ్రీసదాశివతత్త్వే॥ అహంతాఛాదితాంతస్ఫుటేదంతాహంతామయం యాదృశం పరాపరరూపం విశ్వం గ్రాహ్యం । తాదృగేవ శ్రీసదాశివభట్టారికాధిష్ఠితో మంత్రమహేశ్వరాఖ్యః ప్రమాతృవర్గః । పరమేశ్వరేణ కల్పితావస్థానం ఈశ్వరతత్త్వే స్ఫుటేదంతాహంతా సామానాధికరణ్యాత్మతయా యాదృశం విశ్వం గ్రాహ్యం । తథావిధఏవేశ్వరభట్టారకాధిష్ఠితో మంత్రేశ్వరవర్గో విద్యాపదే శ్రీమదనంతభట్టారకాధిష్ఠితబహుశాఖాంతరభేదభిన్నః। యథాభూతమంత్రాః ప్రమాతారః తథాభూతమేవ భేదైకవాదం విశ్వం ప్రమేయం । తత్రాపి సకలప్రళయకాలాత్మకపూర్వావస్థోపలితమిహం ప్రమేయం । మాయాయాం శూన్యమాత్రూణాం ప్రళయకాలీనాం ప్రాచీనతంత్రలీనకల్పం ప్రమేయం । సకలస్య మాయాహేతుతయా యాదృక్ శాబ్దవిజ్ఞానకలాకర్తృత్వశూన్యశుద్ధబోధాత్మా తాదృగేవ శివాది క్షిత్యంతసకలతత్త్వకలితం స్వాత్యంతాభేదసారం ప్రమేయం ఉత్తీర్ణం । శివభట్టారకస్య ప్రకాశైకవపుషః ప్రకాశైకరూపాణాం అభేదాత్ । నచ వస్తుతః స్వాన్యద్గ్రాహ్యం గ్రాహకంవా ॥ అపితు పరమశివభట్టారకఏకఏవ సిద్ధం । నానావైచిత్ర్యసహస్రైరనేకైః స్ఫురతీత్యభిప్రాయః। యథాభగవాన్

విశ్వశరీరః తథా చితిస్సంకోచాత్మనా సంకుచితవిశ్వమయః । శ్రీమత్పరమశివః స్వాత్మైక్యేన స్థితం విశ్వం శ్రీసదాశివాద్యం చితేన రూపేణావభాసయిష్యతి । పూర్వం చిదైక్యఖ్యాతిమాశ్రిత్య శివపర్యాయశూన్యాతిశూన్యాత్మతయా ప్రకాశావభేదేన ప్రకాశమానతయా స్ఫురతి । తతశ్చిద్రసాశ్యానతారూపాశేషతత్త్వభువనభావాత్ । ప్రమాత్రాద్యాత్మకతయాపి ప్రథతే । తథాచైవం భగవత్సిద్ధాంతవచనం॥ "విగ్రహోఽవిగ్రహశ్చైవ సర్వవిగ్రహవిగ్రహః" ఇతి । త్రిశిరోమతేపి— "సర్వదేవమయః కాయః తచ్చేదానీం శృణు ప్రియే । పృథివీకఠినత్వేన ద్రవత్వేంభః ప్రకీర్తితః॥ ఇత్యుపక్రమ్య త్రిశిరో భైరవస్సాక్షాద్వ్యాప్య విశ్వం వ్యవస్థితః" ఇత్యంతేన గ్రంథేన గ్రాహకస్య సంకుచిత విశ్వమయత్వమేవ వ్యవహరతి । అయంచాత్రాశయః । గ్రాహకోప్యేవం ప్రకాశైకాత్మ్యేన ఉక్తాగమయుక్త్యా విశ్వశరీరశివైకరూపఏవ । కేవలం తన్మాయాశక్త్యా అభివ్యక్తస్వరూపత్వాత్ సంకుచితఇవ భాతి । సంకోచేపి విచార్యమాణశ్చిదైకాత్మ్యేన ప్రథానత్వాచ్చిన్మయఏవ । అన్యథా సకించిత్ । సర్వో గ్రాహకోపి విశ్వశరీరశివభట్టారకఏవ । తదుక్తం మయైవ । "అఖ్యాతిర్యది నఖ్యాతిః ఖ్యాతిరేవావశిష్యతే" ఇతి । అనేనైవాశయేన శ్రీమత్స్పందశాస్త్రే॥ "యస్మాత్సర్వమయోజీవ ఇత్యుపక్రమ్య తస్మాత్సర్వసముద్భవః । తత్సంవేదనరూపేణ తాదాత్మ్యప్రతిపత్తితః । తత్వం శబ్దార్థచింతాసు సావస్థానతయాశివః" ఇత్యంతేన గ్రంథేన శివజీవయోరభేదఏవోక్తః । ఏతత్తత్త్వవిజ్ఞానమేవ జీవన్ముక్తిః । ఏతత్తత్త్వాఽపరిజ్ఞానమేవ బంధఇతి భవిష్యత్యేతత్ ॥

తా॥ అ॥ ప్రపంచస్వరూపము నిరూపింపబడుచున్నది.

పరదేవతావిలాసమువలన గలిగిన యీప్రపంచము దేవ తిర్యఙ్మనుష్యాది భేదమువలన బహురూపముగనున్నది. సృష్టి కాలమునందు స్థూలమయిన ప్రపంచము పూర్వము బ్రహ్మము నందు బీజరూపముగ అణగియుండి కారణముగను, తరువాత కార్యప్రపంచముగను చూడబడునట్లే సదాశివాది పురుషబోధకమయిన మంత్రములును, పంచదశ్యాది శ్రీవిద్యలును, చతుర్దశవిద్యలును, చతుఃషష్టివిద్యలును, శాఖాభేదముచేత భిన్నములయినను పరదేవతాబోధకములగుటచేత పరదేవతాస్వరూపములేయనియు, ప్రమేయ (తెలియబడునది) మగు ప్రపంచమును ప్రమాత (తెలిసికొనెడి) లగు జీవులును ప్రళయకాలమున సర్వకారణమగు బ్రహ్మమునందణగియుండి తిరిగి సృష్టికాలమందు బ్రహ్మాది స్థావరాంతప్రపంచము పూర్వప్రకారమే కలుగుచుండుననియు, ప్రకాశ్య (ప్రకాశింపజేయబడునది)మగు ప్రపంచము ప్రకాశ(ప్రకాశింపజేయు)మగు ఆత్మకంటె నన్యము కానందున ప్రపంచమంతయు పరదేవతాస్వరూపమేయనియు, ఇవి ప్రమేయములు (గ్రహింపబడునవి) వీరు ప్రమాతలు (గ్రహించువారు) అను వ్యవహారభేదము కల్పితముకాని వాస్తవముకాదనియు, అతిస్ఫుటమగు ప్రపంచమునందు భగవంతుడంతర్యామిగ నుండునట్లు సకలోపాధులయందును చిత్స్వరూపాత్మ రూపముగ నుండుననియు, సృష్టికిపూర్వము చిదాకారము, అఖండాకారము నగు పరశివుడు సృష్టికాలమందు సదాశివాది నామములుగలిగి తనకంటె నన్యముకాని ప్రపంచమును ప్రకాశింపజేయుననియు, సదాశివతత్వమయిదు చెప్పబడెను. ఇట్లే భక్తానుగ్రహముకొరకు లలితాకారయగు పరదేవత నిర్గుణావస్థ

యందు రూపములేనిదియయినను సగుణావస్థయందు జగద్రూపముచేతనే రూపముగలదియై ప్రకాశించునని భగవత్సిద్ధాంతవచనము. స్థూలాకారముగల భూమియందు కాఠిన్యాంశముగను, స్థూలజలమందు ద్రవాంశముగను ఇట్లే తనమాయాశక్తి చేత కల్పింపబడిన సకలస్థూలప్రపంచమునందును బ్రహ్మమునూత్మరూపముగ వ్యాపించియున్నందున విమర్శించునపుడు ప్రపంచము చిన్మయమేకాని వేఱుకాదని త్రిశిరోమతగ్రంథమునందు చెప్పబడెను. చెప్పబడెడి జీవులు స్వనామమునువిడిచి బ్రహ్మమే యగునని యానూత్రిభాష్యకర్తచేత చెప్పబడెను. ఈఅభిప్రాయముచేతనే బంధశాస్త్రమునందు "జీవేశ్వరులకు అభేదము చెప్పబడినది. ఇట్లు తత్వమును విమర్శించుటయే జీవన్ముక్తి. విమర్శించి తెలిసికొనకపోవుటయే సంసారబంధము." ఇతి ॥

అ॥ నను గ్రాహకోయం వికల్పమయః వికల్పనంచ చిత్తహేతుకం సతి చిత్తే కథమస్య శివాత్మకత్వమితి శంకిత్వా చిత్తమేవ నిర్ణేతుమాహ—

సూ॥ చితిరేవ చేతనపదాదవరూఢా చైత్య
సంకోచినీ చిత్తం ॥ 4 ॥

వ్యా॥ నచిత్తం నామాన్యత్కించిత్। అపితు సైవ భగవతీ తథాహి యా యదా స్వరూపం గృహిత్వా సంకోచం గృహ్ణాతి తదా ద్వయీగతిం కదాచిదుల్లసితమపి సంకోచం గుణీకృత్య చిత్ప్రాధాన్యేన స్ఫురతి। కదాచిత్సంకోచప్రధానతయా చిత్రప్రాధాన్యాపేతయా చిత్తప్రధానమాతా। తత్రాపి క్రమేణ సంకోచాంశప్రధానతయా ఈశ సదాశివాద్యాశ్రితరూపతా సమాధిప్రయత్నోపార్జితే చిత్ప్రాధాన్యే శుద్ధాత్మప్రమా

త్రృతా। క్రిమాత్కర్మపరిక ర్షావతి సంకోచాంశ ప్రాధాన్యే నరా న్యాది ప్రమాతృతా। ఏవంస్థితే చితిరేవ సంకుచితగ్రాహకరూ పా చేతనపదాధిరూఢా। అర్థగ్రహణోన్ముఖేసతి చైత్యే నీలసు ఖాదిజ్ఞానే సంకోచేన వ్యుభయసంకోచాసంకుచితత్వే నచిత్తం। తథాచ స్వాంగరూపేషు భావేష్వపి ఇచ్ఛా, జ్ఞాన, క్రియాచ, యా మాయా తావేవ పశోస్సత్వరజస్తమః ఇత్యాదినా స్ఫురతి స్వాతంత్ర్యాచ్చితిరేవ భగవతీచ్ఛాజ్ఞానక్రియా మాయా శక్తి రూపా। పశుదశాయాం సంకోచపరిక ర్షాత్ సత్వరజస్తమస్స్వ భావచిత్తాత్మతయా స్ఫురతీతి శ్రీమదీశ్వరప్రత్యభిజ్ఞాయాముక్తం అతఏవ శ్రీతత్వగర్భే "వికల్పదశాయామపి తాత్వికస్వరూప సద్భావాత్" మదనుసరణాభిప్రాయేణోక్తం। అతఏవ యే కేచిదపరమార్గానుసారిణః తేషామేవ స్వరూపస్య స్వజ్యోతి ష్ట్వం నవిద్యతే। ఇదమేవమాయాప్రమాతృస్వరూపమిత్యాహ॥

అ॥ జీవుడు వికల్పమయుడును, వికల్పమునకు చిత్తముకార ణమును గద. చిత్తముండగా జీవునకు బ్రహ్మత్వమెట్లుకలుగు నండువా— వినుము.

తా॥ చిత్తమనునది చిచ్ఛక్తిరూపమేకాని వేఱుకాదు. అఖం డాకారము, కారణము నగు చిచ్ఛక్తి ప్రపంచాకారముగ పరి ణమించునపుడు ఆయాయుపాధులయందు సూక్ష్మరూపముగ నుండినను విమర్శించునపుడు ఈశసదాశివాదులచేతనుకూడ సే వింపబడుచుండును. కాని బహిర్వృత్తులులేకుండ నిరంతరమగు సమాధియందు చిచ్ఛక్తియే ప్రధానమగుటవలన శుద్ధాత్మరూ పముగ స్ఫురించును. జీవరూపముతో శబ్దాదివిషయములను గ్రహించుచు సుఖదుఃఖాదిజ్ఞానములయందు తాను సూక్ష్మ

రూపముగ నుండుటచే కార్యకారణముల రెండింటియందును చిద్రూపముగానే యున్నదికాని చిత్తరూపముగ నుండలేదు. జీవాది ఉపాధులనుబట్టి ఖండాకారము వచ్చినదేకాని వాస్తవముకాదు. స్వతంత్రియగు చిచ్ఛక్తి ఇచ్ఛాజ్ఞానక్రియాస్వరూపమాయయై తాను సృజించిన జీవరాసులయందు సత్త్వరజస్తమోగుణస్వభావక చిత్తరూపముగ స్ఫురించునని ఈశ్వరప్రత్యభిజ్ఞాసూత్రములందును, వివిధజగదాకారముగనున్నపుడును చిద్రూపభావనయుండుటచే చిచ్ఛక్తికి లోపములేదని శ్రీతత్త్వగర్భమను గ్రంథమందును చెప్పబడినది. కాని మాయాశక్తిచేత మోహితులగువారు పరమార్థదృష్టిలేకపోవుటచే నీచిద్రూపమును కానలేరు.

సూ॥ తన్మయో మాయా ప్రమాతా ॥ 5 ॥

వ్యా॥ దేహప్రాణపదం యావత్ తావత్ చిత్తప్రధానమేవ। శూన్యభూమిరపి చిత్తసంస్కారమేవ। అన్యథా తతో వ్యుత్థితస్య స్వకర్తృకానుభావనాఽభావస్స్యాదితి। చిత్తమయఏవ మాయామయః ప్రమాతా। అనేనైవాశయేన శ్రీశివసూత్రేషు ॥ “వస్తువృత్త్యను సారేణ చిత్తాత్మేత్యభిసంధాయ ప్రమాతృలక్షణావసరే పునశ్చిత్తమాత్మేత్యుక్తం అస్యైవ సమ్యక్స్వరూపజ్ఞానం సర్వతో ముక్తిః। అసమ్యక్త్వేతు సంసారః” ॥ 5 ॥

తా॥ నాదేహము, నాప్రాణమననెడి భావన యుండునంతవరకు చిత్తరూపమే ప్రధానము. శూన్యభూమి (సుషుప్త్యాది) యందును చిత్తసంస్కారమే లీనమైయుండును. అట్లుకానియెడల సుషుప్తినుండిగాని, సమాధినుండిగాని లేచినవానికి పూర్వస్మృతి కలుగకపోవును. మాయామయుడగు జీవుడు చిత్తస్వ

రూపుడే. వ్యవహారదశయందు చిత్తప్రధానులగు జీవులు సమాధియందు చిత్తలరసమువలన చిద్రూపబ్రహ్మమే యగుదురు అని శివసూత్రములందును చెప్పబడెను ఈవిమర్శమునకే ముక్తియని పేరు. ఈజ్ఞానములేకపోవుట సంసారకారణము

అ॥ తతఏతత్స్వరూపత్వం నిర్వక్తుమాహ—

సూ॥ సచైకో ద్విరూప స్త్రిరూపః।
చతురాత్మా సప్తపంచస్వభావః ॥ 6 ॥

వ్యా॥ నిర్ణీతదశాయాం చిదాత్మా, శివభట్టారక, ఏకఏవాత్మా। నాన్యఃకశ్చిత్ । ప్రకాశస్య కాలాదిభిర్భేదాయోగాత్। జడస్య గ్రాహకానుపపత్తేః। ప్రకాశఏకఏవచ। యతస్స్వాతంత్ర్యాద్గృహీతప్రాణాది సంకోచ సంకుచితార్థగ్రాహకతామశ్నుతే। తతోఽసౌ ప్రకాశరూపసంకోచభావనత్వే ద్విరూపః। ఆణవ మాయిక, కార్మికమలావృతత్వాత్త్రిరూపః। విశ్వ, శూన్య, ప్రాణ, పుర్యష్టకశరీరస్వభావత్వాచ్చతురాత్మా। సప్తపంచక ఇతి। శివాది పృథ్వ్యంతాని పంచత్రింశత్తత్వాని తత్స్వభావమయః। తథాచ శివాది కళాంతప్రమాతృస్వభావత్వేన సప్తకభావః। చిదానందేచ్ఛాజ్ఞానక్రియాశక్తిరూపత్వేఖ్యాతివశాత్ విద్యా, రాగ, కాల, నియతి, పురుష, కంచుకవలితత్వాత్ పంచకస్వభావః। ఏవంచ శివైకత్వేన, పంచత్రింశత్తత్వమయత్వేన, చిదాదిశక్తిపంచకస్వభావత్వేన, ప్రమాతృసప్తకభావత్వేన, చాయం ప్రత్యభిజ్ఞాతస్సర్వముక్తిదః। అన్యథా సంసారహేతుః ॥ 6 ॥

తా॥ ప్రకాశస్వరూపమునకు కాలాదికృతభేదములేదు. జడవస్తువునకు స్వతఃప్రకాశములేదు. కావున నన్నికాలములందు

ను స్వయంప్రకాశమగు చిదాత్మయొకటియే. పరిపూర్ణము, స్వతంత్రము, నిర్గుణము నగు నీచిచ్ఛక్తి సత్త్వరజస్తమోగుణములను గ్రహించి సగుణమయి ప్రాణాదులను, దేహాదులను దాల్చుటచే ద్విరూపయు, ఆణవ, మాయిక, కార్మికమలముల సంబంధముచే త్రిరూపయు, విశ్వ, శూన్య, ప్రాణ, పుర్యష్టకములనెడి యుపాధులచేత చతురాత్మయు, సగుణబ్రహ్మ మొదలుకొని పృథివివరకుగల 35 తత్త్వరూపములను బొందుటచే పంచత్రింశదాత్మకయు, శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య మాయ, కల యనెడి తత్త్వరూపములచే సప్తాత్మయు, చిత్తు, ఆనందము, ఇచ్ఛ, జ్ఞానము, క్రియ అనురూపములతో విద్య, రాగము, కాలము, నియతి, పురుషుడు ననుపంచకవచములను దాల్చుటచే పంచాత్మకయు నగును. ఈవిమర్శమునకే ముక్తియని పేరు. ఈజ్ఞానములేకపోవుటయే సంసారకారణము.

ఏవంచ—సూ॥ తద్భూమికాస్సర్వదర్శనస్థితయః ॥ 7 ॥

వ్యా॥ సర్వేషాం చార్వాకాది దర్శనానాం యా స్థితయః సిద్ధాంతాః। తస్యైవాత్మనో సత్త్వస్యైవ । స్వేచ్ఛాగృహీతాః కృత్రిమభూమయః। యథా । చైతన్యవిశిష్టశరీరమాత్మేతి చార్వాకాః । నైయ్యాయికాదయో జ్ఞానాది గుణగణాశ్రయం బుద్ధితత్త్వప్రాయమేవ ఆత్మానం సంసృతౌ మన్యంతే । అపవర్గే తు తదుచ్ఛేదశూన్య ప్రాయమేవేతి । అహం ప్రత్యయవేద్యః సదైవ సుఖాద్యుపాధితిరస్కృతఆత్మేతి మీమాంసకాః । బంధాదేవ నిమిషాః । జ్ఞానసంతానమేవ తత్వమితి సౌగతాః బుద్ధివృత్తిష్వేవ పర్యవసితః । ప్రాణఏవాత్మేతి శ్రుత్యంతరవిదః కేచిత్ । అసదేవేదమగ్రఆసీదితి అభావబ్రహ్మవాదినః, శూన్య

మేవ గృహీత్వా స్థితాః। మాధ్యమికా అప్యేతమేవ। పరా ప్రకృతిర్భగవాన్ వాసుదేవః తద్విస్ఫులింగప్రాయాః సర్వేజీవా ఇతి పాంచరాత్రాః। పరస్యాః పరిణామాభ్యుపగమాదవ్యక్త ఏవాభినివిష్టాః। సాంఖ్యాదయస్తు విజ్ఞానకలికాభూమిమవలంబతే। "సదేవ సోమ్యేదమగ్రఆసీత్" ఇతి ఈశ్వరతత్త్వమాశ్రితాః అపరే శ్రుత్యంతవిదః శబ్దబ్రహ్మమయం మహాపశ్యంతీమయం ఆత్మతత్త్వమితి వైయాకరణాః శ్రీసదాశివపదమధ్యాసితాః। ఏవమన్యదప్యనుసర్తవ్యమితి। అత ఆగమేషు విశ్వమయమితి కులామ్నాయనివిష్టాః। విశ్వోత్తీర్ణవిశ్వమయమితి త్రికలాదిదర్శనం। ఏవం ఏకస్య చిదాత్మనో భగవతస్స్వాతంత్ర్యాదవభాసితాః। సర్వా ఇమా భూమికాః అస్వాతంత్ర్యాత్ ప్రచ్ఛాదనోన్మీలనతారతమ్యేన తత్రవ్యాప్తిసారతాన్వితాయాం అవ్యక్తరూపాం మహావ్యాప్తిం పరాశక్తిపాతంవినా నలభంతే। తథోక్తం—వైష్ణవాద్యాస్తు యే కేచిత్ విద్యారాగేణ రంజితాః। నవిందంతి పరందేవం శివం పరమకారణం। భ్రమయత్యేవతం మాయా వ్యామోహహా మోక్షలిప్సయా। ఏతే చోపాసకాస్సర్వే నగచ్ఛంతి పరంపదం॥ అపిచ సర్వేషాం దర్శనానాం సమస్తానాం నీలసుఖాది జ్ఞానానాం స్థితయోంతర్విశ్రాంతిస్థానభూమికాః। చిదానందఘనస్వాత్మరూపాభివ్యక్త్యుపాయాః। తథాహి, యథాయథా బహిర్ముఖం స్వస్వరూపే విశ్రామ్యతి తథాతథా బాహ్యప్రపంచోపసంహారః। అంతఃప్రశాంతిపదవ్యవస్థితిః తదుద్దేశ్య సంవిత్తత్త్వసూత్రేణ సృష్టిస్థితిసంహారరూపేయం తురీయసంవిద్భట్టారికా తత్ర సృష్ట్యాదిభేదాన్ ఉద్వమతి। తదా పూర్ణాచ కృశాచ భవతీత్యేషాభట్టారికా క్రమాత్మకమను

శీల్యమానా స్వాత్మసాత్కరోతీత్యేవ భక్తిభాజం ॥ 7 ॥

తా॥ చార్వాకాది సర్వమతసిద్ధాంతములును ఆత్మరూపమే కాని వేఱుకాదు. ఆసిద్ధాంతములు స్వేచ్ఛగా గ్రహింపబడిన కృత్రిమభూమికలు. చైతన్యముతోకూడిన శరీరము ఆత్మయని చార్వాకులును, జ్ఞానాదిగుణములతోకూడి బుద్ధితత్వరూపముయిన ఆత్మయే సంసారకారణమనియు, అట్టిగుణాభావమే ముక్తియనియు. తార్కికులును, అహం అనుజ్ఞానముచేత తెలియబడుచు సర్వదా సుఖాద్యుపాధులచే తిరస్కరింపబడునదే ఆత్మయని మీమాంసకులును, బంధత్యాగమే ఆత్మయని క్షణికులును, జ్ఞానపరంపరయే ఆత్మయని సౌగతులును, ప్రాణమే ఆత్మయని కొందఱువైదికులును, "అసదేవ ఇదమగ్రఆసీత్" అను శ్రుతి వలన ఈజగత్తు సృష్టికిపూర్వము శూన్యబ్రహ్మమని అభావవాదులును, శూన్యమాత్రమే......మాధ్యమికలును, సమస్తజీవులు పరాప్రకృతిస్వరూపమగు భగవంతుడైన వాసుదేవుని యొక్క కిరణములని పాంచరాత్రులును, పరిణామమువలన అభివ్యక్తమయినను పూర్వము అవ్యక్తమగు పరాశక్తియే ఆత్మయని సాంఖ్యులును, "సదేవ సోమ్యేదమగ్రఆసీత్" అనుశ్రుతి వలన ఈజగత్తు సృష్టికిపూర్వము సద్రూపముగానున్నదని అద్వైతులును, సదాశివపదమును విడిచిపెట్టి శబ్దబ్రహ్మమయము, మహాపశ్యంతీమయము అనునదే ఆత్మతత్వమని వైయాకరణులును, ఆగమములచే విశ్వమయమని కులామ్నాయులును, విశ్వము తనంతటతానేపుట్టినదనియు, విశ్వమయమనియు త్రికలాదులును చెప్పుదురు. ఇట్లనేకమతములు చిదాత్మయగు భగవంతుని స్వాతంత్ర్యమువలన ననేకవిధములుగ భాసించుచున్నది

ఈభూమికలేవియు స్వతంత్రములు కానివియు, అవ్యక్తరూప ము మహావ్యాప్తిరూపము నగు పరాశక్తియొక్క ఆరాధనవల ననే పొందబడును. జ్ఞానాదులు కొందరు మాయచేత మో హపడి తమమతమందనురాగము చేత మోక్షకారణమైనబ్రహ్మ మును తెలిసికొనలేరు. సమస్తమతసిద్ధాంతములు బాహ్యసుఖ దుఃఖములను ఉపేక్షించి అంతర్ముఖుడై విశ్రమించుటకును, చిదానందస్వాత్మరూపమును తెలిసికొనుటకును, ఉపాయములుగ నున్నవి. బహిర్ముఖమగు బుద్ధిని ఆత్మరూపమందు విశ్రమింప చేయుటచే బాహ్యప్రపంచవృత్తులు నశించును. కనుక శాంతి మార్గముకొఱకు సృష్టిస్థితిసంహారరూపయగు చిచ్ఛక్తిని తెలి పెడి యీసూత్రములు చెప్పబడినవి. తురీయసంవిద్భట్ట తురీ యాతీత చిచ్ఛక్తియె సృష్టిమొదలగువానిని చేయుచు పూర్ణ బ్రహ్మముగానున్నది. ఈపరదేవత భక్తిధ్యానాదులచే క్రమ క్రమముగవిమర్శింపబడినదై భక్తులకుఆత్మైక్యసుఖమునిచ్చును.

అ॥ నను యద్యేవం భూతస్యాత్మనో విభూతిః తత్కథం మాయామలాన్వితో అణుఃకలాదికలితః సంసారీభవతి, అభిధి య్యత ఇత్యాహ

సూ॥ శక్తిసంకోచమలావృతస్సంసారీ యదా
చిదాత్మా పరమేశ్వరః ॥ 8 ॥

వ్యా॥ యదా స్వాతంత్ర్యాదివ్యాప్తినిమజ్జనేన భేదవ్యాప్తి మవలంబతే। తదానీం యా ఇచ్ఛాదిశక్తయః సర్వజ్ఞత్వాద యో ఒసంకుచితాఅపి సంకోచవత్యో భవంతి। తథాచాపరిమి హతస్వాతంత్ర్యరూపేచ్ఛాశక్తి సంకుచిత సత్యపూర్ణమన్యతమ రూపం ఆణవమలం। జ్ఞానశక్తిః క్రమేణ సంకోచవతీ సర్వజ్ఞత్వ

కించిజ్ఞత్వాంతఃకరణబుద్ధీంద్రియతాపత్తిపూర్వక మర్థసంకుచిత గ్రహణే భిన్నం చేత్యపరిధానరూపం మాయికమలం। క్రియా శక్తిః క్రమేణ సంకోచవతీ సర్వకర్తృత్వ, పూర్ణత్వ, నిత్యత్వ, వ్యాపకత్వ శక్తయః అసంకోచగ్రహణే యదా క్రమాత్ విద్యా రాగ కాలనియతి రూపతయా భవంతి తదా కార్మికం। ఏవంవిధశ్చాయం శక్తిమాన్ సంసారీత్యుచ్యతే। స్వశక్తివికాసే శివఏవ ॥ 8॥

తా॥ చిదాత్మకు ప్రపంచరూపోపాధిసంబంధమువలన పరిచ్ఛేదముకలుగగా ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు సంకుచితములై యాణవాదిమలములుగ మారును. ఎట్లనగా:—

1 పరమేశ్వరుని ఇచ్ఛాశక్తి పరిపూర్ణము, స్వతంత్రము, దేనిచేతను నివారింపబడుటకు శక్యముకానిదిగనున్నను, ఉపాధి సంబంధముచేత పరిచ్ఛేదము, పరతంత్రము, నివారణీయము నగుటయే ఆణవమలము.

2 సర్వజ్ఞమగు పరమేశ్వరుని జ్ఞానశక్తి బుద్ధీంద్రియాద్యంతఃకరణసంబంధమువలన సంకుచితమై కించిద్జ్ఞము (కొంచెము నెరుగుట) అగుటయే మాయికమలము.

3 సర్వకర్త, పూర్ణము, నిత్యము, వ్యాపకము నగు పరమేశ్వరుని క్రియాశక్తి సంకుచితమై విద్యా, రాగ, కాల, నియతి, రూపముగ మారుటయే కార్మికమలము. ఆణవాది మలావృతుడై ఉపాధులయందుండు జీవుడే చిచ్ఛక్తివికాసమువలన శివుడగును.

అ॥ నను సంసారావస్థాయాం అస్యకించిత్ శివోచితమభిజ్ఞానమస్తి। ఏకశివఏవ తథావస్థిత ఇత్యదూష్యం చేత్యాహ—

సూ॥ తథాపి తద్వత్పంచవిధకృత్యాని కరోతి ॥ 9 ॥

వ్యా॥ శుద్ధేశ్వరాధ్వేయ దర్శనస్య బ్రహ్మవాదాదిభ్యోయ మేవ విశేషః ॥ శ్లో॥ యత్సృష్టిసంహారకరం విలయస్థితి కారకం అనుగ్రహకరందేవి ప్రణతార్తివినాశనం ॥ ఇతి స్వచ్ఛందాదిశాస నరీత్యా సదా పంచవిధకృత్యకారిత్వం భగవతః చిదాత్మనః యథా భగవాన్ శుద్ధేశ్వరాధ్వానుసారక్రమేణ వికాసస్వరూ పాణి కృత్వా సృష్ట్యాదీని కరోతి । తథా సంకుచితశక్తితయా సంసారభూమికాయామపి పంచవిధకృత్యాని విధత్తే । తదేవ వ్యవహారే ప్రభుర్దేహాది మాదర్శభాంశమేవాంతరత్వమిచ్ఛయా భాసయతి । శ్రీమదీశ్వరప్రత్యభిజ్ఞాదిషు ఉక్తరీత్యా దేహప్రాణా దికం విశన్ చిద్రూపో మహేశ్వరో బహిర్ముఖభావావసరే నీలాదిమర్థంనియతదేశకాలాదితయా, యథావభాసయతి;తథా నియతదేశకాలాద్యాభాసాంశేన స్రష్టృతాం । తథా తత్ర స్థాప యితృత్వం । నీలాద్యాభాసాంశేన సంహర్తృత్వం । భేదనా భాసాంశేన విలయకారిత్వం । ప్రకాశైకాత్మనా అనుగ్రహీత్వం అవభాసయతి । తథాచ భగవతః పంచవిధకృత్యకారిత్వం । తథా త్రివిధతత్త్వమయాశ్రయత్వం । స్వచ్ఛందసంగ్రహేనిర్ణీతం । ఏవం ఆత్మీయకపంచవిధకృత్యకారిత్వం సదా దృఢప్రతిపత్త్యా పరిశీల్య మానం మాహేశ్వర్యసారమున్మీలయత్యేవ భక్తిభాజాం॥ అత ఏవ సదా తత్పరిశీలయంతి । తత్స్వరూపయంతి । విశ్వం జానా నాఅపి జీవన్ముక్తాః । ఇత్యామ్నాతాః । యేతు తథా సర్వతో భిన్నమివ జాతం పశ్యంతి తే బద్ధాత్మానః । అయమేవ పంచ విధకృత్యకారిత్వప్రకారః ॥ 9 ॥

అ॥ శివుడొక్కడే ఉపాధిభేదముచేత సంసారి (జీవుడు) అన
బడును. శివలక్షణములు జీవునకును గలిగేయుండును. ఎట్లనినః—

తా॥ సంపూర్ణశక్తిగల పరమాత్మ సృష్టి స్థితి లయ తిరో
ధానానుగ్రహములనెడి పంచకృత్యములను దేశకాలనియమము
తో చేయునట్లు శక్తిసంకోచమువలన పరిచ్ఛిన్నుడగు జీవుడును
సృష్ట్యాది పంచకృత్యములను దేశకాలనియమము లేక చేయుచుం
డునని స్వచ్ఛందసంగ్రహమనే గ్రంథమందు చెప్పబడెను. సం
కుచితమై దేశకాలనియమము లేని జీవునియందున్న పంచకృత్య
శక్తి విమర్శింపగా సవికాసమై దేశకాలనియమముగల పరశక్తి
యేయనియు ఈరెండును చిచ్ఛక్తియేయనియు దృఢనిశ్చయ
ముగలవారే ముక్తులు.

అ॥ యావదన్యోపి కశ్చిద్రవాస్యరూపోస్యాహ—

సూ॥ ఆభాసన, శక్తివిమర్శన, బీజావస్థాపన,
విలాపన, తస్థాని ॥ 10 ॥

వ్యా॥ పూర్ణత్వమస్య మాహేశ్వరస్య చిద్రూపస్య పంచ
విధకృత్యకారిత్వమపి సంబధ్యతే। శ్రీమన్మహార్థదృష్ట్యా దృగా
దేరేవ సరణిక్రమేణ యద్యథాభాతి తత్తథాసృజ్యతే తదాసృష్టిః
తత్ర యదా ప్రకాశాంశనిమేషః కించిత్కాలం రజ్యతి తదా
స్థితిః। చమత్కారపరాఽపరవిమర్శనసమయేతు సంహ్రీయతే
తదా సంహృతిః। యథోక్తం శ్రీరామేణ॥ " సమాధివజ్రేణా
ప్యన్యైరభేద్యో భేదభూధరః। పరామృష్టశ్చ నష్టశ్చ త్వద్భక్తిబల
శాలిభిః " ఇతి॥ యదాతు సంహ్రియ్యమాణమేవాహం పరా
క్రిమేణాలం; గ్రాసయుక్త్యా చిదగ్నిసద్భావమాపద్యతే। తదా
పూర్ణతాపాదనేన గృహ్యతే। ఏవమీదృశం పంచవిధకృత్యకా

దితత్వం సర్వస్య సదా సన్నిహితమపి సద్గురూపదేశంవినై వతద్జ్ఞానం నాస్తి । తిస్యాచ్ఛాదితస్వభావస్య స్వస్వరూపావిభిన్న జాతిభిశ్చ శక్తిభిర్వ్యామోహితాత్ । స్వాతంత్ర్యా త్తస్య సదా సంభవః పంచవిధకృత్యకారిత్వస్య పరిజ్ఞానే శక్తిపాత హేతుః। స్వబలోన్మీలనభావాది ప్రకాశనె స్వాభిశ్చ శక్తిభిర్వ్యామోహిత వివిధభాతికశాస్త్రీయశంకాకలితత్వం యదిదమేవ సంసారిత్వం । తదుక్తం సర్వవీరభట్టారకే॥ "అజ్ఞానాచ్ఛంకతే లోకః తతస్సృష్టిశ్చ సంహృతిః । మంత్రాః శివాత్మకాస్సర్వే సర్వేవర్ణాః శివాత్మకాః " ఇతి॥ తథాహి చిత్ప్రకాశాదవ్యతిరిక్తా నిత్యోదితమహామంత్రరూపా పూర్ణాహంతా పరామర్శమయీ యే యం పరావాక్ఛక్తిః ఆదిక్షాంతాశేషశక్తిచక్రగర్భిణీ। సాతు పశ్యంతీ, మధ్యమాదిక్రమేణ గ్రాహకభూమికాయా మాభాసయతి । తత్రచ పరారూపత్వేన స్వరూపం ప్రథయంతీ మాయాప్రమాతుః స్థూలధారణార్థం భాసరూపాం ప్రతిక్షణం నవనవాం వికల్పక్రియాముల్లాసయతి। శుద్ధామపి వికల్పభూమిం తదాచ్ఛాదితామివ దర్శయతి। తత్ర బ్రాహ్మ్యాది దేవతాధిష్ఠితకకారాది విచిత్రశక్తివ్యామోహితాః దేహప్రాణాదికమేవ పరిమితమాత్మానం మన్యంతే మూఢజనాః బ్రాహ్మ్యాదికాఏవ పశుదశాయాం భేదవిషయసంసారం ప్రథయంత్యః పరిమితపాత్రతామేవ సంపాదయంతి । పతిదశాయాంతు సంసారం అభేదేన వర్గస్థితిం ప్రథయంత్యః క్రమాత్క్రమం వికల్పనిర్హ్రాసాదేవ శ్రీమద్భైరవభట్టారికానుప్రవేశమయీం మహతీమవికల్పభూమిమేవోన్మీలయంత్యః సర్వోత్తమోయం విభవఇత్యాదిరూపాం చిదానందలేశసారాం శుద్ధామవికల్పశక్తిముల్లాసయంతి ॥ 10 ॥

అ॥ మఱియొకరహస్యము.

తా॥ చిద్రూపుడును, పూర్ణుడునగు పరమేశ్వరుడు సృష్ట్యాది పంచకృత్యముల నెట్లు చేయుననగా:—

1 వెనుకటిసృష్టియందు ఏయేజంతువున కేయేయవయవము లున్నవో యిప్పుడును ఆయాజంతువుల కాయాయవయవము లు గలిగించుట సృష్టిక్రమము.

2 సృజించినభూతములను ప్రకాశాంశతో కొంతకాలము పాలించుట స్థితిక్రమము.

3 పునరుత్పత్తిసమేతలయమొకటిగను, గురుభక్తితో సమాధిపరుడై పరాశక్తిని విమర్శించుటవలన గలిగెడి పరబ్రహ్మైక్యమందె సంహారరూపాత్యంతికలయము మఱియొకటిగను సంహారక్రమము నేను నీవు వాడు నను భేదబుద్ధియందఱకును పర్వతమువలె దృఢమయి చలింపకయుండును. అట్టిభేదబుద్ధిని భక్తియుక్తమగు సమాధి దేవేంద్రునివజ్రాయుధము పర్వతమును వలె పగులగొట్టి నిర్విఘ్నముగ పరబ్రహ్మైక్యమును గలిగించునని శ్రీరామమూర్తి చెప్పెను. [ట తిరోధానక్రమము.

4 నీవు నేను అనేభేదబుద్ధిచేత చిద్రూపము స్ఫురింపకుండు

5 గురుభక్తియుక్తమయిన సమాధిచేత ప్రపంచము భేదబుద్ధిరూపముగ భాసింపక చిద్రూపముగ భాసింపచేయుట అనుగ్రహక్రమము.

సద్గురూపదేశముచేత జీవునకు ఈపంచకృత్యశక్తి కలదని తెలియఁజేయబడును. బ్రహ్మమునందుగల ఆపంచకృత్యశక్తి స్వతంత్రమగుటచే గురూపదేశమును అపేక్షింపదు. కాని అట్టి అపేక్ష జీవునికిగలదు. బ్రహ్మాభిన్నమగు మాయాశక్తిచేతమో

హితులయినవారికీయర్థము దుర్లభము. చిచ్ఛక్తియే వ్యక్తమ యిన ప్రపంచముయొక్క తత్త్వమును ఇచ్ఛాది మోహశక్తుల చేనావరించి వివిధశాస్త్రముల చేత సందేహావర్చును. ఈసందే హరూపమగు మలములవలననే బ్రహ్మమునకు సంసారావస్థ. లోకము అజ్ఞానముచే మోహమునుపొంది జననమరణాత్మక సంసారమునందు మునుగుననియు, మంత్రములన్నియు శివస్వ రూపములనియు, బీజములన్నియు శక్తిస్వరూపములనియు, సర్వవీరభట్టారకగ్రంథమున చెప్పబడెను. చిత్ప్రకాశకంటె నభి న్నము, మహామంత్రరూపము, పూర్ణాహంతాపరామర్శము, అకారాది క్షకారాంతము నగు వాక్ఛక్తి బిందురూపముగ పర యని, నాదరూపముగ పశ్యంతి యని, అవ్యక్తమగు మధ్యమ యని, స్ఫుటముగ వైఖరి యని వ్యవహరింపబడును. ఈవాక్ఛ క్తి బ్రహ్మమును ఆవరించినట్లుండును. మూఢజనులు బ్రాహ్మ్యా దిదేవతలను చెప్పు కకారము మొదలగు విచిత్రవర్ణశక్తిచే వ్యా మోహమునుపొంది పరిమితమైన దేహప్రాణాదులనే ఆత్మరూప ముగ తలచుచున్నారు. అజ్ఞానదశయందు మూఢజనులకు బ్రా హ్మ్యాదిశక్తులచేత బ్రహ్మము స్ఫురింపక భేదప్రధానమయిన సంసారావస్థయు, పరిమిత దేహాదులును స్ఫురించును. జ్ఞానదశ యందు సంసారావస్థలేకుండ అద్వితీయము స్ఫురించుటచేత వికల్పభూమికలు క్రమముగ నశించి మహత్తరమయిన బ్రహ్మ భూమికను పొందును. ఇదియె "సర్వోత్తమము, శుద్ధము, చి దానందలేశసారము, వికల్పరహితము, నగు" చిచ్ఛక్తి. ॥ 10 ॥

సూ॥ తదపరిజ్ఞానే స్వశక్తివ్యామోహితతా,
సంసారిత్వం ॥ 11 ॥

వ్యా। కించ చితిరేవ భగవతీ విశ్వవమనాత్సంసారవామ చ్చ వామేశ్వర్యాఖ్యాసతీ, ఖేచరీ, గోచరీ, దిక్చరీ, భూచరీ రూపైరశేషైః ప్రమాత్రంతఃకరణబహిష్కరణభావైః స్ఫురతి అభేవేన సర్వాత్మకత్వే పారమార్థికస్వరూపేణ స్ఫురతి। సర్వత్ర వ్యవచ్ఛిన్నాపి పశుభూమికాయాం శూన్యవాదవిశ్రితకించిత్కర్తృత్వాద్యాత్మకలాది శక్త్యాత్మనా ఖేచరీచక్రేణ గోపితపారమార్థికచిద్గగనచారిత్వరూపేణ చకాస్తి। భేదనిశ్చయాభిమాన వికల్పనక్రియా ప్రధానాంతఃకరణ దేవీరూపేణ గోచరీచక్రేణ భేదాలోచనాది ప్రధానబహిష్కరణదేవతాత్మనా చకాస్తి। దిక్చరీచక్రేణ గోపితాఽభేదప్రథానాత్మికపారమార్థికస్వరూపేణ భాతి। భూచరీచక్రేణ పశుహృదయవ్యామోహినీ భాతి। పతి భూమికాయాంచ సర్వకర్తృత్వ చిదాత్మనా చిద్గగనచారిత్వేన ఖేచరీత్వేన, అభేదనిశ్చయాత్మనా గోచరీత్వేన, అభేదాలోచనాత్మనా దిక్చరీత్వేన, సాంగకల్పప్రథాప్రసారప్రమేయాత్మనా భూచరీత్వేన, పతిహృదయవికాసినా స్ఫురతి। ఏవంచ స్వశక్తి వ్యామోహితతైవ సంసారిత్వం। అపిచ చిదాత్మనః పరమేశ్వరస్యానపాయిన్యేకైవ స్ఫురత్తా। అసారకర్తృతైశ్వర్యమోహితతైవ సంసారిత్వం। యథా మాయయోల్లసముదానశక్తిం విశ్వవ్యాప్తిసారాంచ వ్యానశక్తిం, తురీయదశాయాం తురీయశక్తిం, తుర్యాతీతరూపాంచ, చిదానందసారామున్మీలయతి తథా దేహాద్యవస్థాయామపి పతిదశాంత్మా జీవన్ముక్తః। ఏవం త్రివిధా స్వశక్తిప్రాణాదిభిర్వ్యామోహితా వ్యాఖ్యాతా। చిదితి సూత్రే చిత్ప్రకాశో గృహీతశక్తిసంకోచః సంసార్యుక్తః। ఇహ తు స్వశక్తివ్యామోహితత్వేనాస్య సంసారిత్వం భవతి। శంక్యం

శరేణ ప్రతిపాదితం । ఏవంచ సంకుచితశక్తిః ప్రాణాదిమానపి యథా స్వశక్తివ్యామోహానో నభవతి । తథా మాయాశరీరశరమేశ్వరవదేతాత్మ్యాయస్థిత్యా శివభట్టారకశ్చాయమేవేతి భంగ్యానిరూపితం భవతి । యథాగమః॥ “ మనుష్యరూపధనోప్యాసే మాహేశ్వరః ” ఇత్యుక్తంచ॥ శ్రీమదీశ్వరప్రత్యభిజ్ఞాయాం॥ “ యథా శరీరమేవ యే షట్త్రింశత్తత్త్వమయం శివరూపం పశ్యంతి అర్చయంతిచ సిధ్యంతి । ఘటాదికమపి తథా నిశ్చిత్య పశ్యంతి । నచాస్యత్రి వివాదః ” ఇతి॥

తా॥ సర్వము చిద్రూపమే యను జ్ఞానము లేనికాలమందు ఇచ్ఛాదిశక్తులచేకలుగు వ్యామోహమే సంసారము.

చిచ్ఛక్తి తనయందు బీజరూపముగ లీనమైనప్రపంచమును వెల్లడించుటవలన వామేశ్వరి యను నామముకలిగి ఖేచరి. గోచరి, దిక్చరి, భూచరి యనుశక్తులతో జగదాధారముగ స్ఫురించును. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులమూడింటిలోను చిచ్ఛక్తి భేదములేకుండ వాని పారమార్థికస్వరూపముగ స్ఫురించును. అజ్ఞానదశయందు చిచ్ఛక్తి లీనమై తనదగు ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులతో ఖేచరీచక్రముచేత గోప్యమయిన చిదాకాశరూపముగనుండును. భేదము, వికల్పము, ప్రధానమగు అంతఃకరణశక్తిరూపము చేత గోచరీచక్రముగనుండును. బహిర్వృత్తులు ప్రధానముగాగల యింద్రియరూపమగు దిక్చరీచక్రముగనుండును. అజ్ఞానులను మోహపెట్టుచు భూచరీచక్రముగనుండును. మాయాశక్తిచే మోహపడుటయే సంసారము. మఱియు ప్రకాశవిమర్శములొకదానినొకటి యెప్పుడును విడిచియుండవు. కనుక సకల ప్రపంచము ప్రకాశవిమర్శరూపమై యుండగానే నీయసారమగు

జగత్తును పుట్టించితిననే కర్తృత్వాభిమానమే సంసారము. ప్రకాశము శివస్వరూపమనియు, విమర్శము శక్తిస్వరూపమనియు చెప్పబడెను. మాయచేత ప్రకాశించు సుషుప్తిరూపమగు ఉదానశక్తిని, ప్రపంచమునంతను వ్యాపించెడి వ్యానశక్తిని, తురీయదశయందైన జ్ఞానశక్తిని, తురీయాతీతదశయందైన చిదానందసారశక్తియందు లయముచేయుటచే భక్తులకు దేహవ్యవస్థలున్నను జీవన్ముక్తికలుగును. చితి అను సూత్రమునందు చిచ్ఛక్తి సూక్ష్మరూపములో జగద్రూపమును పొందుటచేత సంసారవ్యవస్థ చెప్పబడెను. ఇక్కడ చిచ్ఛక్తి వ్యామోహముచేత బ్రహ్మమునకు సంసారిత్వము కలిగెనని మఱియొకతీరుగ ప్రతిపాదింపబడినది. చిచ్ఛక్తి సూక్ష్మరూపమై జగద్రూపముచేత ప్రాణాదులను పొందినను తనచిత్స్వరూపమెట్లు మఱువకయుండునో అట్లే మాయచేత శరీరము (సగుణము) ను బొందిన పరమేశ్వరుడును వ్యామోహమును పొందడని ఆమ్నాయస్థితిచేత నిరూపింపబడినది. "మనుష్యరూపమందు మహేశ్వరుండంతర్యామిగ నుండెనని ఆగమములు చెప్పుచున్నవి. ఈశ్వరప్రత్యభిజ్ఞయందు "శరీరమే షట్త్రింశత్ (౩౬) తత్త్వస్వరూపమగు బ్రహ్మమని చూచుచు అట్లే ఘటాదులయందును నిశ్చయించి చూచుచు సర్చనచేయువానికి చిద్రూపప్రాప్తియందు సందేహములేదు. ॥ 11 ॥

అ॥ ఉక్తార్థంప్రతి దార్ఢ్యేన తత్త్వదృష్టిం దర్శయితుమాహ—

సూ॥ తత్పరిజ్ఞానే చిత్తమేవాంతర్ముఖీభావేన
చేతనపదాధ్యారోహాచ్చితిః ॥ 12 ॥

వ్యా॥ తస్యాత్మీయస్య పంచవిధకృత్యకారిత్వస్య పరిజ్ఞా నేసతి

అపరిజ్ఞానలక్షణకారణాపగమాత్ । స్వశక్తివ్యామోహితతా
నివృత్తౌ స్వాతంత్ర్యలాభాత్ప్రాగాఖ్యాతం యచ్చిత్తం తదేవ
సంకోచినీం బహిర్ముఖతాం జహదంతర్ముఖభావేన చేతనపదా
ధ్యారోహాత్ । గ్రాహకభూమ్యాక్రమక్రమేణ సంకోచకలా
యాఅపి విగళనేన స్వరూపతాచ్చితిర్భవతి । సా చిన్మయీం
భూమికామావిశతీత్యర్థః ॥ 12 ॥

తా॥ పంచవిధకృత్యములు ఆత్మవేకాని యితరము కాదని
జ్ఞానము కలుగుచుండగా మాయాశక్తిచేకలుగు వ్యామోహము
నశించి చిచ్ఛక్తియొక్క స్వరూపజ్ఞానము కలుగుటవలన పూర్వ
ము చెప్పబడిన స్థూలరూపచిత్తము సూక్ష్మరూపమై బహిర్వ్యా
ప్తులనువిడిచి అంతర్ముఖమగుటచేత జీవశబ్దమునశించి జ్ఞానభూ
మికయందు క్రమముగా సూక్ష్మకళగనుండి అదియును లీనమ
గుటచేత చిత్తుఅయి చిన్మయభూమికను పొందును. ॥ 12 ॥

అ॥ నను యదిపారమార్థికం చిచ్ఛక్తిపదం సకలభేదకబళన
స్వభావం తదస్య మాయాపదేపి తథారూపేణభవితవ్యం యథా
జలాద్యాచ్ఛాదితస్యాపి భావో ర్భానావభాసకత్వ మిత్యాశం
క్యాహ—

సూ॥ చిద్వహ్నిరవరోహపదే ఛన్నోఽపి మా
త్రయా మేయేంధనం ప్లుష్యతి ॥ 13 ॥

వ్యా॥ అవరోహపదే మాత్రయా ప్రవర్తతే । స్వాతంత్ర్యే
ఆచ్ఛాదితస్వభావోపి భూతిభూతిచ్ఛన్నోఽగ్నిరివ మాత్రయా
అంశేన నీలపీతాదిం ప్లుష్యతి స్వాత్మసాత్కరోతి । మాత్రా
పదస్యేద మాకూతం యత్కబళయన్నపి న సార్వాత్మ్యేన
గ్రసతే । అపిత్వంశేన సంస్కారాత్మనా అంతఃస్థాపయతి । గ్రా

సకతత్వంచ సర్వప్రమాతృప్వానుభవసిద్ధం—యథోక్తం శ్రీమ దుత్పలదళపాదైః నిజస్తోత్రే॥ "వర్తంతే జంతవో శేషా అపి బ్రహ్మేంద్రవిష్ణవః। గ్రసమానాస్తతో వందే దేవం విశ్వభ వం లయం" ఇతి॥ 13॥

సూ॥ తా॥ చిదగ్ని జీవులయందు కప్పబడినను జ్ఞానమనెడి కట్టెలచేత క్రమముగా వృద్ధిపొందుచున్నది.

వ్యా॥ తా॥ భస్మముచేత కప్పబడిన అగ్నివలెనే జీవులయం దుకప్పబడిన చిదగ్ని అంశా (సూక్ష్మ) రూపముతో నుండును. చిదగ్ని స్వాతంత్ర్యముచే కప్పబడిన స్వభావముకలదైనను అం శరూపముచేత క్రమక్రమముగ సుఖదుఃఖాదులను నశింపుచే యుచు సంస్కారరూపముతో లోపలనుంచుకొని ఆత్మ సాక్షా త్కారము చేయుచున్నది. అట్లులీనమగుట సర్వజీవులకు సుషు ప్తియందు) అనుభవసిద్ధము. పద్మపాదులచేత పద్మపాదస్తవ మునందు "హరిబ్రహ్మేంద్రాదులతోకూడిన జీవులు ఎవనిచేత సృష్టిలయములు పొందింపబడుచున్నవో అట్టిబ్రహ్మమును నమ స్కరించుచున్నానని చెప్పబడినది. ॥ 13॥

అ॥ యదా పునః కరణేశ్వరీప్రసరసంకోచం సంపాద్య తదా సర్గసంహారక్రమేణ పరిశీలనయుక్తిమాహ—

సూ॥ బలలాభే విశ్వమాత్మసాత్కరోతి॥ 14॥

వ్యా॥ స్వస్వరూపాభేదేన నిర్భాసయతి। యథోక్తంపూర్వ గురుభిః స్వభాషామయేషు క్రమసూత్రేషు "యథా వహ్ని రుద్బోధితో దాహ్యం దహతి తథా విషయపాశాన్ భక్షయే దితి॥ నచైవం వక్తవ్యం విశ్వాత్మసాత్కారరూపసమావేశ భూః కాదాచిత్కఏవేతి కథముపాదేయం స్యాదితి। దేహాద్యాత్మ

జనవశేన తస్యాః కాదాచిత్కత్వమేవాభాతి । వస్తుతస్తు। చితిః స్వాతంత్ర్యాదవభాసితదేహాద్యుక్తజన్మాద్యేవ కాదాచిత్కత్వం। ఏషాతు సదైవ ప్రకాశమానా భగవతీ । అన్యథా దేహాదిషు నప్రకాశేత్ । అతఏవ దేహాది ప్రమాతృతా నిమజ్జనాభ్యాసః కార్యః। సచ ప్రధానతో సారపరిమాతృతా ప్రాప్త్యర్థమితి శ్రీమదీశ్వరప్రత్యభిజ్ఞాకారః ॥ 14 ॥

అ॥ స్థూలరూపచిత్తము సూక్ష్మరూపమగునపుడు ప్రపంచ రూపము లయమయి బ్రహ్మరూపమగునను టయందు యుక్తిని చెప్పుచున్నారు.

తా॥ చిద్రూపసిద్ధికలిగినకాలమందు ప్రపంచము చిద్రూప ముతో సభేదముగ స్ఫురించుచున్నది. “అగ్ని వృద్ధిపొంది వస్తువులను దహించునట్లే చిదగ్ని వృద్ధిబొంది మాయా సంబంధమగు విషయపాశములను దహించునని” క్రమసూత్రి ములయందు చెప్పబడినది. ప్రపంచముఒకానొకప్పుడు ఆత్మరూప ముగ సాక్షాత్కారమయినందువలన నేమిప్రయోజనమనియన కూడదు. చిద్రూపము దేహాదులయందు కప్పబడియుంటచే తనే ఒకానొకప్పుడుస్ఫురించుచున్నది. వాస్తవమువలనచిచ్ఛక్తి స్వాతంత్ర్యముచేపొందిన దేహాదులలో భక్తిధ్యానాదులుగల జనులకే ఒకానొకప్పుడు స్ఫురించును. ఈచిచ్ఛక్తి యెప్పుడును (దేహాదులయందున్నను) ప్రకాశస్వరూపముకలదె. చిచ్ఛక్తివ లననే దేహాదులకు ప్రకాశముకలిగెను. కాని లేనియెడల జడ ములగు దేహాదులకు ప్రకాశము లేకయేపోవును. కనుక తాను జడములగు దేహాదులు కానవియు, చిమాత్రపురుషననియు, నిరంత రమభ్యసింపవలయును. అట్టిఅభ్యాసమువలనముఖ్యసారమగు

చిద్రూపప్రాప్తి కలుగువని ఈశ్వరసిద్ధాంతము. 14॥

సూ॥ చిదానందలాభే దేహప్రాణాదిష్వవభాన
మానేష్వపి చిదైకాత్మ్యప్రతిపత్తిదార్ఢ్యం
జీవన్ముక్తిః ॥ 15 ॥

వ్యా॥ విశ్వాత్మసాక్షాత్కారాత్మని సమావేశరూపేచిదానందే లబ్ధేసతి వ్యుత్థానదశాయాం కల్పిత దేహ ప్రాణ నీల సుఖాదిషు భాసమానేష్వపి తత్సమావేశసంస్కారబలా త్ప్రతిపాదయిష్యమాణయుక్తిక్రమోపబృంహితాచ్చిదైకాత్మ్యప్రతిపత్తిదార్ఢ్యం అవిచలా యా చిదేకత్వప్రథా సైవ జీవన్ముక్తిః। జీవతః ధనం పుష్యతి ప్రాణానపి ధారయతో ముక్తిః। ప్రత్యభిజ్ఞాత స్వస్వరూపవిద్రావితాశేషపాపరాశిత్వాత్ । యథోక్తం, శ్రీస్పంద శాస్త్రే। "ఇతి (యది) వా యస్య సంవిత్తిః క్రీడత్వే నాఖిలం జగత్ । సపశ్యన్ సతతం యుక్తో జీవన్ముక్తో నసంశయః" ఇతి॥

తా॥ చిద్రూపత్వప్రాప్తి కలిగినకాలమందు దేహప్రాణాదులు భాసించినను అవి చిద్రూపములేకాని వేఱుకావనెడి దృఢభావన వలన జీవన్ముక్తి కలుగును.

ప్రపంచము సాక్షాత్తు ఆత్మరూపమను నిశ్చయముతో చిద్రూపానుభవముకలిగియుండగా సమాధ్యనంతరము (జాగరావస్థయందు) కల్పితమయిన దేహ ప్రాణ సుఖ దుఃఖాదులు స్ఫురించినను పూర్వసంస్కార (సమాధి) బలముచేత సర్వము చిద్రూపమని యేకాగ్రవృత్తి కలుగుటవలన జీవన్ముక్తి సిద్ధించును. సమస్తజగత్తు కల్పితమని జ్ఞానముకలిగి అట్లే సర్వదాచూచువాడు జీవన్ముక్తుడనియు, సంశయములేదనియు స్పందశాస్త్రమందు చెప్పబడినది. ॥ 15 ॥

అ॥ కథంచిదానందలాభో భవతీత్యతఆహ—

సూ॥ మధ్యవికాసాచ్చిదానందలాభః ॥ 16 ॥

వ్యా॥ సర్వాంతరతమత్వేన వర్తమానత్వా త్తద్భిత్తిలగ్న తాంవినా చక్రస్య చిద్రూపానుపపత్తేః । సంవిదేవ భగవతీ మధ్యమా। సాతు మాయాదశాయాం తథాభూతాపి స్వరూపం గోపయిత్వా ప్రాక్ ప్రాణే పరిణతేతిరీత్యా ప్రాణాదిభిత్తిభ్రమం స్వీకృత్య అవరోహక్రమేణ బాధదేహాది భువమతిశయానా నానానాడీసహస్రమనుసృతా । తత్రాపి పలాశపత్రమధ్యాద్య శాఖా న్యాయేన బ్రహ్మాది రుద్రపర్యంతం ప్రాణ బ్రహ్మ శ్రయ మాయాయా బ్రహ్మనాడీరూపతయా ప్రాధాన్యేన స్థితాః అతఏవ సర్వశక్తీనా ముదయాత్తత్రైవ విశ్రమాదేవం భూతాప్యేషా పశూనామున్మీలనరూపై వస్థితా—యదా త్రింశక యుక్తిక్రమేణ సర్వాంతరతమత్వేన బ్రహ్మభూతా సంవిద్భగవతీ వక్ష్యమాణక్రమేణ మధ్యమా బ్రహ్మనాడీరూపతయా వికాసతి । తదాంతర్వికాసాచ్చిదానందస్య స్వరూపస్య లాభః ప్రాప్తిర్భవేదితి । తతశ్చ ప్రాగుక్తజీవన్ముక్తిః । మధ్యమవికాసే వికల్పక్షయః ఉపాయః । ప్రాగుక్తవదిష్టపంచకృత్యకారిత్వాద్యనుసరణేన సర్వమధ్యభూతాయాః సంవిదో వికాసో జాయతఇత్యభిప్రాయః । ఉపాయాంతరముచ్యతే । ప్రాణాయామముద్రాబంధాది సమస్తయంత్రేణ త్రోటనేన సుఖోపాయమేవ హృదయనిహితచిత్తవృత్తిం క్రమేణ స్వస్తిబంధకం వికల్పాఽకించిత్కత్వేన పరిశమయ్య అవికల్పపరామర్శత్వేన దేహాద్యుక్తపుర్యష్టకస్య చిత్ప్రమాతృతా నిష్ఠాలనప్రవణోచితాం తదేవోన్మిషద్వికాసాం తురీయాతీతసమావేశదశా మావేశయతి ।

యథోక్తం "వికల్పహానేనైకాగ్ర్యాత్క్రమేణేశ్వరతాభవేత్"
ఇతి శ్రీప్రత్యభిజ్ఞాయాం॥ శ్రీస్పందశాస్త్రేపి॥ "యదా క్షోభః ప్రలీయేత తదాస్యాత్పరమం పదం" విజ్ఞానగర్భస్తోత్రే॥ "విహాయ సకలాః క్రియాః జనని మానసే సర్వతోవిముక్తికరణక్రియానుసృతిపారతంత్ర్యోజ్జ్వలైః। స్థితైస్త్వదనుభావతః సపది వావ్యతే సాపరా। దశాస్యభిరతంద్రితా సమసుఖామృతస్యందిసీతి। అయంచోపాయమూర్ధన్యత్వాత్ ప్రత్యభిజ్ఞాయాంచ ప్రతిపాదితత్వాదాదావుక్తః। "ప్రత్యగాత్మానమైక్షత। తదా వృత్తచక్షురమృతత్వమిచ్ఛన్నితి" శ్రుతిః॥ ప్రసృతాయామపి శక్తేః సంకోచవతీఘానసమయే హృత్పద్మదేశవచ్చ సర్వతోవివర్తనం యథోక్తం॥ "తపోధృతే నిత్యోదితే స్థితిరితి" శక్తేర్వికాసోంతః నిరూఢ్యా క్రమేణైవ సర్వకరణస్ఫారేణ... "అంతర్లక్ష్యం బహిర్దృష్టిర్నిమేషోన్మేషవర్జితః" ఇతి। భైరవముద్రానుప్రవేశయుక్త్యా బహిస్సరణం। ఇత్యాది॥ ఏకాగ్రోపి బహిర్వ్యాప్తినివృత్తఃతత్త్వమీక్షతే। దృష్టతత్త్వస్తు నపునః కర్మజాలే నబధ్యతే॥

అ॥ చిద్రూపప్రాప్త్యుపాయము—

తా॥ చిచ్ఛక్తి అన్నిజంతువులయందును అతిసూక్ష్మముగను అంతర్యామిగనుండును. జడమగు బ్రహ్మాండచక్రము చిద్రూప సంబంధములేకుండ ప్రకాశింపనేరదు. చిన్మాత్రమే మధ్యము (సుషుమ్న) యను పరదేవతాస్వరూపము. ఆచిచ్ఛక్తి మాయాదశయందు తనవిమర్శమును మరుగుపర్చుకొని బంధకములగు దేహప్రాణాదులతోను, అనేకసహస్రనాడులతోనున్న స్థూలప్రపంచమునందును, బ్రహ్మ, విష్ణు, రుద్రాద్యుత్తమదేహములందును "పలాశపత్రముఖ్యాన్యశాఖాన్యాయమున" తామరాకునకు

మొదటనున్న యేకరేఖ అనంతరము అనేకరేఖలుగనున్నను మొదటిరేఖకంటె వేఱుకానివిధమున మొదటిదగు తసచ్చిద్రూపమును విడువకయుండును. సర్వశక్తులకు చిచ్ఛక్తియందే సృష్టిసంహారములు కలుగుటవలన సమస్తజీవులయందును సూక్ష్మరూపయగు చిచ్ఛక్తి మధ్యమయనెడి బ్రహ్మనాడీరూపముగ స్ఫురించును. గాని విమర్శించనపుడు చిచ్ఛక్తి కాకపోదు. ఈవిమర్శమువలననే జీవన్ముక్తి కలుగును. మధ్యమవికాసమునకుజీవునియందుగలవికల్పములు నశించుటఒకయుపాయము. ఈచిద్రూపము పూర్వోక్తపంచవిధకృత్యసంబంధము తమకునుగలదనిభావించు జీవులకు సకలనాడులయొక్క మధ్యవర్తియగు మధ్యమ (సుషుమ్నా) నాడిగుండా వికసించును. ప్రాణాయామము, భైరవాదిముద్రలు, స్వస్తికాద్యాసనములు, మొదలగువానినివిమర్శించుట మఱియొకయుపాయము. అందు స్వస్తికాసనవిమర్శముచేత చిత్తవృత్తులు శాంతించి దేహాదులయందు చెప్పబడిన పుర్యష్టకమునకు చిత్సంబంధము దృఢమగును. ఈశ్వరప్రత్యభిజ్ఞయందు "ఏకాగ్రతచేతక్రమముగా వికల్పములు నశించినకొలది ఈశ్వరతత్వము స్ఫురించుననియు, స్పందశాస్త్రమునందు "చిత్తవృత్తులన్నియు నశించినపుడే ముక్తియనియు" విజ్ఞానగర్భస్తోత్రమునందు "ఓతల్లీ నీయనుగ్రహమువలననే మనస్సునందలి సమస్తవికల్పములనువిడిచి ముక్తిసాధనముల ననుసరించిన భక్తులు నిత్యసుఖస్వరూపమగు మోక్షము నపుడే పొందుదురనియు, నిది శ్రేష్ఠోపాయమనియు చెప్పబడినది." "ఈశ్వరసిద్ధాంతమందును ఇట్లే చెప్పబడినది." "ప్రత్యగాత్మానమైక్షతదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్" అనెడి శ్రుతియు బ్రహ్మము

యొక్క ధ్యానమువలననె మోక్షముకలుగునని చెప్పుచున్నది. చిచ్ఛక్తి ప్రపంచరూపమయినపుడు జీవాదుల హృత్పద్మదేశమందు సూక్ష్మరూపముగ నున్నటుల అంతటను వివర్తరూపముగనుండును. కనుక ధ్యానోపాసనాసమాధులు చిద్రూపసిద్ధికి ముఖ్యసాధనములు." అంతః (లోపలకు) లక్ష్యమును, బహిః (వెలుపలకు) దృష్టియును, కలిగి ఉన్మేషనిమేషములులేకుండగ నుండుట భైరవముద్రయనబడును. లక్ష్యమందు ఏకాగ్రతచేత బాహ్యవృత్తులను లయము చేయుటయే చిద్రూపతాప్రాప్తికి ముఖ్యోపాయము. తత్వజ్ఞానికి ముక్తిసిద్ధము. ॥ 16 ॥

అ॥ సమాధిస్థస్య నిత్యోదితత్వే యుక్తిమాహ—

సూ॥ సమాధిసంస్కారాదుత్థితస్థానే భూయోభూయశ్చిదై
కాత్మ్యవమర్శనాన్నిత్యోదిత సమాధిలాభః ॥ 17 ॥

వ్యా॥ ఆస్వాదితసమావేశో యోగివరో వ్యుత్థానదశాయామపి సమాధిజయసంస్కారేణ క్షీబఇవ సదానందపూర్ణః మనోభావరాశిం శరదభ్రమివ చిద్గగనలీయమానం పశ్యన్ భూయోభూయోంతర్ముఖతామేవ సమవలంబ్య నిమీలన సమాధిక్రిమేణ బహిర్ముఖతాం జహచ్చిదైక్యమేవ విమృశన్ వ్యుత్థానాభిమతావసరే సమాధ్యేకరసఏవ భవతి। యథోక్తంక్రమసూత్రేషు—"క్రమముద్రాంతస్స్వరూపాయాం ముదసమావేశో భవతి। సాధక బాహ్యాదంతఃప్రవేశః ఆభ్యంతరాచ్చ బహిస్స్వరూపానుప్రవేశో జాయతఇతి బాహ్యాభ్యంతరోయం ముద్రాక్రిమఇత్యత్రాయమర్థః॥" సృష్టి స్థితి సంహృతి సంవిచ్చక్రాత్మకం క్రమముద్రయా స్వోదితమాత్మసాత్కరోతి। యేయంతురీయాతితశక్తిః। తథా క్రమముద్రయా అంతఃపూర్ణాహంతాస్వరూ

వశయా బహిర్ముఖవిషయేషు వ్యావృత్తోపి సమాధినిష్ఠసాక్షా త్కృతపరాశక్తిస్ఫారసాధకః పరమయోగీ భవతి। తత్రచ బాహ్యద్రవ్యమానాత్ విషయగ్రామాదంతఃపరస్యాంచిద్భూ మౌ గ్రసనక్రమేణైవ ప్రవేశసమావేశో భవతి। అభ్యంతరా ద్వాసితముక్తిస్వరూపాత్స్వాత్మసాక్షాత్కృతసమావేశసామర్థ్యాదేవ బాహ్యస్వరూపేణ దంతానిభాత్యే విషయగ్రామే వమనయుక్త్యా ప్రవేశక్రియాత్ ప్రధానాత్మసమావేశో జాయతే। సబాహ్యా భ్యంతరోయం నిత్యోదితసమావేశాత్మా। ముదోహర్షస్య వితరణాత్పరమానందరూపత్వాత్పాశద్రావణాచ్చ విశ్వస్యాంత స్తురీయాం ముద్రాణాంచ ముద్రాక్రమోపి సృష్ట్యాది క్రమా భాసకత్వాచ్చ క్రమమిత్యభిధీయతే ॥ 17 ॥

తా॥ సమాధియందు తరుచుగ చిద్రూపములో నైక్యవిమ ర్శకలిగిన యోగివరుడు సమాధినివిడిచిన కాలమునను సమాధి చేకలిగిన సంస్కారబలమున చిత్తవృత్తులు శరత్కాలమేఘము లువలె నిష్ఫలములై చిదాకాశమందు లీనమయినట్లుగచూచు చు అంతర్ముఖుడై సర్వదా చిద్రూపములో నైక్యమునే విమ ర్శించుచు పూర్ణానందస్వరూపుడుగనేయుండును. క్రమసూత్ర ములయందు క్రమముద్రనుపొందిన అనంతరముకూడ బ్రహ్మ నంపముకలుగునని చెప్పబడినది. క్రమముద్రయనగా—సాధకుడు బాహ్యవృత్తులను చిత్తునందే లయింపుచు అంతరవృత్తులను బాహ్యమునకు పోకుండచేయుటయే. సృష్టిస్థితి సంహారముల ను చిద్రూపముగ విమర్శించు జ్ఞానచక్రముకూడ క్రమముద్ర యే. ఇట్లుతెలియుటవలన తురీయాతీతజ్ఞానమనెడి ఆత్మసాక్షా త్కారము కలుగును. సాధకుడు బాహ్యమునందు వ్యవహరిం

చుచున్నను ఈక్రమముద్రచేత పూర్ణాహంతా (బ్రహ్మ) స్వరూపుడై సమాధియందు కలిగిన పరాశక్తి సాక్షాత్కారబలము చేతనే బాహ్యప్రపంచమును చిద్రూపముగచూచుచు చిత్సాక్షాత్కారబలమువలన విడిచిన చిత్తవృత్తులను వాంతాశనము (ముఖమునుండివిడిచిన అన్నము) వలె తిరిగి గ్రహింపక దృశ్యప్రపంచమును చిద్రూపముగనే భావించుచుండును. మఱియు సృష్ట్యాదులు ఆభాసములనిభావించుటయు క్రమముద్రయే. 17॥

అ॥ సమాధిలాభస్య ఫలమాహ—

తతః ప్రకాశానందసారమహామంత్రాత్మక పూర్ణాహంతావేశాత్సదా సర్వసర్గసంహారాది సంవిద్దేవతాచక్రేశ్వరత్వప్రాప్తిర్భవతీతి శివం ॥ 18॥

వ్యా॥ తదానీంత్యేదితే సమాధౌ లబ్ధేసతి ప్రకాశానందసారాచిదాత్మకఘనా మహత్యనవచ్ఛిన్నా మంత్రవీర్యాత్మికా సర్వమంత్రాణాం జీవభూతా॥ పూర్ణా పరాభట్టారికారూపా యే యం అహంతా। అకృత్రిమస్వాంతచమత్కారాత్। తత్రావేశాత్ సదాశివాది ధరణ్యంతస్య విశ్వస్య యాసర్గసంహారావిచిత్రా సృష్టిప్రక్రియా సంవిద్దేవతాచక్రం తదీశ్వరత్వప్రాప్తిసాధనం భవతి॥ ఇత్యాది॥ ఇతి శ్రీపూర్ణానందమునికృతభాష్యం॥

తా॥ నిరంతరసమాధియందు సమస్తమంత్రసారము, పూర్ణము, ప్రకాశానందరూపము, పరాభట్టారికయునగు చిద్రూపమే స్ఫురించును. ఆస్ఫూర్తిచే సమాధ్యనంతరముకూడసృష్టిప్రక్రియప్రపంచము కల్పితమని దృఢబోధకలిగి సంశయవిపర్యదోషములు లేకుండ చిద్రూపుడగును.

శ్రీత్రిపురాసుందరీదేవతార్పణమస్తు.

# శుద్ధపత్రికా.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 6 | ఫావ్యము | భావ్యము |
| | 22 | ములకును | ములకును |
| 6 | 11 | చిష్ట్ల్యీశ | విష్ణ్వీశ |
| | 12 | మూమనగు | మానమగు |
| | 19 | దేవ్వ్యవ | దేవ్వ్యప |
| 14 | 12 | ఈర్వరుడు | ఈశ్వరుడు |
| 17 | 8 | రెండిటిం | రెండింటి |
| 19 | 20 | శివవాపకము | శివవాచకము |
| 20 | 7 | తఆతి | తఇతి |
| | 13 | చ్త్రైతన్య | చైతన్య |
| 21 | 19 | హహారు | హరిహారు |
| 22 | 7 | వైష్ణః | వైష్ణవః |
| | 21 | శస్తుక్తి | శక్తిస్తుతి |
| 23 | 4 | శివస్నా | శివస్నా |
| 25 | 24 | స్త్రైషా | సైషా |
| 33 | 25 | గాని | గాని నేను ఉపాసన చేయుచున్నానని ద్వైతబుద్ధిచేతగాని |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 34 | 20 | లో స॥ | 918 లో స॥ |
| 36 | 3 | లో స॥ | 990 లో స॥ |
| 46 | 2 | ప్రియచ్ఛ అను క్రియకు | మహ్యాం మేధాం, ప్రజ్ఞాం ప్రయచ్ఛ యను శబ్దములకు |
| | 15 | ర్పం | ర్పిం |
| 47 | 3 | ముకు | ముక్తు |
| 50 | 9 | లో స॥ | 235 లో స॥ |
| 51 | 13 | నెరు | నెవరు |
| | 17 | లో స॥ | 742 లో స॥ |
| | 23 | లోదివి | లోనివి |
| 60 | 9 | మన్నవి | నున్నవి |
| 61 | 2 | దేవతలసు | దేవతలను |
| 62 | 1 | ఒకజన్మ | ఒకజన్మ |
| 64 | 21 | చిద్యిద్యా | చిద్విద్యా |
| 74 | 8 | జపించిస | జపించిన |
| 77 | 16 | కోదు | కోరు |
| 85 | 2 | హాహర | హరిహర |
| 89 | 4 | ప్రితిమ | ప్రతిమ |
| 96 | 6 | నాశ క్తిః | నాశశక్తిః |
| 97 | 11 | మనవ రతె | మనసివ రతె |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 108 | 11 | ఎలుగును | కలుగును |
| | 18 | దలియు | దనియు |
| 110 | 17 | రెను | రెండు |
| 111 | 22 | భశేత్ | భవేత్ |
| 117 | 8 | ద్వ్యిధవిం | ద్వివిధం |
| 119 | 2 | ఆముక | అముక |
| 122 | 4 | న్నకోధ | న్నశోధ |
| 123 | 15 | లీనితో | వీనితో |
| 124 | 12 | పడా | పదా |
| 126 | 1 | అనుశు | అనుశ్రు |
| 132 | 24 | రూము | రూపము |
| 133 | 11 | తులను | తులకు |
| | 9 | ప్రిభాకర | ప్రభాకర |
| 135 | 14 | ఖండిచి | ఖండించి |
| 136 | 2 | కలిపూయాం | కలిపూజాయాం |
| 141 | 13 | వంహింంత | సంహిత |
| 166 | 2 | శ్బావవ | భావన |
| 169 | 4 | విది | నది |
| | 22 | మత్రి | మంత్రి |
| 174 | 17 | అర్శ | అర్థ |
| 177 | 4 | శవ | శివ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 9 | 2 అం॥భావార్థము | —— |
| 179 | 2 | ప్రకారము | ప్రకారము |
| | 8 | వ్యాన | వ్యాన |
| 180 | 16 | స్పశ్ | నస్పశ్ |
| | 24 | విభేదత | విభేదతః |
| 190 | 17 | ద్వారశ | ద్వాదశ |
| 205 | 22 | నాము | సామ |
| 215 | 4 | వెష్ణవా | వైష్ణవా |
| 220 | 23 | ల్లుమొక్కువ | ల్లైక్కువ |
| 222 | 13 | ఇతరత్రావుం | ఇతరత్రిఉండ |
| | 16 | శ్వం | శ్వరి |
| 224 | 17 | గమ్యము, కా, | తెలియరా |
| 230 | 4 | జతెం | జితెం |
| 231 | 12 | ప్రతీలత్వా | ప్రతీకత్వా |
| | 19 | ఓకార | ఓంకార |
| 243 | 5 | యద్వైంధాసి | యత్థైంధాసి |
| 246 | 20 | మొదలను | మొదలగు |
| 257 | 4 | వావ | నావ |
| 296 | 19 | తురీయదీ | తురీయద |

